# "నేను దేవుణ్ణి" - సత్యార్థం

## మరియు అద్వైత సిద్ధాంత రహస్యం



షిరిడీ – సాయిబాబా

(1838-1918)



అహమద్‌నగర్ - మెహర్‌బాబా

(1894-1969)

నిజమయిన 'జ్ఞానోదయం' అంటే -
మనసులోని అజ్ఞానాంధకారాన్ని - శాస్త్రజ్ఞాన,
హేతువాద మరియు సత్యాసత్యాల వెలుగుతో
రూపుమాపి, దేవుడి నిజ అస్తిత్వాన్ని గుర్తించటం

.......... అంకితం .........

సత్యాభిలాషులకు

# మార్మికవాదం గురించిన మంచి విశ్లేషణ

అబు సొహైల్ గారు వ్రాసిన ఈ పుస్తకం మార్మికవాదాన్ని ఆధునిక శాస్త్రీయ దృక్పథం నుండి విశ్లేషించిన చక్కని పుస్తకం. అందరూ చదవదగిన పుస్తకం.

తాత్విక ఆలోచన మొదలయిన నాటినుండి మానవుడు తనతో సహా తన చుట్టూ ఉన్న విశ్వానికి ఒక మూలసూత్రం ఉన్నదని, అదే అత్యంత సత్యమని భావించి, ఆ ఏకత్వ సూత్రాన్ని బాహ్య ప్రపంచంలో వెతకగా, మరి కొందరు తమ అంతరంగంలో వెతికారు. అలా అంతర్ముఖులయినవారు తమలోని అవధులు లేని చైతన్యమే అత్యంత సత్యమని, బాహ్యప్రపంచం ఉండటానికి కూడా ఆ చైతన్యమే కారణమని పేర్గొన్నారు. ఈ పునాదులపై తాత్విక సాంప్రదాయాలను నెలకొల్పి, తాత్విక విశ్లేషణలు, వ్యవస్థలు ఆవిష్కరించారు.

మరికొందరు చైతన్యవాదులు తాత్విక వాదనలకు ప్రాధాన్యమివ్వక ఆ చైతన్యంలో లీనమయ్యే 'అనుభవానికి' ప్రాధాన్యమిచ్చారు. వారే మార్మికవాదులు. వారి అనుభవాలను, వారు వ్యక్తీకరించిన భావాలను చక్కగా విశ్లేషించిన పుస్తకం ఇది. "నేనే దేవుణ్ణి" అనే మార్మికవాద ప్రకటనల వెనుక గల ఆత్మాశ్రయ అనుభవాన్ని శాస్త్రీయ దృక్పథంతో అర్థం చేసుకుని, బాబాల మరియు అవతారాల మాటున సాగే వ్యవస్థీకృత ప్రచారాలను రచయిత ఎండగట్టారు.

రచయిత శాస్త్రీయ దృక్పథంతో మార్మికవాదాన్ని వివరించి, ఇస్లాం మత దృక్కోణం నుండి మార్మికవాద సిద్ధాంతాల అసమగ్రతను చర్చించారు. ఇలా ఆధునిక విజ్ఞాన శాస్త్ర దృక్పథం మరియు ఇస్లాం దృక్కోణం ఏకకాలంలో కలిగి ఉండటం వైరుధ్యం కాదని రచయిత అభిప్రాయం. దానికి సమర్ధనగా ఆయన ఖురాన్ పవిత్ర గ్రంధంలో ఆవిష్కరింపబడిన ఆధునిక వైజ్ఞానిక సత్యాలను చర్చించారు. ఒక విషయాన్ని భిన్న దృక్కోణాలనుండి పరిశీలించడం తప్పేమీ కాదని నా అభిప్రాయం.

ఈ పుస్తకం సత్యాన్వేషకులకు, ముఖ్యంగా మార్మికవాదాన్ని అర్థం చేసుకోవాలనుకునే వారికి చాలా ఉపయుక్తం. రచయితను మనసారా అభినందిస్తున్నాను.

- డా॥ ఇళ్ల రవి
తత్వశాస్త్ర అధ్యాపకుడు
SRR & CVR ప్రభుత్వ కళాశాల,
విజయవాడ.

# రచయితకు అభినందనలు

మార్మికవాదం గురించి ఇటీవల కాలంలో వచ్చిన మంచి పుస్తకాలలో ఇది ఒకటి. రచయిత అబు సొహైల్ నిజంగా అభినందనీయులు. ఆయన నిజాయితీగా మార్మికవాద బాబాల అనుభవాలను సానుభూతితో అర్థం చేసుకుని వివరించారు. సాయిబాబా, మెహర్‌బాబాల ప్రకటనల వెనుక గల ఆత్మానుభవ సత్యాలను చాలా ఓపికగా ఆధునిక శాస్త్ర పరిజ్ఞానంతో వివరించారు. ఈ పనిచేయడంలో ఆయన ఎక్కడా బాబాలను కించ పరచకపోవడం విశేషం.

రచయిత శైలి చాలా సులభ శైలి. జటిలమైన తాత్విక లేదా శాస్త్రీయ పదాలను ఉపయోగించకుండా, కేవలం సాధారణ పరిభాషలో విశ్లేషణ చేపట్టడం చాలా కష్టమైన పని. తత్వశాస్త్రంతో ఏమాత్రం పరిచయం లేనివారికి కూడా ఈ పుస్తకం చాలా చక్కగా అర్థమవుతుందనడంలో ఎంతమాత్రం సందేహం లేదు.

ఇస్లాం మతం పట్ల అచంచల విశ్వాసాన్ని కలిగి ఉన్న రచయిత అవతారాల పేరుతో భక్తులు కల్పిస్తున్న విశ్వాసాల ప్రచారంలో గల వైరుధ్యాలను చక్కగా వివరించారు. ఆయన అభిప్రాయాలతో ఏకీభవించని వారు కూడా చదవదగిన పుస్తకం ఇది. బాబాల భక్తులు కూడా ఈ పుస్తకం చదవడం వలన ఒక క్రొత్త దృక్కోణాన్ని అవగాహన చేసుకోగలుగుతారు.

రచయిత ఎంతో శ్రమకోర్చి, ఎన్నో గ్రంధాలను చదివి, నిజాయితీతో చేసిన ఈ రచన అందరినీ ఆకట్టుకుంటుందని నా అభిప్రాయం.

అబు సొహైల్ గారి కృషిని అభినందిస్తూ, ఈ పుస్తకాన్ని పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

Ch. సాంబశివరావు
రిటైర్డ్ తత్వశాస్త్ర అధ్యాపకుడు
విజయవాడ.

# విషయసూచిక


| వ.నెం. | అధ్యాయము | పేజి నెం |
|---|---|---|
| 1. | పరిచయం | 1 |
| 2. | మార్మికవాదము - అర్థము, తత్వము మరియు చరిత్ర | 8 |
| 3. | సాయిబాబా, మెహర్‌బాబా - మార్మికవాదులేనా? | 18 |
| 4. | 'నేను దేవుణ్ణి' - మాటల వెనుక రహస్యం | 28 |
| 5. | హిందూ మతంపై మార్మికవాద ప్రభావం | 67 |
| 6. | మెహర్‌బాబా మరియు అవతారవాదం | 77 |
| 7. | సాయిబాబాగారి అస్తిత్వ వక్రీకరణ | 89 |
| 8. | మీరు ఆలోచించవలసినది ఏమిటి? | 104 |
| 9. | దేవుని నిజ అస్తిత్వం మరియు సందేశం. | 110 |
| ⇨ | సంకలన కర్త సందేశం | 139 |
| ⇨ | అనుబంధాలు | 144 |
| ⇨ | గమనికలు | 147 |
| ⇨ | గ్రంథమాల | 151 |


□ □ □

"మతంలేని విజ్ఞానం అవిటితనం లాంటిది........

విజ్ఞానం లేని మతం అంధకారం లాంటిది."

*- ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ (1879-1955)*

# 1. పరిచయం

ఈ పుస్తకం సాయిబాబా మరియు మెహర్‌బాబా భక్తులకోసం వ్రాయబడింది. ఈ పుస్తకం ద్వారా భక్తులు, తమ బాబాల అవగాహనను సత్య ధృక్పథంలో పెంపొందించుకోగలరు. ఈ పుస్తకంలోగల విశ్లేషణ సాయిబాబా, మెహర్‌బాబా లాంటి ఇతరులకు కూడా అన్వయిస్తుంది.

షిర్డీ సాయిబాబా (1838-1918) మానవ మరియు మతాల సమానతకు, శాంతికి చిహ్నంలా నిలిచారు.

మెహర్‌బాబా (1894-1969) గారు పేదవారికి, కుష్టురోగులకు, మతిస్థిమితం కోల్పోయినవారికి సేవలందిస్తూ, మానవ సేవకు తార్కాణంగా నిలిచారు.

సాయిబాబా గారు 1886వ సం॥లో దైవానుభవం పొంది, అప్పటినుంచి చాలాసార్లు తాను స్వయంగా దేవుడనని ప్రకటించుకున్నారు. మెహర్‌బాబా గారు కూడా 19 సం॥ల పిన్నవయసులోనే దైవానుభవంపొంది, 1954వ సం॥లో "నేను దేవుడి అవతారాన్ని" అని ప్రకటించుకున్నారు.

భక్తులు ఈ ఇద్దరు బాబాలను, అత్యంత భక్తిశ్రద్ధలతో, దేవుడి అవతారాలుగా భావించి పూజిస్తున్నారు.

పుట్టపర్తికి చెందిన సత్యసాయిబాబా (జననం - 1926) తాను పునర్జన్మించిన షిర్డీ సాయిబాబానని ప్రకటించుకున్నారు. అయితే, నేను ఈ పుస్తకంలో ఆయనను గురించి విశ్లేషించను. అందుకని, ఇకపై సాయిబాబా అంటే నేను షిర్డీ సాయిబాబా గారి గురించి వ్రాస్తున్నానని అర్థం.

ఇంకా ఈ పుస్తకం, దేవుని అస్తిత్వానికి సంబంధించి అయోమయ స్థితిలో ఉన్నవారికి కూడా ఉపయోగపడుతుంది. వివిధ వర్గాలు - వివిధ బాబాలను మనకు దేవుళ్ళుగా పరిచయం చేస్తూ ఉంటారు. అయితే వీళ్ళలో నిజమైన దేవుడు ఎవరు? ఇంతమంది దేవుళ్ళలో నేనెవరిని లేక ఎవరెవరిని ఆరాధించాలి? అనేది వీళ్ళ అయోమయం. ఈ అయోమయస్థితిలో నుంచి బయటపడి, దేవుడి నిజ అస్తిత్వాన్ని గ్రహించడానికి ఈ పుస్తకం ఉపయోగపడుతుందని నేను భావిస్తున్నాను.

అంతేకాదు. నిశ్చయంగా మీరు - దేవునిలో లీనమవ్వడం, దైవానుభూతిని పొందడం, దేవుని మైకం ఆవహించడం, జ్ఞానోదయం, మార్మికవాదము, మార్మిక అనుభవాలు మొదలైన పదాలు, భావనలు వినిగానీ, చదివిగానీ ఉండవచ్చు. అవేమిటో అర్థం చేసుకునే ప్రయత్నం ఎప్పుడైనా చేశారా? వీటి గురించి సమాధానాలు కూడా మీకు ఈ పుస్తకంలో లభిస్తాయి. అంతేకాక, వీటివల్ల తలెత్తిన అనేక తప్పుడు భావనలు, అపార్థాల గురించి కూడా ఇందులో విశ్లేషించడం జరిగింది.

మొత్తంమీద, ఈపుస్తకం ద్వారా మీకు ఆధ్యాత్మికతకు సంబంధించిన అనేక అంశాల వివరణ లభిస్తుంది. మరియు దేవుడి గురించి మీకున్న అవగాహనా భావం లేదా జ్ఞానం ఖచ్చితంగా పెరుగుతుంది. అందువలన, మీరు ఈ పుస్తకం చదవడానికి వెచ్చించే సమయం సద్వినియోగం కాగలదని నేను అభిప్రాయపడుతున్నాను.

అయితే, ముందుగా మనవి చేసుకునేదేమిటంటే - నేను ఈ పుస్తకాన్ని మీ ప్రియ బాబాను కించపరచడానికి గానీ, తప్పుగా చిత్రీకరించడానికి కానీ వ్రాయడం లేదు. ఈ ఇద్దరు బాబాలు నిర్వహించిన మానవసేవను నేనెంతో గౌరవిస్తున్నాను. ఐతే వీరి చుట్టూ పెనవేసుకుపోయిన తప్పుడు అభిప్రాయాలను, తప్పుడు అవగాహననూ మీ ముందుంచడమే నా ఉద్దేశ్యం. తద్వారా - వారి జీవిత చరిత్ర, సందేశాలను సరిగా అర్థం చేసుకునే అవకాశం కూడా కలుగుతుంది.

సాయిబాబా మరియు మెహర్‌బాబాలను అర్థంచేసుకోవాలంటే, ముందు మనకొక భావన గురించి అర్థం కావాలి. లేకపోతే, మనం వారిని పూర్తిగా అపార్థం చేసుకునే అవకాశం ఉంది. దురదృష్టవశాత్తూ, వీరి విషయంలో అదే జరిగింది. మనం అర్థంచేసుకోవలసింది: 'మార్మికవాదం' (Mysticism) గురించి. ఎందుకంటే, దీనితోనే వారి జీవితాలు, సందేశాలు ముడిపడి ఉన్నాయి. నన్ను ఆశ్చర్యపరచిన విషయం ఏమిటంటే, చాలామంది భక్తులకు మార్మికవాదం గురించిన అవగాహన ఏమాత్రం లేదు. నా అభిప్రాయంలో, ఈ అవగాహన లేమివలన భక్తులు తమ బాబాల గురించి సరిగా అర్థం చేసుకొనే పరిస్థితిలో ఉండజాలరు. ఈ అవగాహన లేమి మరియు మతపరమైన జ్ఞానం లోపించడంతోపాటు, అమితమైన భక్తిశ్రద్ధల దాహార్తిని తీర్చుకోడానికి జరిగిన ఇష్టదైవాల అన్వేషణ వలన - ఈ బాబాలు దేవుళ్లుగా పరిగణించబడి, అసలైన దేవుడు మరియు ఆయన సందేశం - ఇవి రెండూ మరుగున పడిపోయాయి.

ఒక సాంకేతిక రంగంలో పరిశోధన జరపాలంటే, ముందు మనకు ఆ సాంకేతిక రంగం యొక్క మూలసూత్రలు (Basic Principles) అర్థంకావాలి. అలాగే, బాబాలను అర్థం చేసుకోగలిగే ముందు, మనకు 'మార్మికవాదం' గురించిన అవగాహన అవసరం. అందువలన ముందుగా మనం దీన్ని అర్థం చేసుకొనే ప్రయత్నం చేద్దాం. దీనిని 'అధ్యాయం 2 : మార్మికవాదము - అర్థము, తత్వము మరియు చరిత్ర'లో వివరించడం జరిగింది.

సాయిబాబా మరియు మెహర్‌బాబాలు మార్మికవాదులు (Mystics). దీనికి సంబంధించిన ఆధారాలు - 'అధ్యాయం 3 : సాయిబాబా, మెహర్‌బాబాలు - మార్మికవాదులేనా?' లో ఇవ్వబడ్డాయి.

ఈ పుస్తకంలో ముఖ్యంగా సాయిబాబా, మెహర్‌బాబాల గురించి చర్చించడం జరిగినా, దీనిలో మొత్తం మార్మికవాదానికి సంబంధించిన వివరణ ఉంది. అందువలన, ఈ పుస్తకం ఈ ఇద్దరు బాబాలకు పరిమితంకాదు, వీరిలాంటి ఇతర మార్మికవాదులకు కూడా అన్వయిస్తుంది. అయితే సాయిబాబా, మెహర్‌బాబా భక్తుల ప్రయోజనార్థం వారికి సంబంధించిన అంశాలను ప్రత్యేకంగా ఉంచడం జరిగింది.

'అధ్యాయం 4 : నేను దేవుణ్ణి - మాటల వెనుక రహస్యం' , 'నేను దేవుణ్ణి' అని మనుషులు చేసే ప్రకటన వెనుక సత్యార్థాన్ని మీముందు ఉంచుతుంది. సాయిబాబా, మెహర్‌బాబాలే కాకుండా, వారికి ముందు, తర్వాత వచ్చిన మార్మికవాదులందరి రహస్యం బహిర్గతమౌతుంది. ఈ రహస్యం బహిర్గతం కాగానే, సాయిబాబా మరియు మెహర్‌బాబాల ప్రకటనలు మనకు సులువుగా అర్థం అవుతాయి.

దీని ఆధారంగా, 'అధ్యాయం 5 - హిందూ మతంపై మార్మికవాద ప్రభావం'లో మార్మికవాద తత్వం వెనుక ఉన్న తర్కం మరియు అది ఏవిధంగా హిందూ మతాన్ని సమూలంగా మార్చివేసిందో వివరించటం జరిగింది.

'అధ్యాయం 6 - మెహర్‌బాబా మరియు అవతారవాదం'లో మెహర్‌బాబాను గురించిన ఒక పెద్ద భ్రమను దూరం చేయడం జరిగింది. తద్వారా, మెహర్‌బాబా గారిని సరిగా అర్థంచేసుకొనే అవకాశం కలుగుతుంది. అంతేకాకుండా, ఆయన చుట్టూ అల్లుకోబడిన తప్పుడు అభిప్రాయాలు, తప్పుడు అవగాహనను కూడా మీ ముందుంచడం జరిగింది.

'అధ్యాయం 7 - సాయిబాబాగారి అస్తిత్వ వక్రీకరణ'లో ఏవిధంగా సాయిబాబా యొక్క వ్యక్తిత్వాన్ని ఆయన జీవిత చరిత్రకారులు మరియు భక్తులు మలచివేశారో విశ్లేషించడం జరిగింది. సాయిబాబాగారు ఎన్నో మహిమలు ప్రదర్శించిన వారిగా పేరొందారు. వీటి గురించి కూడా ఇక్కడ వివరించడం జరిగింది.

'అధ్యాయం 8 - మీరు ఆలోచించవలసినది ఏమిటి?' లో మునుపటి అధ్యాయాల ద్వారా పరిశీలించబడిన సత్యాసత్యాల వెలుగులో సాయిబాబా మరియు మెహర్‌బాబా భక్తుల ముందు కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు ఉంచడం జరిగింది. జీవిత పరమార్థమయిన మోక్షంతో ముడిపడి ఉన్న ఈ అంశం గురించి బాబా భక్తులుగా వీరు ఆలోచించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

'అధ్యాయం 9 - దేవుని నిజ అస్తిత్వం మరియూ సందేశం' లో అసలు దేవుని గురించిన ఎటువంటి అవగాహన సరి అయినది? మానవాళికి ఆయన సందేశం ఏమిటి? అనే అంశాలను వివరించడం జరిగింది. దేవుని నిజ అస్తిత్వాన్ని గుర్తించాలని అభిలషించే సత్యాన్వేషులకు సమాధానం ఈ అధ్యాయంలో దొరుకుతుంది.

## సాయిబాబా గారి జీవితచరిత్రలో ముఖ్య ఘట్టాలు

నిజం చెప్పాలంటే, చరిత్రకారులకు సాయిబాబాగారి జీవితచరిత్రలో చివరి దశాబ్దం గురించి తప్ప మిగిలిన వివరాల గురించిన ఆధారాలు లేవు. ప్రచారంలో ఉన్న వివరాల ప్రకారం, ఆయన జన్మించిన సంవత్సరం 1838 అని ఎక్కువగా చెప్పబడుతుంది. అలాగే, ఆయన బ్రాహ్మణ దంపతులకు జన్మించారని చెప్పబడుతుంది. ఆ దంపతులు, ఐహిక జీవితాన్ని త్యజించడంతో, పిన్నవయస్సులోనే సాయిబాబా గారిని వదిలి వేయడం జరిగింది. అప్పుడు, సంతానం లేని ఒక సూఫీ ఫకీరు* దంపతులు సాయిబాబాను చేరదీసారు. అలా సాయిబాబా ఒక ముస్లింలా పెరిగారు. సాయిబాబా గారి 4,5 సం॥ల ప్రాయంలో ఆ ఫకీరు మరణించడంతో ఆయన భార్య సాయిబాబాను పెంచగలిగే స్థోమత లేక, శేలులోని 'వెంకుష' అనబడే గురువువద్ద సాయిబాబాను వదిలివేశారు. 'శేలు' నిజాం రాజ్యంలో ఉండేది. సాయిబాబా గారు శేలులో గడిపిన కాలం గురించి, భిన్న కథనాలు ప్రచారంలో ఉన్నాయి. ఆ గురువు మరణించడంతో, సాయిబాబా ఆ ప్రాంతాన్ని వదిలి, షిర్డీ చేరుకున్నారు. ఇంకొక కథనం ప్రకారం, సాయిబాబా గారు 4 సం॥లు సూఫీ ఫకీరు దగ్గర గడిపి, పిమ్మట 12 సం॥లు ఒక హిందూ గురువు ఆదరణలో పెరిగి, 16 సం॥ల వయసులో షిర్డీ చేరుకున్నారు. ఏది ఏమైనా టోపీకింద పొడవైన జుట్టుతో ఉన్న సాయిబాబా వేషధారణను చూసి, షిర్డీలో ఆయనను ఒక ముస్లిం ఫకీరుగా గుర్తించడం జరిగింది. షిర్డీ నుంచి కొంతకాలం సాయిబాబా కనిపించకుండా పోయారు. ఆ కాలం గురించి కూడా భిన్న కథనాలు ప్రచారంలో ఉన్నాయి (2 నెలల నుండి 7 సం॥ల వరకూ అని). రెండవసారి షిర్డీ చేరుకున్న సాయిబాబా (1858 లేదా 1872 సం॥లో) మరణించే వరకూ షిర్డీలోనే నివసించారు. పాతబడిపోయి, నిర్మానుష్యంగా ఉన్న ఒక మసీదులో సాయిబాబా నివసించారు. షిర్డీ ప్రజలకు ఆయన, వివిధ రకాల వనమూలికలతో చికిత్సలు చేసేవారు. తర్వాతి కాలంలో భస్మం ద్వారా రోగాలను నయంచేయసాగారు. ఆయన ఎల్లప్పుడూ 'అల్లా', 'అల్లాయేస్వామి' (అల్లామాలిక్) అంటూ ఉండేవారని ప్రతీతి.

1886వ సం॥లో - 50 సం॥ల ప్రాయంలో సాయిబాబాగారు అనేక మార్మిక అనుభవాల ద్వారా దైవానుభవం పొంది, దేవునిలో లీనత్వాన్ని ప్రాప్తించారు. ఆలయపూజారి అయిన మహల్సపతితో 'నేను అల్లా వద్దకు వెళుతున్నాను, నా శరీరాన్ని సంరక్షించు' అని చెప్పి సాయిబాబా చలనాన్ని కోల్పోయారు. మూడు రోజుల తర్వాత, ఆయన మళ్ళీ మామూలు స్థితికి వచ్చారు.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

\* *సూఫీలు అంటే ముస్లింలలోని ఒకవర్గం. ఫకీరు అంటే ప్రాపంచిక సుఖాలు, ఆశయాలను త్యజించే ఉద్దేశ్యంతో, కావాలని బీదరికాన్ని ఎంచుకున్నవాడు.*
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

దేవుడు ప్రత్యక్షమయి, దైవలీనత్వం సంభవించే ఆ అనుభవాన్ని గురించి వర్ణిస్తూ, ఆయన భక్తుడైన నానా చందోర్కర్‌తో సాయిబాబా ఇలా అన్నారు:

“ఆ స్థితిలో, దేవుడు మనిషితో సమానం అయిపోతాడు. కీర్తి-అపఖ్యాతి (నింద)తో సమానమయినట్లు, కోరికలేమీ మిగలవు. (సిద్ధులు అనబడే) ఆ సంపూర్ణులకు - ఈ శరీరం తమ నివాసమని, ఆత్మ (‘స్వ’) అనే భావన వీడిపోతుంది. వాళ్లు తమ అస్తిత్వం దేవునితో సమానమని భావిస్తారు. ‘నేను బ్రహ్మను’ అనేది వీరి భావన”[1]

సాయిబాబాగారు పుస్తకాలు, ఉపదేశాలు ఏమీ వ్రాయలేదు, దర్శనార్థం వచ్చిన భక్తులకు చిన్నచిన్న ఉపదేశాలు ఇచ్చేవారంతే. ఆయన భక్తుల ద్వారా ఆ ఉపదేశాలను సంకలనం చేసిన సాయిబాబా జీవిత చరిత్రకారులు వాటిని తమ తమ రచనలలో పొందుపర్చారు. దైవానుభవం పొందిన తరువాతి సంవత్సరాలలో సాయిబాబా గారి ఖ్యాతి మెల్లమెల్లగా చుట్టుప్రక్కల ప్రాంతాలకు వ్యాపించింది. ఆయన ఎంతోమంది సూఫీ శిష్యులకు దైవాన్ని ప్రసన్నం చేసుకొనే లేక దైవానుభవం పొందే ఆ మార్గం గురించి బోధించారు.

సాయిబాబా గారు 1918 సం॥లో అక్టోబరు 15న తుదిశ్వాస విడిచారు. ఆయన మరణం తరువాత, సుమారు 36 గంటల వరకూ హిందూ భక్తులు, ముస్లింలు ఆయనను ఎక్కడ ఖననం చేయాలనే విషయం గురించి వాదులాడుకున్నారు. ముస్లింలు, సాయిబాబా ముస్లిం కాబట్టి, ఆయనను వారి మతాచారం ప్రకారం ఖననం చేయాలని పట్టుబడితే, హిందువులు సాయిబాబాను అప్పుడే నిర్మించిన బూటీవాడలో ఖననం చేద్దామని పట్టుబట్టారు. బూటీవాడ నాగ్‌పూర్‌కు చెందిన బూటీ అనే కోటీశ్వరునిచే నిర్మించబడింది. చివరకు, హిందువులు అధిక సంఖ్యలో ఉండి వారిపట్టు గెలవడంవలన, సాయిబాబా గారిని బూటీవాడలో ఖననం చేయడం జరిగింది. అయితే దానిని ముస్లింలకు చెందిన సూఫీదర్గా వలె ఉంచడానికి హిందువులు అంగీకరించారు. కాలక్రమేణా అది అనేక మార్పులు చెంది, ఇప్పుడు సాయిబాబా సమాధి మందిరంలా పిలవబడుతుంది.

మరణించడానికి ముందు, సాయిబాబాగారు తాను మరణించినా సరే, తన భక్తులకు సహాయం చేస్తూ ఉండగలనని ప్రకటించుకున్నారు. ఈనాడు ఆయన సమాధిని హిందువులు అత్యంత భక్తి శ్రద్ధలతో, హిందూ దేవుళ్ళను కొలిచేరీతిలో - అభిషేకాలు, పూజ, ఆరతి తదితర కార్యాలతో ఆదరించడం జరుగుతుంది. షిర్డీ ఒక ముఖ్య ఆధ్యాత్మిక కేంద్రంగా అభివృద్ధి చెందింది. సంవత్సరం పొడవునా, భక్తులు ఆయన దర్శనార్థం, షిర్డీని సందర్శిస్తారు. ఈమధ్యకాలంలో అనేక హోటళ్ళు (3,4 స్టార్ కూడా), వసతి గృహాలు నిర్మింపబడి, షిర్డీ నిత్యం 25 వేల మంది భక్తులు, సందర్శకులతో కళకళలాడుతోంది. ముఖ్యమైన పండగ దినాల సమయంలో, ఈ భక్తుల సంఖ్య 35 నుండి 40 వేలకు కూడా చేరుకుంటుంది.

## మెహర్‌బాబా గారి జీవిత చరిత్రలో ముఖ్య ఘట్టాలు

సాయిబాబా గారి జీవితంలా కాకుండా, మెహర్‌బాబా గారి జీవిత విశేషాలు వివరంగా అందుబాటులో ఉన్నాయి. మెహర్‌బాబా గారు 1894వ సం॥ ఫిబ్రవరి 25న పూనాలో జన్మించారు. పుట్టినపుడు ఆయనకు పెట్టబడిన పేరు - మెర్వన్ షెరియర్ ఇరాని. ఆయన తల్లితండ్రులు ఇరాన్ దేశానికి చెందిన జొరాష్ట్రియన్ మతస్థులు. వాళ్ళు ఇండియాకు వలసవచ్చారు. అలా ఇరాన్ నుండి మనదేశానికి వచ్చిన వారిని పార్శీలుగా పిలవడం జరుగుతుంది. ఆయన తండ్రిపేరు షెరియర్ మండేగర్. ఆయన మెహర్‌బాబా పుట్టక పూర్వం ఒక సూఫీ డెర్విష్* గా ఉండి, మెహర్‌బాబా పుట్టేటప్పటికి, ఒక టీ షాపు ఆరంభించి మంచి ఆర్థిక స్థితికి చేరుకున్నారు. మండేగర్‌కు పర్షియన్, అరబిక్ భాషలలో ప్రావీణ్యం ఉండేది. ఆయన జీవన ధృక్పధం సూఫీ సిద్ధాంతాలతో నిండి ఉండేది.

మెర్వన్ (మెహర్‌బాబా) పూనాలోని ప్రాథమిక పాఠశాలలో ఉత్తీర్ణులయి 1911 నుంచి డెక్కన్ కాలేజిలో ఉన్నత విద్యనభ్యసించసాగారు. తండ్రిగారి అడుగుజాడల్లో నడుస్తూ, సూఫీ సిద్ధాంతాలను అధ్యయనం చేస్తూ సూఫీ దర్గాల వద్ద ఎక్కువ సమయం గడుపుతూ ఉండేవారు.

కాలేజి విద్యనభ్యసించేప్రాయంలో మెర్వన్‌గారు, బాబాజాన్‌తో పరిచయం పెంచుకున్నారు. బాబాజాన్ ఒక ఆడ సూఫీఫకీరు. ఆమె వయస్సు అప్పటికే 100 సం॥లు ఉండేదని చెప్పబడుతుంది. ఆమె ఒక నిమ్మ చెట్టుక్రింద నివాసం ఉండేది. మెర్వన్ ఆమెను రోజూ సాయంత్రాలలో సందర్శించేవారు. 1914 సం॥లో ఒకానొక ఉదయం - అచేతనావస్థలో, మంచం మీద కళ్ళుపెద్దవి చేసుకొని, దిక్కులు చూస్తున్న మెర్వన్‌ను చూసి, ఆయన తల్లి షిరిన్ తల్లిడిల్లిపోయారు. ఆరోజు నుంచీ 9 నెలల వరకూ మెర్వన్ ఎంతో బలవంతం కొద్దీ తినిపిస్తే తప్ప, అన్నపానీయాల జోలికి పోలేదని చెప్పబడుతుంది. షిరీన్ తన కుమారుడి పరిస్థితికి బాబాజాన్‌ను కారణంగా భావించి కోప్పడ్డారు. తర్వాత మెర్వన్ అది నిజమేనని చెప్పడం జరిగింది.

9 నెలల తర్వాత మెర్వన్ పరిస్థితి మెరుగుపడింది. కొద్దికాలంలోనే మెర్వన్ కాలినడకన చుట్టుప్రక్కల ప్రాంతాలను, తర్వాత దూర ప్రాంతాలను సందర్శించడం మొదలుపెట్టారు. అనేక సూఫీ గురువులనే కాకుండా హిందూ గురువులను కూడా ఆయన సందర్శించేవారు. అప్పటికే తన విద్యాభ్యాసానికి ఆయన స్వస్తి పలికారు. షిర్డీలో సాయిబాబాను కూడా మెర్వన్ దర్శించారు. ఆ తర్వాత, సాయిబాబా శిష్యుడు, హిందూ గురువు అయిన ఉపాసని మహరాజ్‌ను కలసి, ఆయన సకోరి ఆశ్రమంలో 7 సం॥లు శిష్యునిగా గడిపారు. ఆ తర్వాత మెర్వన్ తన సొంత శిష్యులను చేరదీయడం మొదలుపెట్టారు. ఆ శిష్యులు ఆయనకు పెట్టిన పేరే - 'మెహర్ బాబా' (దయగల తండ్రి అని దీని అర్థం).

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

\* *వేగంతో కూడుకున్న శరీర కదలికలు, మంత్రోచ్ఛారణతో దైవభక్తిని ప్రదర్శించే భిక్ష సన్యాసులు.*
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

1922వ సం॥లో మెహర్‌బాబా, తన శిష్యులతో ముంబాయిలో "మంజిల్-ఎ-మీమ్" (గురుగృహం)ను ప్రారంభించారు. తన శిష్యులనుంచి అమితమైన క్రమశిక్షణ మరియు విధేయతలను ఆశించేవారు మెహర్‌బాబా. అక్కడ ఎక్కువకాలం ధ్యానం, ఉపవాసాలతో గడిపిన మెహర్‌బాబా, ఒక సంవత్సరం తర్వాత తన శిష్యులతో అహ్మద్‌నగర్‌కు సమీపంలోని ఒక నిర్వాసిత ప్రాంతానికి తరిలారు. ఆ ప్రాంతానికి "మెహరాబాద్" గా పేరుపెట్టడం జరిగింది. ఆ ఆశ్రమం ఆయన ఆధ్యాత్మిక పనులకు కేంద్రంగా మారింది. బాబా అక్కడి నుంచి, తన శిష్యులతో సుదూర ప్రాంతాలను సందర్శించి, పేదవారికి, కుష్టురోగులకు కాళ్ళు కడిగి, వారికి వివిధ సేవలందించేవారు. 1924వ సం॥లో మెహర్‌బాబా, మెహరాబాద్‌లో 'ప్రేమ్ ఆశ్రమ్' పేరుతో ఒక పాఠశాలను కూడా ప్రారంభించారు.

జూలై 10, 1925వ సం॥రం మొదలుకొని మరణించేవరకూ, మెహర్‌బాబాగారు మౌనవ్రతాన్ని పాటించారు. అక్షరాల పలకతో ఆయన ఇతరులతో సంభాషించేవారు. తర్వాతి కాలంలో చేతి సైగలతో సంభాషించసాగారు. 'మండలి'గా పిలవబడే ఆయన శిష్యగణం, ఆ సైగల భాష అర్థం చేసుకుని, ఇతరులకు వివరించేవారు.

1930 సం॥రం మొదలు, మెహెర్‌బాబాగారు, అంతర్జాతీయ యాత్రలు ప్రారంభించారు. అనేక దేశాలను సందర్శించిన మెహర్‌బాబా - ఇంగ్లాండు, అమెరికాలలో అనేకమంది పాశ్చాత్త్యులను శిష్యులుగా చేర్చుకున్నారు.

1940లలో మెహర్‌బాబాగారు భారత ఉపఖండంలో విస్తృతంగా పర్యటించి, ఒకరకమైన వ్యక్తులతో ఎక్కువకాలం గడిపారు. 'మస్త్-అల్లా'లుగా పిలవబడేవీరు, చూడటానికి పిచ్చివారిలా ఉంటారు. కాని వీరి స్వభావం మామూలు పిచ్చివారికి భిన్నంగా ఉంటుంది. మెహర్‌బాబా వీరు ఆధ్యాత్మికంగా ఎంతో ఉన్నత స్థితిలో ఉన్నవారని ప్రకటించారు.

1949వ సం॥లో మెహర్‌బాబా గారు ఒక కొత్త అధ్యాయాన్ని ప్రారంభించారు. దాన్ని ఆయన 'నూతన జీవితం' (New Life) గా వర్ణించారు. 20 మంది శిష్యులను ఎంచుకొని, 'ఆశ, ఆశయం, సహాయం' ఏమాత్రంలేని జీవితాన్ని గడపబోతున్నామని వారితో చెప్పారు. వాళ్ళు భారతదేశంలో వివిధ ప్రాంతాలను పర్యటించి, భిక్షాటన చేస్తూ, బాబాగారి ఆజ్ఞలను పాలిస్తూ గడిపారు.

'నూతన జీవితం' అధ్యాయాన్ని ముగించిన మెహర్‌బాబాగారు మరోసారి సుదీర్ఘధ్యానాలలో ఏకాంతంగా గడిపారు. తర్వాత కొంతకాలం భక్తులకు దర్శనాలిస్తూ భారతదేశంలో మరియూ విదేశాలలో పర్యటిస్తూ గడిపారు. 1940-50 మధ్యకాలంలో మెహర్‌బాబాగారు విదేశాలలో రెండు ఆధ్యాత్మిక కేంద్రాలను ప్రారంభించారు. అవి, అమెరికాలోని దక్షిణ కెరొలినాలోని 'మెహర్ ఆధ్యాత్మిక కేంద్రం' మరియూ ఆస్ట్రేలియాలో బ్రిస్‌బేన్‌లోని 'అవతారగృహం'.

1952వ సం॥లో మే 24న మెహర్‌బాబాగారు, అమెరికాలోని ఒక్లహామా వద్ద ఒక తీవ్రమైన కారు ప్రమాదానికి గురయ్యారు. ఆయనతో ప్రయాణిస్తున్న సభ్యులందరూ తీవ్రగాయాల పాలయ్యి ఆసుపత్రిలో చికిత్స పొందారు. మెహర్‌బాబా గారి కాలువిరిగి, ముఖానికి కూడా గాయాలయ్యాయి.

సెప్టెంబరు 1953వ సం॥లో మెహర్‌బాబా గారు 'ఉన్నతులలో అత్యున్నతుడు' (Highest of the High) ప్రకటన ఇచ్చారు. 1954వ సం॥లో ఫిబ్రవరి 10న ఉత్తరప్రదేశ్‌లోని మెహరస్తానలో, మెహర్‌బాబా బహిరంగంగా, తనను తాను దేవుని అవతారంగా ప్రకటించుకున్నారు. ఈ సందర్భంలో ఆయన తన అక్షర పలకపై 'అవతార్ మెహర్ బాబా కీ జై' అని వ్రాసి చూపించారు.

అదే సంవత్సరం సెప్టెంబరు మాసంలో, మగశిష్యులకు ఒక సహవాస కార్యక్రమం అమలు చేశారు. తరువాత ఆ కార్యక్రమాన్ని, 'మూడు అత్యున్నత వారాలు' గా పిలవడం జరిగింది. ఈ సహవాస సమయంలో మెహర్‌బాబా గారు ఎన్నో ఉపదేశాలు, బోధనలు చేశారు. అదే సంవత్సరం అక్టోబరు నెలలో ఆయన అక్షర పలకను కూడా త్యజించి, చేతిసైగలతో సంభాషించడం మొదలు పెట్టారు.

మెహర్‌బాబాగారి ఆధ్యాత్మిక సిద్ధాంతం - సూఫీ, వేదాంత మరియు జొరాష్ట్రియన్ మార్మికవాద సిద్ధాంతాల సమ్మేళనం. దీనిని ఆయన, 1955వ సం॥లో ప్రచురించబడిన 'గాడ్ స్పీక్స్' (God Speaks) అనే పుస్తకంలో వివరించారు. ఇందులో మొదటి 8 అధ్యాయాలు మెహర్‌బాబాగారు అక్షరపలక సహాయంతో బోధించడం జరిగింది. మెహర్‌బాబా గారు, తన ఈ పుస్తకాన్ని ఈ కాలానికి చెందిన అత్యంత ముఖ్యమైన పుస్తకంగా ప్రకటించారు.

1956వ సం॥లో డిసెంబరు 2 న మెహర్‌బాబాగారు మరో కారు ప్రమాదానికి గురయ్యారు. సతారాలో ఈ ప్రమాదం సంభవించింది. ఈ ప్రమాదంలో డా॥ నీలు అనే మండలి సభ్యుడు మరణించారు. మెహర్‌బాబాగారి పొత్తికడుపుకు తీవ్రగాయంతోపాటు అనేక ఇతర గాయాలయ్యాయి. ఈ తీవ్రగాయాల నుండి ఆయన అనతికాలంలోనే కోలుకొని, మళ్ళీ నడవడం ప్రారంభించారు. కానీ ఈ ప్రమాదం తర్వాత ఆయన ఆరోగ్యం క్రమేణా క్షీణించసాగింది.

1958వ సం॥లో ఆయన ఇంకొకసారి విదేశాలకు పయనమయ్యారు. ఆయన నడవగలిగే స్థితిలో లేకపోవడంతో, మోసుకొని తిరగవలసి వచ్చింది. భారతదేశం తిరిగివచ్చిన తరువాత, మరలా ఆయన ఏకాంత ధ్యానం, ఉపవాసాలలో గడపసాగారు. ఆయన ఆరోగ్య పరిస్థితి అప్పటికి బాగా క్షీణించింది.

1967వ సం॥లో మరణించడానికి 2 సం॥ల పూర్వం, మెహర్‌బాబాగారు తన భోధనల సంకలనమైన 'ఉపదేశాలు' (Discourses) ఆరవ కూర్పు (ఎడిషన్)ను ప్రచురించే పనిని స్వయంగా సమీక్షించారు. ఇప్పుడు ప్రచురణలో ఉన్న 7వ కూర్పు షెరియర్ ప్రెస్ ద్వారా 1987 వ సం॥లో (బాబా గారి మరణానంతరం) ముద్రించబడింది. ఈ ఎడిషన్‌లో బాబాగారు ఆమోదించని సంపాదకీయ / వ్యాఖ్యాత పరమైన మార్పులను చేర్చడం జరిగింది.

1968వ సం॥లో మెహర్‌బాబాగారు ఏకాంత దీక్షను విరమించి, తన 'కార్యం' నూటికి నూరుపాళ్ళు అనుకున్నట్టుగా పూర్తయిందని ప్రకటించారు. కానీ, అప్పటికి ఆయన కదలలేని పరిస్థితిలో ఉన్నారు. ఇంకొన్ని నెలలలో ఆయన పరిస్థితి మరింత విషమించింది. శరీర కండరాల దుస్సంకోచాలతో (అదుపుతప్పిన సంకోచవ్యాకోచాలతో) ఆయన బాధపడసాగారు. డాక్టర్ల పర్యవేక్షణలో ఉన్నా, ఆయన పరిస్థితి దిగజారసాగింది.

1969వ సం॥లో జనవరి 31న మెహర్‌బాబాగారు తుదిశ్వాస విడిచారు. ఆయన భౌతిక కాయాన్ని, ప్రజల దర్శనార్థం వారంరోజులు ఉంచి, చివరకు దానిని ఖననం చేశారు.

ఆయన సమాధి ఉన్న మెహరాబాద్ (అహ్మద్‌నగర్ సమీపంలో) ఒక ఆధ్యాత్మిక సందర్శనా కేంద్రంగా మారింది.

**ఇవీ, సాయిబాబా మరియూ మెహర్‌బాబాల జీవితంలోని ముఖ్యమైన ఘట్టాలు. ఇంతకు ముందు వివరించిన విధంగా, వీరి జీవితాలను అర్థం చేసుకోవాలంటే ముందు మనం 'మార్మికవాదం' అనే సైద్ధాంతిక భావనను అర్థం చేసుకోవాలి. లేకుంటే, వీరి జీవితాలను పూర్తిగా అపార్థం చేసుకునే అవకాశం ఎంతైనా ఉంది. తరువాతి అధ్యాయంలో, మార్మికవాదం గురించి వివరంగా తెలుసుకుందాము.**

"ఏ వ్యక్తీ అకస్మాత్తుగా
గురువు కాజాలడు"

- ఫెంటన్ జేమ్స్

# 2. మార్మికవాదము - అర్థము, తత్వము మరియు చరిత్ర



*భౌతిక పరిధులనుదాటి, ఆధ్యాత్మిక ప్రపంచాల కొరకు మార్మికవాది చేయుచున్న మర్మాన్వేషణను ఉదహరిస్తున్న చిత్రం* [1]

## మార్మికవాదము (MYSTICISM) - అంటే ఏమిటి?

"ధ్యానము మరియు భావజ్ఞత ద్వారా ఎవరైనా సరే దైవానుభవం పొందటం, దైవంలో లీనమవ్వడం వంటివి సాధించవచ్చనే నమ్మకం. కొన్ని ఆధ్యాత్మిక సాధనలద్వారా, సృష్టికర్తతో ఏకమయ్యే ప్రయత్నాల గురించి వివరించే శాస్త్రం" [2]

సాధారణంగా చెప్పాలంటే, ఇది మనస్సుకు సంబంధించిన సాధన. ఇందులో మనస్సుకు, అన్ని రకాల ఆలోచనల నుంచి విముక్తి కలిగించి, నిలకడగా చేయడం జరుగుతుంది. తద్వారా పరమ సత్యాన్ని గ్రహించగలగే వీలవుతుందని నమ్మబడుతుంది. దీనినే, దైవానుభూతి పొందడం అని కూడా అంటారు. మార్మికవాది (Mystic) అనే పదం మిస్టరీ అనే గ్రీకు పదం నుంచి వచ్చింది. దీని అర్థం -'వివరించలేనటువంటి అనుభూతి' (Unexplainable) అని. దీని మూలపదానికి అర్థం - మూసుకున్న కళ్ళతో (with closed eyes) అని.

మానవ చరిత్రను, ఆధ్యాత్మిక కోణంలో విశ్లేషించిచూస్తే, ప్రతీకాలంలోనూ, అన్ని రకాల జాతుల వారిలో నిర్దిష్టంగా కొంతమంది - 'మనం దైవానుభవం పొందవచ్చు', 'దైవంలో లీనం కావచ్చు' అనే భావాల్ని వ్యక్తం చేశారు అనే విషయం గమనించవచ్చు. వీరే మార్మికవాదులు.

గమనించదగ్గ విషయమేమంటే, ఈ భావాన్ని వ్యక్తం చేసేవారు అన్ని మతాలలోను (ఇస్లాం, క్రైస్తవమతం, యూదుల జుడాయిజం, హిందూమతం) ఉన్నారు. మరియు వారు ఏమతానికీ చెందని వారై కూడా ఉండవచ్చు.

వీరిని హిందూమతంలో మనం 'సిద్ధులు' లేక 'యోగులు' అంటాము. దైవానుభవానికి గల అనేక మార్గాలలో యోగసాధన ఒకటి. ఈరోజుల్లో యోగా మనకు శరీర, మానసిక సంతుల్యాన్ని నెలకొల్పే ఒక శారీరక సాధనంగా ఎక్కువగా ఉపయోగపడుతున్నా, తరాలుగా యోగులు దీనిని దైవానుభూతిని పొందటం కోసం ఒక మార్గంగా ఉపయోగించుకున్నారు. యోగా ఒక్కటే కాకుండా, హిందూ సాంప్రదాయంలో భక్తి గీతాల ఆలాపన కూడా దైవానుభూతి సాధనంగా ఉపయోగపడింది.

ముస్లిములమని చెప్పుకొనే మార్మికవాదులను 'సూఫీ'లు అంటారు. 'తసవ్వుఫ్' లేక 'సూఫీజం'ను ఇస్లాం యొక్క ఒక రహస్య శాఖగా అభివర్ణిస్తారు. ఈ మార్గంలో పయనించిన వారికి, అల్లా దర్శనమిస్తాడు మరియూ అల్లాలో లీనమయ్యే భాగ్యం కలుగుతుంది అనేది సూఫీల నమ్మకం. సూఫీలు తమ దగ్గర రహస్య జ్ఞానం ఉందని, అది ఇతర సాధారణ ముస్లింల వద్ద లేదనీ ప్రకటించుకుంటూ ఉంటారు.

యూదుల మతమైన జుడాయిజంలో, ఈ దైవానుభూతి శాస్త్రాన్ని 'కబ్బాలా' అంటారు. దీనినే క్రైస్తవ సాంప్రదాయంలో 'గ్నాస్టిజం' అంటారు.

బౌద్ధమతం మరియూ తాయిజం (చైనీయుల మతం)లు పూర్తిగా మార్మిక అనుభవాల ఆధారంగా ఏర్పడిన తత్వాలననుసరించి నెలకొల్పబడిన మతాలు. ఐతే, ఇక్కడ గమనింపదగిన ముఖ్యవిషయం ఏమిటంటే, బౌద్ధమతంలో అసలు దేవుని గురించిన భావనే లేదు.

బౌద్ధమతానికి జపాన్ దేశంలో పెట్టబడిన పేరు 'జెన్ బుద్ధిజం'. మన యొక్క 'ధ్యానం' అనే పదాన్ని, చైనీయులు 'ఛాన్'గా అనువాదం చేసుకున్నారు. తరువాత, చైనా నుండి జపాన్‌కు బౌద్ధమతం వ్యాప్తి చెందినపుడు, జపానీయులు దానికి 'జెన్'గా పేరుపెట్టారు. అందుకని 'జెన్' అంటే ధ్యానాన్ని ప్రధాన మార్గంగా బోధించే బౌద్ధమతవర్గం. ఇందులో ధ్యానసాధనను 'జాజెన్'గా పిలుస్తారు.

ఇవే కాకుండా, ఏమతంతోనూ సంబంధంలేని కొన్ని మార్మికవాద సాంప్రదాయాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు - జావనీస్ మార్మిక సాంప్రదాయం, హెసీజం, మర్మోనిజం, క్వకేరిజం, సమారా, యూనిటేరియనిజం మొదలైనవి.

## మార్మికవాద - తత్వం

వివిధ సాంప్రదాయాలకు చెందిన మార్మికవాదుల రచనల ఆధారంగా బోధపడే విషయం ఏమిటంటే - వీరంతా కూడా ఒకేరకమైన అనుభూతులకు లేదా అనుభవాలకు లోనయ్యారు. అయితే, వాటిని వివరించే తీరుమాత్రం వారి వారి మతాలు, సాంప్రదాయాలు మరియు ఇతర పరిస్థితుల ప్రభావంవలన కొద్దిగా భిన్నంగా కనిపిస్తుంది. ఎలాగంటే, ఉదాహరణకు, మనం కొంతమందికి ఒక సినిమా చూపించామనుకోండి. ఒకొక్కరు దాని గురించి ఒక్కొక్కరకంగా వివరించడం, విశ్లేషించడం చేస్తారు. అయితే కథలో మాత్రం మార్పు ఉండదు.

మార్మికవాదుల వివరణలో, వారు ఈ భౌతిక ప్రపంచాన్ని అధిగమించి, ఒక ఆధ్యాత్మిక ప్రపంచాన్ని తిలకించారనీ, దేవునిలో లీనమయ్యారనే భావన ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

ఈ భావాన్ని వ్యక్తం చేసినవారు అనేకమంది అనేది మనకు చరిత్రలో కనిపించే నిజం. మేము దైవానుభూతిని పొందాము, దేవునిలో లీనమైపోయాము, దైవజ్ఞానం ఆర్జించాము, జ్ఞానోదయం పొందాము అనేవి వీరి వివరణలలో సాధారణంగా కనిపించే అంశాలు. ఈ వివరణలన్నీ ఒకేరకమైన అనుభవాలతో ముడిపడి ఉన్నాయనేది అర్థం అవుతుంది.

## ఎలా చేస్తారు?

తమలక్ష్యసాధనకు, వివిధ సాంప్రదాయాలకు చెందిన మార్మికవాదులు, వివిధ విధానాలను అవలంబించారు. ఆ అసాధారణమైన, అనూహ్యమైన స్థితిని పొందడానికి, వివిధ రకాలయినటువంటి సాధనాక్రమాల్ని రూపొందించారు.

జెన్ బుద్ధిజంలో - అర్థంపర్థంలేని వాక్యాల్ని, మనసుమీదఉన్న పట్టును సడలించి, తద్వారా ఆధ్యాత్మిక ద్వారాలను తెరవడానికి వాడతారు. ఈ వాక్యాల్ని కోయన్స్ (Koans) అంటారు.

కబ్బాలా సాధన చేసే యూదులు - క్లిష్టమైన సంఖ్యలు, చిత్రాలను మనసులో ఊహించుకోవడం, వాటిని పరివర్తనం చేయడం ద్వారా ఈ పట్టును సడలిస్తారు.

క్రైస్తవ మార్మికవాదులు - అచంచల దీక్ష, ఉపవాసం, మౌనవ్రతం మరియూ అనేక రకాల స్వకల్పిత శారీరక శిక్షల ద్వారా మనస్సును ప్రాపంచిక విషయాల నుంచి దూరంచేసి, దేవుని మీద ఏకాగ్రత సాధించడానికి ప్రయత్నిస్తారు.

ఇక సూఫీలు కూడా తమలక్ష్యసాధనకు తమదైనరీతిలో మార్గాలను అభివృద్ధి చేశారు. దీనిని తరీఖా (మార్గం అని అర్థం) అంటారు. దీనిద్వారా దైవానుభవాన్ని సాధించవచ్చు అనేది వీరిబలమైన నమ్మకం. వీరి మార్గంలో అనేక గమ్యాలు ఉంటాయి. వాటిని వీరు - పశ్చాత్తాపము, మితాహార-బ్రాహ్మచార్యం, వైరాగ్యం, బీదరికం, సహనం, దేవునిలో పూర్తి విశ్వాసం, మనస్సును పూర్తిగా శాంతింపజేయడం అని పేర్కొంటారు.

సాంప్రదాయమేదైనా సరే, దైవానుభవ లక్ష్యసాధనలో తొలిఅడుగు - మనస్సుని అన్యప్రాపంచిక ఆలోచనల నుంచి విముక్తంచేసి దేవుని మీద లగ్నంచేయడం. అందుకనే, ఈ సాంప్రదాయాలన్నింటిలోనూ ఏదో ఒక రకమైన వైరాగ్యం అనేది అవలంబించడం జరుగుతుంది.

ఈ మార్గంలో పయనిస్తున్న శిష్యులకు మార్గం చూపుతున్నవారిని - హిందూ సాంప్రదాయంలో 'గురువు' అని, జెన్ బుద్ధిజంలో 'రోషి' అని, సూఫీ సాంప్రదాయంలో 'షేక్' లేదా 'ముర్షిద్' అని పిలుస్తారు. శిష్యులను సూఫీ సాంప్రదాయంలో 'మురీద్'లని, హిందూ సాంప్రదాయంలో 'యోగి' అని పిలుస్తారు. దైవానుభవాన్ని సూఫీ సాంప్రదాయంలో 'ఫనా' లేక 'మారిఫా' అని, హిందూ సాంప్రదాయంలో 'బ్రహ్మవిలాస' లేక 'సమాధి' అని, బౌద్ధమతంలో 'నిర్వాణ' అని, క్రైస్తవమతంలో 'మిస్టిక్ యూనియన్' అని పిలుస్తారు.

గమనించవలసినదేమంటే - భాషలు, సాంప్రదాయాలూ వేరైనా వీటన్నింటి తత్వం మరియూ లక్ష్యం కూడా ఒక్కటే - దైవానుభవాన్ని పొందిన గురువు, శిష్యునికి అదే లక్ష్యసాధనలో మార్గదర్శిగా నిలవడం.

## వీళ్ళను అసలు అర్థం చేసుకోగలమా?

మామూలు మనుషులకు (మనలాంటివారికి) ఇదంతా ఓ అయోమయంలా గోచరిస్తుంది. వీరి వర్ణనలు, తత్వం బోధపడటం కష్టంగా కనిపిస్తుంది. ఐతే ఇది అంత కష్టతరం ఏమాత్రంకాదు. కొంచెం లోతుగా ఆలోచిస్తే, వారి వర్ణణలను మనం అర్థం చేసుకోగలం.

ఉదాహరణకు, కొన్ని నీళ్లను ఒక గిన్నెలో పోసి వేడిచేయడం ప్రారంభించామనుకోండి. కొద్దిసేపటి తరువాత ఏమౌతుందో మనందరికీ తెలుసు. నీరు, మరుగు ఉష్ణోగ్రతకు చేరుకోగానే - ఆవిరవ్వడం జరుగుతుంది - అంటే నీరు గాలిలో కలసిపోతుంది. ఈ ఉదాహరణలో నీళ్ళకు బదులు మానవ అస్తిత్వాన్ని, గాలికి బదులు దైవస్వరూపాన్ని ఆపాదించండి. వేడిచేయడం అనే ప్రక్రియను సాధనతో పోలిస్తే, నీళ్ళు గాలిలో కలిసిపోవడాన్ని మార్మికవాదులు చెప్పినట్లు, మానవ అస్తిత్వం దైవ స్వరూపంలో లీనమవ్వడంతో పోల్చుకోవచ్చు.

ఇంకొక ఉదాహరణ. ఒక గ్లాసు నిండా నీళ్ళు ఉన్నాయనుకోండి. అందులో కొంచెం పంచదారను కలుపుతున్నామనుకోండి. నీళ్ళను దేవునిగా భావిస్తే (ఉదాహరణకు మాత్రమే), పంచదారను మానవ అస్తిత్వంగా భావిస్తే, పంచదారను నీళ్ళలో కలిపేముందు - నీవెవరు? అని అడిగామనుకోండి. అది మాట్లాడగలిగితే 'నేను పంచదారను' అంటోంది. నీళ్ళలో కలిపివేసిన తర్వాత మరలా అడిగితే సమాధానం ఏమని వస్తుంది? 'నేను (పంచదార) నేను కాను, ఇప్పుడు నేను నీళ్ళ (దేవుని)లో పూర్తిగా కలసిపోయాను. ఇప్పుడు నేను నీరుని (దేవుడిని) అంటోంది. (మార్మిక వాదుల మాటలు ఇలానే ఉంటాయి. వారి అనుభవాలను అర్థమయ్యే రీతిలో చెప్పడానికి మాత్రమే ఈ ఉదాహరణలు ఇవ్వబడ్డాయని గమనించగలరు).

**హిందూ గ్రంథంలో వ్రాయబడింది:**

'సొంత అస్తిత్వం ('స్వ'భావన) అనేది ఒక స్వచ్ఛమైన, అనంతమైన, కాలాతీత చైతన్య సముద్రంలో కలసిపోతుంది. వేరైన భావన అనేది, శరీరాలతో అస్తిత్వాన్ని ('స్వ'భావనను) జతచేయడం వలన కలిగింది. ఈ భౌతిక అస్తిత్వం కరిగిపోయినపుడు 'స్వ', 'పర' అనే భావన ఉండదు (అంతా ఒక్కటే), ఇదే చెప్పదలచుకొన్నాను ప్రియతమా!'[3]

**14వ శతాబ్దానికి చెందిన జర్మన్ మార్మికవాది జాన్ టాలర్ ఇలా సెలవిచ్చాడు:**

"మార్మికుని ఆత్మ, దైవాత్మలో మునిగిపోయి, తన స్వరూపాన్ని కోల్పోతుంది. అప్పుడది అన్ని రకాల ద్వైత జ్ఞానాన్ని కోల్పోతుంది. అన్నీ దేవుని మధురమైన ఆనందానుభూతిలో ఏకమైపోతాయి. మానవ శరీరం అప్పుడు ఆ దైవ పదార్థంతో నిండిపోయి, తనను తాను కోల్పోతుంది. ఒక చుక్కనీరు ద్రాక్షరసంలో మాయమైపోయినట్టు"[4]

**చైనీయులు ఇదే అనుభవాన్ని ఇలా వివరించారు:**

'తాయిస్టు ఈ ప్రపంచ వ్యాపకాల పరిధినిదాటి, ప్రాపంచిక వస్తువులను దాటుకుంటూపోయి, చివరకు తన ఉనికినే దాటేస్తాడు. అంచెలంచెలుగా జరిగే ఈ ప్రక్రియతో అతనికి జ్ఞానోదయం అయి, చివరకు అన్ని వస్తువులనూ 'ఒక్కడి'గా చూడగలుగుతాడు" [5]

ఇదే అనుభవం, సూఫీ గురువు మన్సూర్ అల్ హల్లాజ్, అల్లాతో తన సంయోగాన్ని ఇలా వివరించేట్టు చేసింది:

"నేను ప్రేమించే అతడే నేను, మేమిద్దరం ఒకే శరీరంలోని ఆత్మలం.
నీవు నన్ను చూస్తే, అతణ్ణి చూసినట్టే, అతణ్ణి చూస్తే, మా ఇద్దరినీ చూసినట్టే".[6]

"ఓ ప్రజలారా! నన్ను నా దేవుడి నుండి కాపాడండి. దేవుడు నన్ను నానుంచి కాజేశాడు. నాకు నన్ను తిరిగి ఇవ్వడంలేదు. అతను నాలో చేరిపోవడంవలన, అతనికి ఇవ్వదగిన గౌరవం నేను ఇవ్వలేకపోతున్నాను - అలాచేస్తే నన్ను వదలి వెళ్ళిపోతాడనే భయంతో. అమ్మో! నన్ను ఒంటరివాణ్ణి చేసి వెళ్ళిపోతాడేమో! ఆ కలయిక తర్వాత, దేవుడు వదిలి వెళ్ళిపోబడినవాడు ఎంత దౌర్భాగ్యవంతుడు?" [7]

మధ్యయుగానికి చెందిన క్రైస్తవ సన్యాసి మీస్టర్ ఎఖ్‌కార్డ్ మాటల్లో చెప్పాలంటే :

"దేవుణ్ణి నేను ఎలా ప్రేమించాలి? దేవుణ్ణి - దేవునిలా, ఆత్మలా, వ్యక్తిలా, రూపంలా ప్రేమించకూడదు. అతణ్ణి వీటన్నింటికీ అతీతమైన ఒక స్వచ్ఛమైన వానిలా ప్రేమించాలి. ఈ స్వచ్ఛతలోకి మనం మునిగిపోతూ ఉండాలి" [8]

యూదు మార్మికవాది రబ్బీ ఎలీజర్ సెలవిచ్చాడు:

"ప్రార్థనలో, నిన్ను నువ్వు ఏమీకానట్టు పూర్తిగా మరచిపో. దైవదర్శనం కోసం ప్రార్థిస్తున్నట్టు మాత్రమే గుర్తుంచుకో. అప్పుడు నువ్వొక మానసిక ప్రపంచంలోకి ప్రవేశిస్తావు. సమయాతీతమైన ఒక మనోస్థితిలోకి. ఆ ప్రపంచంలో అన్ని సమానము మరియు ఒక్కటే - జననం, మరణం, నేల, నీరు మొదలైనవి - కానీ ఆ ప్రపంచంలోకి నువ్వు ప్రవేశించాలంటే ముందు నీ అహాన్ని, నీ సమస్త సమస్యల్ని త్యజించాలి"[9]

తుకారాం (1608-1650) - ఇతను మహారాష్ట్రకు చెందిన భక్తిగీతాలాపకుడు, దేవునితో తన సంయోగాన్ని ఇలా వివరించాడు:

"సమస్తం ఒక్కటైపోయాయి. అలలు, సముద్రం ఒక్కటైపోయాయి. వచ్చేదీ, పోయేదీ అంటూ ఏమీ లేదు. ఆత్మ తనచుట్టూ తాను అల్లుకుపోయింది. సూర్యాస్తమయం, సూర్యోదయాలు మాయమైపోయాయి" [10]

జ్ఞానేశ్వర్ (13వ శతాబ్దం) - ఇంకొక భక్తి గీతాలాపకుడు ఇలా వివరించాడు:

"దేవునితో ఆ సంయోగస్థితిలో, సంయోగ భావన సంయోగం నుంచే జనిస్తుంది. నీళ్ళలో నీళ్ళు ఒక్కటైపోయినట్టు, గాలి ఆకాశంలోకి మాయమైపోయినట్టు. ఆ స్థితిలో కేవలం ఆనందం మాత్రమే మిగులుతుంది". [11]

ఇవి - మార్మికవాద అనుభవాల పరంపరలోని కొన్ని ఉదాహరణలు మాత్రమే. ఈ వివరణల వెలుగులో విశదమయ్యేదేమంటే - వేర్వేరు మతాలకు, ప్రాంతాలకు చెందిన వారైనా కూడా, వీరంతా కూడా ఒకేరకమైన అనుభవానికి లేదా అనుభవాలకు లోనయ్యారు. మీరు ఇప్పటి వరకూ చదివిన మార్మికవాదుల వివరణలను నిశితంగా పరిశీలిస్తే ఈ క్రింది విషయాలు బోధపడతాయి:

- దేవుడు ఒక స్వచ్ఛమైన చైతన్యం (Consciousness) మరియూ ఆత్మలా వర్ణింపబడ్డాడు.
- దేవునిలా వర్ణింపబడిన దానిలోకి లీనమైపోయి, ఒకటైపోయిన అనుభవం వారికి కలిగింది.
- ఆ అనుభవంలో తన 'స్వ'- అస్తిత్వం (Self) అనే భావన పూర్తిగా కోల్పోవడం జరిగింది.
- ఆ అనుభవంలో సమయజ్ఞానం కూడా కోల్పోవడం జరిగింది.
- 'అంతా ఒక్కటే' అనే బలమైన భావన మనసులో నిలచిపోయింది.
- ఈ అనుభవాన్ని 'జ్ఞానోదయం'గా కూడా వర్ణించడం జరిగింది.

## ప్రసిద్ధులైన కొంతమంది మార్మికవాదులు

వీళ్ళ చిట్టా చాలా పెద్దది. వేల సంఖ్యలో ఉన్నట్టు చరిత్ర చెప్తూంది. క్రింద ఇవ్వబడినవి కొన్ని పేర్లు మాత్రమే.

| | | |
|---|---|---|
| హిందూ సాంప్రదాయానికి చెందినవారు | : | ఆది శంకర (788-820), దత్తాత్రేయ, జ్ఞానేశ్వర్ (13వ శతాబ్దం), నామ్‌దేవ్ (1270-1350), ఏక్‌నాథ్ (1533-1599), తుకారాం (1608-1650), శ్రీరామకృష్ణ (1836-1886), వివేకానంద (1863-1902), అరవిందుడు (1872-1950) మొదలైనవారు. |
| చైనీయులు | : | లావ్‌సు, చువాంగ్‌సు, గేహాంగ్, చీదావ్‌లిన్, చాంగ్ సన్‌ఫెంగ్ మొదలైన వారు. |
| క్రైస్తవ సాంప్రదాయానికి చెందినవారు | : | ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిసి (1182-1226), ఆంజెలా ఆఫ్ ఫలిగ్నో (1248-1309), సెంట్ థెరిసా ఆఫ్ అవీలా (1515-1582), సెంట్ జాన్ ఆఫ్ క్రాస్ (1542-91) |
| ఇస్లాం సాంప్రదాయానికి చెందినవారుః | | |
| పార్శీలు | : | అల్‌ఘజాలి (మరణం 1111), మన్సూర్ అల్‌హల్లాజ్, అబూయాజిద్ బిస్తామి, జామి, ఇబ్న్ అరబీ. |
| ఆఫ్ఘనీయులు | : | మౌలానా ఫైజన్ (20వ శతాబ్దం) |
| తర్కీయులు | : | యూనస్ ఎమిూర్ |
| భారతీయులు | : | ఖాజా మొహియుద్దీన్ ఛిస్తీ, ఖాజా నిజాముద్దీన్ ఛిస్తీ, ఖలందర్ బాబా ఔలియా మొదలైనవారు. |
| యూదులు | : | షిమన్ బర్‌యోఛాయ్, అబ్రహంబెన్ సామ్యూల్ అబులఫియా (1240-1291), మోషే ఛాయిం రిజ్జతో (1707-1810), అబ్రహం ఇసాక్ కూక్ (1864-1935) మొదలైనవారు. |

## నకిలీ గురువులు

కొందరు స్వార్థపరులు ఈ మార్మికవాదాన్ని ప్రజలను మోసంచేసే ఒక సాధనంలా వాడుకున్నారు. ఈ నకిలీ గురువులు చాలామంది, అమాయక భక్తులను, శిష్యులను మోసం చేశారు, కొంతమంది పలురకాలుగా ఇంకా మోసం చేస్తూనే ఉన్నారు. నేను వీళ్ళ గురించి చర్చించ బోవడంలేదు. చేయదలచుకున్న ప్రస్తావన ప్రక్కదారి పట్టకుండా ఉండేందుకు, అసలైన మార్మికవాదము మరియు మార్మికవాదుల గురించే నేను విశ్లేషణ జరుపుతాను.

## సూఫీజం గురించి మరికొంత వివరణ

ఇంతకు ముందే పేర్కొన్నట్టు, సూఫీజం అనేది ఇస్లాం సాంప్రదాయానికి చెందిన మార్మికవాదము. ఇక్కడ మనం ఇతర సాంప్రదాయాలకంటే సూఫీజం గురించి వివరంగా చూడడానికి కారణమేమిటంటే - సాయిబాబా, మెహర్‌బాబాలిద్దరూ కూడా మిగతా సాంప్రదాయాలకంటే ఎక్కువగా సూఫీజంతోనే ముడిపడి ఉన్నారు. ఈ విషయం మీకు ముమ్ముందు అవగతమౌతుంది. సాయిబాబా, మెహర్‌బాబాలను సరిఅయిన రీతిలో అర్థం చేసుకోవాలంటే, మనం ముందు సూఫీజం గురించి కొద్దిగా అయినా నేర్చుకోవలసిందే.

సూఫీల నిర్వచనం ప్రకారం, సూఫీజం అంటే : "దేవునిలో పయనం, దేవునితో పయనం, దేవుని ద్వారా పయనం మరియు దేవునితో సంయోగాల గురించి వివరించే శాస్త్రం లేదా జ్ఞానం" [12]

*ఈ క్రిందిపటం ద్వారా సూఫీలు తమ ఆధ్యాత్మిక పయనాన్ని వివరిస్తారు[13]:*




పై పటంలో 'B' అనేది పయనం మొదలయ్యే స్థానం. BCA అనేది పై వైపు పయనం, ఇది 'A' వద్ద ముగుస్తుంది. దీనిని సైర్-ఇలా-అల్లా (దేవుని వైపు పయనం) అంటారు. 'A' వద్ద ఫనా-ఫి-అల్లా (దేవునిలో లీనత్వం) సిద్ధిస్తుంది. ఆతర్వాత సైర్-ఫీ-అల్లా (దేవునిలో పయనం) ఉంటుంది. దాని తర్వాత ADB ద్వారా 'B' కు తిరిగి రావడాన్ని సైర్-మిన్-అల్లా (దేవుడి నుండి పయనం) అంటారు. 'ఈ పయన చక్రం పూర్తి చేయడం ద్వారా - ఆధ్యాత్మికత పరిపక్వత చెంది, మానవ మహానత్వం సిద్ధిస్తుంది' అనేది సూఫీల నమ్మకం.

చాలామందికి, ఇదెంతో విచిత్రంగా తోస్తుంది. ఏమిటి? దేవుడి దగ్గరకు పయనమా? దేవునిలో పయనమా? అదెలా ఉంటుంది? అదెలా సాధ్యం? కానీ, మార్మికవాదులు మాట్లాడేదీ, బ్రతికేదీ వీటిని గురించే.

సూఫీలు 'వహద్-ఉల్-ఉజూద్' అనే తత్వంలో నమ్మకముంచుతారు. దీని అర్థం - 'అన్నింటి యొక్క ఏకత్వం', అంటే అంతా ఒక్కటే మరియూ అంతా కలిపి దేవుడు అని. ఇది 'అద్వైత' సిద్ధాంతానికి మరొక నిర్వచనం తప్ప వేరొకటి కాదు. మార్మికవాద సాంప్రదాయాలను పోల్చిచూస్తే - విధానాలలో, వర్ణణలలో తేడా ఉన్నప్పటికీ, తత్వం ఒక్కటే ('అంతా ఒక్కటే' అనేది) అని బోధపడుతుంది.

ఇస్లాం యొక్క ప్రాథమిక సూత్రాల అవగాహన ఉండి, సూఫీల తత్వం గురించి వినిఉండని ముస్లింలకు, సూఫీజం యొక్క నిర్వచనం మరియు వారి 'వహద్-ఉల్-ఉజూద్' సిద్ధాంతాలు తమ మత విశ్వాసానికి ఎంతో భిన్నంగా మరియూ నమ్మలేనట్టుగా ఉంటాయి. దీనికి గల కారణం తెలుసుకోవాలంటే మనం ఇస్లాం యొక్క ప్రాథమిక సూత్రాలను పరిశీలించాలి.

ఇస్లాం యొక్క అత్యంత ప్రాథమిక సూత్రం - 'దేవుని ఏకత్వం' - అంటే దేవుడు ఒక్కడే అని. ఇది మార్మికవాదుల 'అన్నింటి ఏకత్వం'తో ఎంతో భిన్నమైనది. వీటి అర్థాలలో ఎంతో వ్యత్యాసం ఉంది.

అన్నింటి ఏకత్వం అంటే, అంతా దేవుడే అని... మీరు, నేను, మీరు చదువుతున్న ఈ పుస్తకం, మీచుట్టూ ఉన్న వస్తువులు, జంతువులు, చెట్లూచేమలూ, ప్రపంచంలోని ఇతర సృష్టి అంతా - గ్రహాలు, నక్షత్రాలు...... ఇలా అన్నీ కూడా దేవునిలో అంశాలే అని.

ఇస్లాం సందేశమైన 'దేవుని ఏకత్వం' పై సిద్ధాంతానికి పూర్తిగా భిన్నమైనది. సృష్టికర్త మరియు సృష్టితాల మధ్య ఉన్నటువంటి తేడాను, ఇస్లాం చాలా వివరంగా విశదపరుస్తోంది. సృష్టి అంతా దేవునికి చెందినదే గానీ సృష్టి అంతా దేవుడు కాదు. అంతేకాదు, దేవుణ్ణి సృష్టిలోని ఏవస్తువుతో అయినా జతపరచడం, పోల్చడం అనేవి అన్నింటికంటే పెద్దపాపంగా తేటతెల్లం చేయబడింది.

ఇస్లాం - దేవుడిని, సృష్టిలోని ఏవస్తువుతో అయినా పోల్చడాన్ని ఖచ్చితంగా నిషేధిస్తుంది. దేవునికికొక రూపాన్నివ్వడం, అతనికి భాగస్వాముల్ని జతచేయడం, దేవునికి కుమారులు ఉంటారని నమ్మడం - ఇవన్నీ అవివేకాలని తెలియజేస్తుంది. ఇస్లాం ప్రకారం దేవుని నిర్వచనం ఏమిటంటే - ఆయన ఒక్కడే, పూజకు అర్హమైన ఒకే ఒక శక్తి, సర్వలోకాలకు (భూలోకం, స్వర్గం, నరకం) యజమాని, అత్యంత శక్తిమంతుడు, అనంత కరుణామయుడు, అపారకృపాశీలుడు మరియు ప్రళయం తరువాత వచ్చే తీర్పు దినానికి యజమాని. ఆయన ఒక్కడే. అంటే ఆయనకు సహవర్తులెవ్వరూ లేరనే భావంతో. ఆయనే సృష్టికర్త, దానిసంరక్షకుడు, దానిని నాశనం చేసేదీ ఆయనే. ఆయన ఎవరి ఆధారం అవసరం లేనివాడు, సమస్త సృష్టి ఆయనమీదే ఆధారపడి ఉంది. ఆయన పుట్టుక, మరణం లేనివాడు. కుమారులు (సంతానం), కన్నవారులాంటి బంధాలకు అతీతుడు. అందరికంటే గొప్పవాడు.

ముస్లింలు ఆయననను అల్లాహ్ అని పిలుస్తారు. అరబిక్ పదమైన 'అల్లాహ్'కు అర్థం - 'పూజింపయోగ్యుడు' అని మాత్రమే. తెలుగులో దానిని 'దేవుడు' అని అనువాదం చేయవచ్చు. కానీ, అరబిక్ పదమైన 'అల్లాహ్'కు ఒక విశిష్టత ఉంది. అదేమిటంటే - దానికి బహువచనం లేనేలేదు. 'దేవుడు' అనే బదులు 'దేవుళ్ళు' అనగలం కానీ 'అల్లాహ్' పదానికి బహువచం లేదు. అలాగే లింగ భేదంకూడా లేదు. 'దేవుడు' అనే పదాన్ని 'దేవత'గా మార్చవచ్చు. కానీ అల్లాహ్ అనే పదాన్ని అలా మార్చేవీలులేదు. 'అల్లాహ్' అనే పదానికి అసలు లింగ నిర్వచనం లేదు. ఎందుకంటే 'అల్లాహ్' దానికి అతీతుడు. 'అల్లాహ్' ను 'అతడు', 'ఆయన' అని భాష మరియూ వ్యక్తీకరణలో సౌలభ్యం కోసం మాత్రమే వ్రాయడం, పలకటం జరుగుతుంది తప్ప అసలు ఈ పదానికి లింగ నిర్వచనం లేదు.

మానవులంతా ఆ సృష్టికర్త ఆరాధనకు, ఆజ్ఞాపాలనకు మాత్రమే సృష్టించబడ్డారని ఇస్లాం ధర్మం అత్యంత ప్రస్ఫుటంగా విశదపరుస్తోంది. సూఫీలు నమ్మేటట్లుగా - అల్లాహ్ దగ్గరకు పయనం, అల్లాహ్ సాక్షాత్కారం, అల్లాహ్‌లో లీనమైపోవడం, సంయోగం చెందడంలాంటి అంశాలుగానీ, భావనలుగానీ ఇస్లాంలో లేనేలేవు. ఇస్లాంలో దేవుని ముందు హాజరు పరచబడటం గురించి ఉంది - కానీ అది సంయోగం కోసంకాదు. ప్రళయం తర్వాత, తీర్పుదినాన దేవుడు మన కర్మలనుబట్టి మన పరలోక స్థానాన్ని నిర్ధారణ చేయడం కోసం. అంతేకాదు, ఇస్లాం సన్యాసత్వాన్ని (ప్రాపంచిక జీవితం త్యజించడం), సూఫీలు అవలంబించే ఇతర విధానాలను నిర్దిష్టమైన పదాలలో ఖండిస్తుంది.

ఎంత ఆశ్చర్యకర విషయం? సూఫీలు తమను తాము ముస్లింలుగా చెప్పుకుంటారు. మరి వారి నమ్మకాలు, భావనలు ఇస్లాంకు ఇంత భిన్నంగా (ఖచ్చితంగా చెప్పాలంటే పూర్తి వ్యతిరేకంగా) ఎలా ఉన్నాయి? నమ్మకాలలో ఈ వ్యత్యాసమే ముస్లింల, సూఫీల(ముస్లిం మార్మికవాదుల) మధ్య ఎన్నో గొడవలకు కారణమైంది. సూఫీ గురువు - మన్సూర్ హల్లాజ్ - 'నేను దేవుణ్ణి' అని ప్రకటించుకున్నప్పుడు, ముస్లిం మతపెద్దలు అతనికి మరణశిక్ష విధించారు. దానిని అమలు పరచడానికి తీసుకువెళ్తుండగా, అతను తన శిష్యులతో ఇలా అన్నాడు - "దీనిని గురించి చింతించకండి, నేను 30 రోజుల తర్వాత మీదగ్గరకు వచ్చేస్తాను." [14] అతని అవశేషాలను టైగ్రిస్ నదిలో విసిరివేశారు. తమ గురువు, మాటప్రకారం తిరిగివస్తాడనే నమ్మకంతో, అతని శిష్యులు నది ఒడ్డున వేచిచూసారు.[15] **మన్సూర్ హల్లాజ్ తిరిగి రాలేదు.**

## మార్మికవాదం - ఒక ఏకైక తత్వం

మార్మికవాదులు తమను తాము వివిధ మతాలతో జతపరచుకోవడానికి కారణాలు ఏమైనప్పటికీ, వారిలో చాలామంది ఆయా మతాల ఆచరణలను కొద్ది కొద్దిగా పాటిస్తూ, వారిలో ఒకరిలా ఉంటూనే తమ మార్మిక సాధనాలు చేస్తూ ఉంటారు. ఉదాహరణకు, చాలామంది సూఫీలు, ముస్లింలు ఆచరించే నమాజు (ప్రార్థన), రోజా (ఉపవాసం)లను పాటిస్తూ, చూడడానికి వాళ్లూ ముస్లింలే అనే భావన కలిగేట్టు ఉంటారు. కానీవారు ఇస్లాంలో లేని అనేకానేక ఇతర ఆచరణలను కూడా పాటిస్తుంటారు.

ఇప్పటిదాకా చదివింది మిమ్మల్ని ఆశ్చర్యపరచవచ్చు. అసలు మార్మికవాదము, మతాలకు గల సంబంధం ఏమిటి? అనే సంశయం కలుగవచ్చు.

ఇక్కడ నేను వ్యక్తపరచదలచుకున్న వాస్తవం ఏమిటంటే - మార్మికవాదం అనేది ఒక ఏకైకతత్వం - అది ఏమతంతో జతపడి ఉన్నప్పటికీనూ. సూఫీల విషయంలో విశదీకరించినట్టు, అది ఆ మత విశ్వాసాలకు పూర్తిగా వ్యతిరేకంగా కూడా ఉండవచ్చు.

అందుకని మనం మార్మికవాదాన్ని ఈ ధృక్పధంలోనే విశ్లేషించాలి. అది జతపడి ఉన్న మతం ఆధారంగా దాన్ని విశ్లేషిస్తే, మనం మార్మికవాదాన్ని, మార్మికవాదుల్నే కాకుండా ఆ మతాన్ని కూడా పూర్తిగా అపార్థం చేసుకునే ప్రమాదం ఉంది. ఇంకా, అనేక రకాల మతాలవలన ఏర్పడి ఉన్న అయోమయానికి అదితోడై, మరింత అయోమయానికి కారణమౌతుంది.

విభిన్న కాల,ప్రాంత,సాంప్రదాయాలకు చెందిన ఇంతమంది ఒకేరకమైన అనుభవాల గురించి వివరించడం, దైవానుభవం పొందగలం, దేవునిలో లీనంకాగలం అని పదేపదే ప్రకటించడం ఎంత ఆశ్యర్యకరమైన విషయం? దేవుణ్ణి ఇతర మార్గాలలో కొలిచేవారికి (అంటే గుళ్ళలో, చర్చిలలో, మసీదులలో పూజించేవారికి) ఈ భావనలు ఎంతో విచిత్రంగా తోచవచ్చు. ఇంతమంది, ఇంత ఖచ్చితంగా దేవుని గురించి వేరే రకంగా చెబుతున్నారంటే మనం ఏమని అర్థంచేసుకోవాలి? ఎవరు అనుసరిస్తున్న విధానం సరిఅయినది? మనం చేస్తున్న పూజా ప్రయాసలన్నీ వ్యర్థమేనా? అసలు ఈ రెండు మార్గాలు ఎందుకింత భిన్నంగా ఉన్నాయి? రెండు మార్గాలూ సరిఅయినవేనా? అనే పలుప్రశ్నలు దేవుని గురించి చింతన ఉన్న ప్రతీవారికీ కలుగవచ్చు. అసలు విషయం ఏమిటంటే ఈ ప్రశ్నల సమాధానాల కోసం జరిగిన అన్వేషణ ఫలితమే ఈ పుస్తకం రూపంలో మీ ముందుంచడం జరిగింది. మీరు దీనిని సత్యాన్వేష కాంక్షతో చదివి, అర్థం చేసుకుంటారని ఆశిస్తున్నాను.

ఈ అధ్యాయంలో 'మార్మికవాదం' గురించి పరిచయం చేయడం జరిగింది. సాయిబాబా మరియు మెహర్‌బాబాలు మార్మికవాదులు. వీరు సూఫీ సాంప్రదాయంతో బలంగా ముడిపడి ఉన్నారు. దీనికి సంబంధించిన వివరాలు, ఆధారాలు - తరువాతి అధ్యాయంలో చూద్దాము.

"కంటిద్వారా చూడకుంటే .............

ఒక అబద్ధాన్ని నిజంగా భ్రమించే

అవకాశం ఉంది"

-బ్లేక్ విలియం

## 3. సాయిబాబా, మెహర్‌బాబా - మార్మికవాదులేనా?

షిర్డీలోని సాయిబాబా మందిరాన్ని దర్శించిన వారికి - 'సాయిబాబా ఒక హిందూ దైవావతారం అయి ఉండవచ్చు. కొంతమంది ఆయనను పొరపాటుగా ముస్లింగా అర్థం చేసుకుని ఉండవచ్చు' అనే అభిప్రాయం కలుగుతుంది. అక్కడ ఆయన పాలరాతి విగ్రహం, అందంగా అలంకరించబడిన వెండి సింహాసనం మీద దర్శనమిస్తుంది. దానికి భక్తులు, హిందూ సాంప్రదాయానుసారం - నిరంతరం పూజలు, అభిషేకాలు, ఆరతులతో ఒక హిందూ దేవునిరీతిలో కొలుస్తూ ఉంటారు. రామనవమిలాంటి పండుగలప్పుడైతే ఇంకా ఎక్కువ సంబరాలు, ప్రత్యేక పూజలు చూడవచ్చు. సాయిబాబా సుమారు 60 సం॥లు నివసించిన పాత మసీదు మినహాయించి, ఆయన ముస్లిం అస్తిత్వాన్ని తెలియజేసే ఇతర గుర్తులేమి అక్కడ కనిపించవు. దీనివలన, షిర్డీ దర్శించిన వారికి ఇతర హిందూ పుణ్యక్షేత్రాల మాదిరిగా, ఒక హిందూ దైవదర్శనం చేసుకున్న అనుభవమే కలుగుతుంది.

నిజం ఏమిటంటే - సాయిబాబా హిందువు కాదు, ముస్లిమూకాదు. ఆయన ఒక సూఫీ ఫకీరు. అందువలన ఆయన ఒక మార్మికవాది. ఆయన ముస్లిం ఎందుకు కాజాలరంటే, ఆయన సిద్ధాంతాలు, తత్వం, ఉపదేశాలు ఇస్లాం ధర్మానికి చెందినవే కావు. మునుపటి అధ్యాయంలో వివరించినట్టుగా సూఫీలు తమను తాము ముస్లింలుగా ప్రకటించుకొనే మార్మికవాదులు. కానీ వారి సిద్ధాంతత్వం మరియు ఆచరణలు ఇస్లాంకు సరాసరి వ్యతిరేకంగా ఉంటాయి.

ఈ కారణం వల్లనే సాయిబాబాగారి అస్తిత్వాన్ని గురించి అయోమయ పరిస్థితి నెలకొంది. హిందువులకు, ప్రత్యేకించి సాయిబాబాతో గడిపిన బ్రాహ్మణులకు - ఇస్లాం గురించిగానీ, సూఫీజం గురించిగానీ సరిఅయిన అవగాహన లేదు. చాలామంది ముస్లింలకే - ఇస్లాం మరియు సూఫీజంల మధ్య ఉన్న సైద్ధాంతిక వ్యత్యాసాల జ్ఞానం లేదు. మార్మికవాదాన్ని ఒక వేరైన, ఏకైక తత్వంలా కాకుండా, దానిని అది ముడిపడి ఉన్న మతం ఆధారంగా విశ్లేషించే పొరపాటు, చాలామంది విశ్లేషకులు చేశారు. వీటన్నింటివల్లా, సాయిబాబా గారి అసలు అస్తిత్వం విషయంలో అంత అయోమయం నెలకొంది. ఆయన దేవుడు, ఆయనకు మతంతో సంబంధంలేదని ఇచ్చే వివరణవల్ల నిజ నిర్ధారణ జరగదు. సాయిబాబాగారి అసలు అస్తిత్వాన్ని నిరూపించే బలమైన, చారిత్రక సాక్ష్యాధారాలు చాలా అందుబాటులో ఉన్నాయి. మనం వాటిని పరిశీలిద్దాం.

సాయిబాబాగారు, సొంతమాటల్లోనే తను ముస్లింనని ప్రకటించుకున్న సందర్భాలు ఉన్నాయి. ఉదాహరణకు, ఒక హిందూ భక్తుడు, ఆయన ముస్లిం అయిన కారణంగా ఆయనను దర్శించడానికి సంశయంలో ఉన్నప్పుడు, సాయిబాబాగారు కోపంలో అతడితో ఇలా అన్నారు:

"నేను ముస్లింని. వెళ్ళు, వెళ్ళి ఆ భీమశంకరాలయం దగ్గరున్న సాధు కాళ్ళమీదపడు"[1]

ఇంతకు ముందు పేర్కొన్నట్లు, సాయిబాబాగారి సిద్ధాంతత్వం ఇస్లాం సిద్ధాంతాలకు వ్యతిరేకం కాబట్టి ఆయన ముస్లిం కాజాలరు. అది ఎందుకనేది మనం ముందుగా పరిశీలించి, ఆ తరువాత ఆయన సూఫీ సాంప్రదాయానికి చెందిన వారనే ఆధారాలను పరిశీలిద్దాము.

దీనికి ముందు నేను - సాయిబాబా గారి జీవితం మీద డాక్టర్ మేరీ వారెన్ (Ph.D.) గారు చేసిన చారిత్రాత్మక పరిశోధన గురించి కొంచెం చెప్పాలి. ఈమె ఇంగ్లాండ్ దేశానికి చెందిన ఒక మహిళ. ఉన్నత విద్యాభ్యాసం తరువాత ఈమె ఇంగ్లండు నుండి కెనడా దేశానికి వెళ్లి, అక్కడ టొరంటో యూనివర్సిటీలో M.A. మరియు Ph.D. చేశారు. Ph.D. పూర్తి చేసే క్రమంలో, తన పరిశోధనాంశాన్ని - 'షిరిడీ సాయిబాబాగారి సూఫీ అస్తిత్వం'గా తీసుకున్నారు.

తర్వాత ఆమె తన పరిశోధనల ఫలితాల ఆధారంగా 1999 వ సం॥లో ఒక పుస్తకం వ్రాసారు. అది - 'సూఫీజం వెలుగులో షిర్డీసాయిబాబా' (Shirdi Sai Baba - In the light of Sufism). విషయమేమంటే, సాయిబాబా గారిని విమర్శిస్తూ వ్రాసిన పుస్తకం కాదది. నేను దాన్ని షిర్డీసాయిబాబాగారి ఆధ్యాత్మిక వెబ్‌సైట్ - www.saibaba.org లో కొన్నాను. ఈ పుస్తకం షిర్డీ సాయిబాబా గారి సూఫీ అస్తిత్వాన్ని ఆధారాల సహాయంతో కళ్ళకు కట్టినట్లు చూపిస్తుంది.

వారెన్ గారి పరిశోధనలో దొరికిన ఆశ్చర్యకరమైన మరియు ముఖ్యమైన ఒక ఆధారం- సాయిబాబా గారి శిష్యుడు, సేవకుడు అయినటువంటి - అబ్దుల్ వ్రాసుకున్న పుస్తకం. ఇందులో, ఆయన సాయిబాబాగారి సమక్షంలో ఖురాన్ పఠిస్తూ మరియు ఆయన బోధనలు వింటూ వ్రాసుకున్న అంశాలు చాలా ఉన్నాయి. ఈ పుస్తకం వారెన్‌గారికి ఒక అనూహ్యమైన రీతిలో లభించింది. 1984-89 సం॥ల మధ్య సాయిబాబా సంస్థానానికి ధర్మకర్తగా పనిచేసి, సాయిబాబా గారి మీద అనేక పుస్తకాలు కూడా రచించిన, వి.బి. ఖేర్ గారు దీని ప్రతిని వారెన్‌కు ముంబాయిలో కానుకగా ప్రసాదించారు.

అబ్దుల్‌గారు సాయిబాబా గారి దగ్గర కూర్చుని, వ్రాసుకున్న ఆ వివరాలు చదివిన తరువాత, సాయిబాబాగారు హిందూ సాంప్రదాయానికి చెందిన వారని, హిందూ దైవ అవతారం అనే అభిప్రాయాలు ఎంత తప్పో తేటతెల్లమవుతుంది. అబ్దుల్ గారి ఈ వ్రాతప్రతిని వారెన్ తమ పుస్తకంలో ప్రచురించారు.

## సాయిబాబా గారు ఇస్లాం సిద్ధాంతాలు పాటించేవారు కాదనే వాదనకు ఆధారాలు

షిర్డీలో ప్రవేశించిన సాయిబాబాగారు, ఒక పాడుబడిన మసీదులోచేరి, నివసించసాగారు. అక్కడ ఆయన ఒక అగ్నిపీఠం (ధుని అని కూడా అంటారు) ప్రారంభించారు. ఇది ఇస్లాం మత సిద్ధాంతాలకు వ్యతిరేకమైన ఆచారం, ప్రపంచంలోని ఏ మసీదులోనూ మీకీ సన్నివేశం కానరాదు.

దాస్‌గాను (అసలు పేరు - గణపత్ రావ్ దత్తాత్రేయ సహస్రబుద్ధే) సాయిబాబాగారి భక్తుడు (సాయిబాబా గారు బ్రతికుండగా) - ఆయన చెప్పినదానినిబట్టి, సాయిబాబా గారు కొన్నిసార్లు స్థానిక ముస్లింలతో వాదులాడేవారు. 'ముస్లింల మతాచారాలకు అనుగుణంగా ఆయన ఆలోచనలు ఉండకపోవడమే దీనికి కారణం' [2]

"కొంతమంది ముస్లింలు సాయిబాబాను శుక్రవారం జరిగే ప్రత్యేక ప్రార్థనలు - కుత్బా (సందేశం) మరియు నమాజు (ప్రార్థన)లో పాల్గొనేందుకు పట్నం వెళ్లమని ఉపదేశించేవారు. ముందు అంగీకారం తెలిపినా, చివరకు సాయిబాబా వాళ్ళతో వెళ్ళడానికి నిరాకరించేవారు. దాస్‌గాను అభిప్రాయంలో ఆ ముస్లింలు కోపానికి గురైనా, శక్తివంతమైన ఆ బాబాను ఏమీ చేయలేక పోయేవారు".[3]

శుక్రవారం ప్రార్థన అనేది - ఇస్లాంలో ఎంతో విశిష్టతతో కూడుకుని ఉంది. ప్రతీ శుక్రవారం, మసీదులలో క్రమం తప్పకుండా హాజరయ్యే ముస్లింలే దీనికి రుజువు. ఎవరైనా ముస్లిం, శుక్రవారం ప్రార్థనకు వెళ్ళడానికి నిరాకరిస్తే, అసలు నువ్వు ముస్లింవేనా అని ప్రశ్నిస్తారు తోటి ముస్లింలు.

అంతేకాదు. సాయిబాబా అసలు నమాజు (ప్రార్థన) ఎందుకు చేయాలి? అని ప్రశ్నించారు. అబ్దుల్‌గారి పుస్తకం నుంచి:

''నా హృదయ ఫలకంపై దేవుడు ఆసీనుడై ఉన్నప్పుడు నాకు ఇమామ్ (మసీదులో నమాజు చదివించేవారు) అవసరం ఏమిటి? ఇక్కడ ప్రార్థన ద్వారా నా కార్యం నెరవేరుతున్నప్పుడు, నేను మసీదుకు వెళ్ళి, ఆయన సందేశం వినవలసిన అవసరం ఏమిటి? ఎల్లప్పుడు దైవధ్యానంలో నిమగ్నమై ఉండే నేను, 5 పూటలా నమాజు చేయవలసిన అవసరం ఏమిటి? దైవప్రేమలో ఉన్న మనం వెళ్ళి మందిరంలో ఉందాము. మక్కా వెళ్లి 'కాబా' దర్శనం చేసుకొనే అవసరం ఏముంది?''[4]

ఇంకా అబ్దుల్‌గారు అక్కడ ఒక సూఫీ కవిత కూడా వ్రాసారు. దాని అర్థం:

''మేము దేవుని ప్రేమలో ఉన్నాము. మనం మందిరం (గుడి)కి వెళ్ళి అక్కడ ఉందాము. డబ్బులు వసూలుచేసి, ముస్లిమేతరులకు ఇద్దాము. మాకు కాబాను దర్శించాలనే తపనే లేదు. దేవుని ప్రతిమ, నా హృదయ ఫలకంపై ఉన్నప్పుడు, నేను ప్రార్థనలో వంగడం (సజ్ద) ఏమిటి? సలాములు చేయడం ఏమిటి? ఈ ప్రార్థనలేమిటి? ఈ ఉపవాసాలేమిటి? ఇస్లాం ధర్మం ప్రకారం నేను ఇవన్ని చేయాలి. కానీ నేను చేయను'' [5.]

గమనించవలసినదేమిటంటే - ఇస్లాంలో 5 ముఖ్యసూత్రాలు ఉన్నాయి. వీటిని ఇస్లాంయొక్క మూల స్థంబాలుగా పేర్కొంటారు. అవి ఏమిటంటే: ''దేవుడు ఒక్కడే - అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యదైవంలేడు మరియు ముహమ్మద్ ఆయన ప్రవక్త'' అని నమ్మి - సాక్ష్యమివ్వటం, 5 పూటలు నమాజు చేయడం, రంజాను మాసంలో ఉపవాసాలుండడం, జకాతు (ఆస్తిలో పేదల హక్కైన వాటాను) చెల్లించడం, స్థోమత ఉంటే మక్కాయాత్ర (హజ్) చేయడం''.

ఈ 5 ముఖ్య సూత్రాల ఆచరణకంటే మించిన కర్తవ్యం ఇస్లాంలో ఏదీలేదు. అంటే, ఒకవ్యక్తి ఇతరత్రా సత్కార్యాలు ఎన్నో చేస్తున్నప్పటికీ, ఈ ప్రాథమిక సూత్రాలను పాటించకపోతే అతడు ముస్లిం కాజాలడు. నమాజు (ప్రార్థన) విషయానికొస్తే, ఇది ప్రతి ఒక ముస్లింపై విధి మాత్రమే కాకుండా, ఒక ముస్లింకు - ముస్లింకాని వానికి మధ్య తేడాగా నిర్వచించడం జరిగింది. దైవ ప్రవక్తలకు కూడా ఈ విధినుండి మినహాయింపు ఇవ్వబడలేదు. యుద్ధసమయంలో కూడా ఈ విధి నిర్వహించవలసిందే.

సాయిబాబా గారు తాను ముస్లింనని చెప్పుకున్నా, ఇస్లాం యొక్క ఈ ప్రాథమిక సూత్రాలను పాటించనని ప్రకటించుకున్నారు. సాయిబాబాగారు ముస్లింకాదని నిరూపించడానికి దీనికి మించిన ఆధారాల అవసరం లేదు.

ఇక్కడ మీరు గమనించి, అర్థం చేసుకోవలసిన విషయం ఏమిటంటే, సాయిబాబాగారు ఇస్లాం సూత్రాలను, ఆచరణలను పాటించలేదని ఆయనపై అభాండం వేయడం నా ఉద్దేశ్యం కాదు. మార్మికవాదుల జీవితచరిత్రలు పరిశీలిస్తే, వారు మతాచారాలకు వ్యతిరేకులనేది ఎంత ప్రస్ఫుటంగా కనిపిస్తుందంటే -

మార్మికవాదులను గుర్తించడానికి దీనినొక ఆధారంగా కూడా తీసుకోవచ్చు. సాయిబాబాగారి విషయంలో మనకీ ఆధారం స్పష్టంగా కనిపిస్తోంది మరియూ ఇది నేను ఇంతకు ముందు పేర్కొన్నట్టు, 'మార్మికవాదమనేది ఒక ఏకైక తత్వం' అనే విశ్లేషణను కూడా బలపరుస్తుంది. ఈ విశ్లేషణ-మార్మికవాదము, మార్మికవాదుల గురించి - నిజాల మరియు ఆధారాల వెలుగులో - సత్యావగాహనను పెంపొందించుకోవడంలో ఎంతగానో సహకరిస్తుంది.

ఇస్లాం సిద్ధాంతాలకు వ్యతిరేకి అయి ఉండడమే కాకుండా, సాయిబాబా గారు మార్మికవాదులకు సమర్థత తెలిపినట్టుగా కూడా ఆధారాలున్నాయి. మరలా, అబ్దుల్ గారి పుస్తకం నుంచి:

"క్రూరులైన వారి చేతిలో కలం ఉంటే, మన్సూర్ (అల్‌హల్లాజ్)ను ఉరి తీయకుండా ఉంటారా?"[6]

ఇంతకు ముందు వివరించినట్టు, మన్సూర్ హల్లాజ్ ఒక సూఫీ గురువు. అతను ముస్లింగా ఉండి, ఇస్లాం సిద్ధాంతాలకు వ్యతిరేకంగా ఉన్న భావనలను వ్యక్తపరచడమే కాకుండా, "నేను దేవుణ్ణి" అని ప్రకటించుకోవడంతో ఇస్లాం శాసనాధికారులు అతనికి మరణశిక్షను విధించారు.

## సాయిబాబాగారు సూఫీయా? కాదా?

ముస్లింనని చెప్పుకుని, ఇస్లాం సిద్ధాంతాలను సవాలుచేయడమే, సాయిబాబా గారు మార్మికవాది అని ఋజువు చేయడానికి ఒక బలమైన ఆధారం. ఐతే, ఇలా సవాలుచేసే వారందరూ కూడా మార్మికవాదులు అవ్వాలని కూడా లేదు. కాబట్టి మనం ఆయన సూఫీ అని ఋజువుచేసిన ఇతర ఆధారాలను పరిశీలిద్దాము.

అన్నా సాహెబ్ ధబోల్కర్ - సాయిబాబాగారి మొదటి జీవిత చరిత్రకారుడు మరియు ఆయన బ్రాహ్మణ భక్తుడు. ఆయన రచించిన 'శ్రీ సాయి సత్చరిత' చదవని భక్తులెవరూ ఉండరేమో. ధబోల్కర్, సాయిబాబాను చాలా స్పష్టంగా 'ముస్లిం ఫకీరు'గా పేర్కొంటూ, తాను ముందునుంచీ ఫకీరు జీవితాన్ని ఎన్నుకొని, ప్రాపంచిక సుఖాలను త్యజించానని వివరిస్తూ సాయిబాబా ఇలా అన్నారని 'శ్రీ సాయి సత్చరిత'లో పేర్కొన్నారు:

"నేను ఫకీరునయినప్పటికీ, ఇల్లువాకిలి, భార్యబిడ్డలు, తదితర బాదరబందీ లేవీ లేకుండా, ఎక్కడికీ కదలక యొకచోట కూర్చునియున్నప్పటికీ........" [7]

ధబోల్కర్ తనకు ఇస్లాం గురించి గాని, సూఫీజం గురించిగాని, వీటి వ్యత్యాసాలను గురించిగాని తెలియదని ఒప్పుకుంటూనే, సాయిబాబా గారి ముస్లిం చిహ్నాలు లేక గుర్తులను యథాతథంగా పొందుపరిచారు.

భరద్వాజ గారి వివరణ ప్రకారం 'సాయిబాబాగారిని చాలా మంది ముస్లింలు, ఒక గొప్ప ముస్లిం బాబాగా గుర్తించి ఆయన కారుణ్యాన్ని పొందారు'[8]

బాబాలను నమ్మే ఇంకొక ముస్లిం భక్తుడు, సాయిబాబా గారిని గొప్ప సూఫీగా అభివర్ణిస్తూ ఇలా అన్నాడు: "సాయిబాబా ఇప్పటికీ ఒక గొప్ప బాబా. ఇప్పటికీ అని ఎందుకంటున్నానంటే బాబాలు మరణించరు. ఒకస్థితి నుంచి మరోస్థితికి మారతారే తప్ప"[9]

దీని గురించి వారెన్ ఇలా వ్రాసారు: ఈ ముస్లిం భక్తుడి వర్ణన, అతను సాయిబాబాను సూఫీ గురువుగా గుర్తించాడనడానికి నిదర్శనం. తద్వారా, సూఫీల నమ్మకాలను అనుసరిస్తూనే, సాయిబాబా తాను మరణించిన పిమ్మట కూడా భక్తులకు సహాయం చేయగలనని ప్రకటించారనేది కూడా వెల్లడౌతుంది.

సూఫీల నమ్మకం ప్రకారం, సూఫీ గురువులు మరణించిన అనంతరం కూడా వారి సమాధుల వద్ద వారి శక్తులు ఇమిడి ఉంటాయి. సూఫీజం, ఇస్లాం సిద్ధాంతాల మధ్య వ్యత్యాసం తెలియని కొందరు ముస్లింలు - మనుషుల సమాధులను దర్గాలుగా మలచి, అక్కడ సంబరాలు చేసుకోవడం (దీనిని ఉరుసు అంటారు) వెనుక గల కారణం ఇదే.

ఇంతకు ముందు పేర్కొన్నట్టు, మార్మికవాదుల ఇంకొక ముఖ్యమైన గుర్తు వారి సన్యాసత్వం - ప్రాపంచిక సుఖాలను, త్యజించడం. వీళ్ళను సూఫీ సాంప్రదాయంలో 'ఫకీరు' అంటారు. ఇది 'ఫకర్' అనే అరబీపదం నుండి వచ్చింది. దీనర్థం 'బీదరికం' అని. 'ఫకీరు' అంటే 'బీదరికాన్ని కావాలని స్వీకరించినవాడు'.

సాయిబాబా ఇలా అన్నారు:

"ఫకీరు పదవియే నిజమైన మహారాజ పదవి, అదియే శాశ్వతము, మామూలు సిరిసంపదలు - క్షణ భంగురాలు".[10]

సాయిబాబా గారి జీవితచరిత్ర చదివితే ఆయన ఈ సూఫీ సిద్ధాంతాన్ని చాలా కచ్చితంగా పాటించారనేది విశదమౌతుంది. జీవితమంతా ఆయన భిక్షాటన చేస్తూ, రుచి, శుచుల గురించి ఆలోచించకుండా, దొరికిందే తినేవారు.

ఆయన వేషధారణ కూడా సూఫీ ఫకీర్ల వేషధారణే. రామ్‌గిరి బువ ప్రకారం : "షిర్డీ చేరుకున్నప్పుడు, సాయిబాబా (నడుము భాగం వరకూ వేలాడుతున్న) పొడవయిన జుట్టుతో ఉన్నారు."[11]

"ఆయన వేషధారణ ఒక క్రీడాకారునివలె ఉండేది, జుట్టు ఎప్పుడు కత్తిరించుకోలేదు."[12]

"మొహియుద్దీన్ తంబోలి అనే ఒక ముస్లిం వ్యక్తితో సాయిబాబా కుస్తీపోటీలో పాల్గొని - ఓడిపోయారు. అప్పటి నుంచీ, ఆయన పొడవైన చొక్కా, కాఫ్ని ధరించసాగారు" [13] ఇది సరాసరి అప్పటి సూఫీల వేషధారణ. భక్తులు ఇచ్చే కొత్తబట్టలు వేసుకోవడానికి ఆయన ఇష్టపడేవారుకారు. పాతవాటికే కుట్లువేసి, తిరిగివాడేవారు.

అబ్దుల్ గారి పుస్తకంలో సాయిబాబాగారు, సూఫీల గురించి చేసిన చర్చలు ఎన్నెన్నో ఉన్నాయి. 13వ శతాబ్దానికి చెందిన ప్రఖ్యాత సూఫీ గురువు 'రుమీ' గారి ఉపదేశాలు, కవిత్వం, సూఫీ మార్గం ద్వారా ప్రయాణించి దైవత్వాన్ని పొందే విధానం, సూఫీల ఆధ్యాత్మిక శ్రేణుల వివరణ, ఛిస్తీ పరంపరకు చెందిన సూఫీల జాబితా.... ఇలా ఎన్నెన్నో అందులో వ్రాయబడి ఉన్నాయి.

వీటన్నింటి ఆధారంగా, సాయిబాబా ఒక సూఫీ గురువని చెప్పడానికి చాలా బలమైన ఆధారాలు ఉన్నాయని వారెన్ తమ పుస్తకంలో నిరూపించారు. "ఛిస్తీల పరంపరతో ఆయన సూఫీ లక్షణాలు పోలిఉన్నాయి" అని వారెన్ వ్రాశారు .[14]

ఈవిధంగా, వేర్వేరు వ్యక్తుల నుంచి సేకరించిన ఈ వివరాలన్నింటి ద్వారా, సాయిబాబా గారు ఒక (సూఫీ) మార్మికవాది అనడంలో ఏమాత్రం సందేహం లేదు.

# మెహర్ బాబా - మార్మిక వాదియా?

సాయిబాబా గారు సూఫీ గురువైనప్పటికీ, ఆయన బ్రాహ్మణ భక్తులు మరియు చరిత్రకారులు ఆయనను హిందూ సాంప్రదాయంలో పూర్తిగా ఇమిడ్చివేశారు. ఈ ప్రక్రియ ఎలా జరిగింది అనేది ఏడవ ఆధ్యాయంలో వివరించడం జరిగింది. సాయిబాబాగారి విషయంలోలా కాకుండా, మెహర్‌బాబా గారు మార్మికవాది అని ఋజువు చేయడం ఎంతో సులభం. చెప్పాలంటే మెహెర్‌బాబా గారు మార్మికవాది అని ఋజువు చేయమనడం, టెండుల్కర్ గారికి క్రికెట్ తెలుసని రుజువు చేయమనటంతో సమానం. మెహర్‌బాబా జీవితచరిత్రపై ఉన్న సమాచారం ద్వారా, ఆయన మార్మికవాదని ఋజువు చేయడం ఎంతో సులభతరం.

మెహర్‌బాబాగారి జీవిత విశేషాలు వివరంగా వ్రాయబడి ఉన్నా, సంఘటనలకు భక్తిరసాన్ని జోడించని పుస్తకాలు అరుదే. ఒక గొప్ప మినహాయింపు - కెవిన్ షెఫర్డ్ గారి రచనలు. ఈయన ఇంగ్లండుకు చెందిన ఒక స్వతంత్ర చరిత్రకారుడు. 1950 సం॥లో జన్మించిన కెవిన్ పిన్న వయసు నుంచీ, మెహర్‌బాబాగారి గురించి చాలా కుతూహలం కలిగిన వ్యక్తి. "మెహర్‌బాబాగారి జీవిత విశేషాలను రచనలలో పొందుపరచడంలో నా ఉద్దేశ్యం చరిత్రను జరిగింది జరిగినట్టు పదిలపరచటమే గానీ, వక్రీకరించడం కాదు" [15] అంటారాయన. తన రచనల ద్వారా ఇతర రచయితలు మెహర్‌బాబాగారి మీదవేసిన అభాండాల్ని కూడా సరిఅయిన వివరణలద్వారా చాల వరకూ తొలగించే ప్రయత్నం చేశారు. మరోవైపు, మెహర్‌బాబా గారి మండలి, భక్తులు చేస్తున్న తప్పుడు ప్రచారాలను కూడా ఖండించారు. ఆయన వ్రాసిన పుస్తకం - 'మెహర్‌బాబా - ఇరానియన్ లిబరల్ (విశాల ధృక్పది).'

## మెహర్‌బాబాగారి పుట్టుపూర్వోత్తరాలుః-

ఆశ్చర్యం కలిగించే విషయమేమిటంటే, చాలామంది భక్తులకు మెహర్‌బాబాగారి పుట్టుపూర్వోత్తరాల అవగాహన కూడాలేదు. అది అనవసరమని అనుకునే వారు కూడా ఉన్నారు. 'మెహర్‌బాబా దేవుడు' అంతే! ఇంకేమీ వివరాలు అవసరం లేదని వాదించేవారు లేక పోలేదు. వాస్తవాలకు విలువనిచ్చేవారు గుర్తించవలసిన విషయమేమిటంటే - ఇరాన్ దేశంలో ఆవిర్భవించిన మార్మికవాద సాంప్రదాయాలతో మెహర్‌బాబా బలంగా ముడిపడి ఉన్నారు. ఆయన తల్లిదండ్రులిద్దరూ ఇరాన్ నుంచి మనదేశానికి వలస వచ్చిన జొరాష్ట్రియన్‌లు.[16] ఆయన తండ్రి షెరియర్ మండేగర్ ఇరాన్‌లోని ఖజర్ ప్రాంతానికి చెందినవారు. సూఫీ సాంప్రదాయాలు, సాధనలను ఆచరిస్తూ దేశదిమ్మరిగా తిరిగేవారు. భారతదేశం వచ్చిన తర్వాత కూడా దాదాపు ఒక దశాబ్దంపాటు అలా తిరుగుతూ, చివరకు పూనాలో స్థిరపడ్డారు.

ఇంతకు ముందు వివరించినట్టు, మార్మికవాదులు తమనుతాము వివిధ మతాల వారిగా పిల్చుకుంటారు. సూఫీలు ముస్లిములమని చెప్పుకొనే మార్మిక వాదులని మనం చూశాం. అలాగే జొరాష్ట్రియన్ మతంలో కూడా మార్మికవాదులున్నారు. అజర్ కైవాన్ (మరణం 1618) అలాంటి ఒక జొరాష్ట్రియన్ మార్మికవాది. ఆయన తన శిష్యులతో ఇరాన్ నుంచి, మనదేశంలోని సఫావిద్ ప్రాంతానికి వలస వచ్చాడు. తరువాత వారిని 'కైవానీ'లుగా పిలవడం జరిగింది. మార్మికవాదులు మతాచారాలను వదిలిపెట్టే క్రమంలోనే వాళ్ళు జొరాష్ట్రియన్ మతాచారాలన్నింటినీ వీడి, మనదేశ పరిస్థితులకు అనుకూలంగా ఉండేట్టు తమ సొంత సాధనలను మలిచారు. వాళ్ళ సిద్ధాంతత్వం 'ఇష్రాకీ' అని పిలవబడుతుంది. సూఫీజం, యోగ, వేదాంత మరియూ గ్రీకు సిద్ధాంతాలన్నీ ఇందులో ఇమిడి ఉన్నాయి. మెహర్‌బాబాగారు తాను ఏ వర్గానికీ చెందని వాడినని ప్రకటించినా, ఆయన సిద్ధాంతాలు కైవానీ సిద్ధాంతాలను పోలి ఉంటాయనేది గమనించవచ్చు. కైవానీలు కూడా తమను తాము ఏ వర్గానికి చెందని వారిగా భావించేవారు. 'కైవానీ' అనేది చరిత్రకారులు ఇచ్చినపేరు, వారిలో అన్ని మతాల

నుంచి వచ్చిన మార్మికవాదులు ఉండేవారు. వీళ్ళందర్నీ ఒకటి చేసింది మార్మికవాద సిద్ధాంతమే. అజర్ కైవాన్‌ను మెహర్‌బాబా 'చివరి గురువు' గా వర్ణిస్తూ, "ఆయన తర్వాత జొరాష్ట్రియన్ మతంలో దైవత్వం పొందిన వారే లేరు" అని అన్నారు.

అసలు ఈ 'ఇష్రాకీ' సిద్ధాంతాన్ని వెలుగులోకి తెచ్చినది - షేక్ సొహ్రావర్ది మక్తూల్ (మరణం 1191). అజర్ కైవాన్ ఈ సిద్ధాంతాన్ని కొద్దిగా వక్రీకరించి, మనదేశ పరిస్థితులకనుగుణంగా ఉండేట్టు మలిచాడు. ముస్లిం అయి ఉండి, ఇస్లాం మత సిద్ధాంతాలకు సరాసరి వ్యతిరేకంగా ఉన్న సిద్ధాంతాలను బోధించినందుకు, సొహ్రావర్దికు మరణ శిక్ష విధింపబడింది. 'మక్తూల్' అంటే 'ఉరి తీయబడినవాడు' అని అర్థం.

కెవిన్ తన పుస్తకంలో, మెహర్‌బాబా గారి సిద్ధాంతత్వం మరియు బోధనల్లో, ఇలా ఇరాన్‌లో ఆవిర్భవించిన మార్మికవాద సాంప్రదాయాలు ఏవిధంగా పునర్జీవనం పొందాయో వివరించారు.[17]

**<u>మన్సూర్ హల్లాజ్ గురించి:</u>**

సాయిబాబా గారిలాగానే, మెహర్‌బాబాగారు కూడా మన్సూర్ గురించి చర్చించారు. మెహర్‌బాబా, మన్సూర్‌ను 'కుతుబ్'గా వర్ణిస్తూ 'నేను దేవుణ్ణి' అనే మనోస్థితి పొందినవాడిగా పేర్కొన్నారు.[18] 'కుతుబ్' అనేపదం మెహర్‌బాబా గారి బోధనల్లో చాలా తరచుగా కనిపిస్తుంది. సూఫీ సాంప్రదాయక పదమైన దీనర్థం - 'విశ్వకేంద్రకం' - అంటే ఆ వ్యక్తి ఒక ఆధ్యాత్మిక కేంద్రకంలాంటి వాడని అర్థం.

**<u>మతాచారాల ఉద్వాసన:</u>**

ఇంతకు ముందు పేర్కొన్నట్లు, మతాచారాలను వ్యతిరేకించడం, వాటికి బహిరంగంగా ఉద్వాసన పలకడమనేది మార్మికవాదుల బలమైన గుర్తు. సాయిబాబాగారు ఇస్లాం మతాచారాలను బహిరంగంగా నిరాకరించినట్టే, మెహర్ బాబాగారు ఇలా అన్నారు:

*"అన్ని మతాల గ్రంథాలు...........యధార్థంతో సంబంధం లేనివే".* [19]

అంతేకాకుండా, మెహర్‌బాబాగారు "అన్ని మతగ్రంథాలు భ్రష్టుపట్టిపోయాయి" అని సెలవిస్తూ, వాటి జాబితాను కూడా ప్రకటించారు: "వేదాలు, బైబిలు, ఖురాను, జెండవేస్త (జొరాష్ట్రియన్‌ల మతగ్రంథం). ఐతే కొన్నిసార్లు ఈ మార్పులు అనుకోకుండా జరిగాయి, ఎలాగంటే అవతారాల (జరాతుష్ట్ర, యేసుక్రీస్తు, ముహమ్మద్*) శిష్యులు, తరువాతి తరంవారు జనసమూహాల్లో ప్రసంగించేటప్పుడు, వారిమాటలు అవతారాల మాటలని ప్రజలు భ్రమపడి ఉండవచ్చు"[20] అన్నారు.

జరాతుష్ట్రను జొరాష్ట్రియన్ మతానికి ప్రవక్తగా చెప్పుకుంటారు. కానీ, చరిత్రకారులకు జరాతుష్ట్ర గురించిన వివరాలేవీ నిర్దిష్టంగా తెలియదు. ఆయన పుట్టిన సంవత్సరంగానీ, ప్రదేశంగానీ, ఆయన బోధనల గురించిగానీ ఏమీ తెలియదు. ఇందువలన జొరాష్ట్రియన్ మతగ్రంథాలు జరాతుష్ట్ర బోధనలని భావించడం సాధ్యంకాదు. జొరాష్ట్రియన్ మతాధిపతులు దానిలో మార్పులుచేసి ఉండవచ్చు. కెవిన్ ఇలా అభిప్రాయపడ్డారు: జరాతుష్ట్ర మరియూ యేసుక్రీస్తుల విషయంలో, చరిత్రకారులు ఈ విషయాన్ని ఒప్పుకుంటారు. కానీ, ఖురాను అవతరించిన కాలంలోనే వ్రాతరూపంలో పొందుపరచబడటంవలన, ఇది మార్పులు చెందింది అనడం కష్టం."[21]

ఈ విధంగా మెహర్‌బాబాలో కూడా మనకు మత ఆచారాలను, విశ్వాసాలను, గ్రంథాలను వ్యతిరేకించే మార్మికవాదుల ఆ స్వభావం స్పష్టంగా కనిపిస్తోంది.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

\* *దైవప్రవక్తలపై శాంతి నెలకొనుగాక!*
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

## మార్మికవాదులైన గురువులు మరియు మార్మిక సాధనలు:

మెహర్‌బాబా గురువులు - బాబాజాన్ (ఒక ఆడ సూఫీ) మరియు ఉపాసనీ మహరాజ్ (హిందూ మార్మికవాది). మెహర్‌బాబాగారు సన్యాసజీవితాన్ని, బ్రాహ్మచార్యాన్ని పాటించారు. ఆయన ఎక్కువకాలం ఉపవాసాలతో కూడిన ఏకాంత ధ్యానసాధనలోనే గడిపేవారు. ఎంతగానంటే, ఆయన దర్శనార్థం వచ్చిన వారికి కూడా ఆయన చాలాసార్లు అందుబాటులో ఉండేవారు కాదు.

## సూఫీ సాంప్రదాయంతో ఆయన సంబంధం:

ఆడ సూఫీ గురువు సమక్షంలో మార్మికవాద అక్షరాభ్యాసం ప్రారంభించటమే కాకుండా, మెహర్‌బాబా సూఫీ కవిత్వం నుంచి కూడా చాలా నేర్చుకున్నారు. అంతేకాక, మొత్తం సూఫీజాన్నే పునరుద్ధరించడానికి నడుం కట్టారు. ఈ దిశలో ఆయన, ఐవీడ్యూస్ అనే అమెరికాకు చెందిన మహిళతో చేసిన పని పేర్కొనదగ్గది. ఐవీడ్యూస్ మెహర్‌బాబా అనుచరురాలు. మనదేశానికి చెందిన, ఛిస్తీ వర్గ సూఫీ గురువు - ఇనాయత్ ఖాన్ (మ॥ 1927) సిద్ధాంతాలను ఆచరిస్తూనే, ఈమె మెహర్‌బాబాను తన గురువుగా ఎంచుకున్నారు. ఇనాయత్ ఖాన్ శిష్యురాలైన ఆదా మార్టిన్ (మ॥ 1947) దగ్గర ఆమె అభ్యసించారు. ఐవీడ్యూస్, అమెరికాలో 'పునరుద్ధరింపబడిన సూఫీజం' (SUFISM - REORIENTED) అనే సంస్థను 1950 సం॥లో స్థాపించారు.

ఆమెతో మెహర్‌బాబా ఇలా అన్నారు: "నేను ఈ పునరుద్ధరింపబడిన సూఫీజం విషయంలో చాలా ఉత్సుకతతో ఉన్నాను. దీని ప్రభావం ప్రపంచమంతటా కనబడాలి." [22]

ఇంకా, " 'ఫనా', 'బఖా'లు (సూఫీలు దేవునిలో లీనమయ్యే భావనాపదాలు) సాధిస్తేనే మనం ఇతరుల్ని ఈ మార్గానికి ఆకర్షించగలం" అంటూ ఇలా అన్నారు: "నేను ఈ మొత్తం వ్యవహారాన్ని మార్చదలచుకున్నాను, పునరుద్ధరించదలచుకున్నాను. ఎందుకంటే సూఫీజాన్ని నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను" [23]

ఇంకో సందర్భంలో ఆయన "నేను అందరికంటే గొప్ప సూఫీను - గతించిన, వర్తమాన, రాబోయే వారందరికంటే"[24] అని సెలవిచ్చారు.

## మార్మిక కవితలు మరియు సిద్ధాంతత్వం:

మెహర్‌బాబా గారి బోధనలు ఖచ్చితంగా మార్మికవాదమే - సర్వందేవుడే - అంతా ఒక్కటే (అద్వైతం). అయన 14వ శతాబ్దానికి చెందిన ఇరాని సూఫీ అయిన 'హాఫిజ్' కవితల్ని, వర్ణణలను ఎక్కువగా వాడేవారు. కబీర్, తుకారాం (మార్మికవాదులు) కవితల్ని కూడా బాగా ఇష్టపడేవారు. ఐతే 'హాఫిజ్' వర్ణణలు మిగతా అందరి వర్ణణల కంటే అధికంగా ఆయన బోధనల్లో దర్శనమిస్తాయి. దీనివలన ఆయనకు ఇరాన్ - మార్మిక సాంప్రదాయంతో ఉన్న బాంధవ్యం బోధపడుతుంది. మెహర్‌బాబా 'హాఫిజ్' మరియు 'కబీర్'లను కూడా 'కుతుబ్'లుగా వర్గీకరించారు.

ఆయన మార్మిక వాద సిద్ధాంతి అని అర్థంచేసుకోవడానికి ఆయన 'ఉపదేశాలు' (Discourses) నుంచి 'మొదటి ఏడు నిజాలు' పరిశీలిస్తేచాలు. అందులోని మొదటి నిజంః

*"దేవుడు ఒక్కడి ఉనికే అసలైనది, దేవుడు ప్రతీవస్తువులోనూ ఉన్నాడు"*

*- మెహర్‌బాబా ఉపదేశాలు - సంపుటము 1, 17వ పేజి*

ఆయన 'ఉపదేశాలు' (Discourses) మార్మికవాద సిద్ధాంతాలతో నిండిఉంది.

*"ఈవిధంగా దేవుడి గురించి పట్టించుకోకపోవడంకంటే, దేవుడి గురించి చదవటం మేలు, దేవుడి గురించి చదివేకంటే, దేవుడిలా భావించుకోవడం మేలు. దేవుడిలా భావించుకొనేకంటే, దేవుడి అనుభవాన్ని పొందటం మేలు, ఆ అనుభవంకంటే, స్వయానా దేవుడైపోవటం మేలు".*

*- మెహర్‌బాబా ఉపదేశాలు - సంపుటము 3, 30వ పేజి*

ఖచ్చితంగా చెప్పాలంటే, మెహర్‌బాబా గారి బోధనలు - సూఫీజం, ఇరానీ మార్మికవాదం మరియు వేదాంతాల సమ్మేళనం.

ఈవిధంగా మెహర్‌బాబా గారు ఒక మార్మికవాది అనే విషయం ఎంతో ప్రస్ఫుటంగా తేటతెల్లం అవుతుంది. ఆయన మార్మికవాది అని నిరూపించడం కంటే కూడా, మార్మికవాది కారని నిరూపించడం కష్టతరం, అసంభవం.

# మార్మికవాదము - ఒక ఏకైక సిద్ధాంతత్వం

ఈ విధంగా, సాయిబాబా మరియూ మెహర్‌బాబాలు మార్మికవాదుల అస్తిత్వ నిర్వచనంలో ఎంతో సరిగ్గా ఇమడటం చూశాం. ఇదే పరిశీలనను ఇతర మార్మికవాదులకూ అన్వయించవచ్చు. తద్వారా తెలిసే విషయమేమిటంటే - "మార్మికవాదం అనేది ఒక ఏకైక సిద్ధాంతత్వం." దీనిని మనం ఇదేవిధంగా విశ్లేషించాలి. విభిన్న మతాలతో ఇది ముడిపడి ఉన్నప్పటికీ, దీని సిద్ధాంతత్వం ఒక్కటే మరియూ అది ముడిపడి ఉన్న మత సిద్ధాంతాలకు పూర్తిగా విరుద్ధంగా కూడా ఉండవచ్చు. అందుకని, దానిని అది ముడిపడిఉన్న మతతత్వంతోపాటు కలిపి విశ్లేషించే పొరపాటు చేస్తే, మార్మికవాదాన్నే కాకుండా, ఆ మతతత్వాన్ని కూడా అపార్థం చేసుకోవడం సంభవిస్తుంది.

ఈ విశ్లేషణను బలపరిచే, మరొక బలమైన ఆధారం ఏమిటంటే - ఈ మార్మికవాద సాంప్రదాయాలలో ఆశ్చర్యకరమైన 'భిన్నత్వంలో - ఏకత్వం' గోచరిస్తుంది. మార్మికవాదులు తమ మతాలకు ఏమాత్రం విలువనివ్వరు. సూఫీ మార్మిక వాది అయిన సాయిబాబా గారికి అనేక సూఫీ శిష్యులతోపాటు హిందువులు కూడా ఉండేవారు (ఉదాహరణకు ఉపాసని మహరాజ్). మెహర్‌బాబా గారి గురువులు - బాబాజాన్ (సూఫీ) మరియు ఉపాసనీ మహరాజ్ (హిందూ). బాబాజాన్ గారి గురువు ఒక హిందూ మార్మికవాది. బలమైన ఆధారాలు లేనప్పటికీ, సాయిబాబా గారి గురువు కూడా హిందువనే వాదం ప్రచారంలో ఉంది. మార్మికవాదం - ఒక ఏకైక సిద్ధాంతత్వం కావడం వల్లనే ఇదంతా సాధ్యపడింది. మార్మికవాదులంతా తమ ఈ మార్మిక వాదమైన అద్వైత సిద్ధాంతపరంగా ఒకటై ఉన్నారు. వారికి మతాల సాంగత్యము అంతగా పట్టించుకోదగ్గ విషయమే కాదు (దానిని వారు ఎలాగైనా లెక్కచేయరు కాబట్టి).

ఇప్పటికి మీరు ఇంకొక ముఖ్య విషయం గమనించి ఉండవచ్చు: మార్మికవాదులు మతసాంప్రదాయాల్ని, ఆచరణలను ఉద్వసిస్తారనేది. మీరు ఈ విషయాన్ని పరిశీలన చేస్తే ఆశ్చర్యం కలగవచ్చు: ఏమిటి? వీళ్లు ఇలా ఎందుకు చేస్తారు? చూడడానికి వీరు దేవుని పరమ భక్తులలా ఉంటారే? దేవుని గురించి అంత భక్తి, గౌరవం ఉన్నవారు, దేవుని కోసం జరిగే ఆచారాల్ని నిరాకరించడమేమిటి? అసలు వీళ్ళ ఉద్దేశ్యంలో దేవుడంటే ఏమిటి? మతాలలో ప్రభోదింపబడిన దేవుడు, వీళ్లదేవుడు ఒక్కడేనా? వేరా? లాంటి పలు ప్రశ్నలు తలెత్తవచ్చు.

నిశ్చయంగా ఇవి చాలా ముఖ్యమైన ప్రశ్నలే. వీటికి సమాధానం మీకు వచ్చే అధ్యాయాలలో తప్పకుండా లభిస్తుంది.

"మనస్సే అంతా నడుపుతుంది. మనస్సే ముఖ్యం. మనస్సు నుంచే అన్నీ అవతరించాయి."

*- ధర్మపద బౌద్ధగ్రంథం, 1వ శ్లోకము, క్రీస్తుపూర్వం 3వ శతాబ్దం.*

"మనస్సు యొక్క అవయవం - మెదడు"

*- నాడీమండల శాస్త్రవేత్త మరియు జెన్‌సాధకుడు జేమ్స్ హెచ్. ఆస్టిన్, క్రీస్తుశకం 2000.*

# 4. 'నేను దేవుణ్ణి' - మాటల వెనుక రహస్యం

''స్వామి అభయానంద (అసలుపేరు స్టాన్ ట్రోట్) అమెరికాలోని ఇండియానా పొలిస్‌లో 14 అగష్టు, 1938వ సంవత్సరంలో జన్మించారు. 1966వ సం॥లోని జూన్ మాసంలో ఆయన మార్మికవాద సిద్ధాంతత్వానికి ఆకర్షితులై, దైవానుభవం పొందాలని బలంగా కోరుకున్నారు. అదే సంవత్సరం, నవంబరు 18న దైవకృపవలన ఆయన కోరిక ఫలించి, దైవానుభవం పొందారు. ఈ సకాలీన మార్మికవాది మనకు తరాలుగా వస్తున్న మనిషి యొక్క జ్ఞానోదయ అనుభవాన్ని వివరిస్తూ, పాశ్చాత్య - భారతీయ సాంప్రదాయాలకు చెందిన నలభైకిపైగా పేరొందిన మార్మికవాదుల చరిత్రలను, మార్మిక సాంప్రదాయ ప్రాచీనత, సహనత్వాన్ని, దాని వ్యక్తీకరణలోని సారూప్యతను మనముందుంచుతున్నారు''.

ఇది - స్వామి అభయానందగారి పుస్తకం 'మార్మికవాద చరిత్ర - మారని తీర్పు' (History of Mysticism- The Unchanging Testament) కు పరిచయం. ఆయన తన పుస్తకంలో వివిధ కాలాలకు చెందిన ప్రఖ్యాత మార్మికవాదుల జాబితాను, ఉపదేశాలను పొందుపరిచారు. ఉపనిషత్తుల కాలానికి చెందిన జ్ఞానధ్యానుల నుంచి మొదలు, బుద్ధుడు, గ్రీకు, రోమను, మధ్యకాల మార్మికవాదులతోపాటు, 20వ శతాబ్ది మార్మికవాదులైన - పీర్ ఇనాయత్ ఖాన్ (1888-1950), పరమహంస యోగానంద (1893-1952), రమణ మహర్షి (1879-1950), స్వామి శివానంద (1887-1963), అరవిందుడు (1872-1950), సాయిబాబా మరియు మెహర్‌బాబాల వరకూ.

స్వామి అభయానంద గారి పరిశోధన ప్రకారంగాని, మార్మికవాదుల రచనల పరిశీలన ఆధారంగాగాని మనకు తెలిసే ముఖ్య విషయమేమిటంటే, మార్మికవాదులు వెల్లడించిన విషయాలు, వారి సిద్ధాంతత్వం-ఆధ్యాత్మిక ఊహల, అంచనాల ఆధారంగా జనించినవికావు. అవి నిజ అనుభవాల ఫలితాలు. ఆ అనుభవాలు ఎంత నిర్దిష్టంగా, బలంగా ఉంటాయంటే వాటిని పొందినవారు తాము నిశ్చయంగా మన ఉనికి యొక్క పరమ సత్యాన్ని తెలుకున్నామని, అనుభవించామని భావిస్తారు.

అభయానందగారి సొంతమాటల్లో: ''హిందువులు 'సమాధి' అనీ, బౌద్ధులు 'నిర్వాన' అనీ, సూఫీలు 'ఫనా' అనీ, క్రైస్తవులు 'మిస్టిక్ యూనియన్' అని పిలిచే ఈ అనుభవంలో - మన చైతన్యం (Consciousness) ఒక్కసారిగా మొత్తం విశ్వవ్యవస్థయొక్క చైతన్యంగా మారిపోతుంది. ఇంతకు ముందున్న ద్వైత భావన (నేను, నువ్వు మొదలైనవి) మటు మాయమై, అన్నీ విభజింపలేని ఐక్యతలో కలిసిపోతాయి. అంతా ఒకటైపోతుంది. ఇంతకు ముందు వరకూ ఉన్న తాను దేహరూపందాల్చి, పాపాల్లో చిక్కుకున్న ఆత్మననే భావన సమసిపోయి, ఏ చైతన్యమైతే వివిధ శరీరాలుగా, ఆత్మలుగా వస్తువులుగా పరివర్తనం చెందుతుందో, ఆ చైతన్యాన్ని నేనే అనే జ్ఞానం బోధపడుతుంది. అంతకు ముందు ఒక ఆత్మగా, అతను పరమాత్మ సంయోగాన్ని కోరుకున్నప్పటికి, ఇప్పుడు ఆత్మ- పరమాత్మ అనే సంబంధం లేదు. తనే ఆ పరమాత్మనని, ఒకే ఉనికినని, పరమసత్యాన్నని గ్రహిస్తాడు. సర్వ విశ్వవ్యవస్థ యొక్క ఆత్మ తనేనని ప్రబోధపడే ఆ అనుభవం అతనిలో విపరీతమైన మార్పును తీసుకువస్తుంది. జీవన్మరణ చక్రంలో ఇరుక్కుని, పరిమిత దేహంలో బంధింపబడిన అతనికి ఆ కొత్త అనుభవం, అతని యొక్క అసలు అస్తిత్వాన్ని బోధిస్తుంది: తాను అనంతమైన వాడినని, కాలాతీతుడనని, జీవన్మరణాలకు కూడా అతీతుడనని. అది అతని అస్తిత్వాన్ని పూర్తిగా మార్చివేసి, మనసులో ఉన్న భయం, సందేహం, అభద్రతా భావాల నుంచి విముక్తిని ప్రసాదిస్తుంది.''.[1]

స్వామి అభయానందగారి ఈ పై వివరణ, మన మార్మికవాద సిద్ధాంతత్వ అవగాహనకు ఎంతగానో ఉపయోగపడుతుంది. ఎందుకంటే, ఇది అన్ని కాలాల మార్మికవాదుల వివరణలు, సిద్ధాంతాలకు మూలమైనది. ఇది వారి మార్మిక అనుభవాల విశ్లేషణ ఫలితంగా జనించిన వివరణ. ఇదియే మెహర్‌బాబా గారి పుస్తకం - గాడ్ స్పీక్స్ (God Speaks) మరియూ ఉపదేశాలు (Discourses) యొక్క ఆధారం కూడానూ.

మార్మికవాదులు చెప్పేది చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. వాళ్లు సర్వమూ దేవుడిలోని అంశాలే (భాగాలే) అంటారు - మనుషులు, వస్తువులు, జంతువులు, ప్రకృతి, గ్రహాలు, నక్షత్రాలు, ఇలా ఊహింపదగినవన్నీ కూడా. దీనిగురించి ఆలోచిస్తే మనలో అనేక ప్రశ్నలు కలుగవచ్చు: ఏమిటి? నేను కూడా దేవుడి ఒక భాగాన్నా? మరి నాకెందుకు ఎప్పుడూ అలా అనిపించలేదు? ఇదే నిజమైతే నేనింత అశక్తుడిగా ఎలా ఉన్నాను? నేనే దేవుడినైతే, ఇక నేను దేవుణ్ణి ప్రార్థించడమేమిటి? నేనెందుకు పుట్టించబడ్డాను? మొదలైనవి. జ్ఞానోదయం కాని మన మస్తిష్కాలలో ఇలాంటి ప్రశ్నలు ఎన్నెన్నో ఉదయిస్తాయి. ఇదంతా చాలా గందరగోళంగా అనిపిస్తుంది కదూ? ఈ అధ్యాయంలో ఈ గందరగోళం దూరమయి, అన్ని ప్రశ్నలకూ జవాబు లభించనుంది.

## మార్మికవాదము మరియు శాస్త్రజ్ఞానం

**శాస్త్ర విజ్ఞానం - మార్మికవాదుల గురించి, మార్మిక అనుభవాల గురించి ఏమి చెబుతుంది?**

శాస్త్రవిజ్ఞానం (సైన్స్)కు హేతుబద్ధమైన వివరణ అవసరం. అందువలన శాస్త్రవేత్తలు ఈ మార్మిక వాదులను చాలాకాలంగా - మానసిక సంతుల్యం కోల్పోయిన వారిగానూ, విచక్షణా జ్ఞానం దెబ్బతిన్న వారిగానూ భావిస్తూ వచ్చారు. వారలా భావించడానికి కారణాలు లేకపోలేదు. ఉదాహరణకు కొన్ని మానసిక వ్యాధులు (స్కిజోఫ్రినియా, ఎపిలెప్సీ లాంటివి) వింత వింత శబ్దాలు, దృశ్యాలు, ఊహలను కలుగజేస్తాయి. వీటిలో చాలా మతపరమైన సాంద్రత ఉండి, ఆధ్యాత్మికతతో వారు వ్యామోహులు అయ్యేటట్టు చేస్తాయి.[2]

ఇదికాక ఇంకొక వివరణ కూడా ఇవ్వడం జరిగేది. దానిని ఫ్రెడ్స్ థీరీ (Freuds Theory)గా పిలుస్తారు. దీనిప్రకారం, ఈ అనుభవాలు బాల్యానికి చెందిన ఒకరకమైన మానసికవ్యాధి లక్షణాలు. తల్లి గర్భంలో ఉన్నప్పుడు మనకు ద్వైత జ్ఞానం (నా, పర అనే విచక్షణ) ఉండదు. అంతా ఒక అనంతమయిన సముద్రగర్భ ప్రశాంతతలా తోస్తుంది. ఫ్రెడ్ ఏమన్నాడంటే - మార్మికవాదులు దేవునితో లీనమవ్వడానికి పడే తాపత్రయం, ఈ ప్రపంచం యొక్క చేదు నిజాల నుంచి విముక్తులై, మరలా అనంతమైన ఆ ప్రశాంతతను చేరిపోవడానికి మనసులో పరధ్యానంగా ఉన్న తాపత్రయం, తహ తహ అని.

ఇలాగ శాస్త్రవేత్తలు మరియూ మార్మికవాదుల సిద్ధాంతాల మీద నమ్మకం లేనివారూ, మార్మిక అనుభవాలకు ఈ రకమైన వివరణ ఇచ్చేవారు. కానీ, గత కొన్ని దశాబ్దాలుగా జరిగిన పరిశోధనల ప్రకారం, ఈ వివరణలు ఆధార రహితాలనేది వెల్లడైంది. ఈ పరిశోధనల్లో తేలిన విషయమేమిటంటే, మార్మిక అనుభవాలు పొందిన వ్యక్తుల యొక్క మానసిక స్థితి, సమాజంలో మిగిలిన వ్యక్తులకంటే ఏమాత్రం తక్కువ కాకుండా, ఖచ్చితంగా చెప్పాలంటే ఇంకా మెరుగుగా కూడా ఉండవచ్చు. ఈ మార్మిక అనుభవాలు - మానసిక వ్యాధులు కలిగించే అనుభవాలకంటే ఎంతో వైవిధ్యమైనవని కూడా తేలింది. ఇప్పుడు అందుబాటులో ఉన్న సమాచారం ప్రకారం మనం ఖచ్చితంగా చెప్పగలిగేదేమిటంటే, మార్మిక అనుభవాలు కొన్ని మానసిక వ్యాధి లక్షణాలను

పోలి ఉన్నా, ఇవి మానసిక వ్యాధులవలన కలిగేవి కావు. మానసిక వ్యాధి అనుభవాలు, మార్మిక అనుభవాలంత స్పష్టంగా, నిజాలుగా ముద్రవేయలేవు. మార్మిక అనుభవాలను మనసు నిజజీవితంలోని అనుభవాలంతటి స్పష్టత తోనే గుర్తుంచుకోగలదు. ఇది మానసిక వ్యాధి అనుభవాల విషయంలో జరుగదు.

## మరి ఈ మార్మిక అనుభవాలు ఎలా కలుగుతున్నాయి?

మీరు దీనికి సమాధానం చెప్పగలరా? చెప్పగలరు. దీనికి సమాధానం మీ శరీరంలో అత్యంత అధికంగా వాడబడే అవయవం. ఈ పుస్తకం చదవడం కూడా మీరు ఆ అవయవం సహాయంతోనే చేస్తున్నారు. అదే మీ **మెదడు**. అవును. మీరు కళ్ళతో పుస్తకాన్ని చదువుతున్నామని అనుకొంటున్నా, కళ్ళు సంకేతాలను (Signals) మాత్రమే జనింపజేస్తాయి. అని మెదడుకు సరఫరా అయి, మెదడు ఈ పుస్తక రూపాన్ని, ఈ వాక్యాల రూపాన్ని తయారు చేస్తుంది. మీరు చదువుతున్నది - అర్థం చేసుకోబడడం, విశ్లేషించబడటం, గుర్తుంచుకోబడడం - అన్నీ కూడా మెదడులోనే జరుగుతున్నాయి.

సంవత్సరాల కొద్ది సాగిన పరిశోధనల ద్వారా శాస్త్రవేత్తలు - మార్మిక అనుభవాల వెనుకగల రహస్యాన్ని ఛేదించారు. అవి శాస్త్రపరంగా గమనింపదగినవని, అర్థం చేసుకోదగినవనీ నిర్ధారించారు. అత్యాధునిక సాంకేతిక పరికరాల (SPECT, PET కెమేరాలు)* సహాయంతో ధ్యానసాధనలో ఉన్న మెదడులను విశ్లేషించి, జ్ఞానోదయ అనుభవం వెనకున్న రహస్యాన్ని తెలుసుకున్నారు. ఇప్పుడు శాస్త్రవేత్తలు మార్మిక అనుభవాలను జనింపజేస్తున్న మెదడులోని భాగాలను ఖచ్చితంగా గుర్తించడమేకాక, ఈ అనుభవాలు ఎలా కలుగుతున్నాయనేది వివరంగా వెల్లడించే స్థాయికి చేరుకున్నారు.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

\* ***SPECT*** *కెమేరా*: *ఇది ఒక అత్యాధునిక యంత్రం. ఇది రేడియో తరంగాలను గుర్తించగలుగుతుంది. ధ్యానులు ప్రశాంత వాతావరణంలో ధ్యాన సాధన చేస్తుండగా, వారి మెదడులపై పరిశోధనలు జరపగలగడం దీని ముఖ్యమైన ఉపయోగం. మార్మిక అనుభవాలప్పుడు ఒక రేడియో యాంత్రిక ట్రేసర్‌ను దూరంనుంచి ధ్యానుల రక్తాలలోకి ఎక్కిస్తారు. ఈ Tracer వారి మెదడు కణాలలోకి అప్పటికప్పుడు చేరుకుని, స్థిరంగా ఉండగలదు. ధ్యానం పూర్తయిన తరువాత SPECT కెమేరా సహాయంతో స్కానింగ్ చేసి, Tracer ఎక్కించినప్పటి మెదడులోని యథాస్థితి చిత్రాలను పొందగలం. ఈ చిత్రాల ఆధారంగా, కంప్యూటరు సహాయంతో మెదడు యొక్క 3D చిత్రాలను రూపొందించగలరు.*

***PET*** *కెమేరా - ఇందులో ఒక ఐసోటోపు - ఒక పాసిట్రాన్ (వ్యతిరేక - ఎలక్ట్రాన్)ను వెలువరుస్తుంది. ఇది ఎలక్ట్రాన్‌ను ఎదుర్కొనినప్పుడు, రెండు ఫోటాన్‌లు విడుదలౌతాయి. ఇలా విడుదలయిన ఫోటాన్లను కెమేరా సహాయంతో గుర్తించి, చిత్రరూపంలోకి మార్చడం జరుగుతుంది.*

*ఈ ఆధునిక పరికరాలు, ఇంతకు ముందున్న CT, MRI స్కానింగ్‌ల కంటే ఎంతో ఆధునికమైనవి. వీటిని గత 30 సం॥లలో అభివృద్ధి పరిచారు. వీటిద్వారా ఇంతకు ముందెన్నడూ లేనివిధంగా - మెదడు పనిచేసే తీరుని విశ్లేషించే వీలయింది.*
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

మీరు ఊహించగల ప్రతీజంతువు (క్షీరదాలు, సరీసృపాలు, ఉభయచరాలు, పక్షులు, చేపలు మొదలైనవి)కు మెదడు ఉంటుంది. కానీ మానవ మెదడుకి చాలా ప్రత్యేకత ఉంది. అది మనకు ఆలోచించే, విశ్లేషించే, వ్యూహరచన చేసే శక్తులతోపాటు...... మార్మిక అనుభవాలను కూడా ఇస్తుంది. ఇది నిజంగానే ఒక అద్భుతమైన అవయవం.

మెదడుమీద గత కొన్ని దశాబ్దాలుగా జరిగిన పరిశోధన విశిష్టమైనది. గడచిన 30 సం॥లలో నాడీమండల శాస్త్రవేత్తలకు (న్యూరోసైంటిస్ట్‌లకు) - వైద్య, శరీర శాస్త్ర రంగాలలో లభించిన నోబెల్ పురస్కారాలే దీనికి సాక్ష్యం. ఇందువలనే అమెరికా సంయుక్త రాష్ట్రాల కాంగ్రెస్ కూడా గడచిన పది సంవత్సరాలను (1990-2000) - **'మెదడు దశాబ్దం'** (Decade of Brain) గా అభివర్ణించింది.

మార్మిక అనుభవాల గురించిన సమాధానాల పరిశోధన మనల్ని నాడీమండల శాస్త్రం (Neuro Science) ముందుంచుతుంది. ఇది మెదడు, నాడీమండల సంబంధిత శాస్త్రాల అధ్యయన రంగం. ఈ రంగంలో జరిగిన అభివృద్ధి, పరిశోధనల ద్వారా ఋజువయిందేమిటంటే - 'మార్మిక అనుభవాలు' అనేవి - మార్మికవాదుల సాధనలవల్ల మెదడులో సంభవించే మార్పులవలన ఉత్పన్నమౌతున్నాయి'. ఈ మార్పులవలన కొన్ని ప్రత్యేక మనోస్థితులు ఉత్పన్నమౌతున్నాయి. వీటిని అసాధారణ మనోస్థితులుగా వర్ణిస్తారు. మార్మికవాదులు వివరించినట్టు ఈస్థితిలో మెదడు కొన్ని గాఢమైన నమ్మకాన్ని కలిగించే అనుభవాలను ఉత్పన్నం చేస్తుంది.

ఈ మనోస్థితులు ఎలా ఉద్భవిస్తాయి? వీటివెనుకగల శారీరక వ్యవస్థలు ఏమిటి? మరియు ఇవి ఎలాంటి మనోభావాలను మార్మికవాదులకు కలిగిస్తాయి అనేవి ఈ అధ్యాయంలో వివరంగా తెలుసుకుందాము.

## అసాధారణ (చైతన్య) మనోస్థితులు

''చైతన్యం'' (Consciousness) గురించిన అన్ని నిఘంటువుల నిర్వచనాలు 'స్వ'భావన (నా-నేను అనే భావన, Self) చుట్టూ అల్లుకొని ఉంటాయి. ఈ నిర్వచనాలు ఒక నిజాన్ని వెల్లడించవు. అది మన మార్మిక అనుభవాల అవగాహనకు కీలకమైనది. అదేమిటంటే: కొన్ని ప్రత్యేక మనోస్థితులు ఈ 'స్వ' అనే భావన లేకుండా ఉంటాయి. అయినా అవి అనుభవంలోకి వస్తాయి.[3]

మనం ఈ 'స్వ' భావనను గురించి తర్వాత చర్చిద్దాము. ముందు మామూలు లేక సాధారణ మనోస్థితి, అసాధారణ మనోస్థితుల గురించి నేర్చుకొందాము.

### సాధారణ (చైతన్య) మనోస్థితి అంటే ఏమిటి?

ఇది మనందరికీ తెలుసు. నిత్యం మనం ఉండే మనోస్థితి ఇదే. ప్రస్తుతం మీరు ఈ పుస్తకం చదువుతూ ఇదే మనోస్థితిలో ఉన్నారు. ఇది మనం జీవితంలో అత్యధిక సమయంగడిపే మనోస్థితి.

ఈ స్థితిలో మనకు 'స్వ' (Self), 'పర'(Other) అనే జ్ఞానం ఉంటుంది. కాల-ప్రాంత అవగాహన కూడా ఉంటుంది. అంటే - సమయం గడుస్తున్నట్లు తెలుస్తూ ఉంటుంది మరియు మనమెక్కడున్నామో అనే జ్ఞానం కూడా ఉంటుంది. మన జ్ఞానేంద్రియాల నుంచి సమాచారాన్ని అందుకుంటూ నిరంతరం విశ్లేషిస్తుంటుంది మన మెదడు. సంవత్సరాలుగా పనిచేస్తున్న మన మెదడు ఈ మనోస్థితిని ఎంత సమర్థవంతంగా

తయారుచేస్తుందంటే, దాని గురించి ఆలోచించవలసిన అవసరం కూడా మనకు లేదు. మనం అందులో ఉన్నాం అంతే. మన మెదడులో ఎన్ని భాగాలు, నాడీ వ్యవస్థలు సమాంతరంగా, సమర్ధవంతంగా పనిచేస్తుంటే మనకీ మనోస్థితి ఉన్నదనేది మనం విశ్లేషించే ప్రయత్నమెప్పుడూ చేయం. మనం దాన్ని పట్టించుకోం. అవునుమరి. మనకు సమయం ఎక్కడ? ఈ చైతన్యాన్ని, మనోస్థితిని గురించి ఆలోచిస్తూ కూర్చుంటే, మిగతా పనులెవరు చేస్తారు? నిజమే!

కానీ మీకు కొంచెం ఆశ్చర్యం కలిగించగలిగే విషయం ఏమిటంటే, మనం ఈ సాధారణ చైతన్య మనోస్థితిలోనే కాకుండా, కొన్ని ఇతర రకాల మనోస్థితులలో కూడా ఉండగలం. వీటినే అసాధారణ మనోస్థితులని అంటారు.

ఇది అర్థం చేసుకోవడం మీకేమైనా కష్టంగా ఉంటే, మొత్తం చైతన్యాన్ని లేక మనోస్థితిని ఒక పది అడుగులు లోతుగల కొలనుగా భావించండి. మన మామూలు చైతన్యం - లేదా సాధారణ మనోస్థితి కొలనులో ఒక అడుగులోతువరకూ ఉన్న నీరనుకోండి. ఇప్పుడు ఆ మిగిలిన 9 అడుగుల నీరు, ఆ ఇతర అసాధారణ మనోస్థితులకు చెందుతుంది. ఇంకొక ఉదాహరణ - మన మొత్తం చైతన్యాన్ని లేక మనోస్థితిని ఒక నారింజ అనుకోండి. మన మామూలు చైతన్యం - లేక సాధారణ మనోస్థితి దానిపై చర్మం (తొక్క) అనుకుంటే, దాని లోపలిభాగం ఆ ఇతర అసాధారణ మనోస్థితులకు చెందుతుంది.

న్యూరాలజిస్ట్ (నరముల వైద్య నిపుణుడు) మరియూ జెన్ సాధకుడు అయిన జేమ్స్ హెచ్. ఆస్టిన్ ఈ మనోస్థితులను క్రింది రకాలుగా వర్గీకరించారు.

***<u>సాధారణ (చైతన్య) మనోస్థితులు:-</u>***

1. మామూలు మెళుకువతో కూడిన మనోస్థితి (మీరిప్పుడు ఈ స్థితిలోనే ఉన్నారని ఆశిస్తున్నాను)
2. నిద్ర - కలలు లేని నిద్ర (S- Sleep)
3. నిద్ర - కలలతో కూడిన నిద్ర (D-Sleep)
4. ధ్యాన సాధన ప్రారంభంలో కలిగే మనోస్థితులు.

***<u>అసాధారణ (చైతన్య) మనోస్థితులు:-</u>***

5. తీవ్రమైన - స్పృహస్థితి - ఇంద్రియ గ్రహణశక్తి ఉండేది.
6. లీనత్వం (Absorption) - ఇంద్రియ గ్రహణశక్తి ఉండేది - బాహ్యలీనత్వం.
7. లీనత్వం (Absorption) - ఇంద్రియ గ్రహణశక్తి లేకుండునది - అంతర్లీనత్వం (సమాధి, ఫనా)

***<u>అత్యంత అసాధారణ (చైతన్య) మనోస్థితులు:-</u>***

8. అంతర్జ్ఞాన మనోస్థితి.
9. వర్ణింపలేని - పరమసత్య మనోస్థితి (బౌద్ధుల - 'నిర్వాన')
10. నిరంతరం కొనసాగే జ్ఞానోదయ స్థితులు.

పై వర్గీకరణలో, మొదటి మూడు స్థితులు మనకు బాగా పరిచయమైనవే:

(1) మెళుకువ (2) నిద్ర (3) కలల నిద్ర. ధ్యాన సాధనచేస్తే 4వ వర్గంలో ఉన్న మనోస్థితులలోకి పోవచ్చు. ఈ నాలుగు స్థితుల గురించి వ్రాయగల ఆశ్చర్యకర విషయాలు ఎన్నో ఉన్నాయి. కానీ ఇక్కడ మనం మార్మిక అనుభవాల గురించిన వివరణ కోరుతున్నాం కాబట్టి వాటికి సంబంధించిన స్థితులనే చర్చిద్దాం. అవి - అసాధారణ మరియూ అత్యంత అసాధారణ మనోస్థితులు.

నెలలు, సంవత్సరాల తరబడి చేసే ధ్యాన సాధనలు ఈ మనోస్థితులకు దారితీస్తాయి. ముఖ్యంగా 7 నుండి 10వ స్థితులు - మార్మిక అనుభవాలకు సంబంధించినవి. అమెరికాకు చెందిన ప్రఖ్యాత తత్వవేత్తగా మారిన మనస్తత్వ శాస్త్రవేత్త విలియం జేమ్స్, తనపై చేసుకొన్న సొంత ప్రయోగాల ఆధారంగా ఇలా వివరించారు:

“మనం మామూలుగా ఉండే మనోస్థితి, మనోస్థితులలో ఒక వర్గం మాత్రమే. దానికి బదులు అనేకానేక మనోస్థితులలో మనం ఉండగలిగే అవకాశం ఉంది. అలాంటి మనోస్థితులు ఉంటాయి అనికూడా అనుకోకుండా మనం జీవితం గడిపేయగలం. కానీ, కావలసిన ఉత్తేజకాన్ని లేక ప్రేరణను అందజేస్తే అవి ఇట్టే మన ముందుంటాయి” [4].

ఇలాంటి కొన్ని మనోస్థితులలో ‘స్వ’ (అంటే ‘నేను’, ‘నా’ అనే) భావన మరియు ‘కాల-ప్రాంత’ భావనలు కూడా ఉండవని తెలిస్తే మీరు ఆశ్చర్యపోవచ్చు. ఈ స్థితులే అన్ని కాలాల మార్మిక వాదులు అనుభవించింది. ఈ స్థితులలోనే మార్మికవాదం, మార్మికవాద తత్వాల యొక్క మర్మాలకు సంబంధించిన సమాచారం ఉంది. రాబోయే పుటలలో మనం ఈ ‘స్వ’ భావన, ‘కాల-పాంత్ర’ భావనలు ఎలా అంతమౌతాయో, తద్వారా సంభవించే మనోస్థితులలో ఏమౌతుందో తెలుసుకుందాం.

**మార్మిక అనుభవంలో పాత్రను పోషించే మెదడులోని భాగాలు:**

మార్మిక అనుభవాలను అర్థంచేసుకోవాలంటే, మెదడు పనిచేసే విధానం గురించిన ప్రాథమిక జ్ఞానం అవసరం. మెదడు యొక్క అన్ని భాగాల గురించి వివరించడం ఇక్కడ సాధ్యంకాదు మరియు అవసరం లేదు కూడా. అందుకని మార్మిక అనుభవాలలో పాత్రను పోషించే ఆ కొన్ని భాగాలను గురించిన వివరణయే ఇవ్వడం జరిగింది. కొంచెం కష్టంగా అనిపించినా, వాటి గురించిన వివరణను ఓపికగా చదివితే మార్మిక అనుభవాల వెనుక మర్మం ఇట్టే బోధపడుతుంది.




నాడీ మండల శాస్త్రవేత్తలు మెదడు మరియు కేంద్ర నాడీ మండల వ్యవస్థ (Central Nervous System) ను పలు భాగాలుగా వర్గీకరించారు. మొదటి వర్గానికి చెందిన ముఖ్యమైన భాగాలు - కుడి, ఎడమ అర్ధగోళాలు (వీటినే కుడిమెదడు, ఎడమ మెదడు అని కూడా అంటారు.) ఈ అర్ధగోళాలు రెండూ సారూప్యంగా (ఒకేలాగ) ఉంటాయి మరియు సెరెబ్రల్ కార్టెక్స్ అనే పదార్థంతో నిండి ఉంటాయి. ఇది మానవులను జంతువుల నుంచి వేరుచేసే అతిముఖ్యమైన భాగం. ఎందుకంటే, దీని ద్వారానే మనకు ‘విశ్లేషణ శక్తి’ సంభవించింది (చిత్రంలో సెరెబ్రమ్).

వర్గీకరణలో తరువాత వచ్చేవి - ఈ అర్ధగోళాల క్రింద ఉండే భాగాలు. వీటిని థాలమస్, హైపోథాలమస్ అంటారు. ఇవి ప్రాథమిక జీవనచర్యల నిర్వహణ, హార్మోనుల నియంత్రణ, మౌలిక భావావేశాల నియంత్రణ వంటి విధులను నిర్వహిస్తాయి. ఇలాంటి భాగాలన్నింటిని కలిపి లింబిక్ వ్యవస్థ (Limbic System) అంటారు. ఈ వ్యవస్థే మన భావ వ్యక్తీకరణను సాధ్యం చేస్తుంది (భయం, కోపం, సంతోషం, ప్రేమ మొదలైనవి).

వర్గీకరణలో తరువాత వచ్చేది - అసంకల్పిత లేదా స్వతంత్ర నాడీ వ్యవస్థ (Autonomic Nervous System). ఇది మెదడును శరీరంలోని ఇతర భాగాలతో అనుసంధానం చేయడానికి ఉపయోగపడుతుంది.

***కుడి, ఎడమ అర్ధగోళాలు :-***

ఎడమ అర్ధగోళం - శరీరం కుడివైపు నుంచి వచ్చే అనుభూతుల సమాచారాన్ని విశ్లేషిస్తే, కుడి అర్ధగోళం - శరీరం ఎడమవైపు నుంచి వచ్చే అనుభూతుల సమాచారాన్ని విశ్లేషిస్తుంది. ఎడమ అర్ధగోళం - కుడివైపు శరీర కదలికలను నియంత్రిస్తే, కుడి అర్ధగోళం - ఎడమవైపటి శరీర కదలికలను నియంత్రిస్తుంది. ఎడమ అర్ధగోళం విశ్లేషణ, గణిత సంబంధ కార్యాలతోపాటు, కాలగమన అనుభవ నియంత్రణ, భాషా సామర్థ్యాలకు ఎక్కువగా బాధ్యత వహిస్తుంది. అందుకని దీనిని ఆధిక్యతకల అర్ధగోళంగా వ్యవహరిస్తారు. కుడి అర్ధగోళం - భావాలోచనలు, భావావేశ సంబంధ సామర్థ్యాలకు ఎక్కువగా బాధ్యత వహిస్తుంది. ఈ రెండు అర్ధగోళాలు - కార్పస్ కల్లోజమ్ అనబడే నిర్మాణంచే జతకలసి ఉంటాయి.

ఒకో అర్ధగోళం - తిరిగి అనేక భాగాలుగా వర్గీకరించబడింది. వీటిలో మార్మిక అనుభవాలతో సంబంధం ఉన్న భాగాలనే పరిశీలిద్దాం.

**AAA** - దీని అసలు పేరు: ప్రిఫ్రంటల్ కార్టెక్స్. మనం దీనిని AAA గా వ్యవహరిద్దాం. AAA అంటే Attention Association Area - ధ్యాస నియంత్రణ భాగము.

AAA - శరీర కదలికల నియంత్రణ, లక్ష్యసాధనకు సంబంధించిన ప్రవర్తనల నియంత్రణ చేస్తుంది. చిన్న చిన్న పనులైన - నడవడం, వస్తువులను అందుకోవడం మొదలు లక్ష్యసాధనకు అవసరమైన - మనసును ఒక ఆలోచనపై కేంద్రీకృతం చేయడంలాంటి క్లిష్టమైన పనులను కూడా ఇది నిర్వహిస్తుంది. అందుకనే దీనిని నాడీమండల సంకల్ప కేంద్రము (Neurological Seat of Will) అని కూడా అంటారు. మెదడులోని ఈ భాగం దెబ్బతింటే, ధ్యాసను లగ్నం చేయడం, భవిష్యత్ కార్యకలాపాల పథకాలను రూపొందించడంలాంటి పనులు చేయలేకపోవడం సంభవిస్తుంది. ధ్యానసాధనలో ఈ భాగం ఎక్కువగా ఉత్తేజితం కావటం జరుగుతుంది.

**OAA – మార్మిక అనుభవాల అవగాహనలో ఇది కీలకమైన భాగం.**

దీని అసలు పేరు - పోస్టీరియర్, సుపీరియర్ పెరిటల్ లోబ్. దీనిని మనం OAA గా వ్యవహరిద్దాం. OAA అంటే - Orientation Association Area - శరీర సమతుల్య నియంత్రణ భాగం.

OAA యొక్క ముఖ్య విధి - భౌతిక శారీరక భావాన్ని జనింపజేయడం. మన శరీరంలో ఏ చివర పైన ఉంది, ఏది కింద ఉంది గమనించడం, కోణాలు, దూరాలను కొలవగలగడం, చుట్టూ భౌతిక ప్రపంచంలో ఉన్న అడ్డంకులను దాటుకుంటూ క్షేమంగా నడవగలగడం వంటి ప్రాథమిక కార్యాల నిర్వహణ దీని నియంత్రణలోనే జరుగుతుంది. వీటన్నింటినీ చేయగలగడానికి ముందు అది మన శరీరం యొక్క భౌతిక పరిమితుల నిర్దిష్ట సమాచారాన్ని రూపొందించాలి. ఇంకా వివరంగా చెప్పాలంటే, అది భౌతిక శరీరం యొక్క పరిధిని గుర్తించి, ఇక్కడిదాకా 'నేను' మిగిలినదంతా 'నేను కానిది' అనే వివేచనను జనింపజేస్తుంది. 'నేను-కానిది' అనేది అనంతమైన బాహ్య ప్రపంచాన్ని సూచిస్తుంది.[5]

మన మెదడు మన శరీర పరిమితిని తెలుసుకోవడానికి ఇంత తంతు అవసరమా? అని మీకు అనిపించవచ్చు. అది దానికదే అయిపోతుంది. అని మనం అనుకుంటాం. ఇలా ఎందుకు అనిపిస్తుందంటే, OAA తన పనిని అత్యంత సమర్థవంతంగా నిర్వహిస్తుంది. మరియు మనం దానికి అలవాటు పడిపోయాం కాబట్టి. చిన్నపిల్లలను చూడండి. నడక నేర్చుకొనేడప్పుడు వాళ్లుపడే తిప్పలు కొన్ని ఇతర వ్యవహారాలతోపాటు OAA తన పనితనాన్ని నేర్చుకోవడాన్ని కూడా సూచిస్తుంది. ఆ తరువాత ఏళ్ళ తరబడి ఈ వ్యవస్థ ఎంత సమర్థవంతంగా పనిచేస్తుందంటే, ఈ పనులకు ఒక వ్యవస్థ కూడా అవసరం అని మనకనిపించదు. మెదడులో ఈ భాగం దెబ్బతిన్నవారిని చూస్తే దాని విశిష్టత ఏమిటో అర్థం అవుతుంది. వారికి, ఈ భౌతిక ప్రపంచంలో కదలడం కూడా ఒక క్లిష్టతరమైన పని అయిపోతుంది. కుర్చీలో కూర్చోవడంలాంటి చిన్న పనికూడా వారికి అసంభవం అయిపోతుంది. అలా కూర్చోబోతూ లేదా మంచం మీద పడుకోడానికి ప్రయత్నిస్తూ వారు అవిచేయలేక కిందపడిపోతూ ఉంటారు. ఈ చర్యలన్నింటికీ మనకు తెలియకపోయినా, అనేక గణిత సంబంధ అంచనాలు అవసరమవౌతాయి. OAA దెబ్బతిన్న మెదడులు ఆ అంచనాలను సరిగా చేయలేక పోడవం వలన అలా కిందపడిపోవడం జరుగుతుంది. ఈవిధంగా OAA లేకుండా మనల్ని మనం ఈ ప్రపంచంలో భౌతికంగాగానీ, మానసికంగాగానీ గుర్తించలేము.

శరీర జ్ఞానేంద్రియాల నుంచి నిరంతరం సమాచారాన్ని విశ్లేషిస్తూ OAA తన పనిని ఎంతో సమర్థవంతంగా చేసుకుపోతుంది. దాని పనితనాన్ని ఒక సూపర్ కంప్యూటర్‌తో పోల్చవచ్చు. ఇది స్పర్శ, దృశ్య, శ్రవణ జ్ఞానేంద్రియాల సమాచారాన్ని సమీకరించి, 'కాల-ప్రాంత' భావనను జనింపజేస్తుంది. నిజానికి మెదడులో రెండు OAAలు ఉంటాయి. (ఒకటి కుడి అర్థగోళంలో, మరొకటి ఎడమ). ఇవి ఒకదానికొకటి సంబంధించినవైనా, నిర్దిష్ట చర్యలకు ప్రాతినిద్యం వహిస్తాయి. ఎడమ OAA ఒక పరిమిత భౌతిక కాయభావనను జనింపజేస్తే, కుడి OAA - ఈ భౌతిక కాయాన్ని ఉంచేందుకు అవసరమైన బాహ్య ప్రపంచ నిరూపకాల (Co-ordinates) భావనను జనింపచేస్తుంది. సులభంగా అర్థమయ్యేట్టు చెప్పాలంటే ఎడమ OAA -'స్వ'భావనను జనింపజేస్తే, కుడిOAA - ఆ 'స్వ'ను ఉంచగలిగే 'ప్రాంత' భావనను జనింపజేస్తుంది.

| | | |
|---|---|---|
| *ఇంద్రియాల నుంచి నిరంతర సమాచారం* → | **Orientation Association Area (OAA)** | → *పరిమిత 'స్వ' భావన మరియు 'కాల' భావన* |
| *(సమాచారం : నిలిపివేయబడింది)* | **Orientation Association Area (OAA)** | → *అపరిమిత 'స్వ' భావన (అనంతం) మరియు కాలాతీత భావన* |

ఇప్పుడు OAA కు ఇంద్రియాల నుంచి సమాచార సరఫరా నిరోధించబడితే ఏమి జరుగుతుందనేది పరిశీలిద్దాము. గమనించవలసినది ఏమిటంటే - మనం పరిశీలిస్తున్నది OAA కు దెబ్బతగలడాన్ని కాదు - దానికి అందవనసిన సమాచారం అందక పోవడాన్ని మాత్రమే. అప్పుడది ' స్వ' పరిమితిని ఎలా అంచనావేస్తుంది? ఇంద్రియ సమాచారం లభ్యంకాకపోవడంతో అది ఆ పరిమితిని అంచనా వేయలేదు. కాని అది ఎప్పటిలా పని చేస్తూనే ఉంది. ఆ'స్వ'భావనను ఉత్పత్తి చేస్తూనే ఉంది. అప్పుడా స్థితిని మెదడు ఎలా విశ్లేషిస్తుంది? OAA 'స్వ' కు పరిమితిని జోడించక పోవడంతో అపరిమితమైన 'స్వ' భావన జనిస్తుంది. పరిమితులు లేనప్పుడు 'నా','పర' అనే భావనలు అంతమైపోతాయి.'అంతా ఒక్కటే', 'అన్ని ఒకదానితో మరొకటి కలసి ఉన్నాయి' అనే భావన జనిస్తుంది. ఫలితం - అనంతమయిన 'స్వ' భావన. సమాచార లేమి వలన OAA కాలభావనను కూడా ఉత్పత్తి చేయలేదు. దీనివలన కాలరహిత భావన జనిస్తుంది. వీటన్నింటి పర్యవసానంగా ఈ స్థితిలో ఉన్న మనిషికి తాను కాలాతీతమైన, అనంతమైన వాడిననే అనుభవం కలుగుతుంది. ఈ స్థితి ఎంతో నిజమైనదిగా అనిపిస్తుంది. ఎందుకంటే మెదడులో విశ్లేషించబడిన సమాచారం ప్రకారం ఆ భావన కలిగింది. మనం నిజజీవితంలో చూసే వివిధ దృశ్యాలు నిజాలుగా ఎలా అర్థంచేసుకుంటాము? ఈ దృశ్య సమాచారం కళ్ళ ద్వారా మెదడుకు సరఫరా అయి అక్కడ విశ్లేషించబడడం వలన. 'మెదడులో విశ్లేషించబడడం' అనేది నిజ భావనకు మూలం. అందుకని, ఈ అనంతమైన, కాల రహిత భావన కూడా మెదడులో విశ్లేషించబడటం వలన అది ఎంతో నిజంగా, పరమసత్యంలా భావించబడుతుంది. 'అన్ని ఒకటి కావు, అన్ని విడివిడిగా ఉన్నాయి' అన్నా ఆ వ్యక్తి నమ్మడు. 'లేదు, అంతా ఒక్కటే, నీకు తెలీదు' అంటాడు.

పై వివరణ మీకు అర్థం అయితే, మార్మికవాదులు తరాలుగా చెబుతున్న వర్ణనలను కూడా అర్థంచేసుకోవచ్చు:

***" సమస్త దిశల నుంచి పొంగి ప్రవహించుచు వచ్చిన నదులన్నియునూ -***

***సముద్రంలో లీనమయి దానితో ఒకటయినట్టు,***

***అన్ని జీవరాసులూ వాటి 'స్వ' భావనను కోల్పోయి ఒకటిగా లీనమగును"***

(చందోగ్య ఉపనిషత్ 10:1-2 )

**'సొంత అస్తిత్వం ('స్వ'భావన) అనేది ఒక స్వచ్ఛమైన, అనంతమైన, కాలాతీత చైతన్య సముద్రంలో కలసిపోతుంది. వేరైన భావన అనేది, శరీరాలతో అస్తిత్వాన్ని ('స్వ'భావనను) జతచేయడం వలన కలిగింది. ఈ భౌతిక అస్తిత్వం కరిగిపోయినపుడు 'స్వ', 'పర' అనే భావన ఉండదు (అంతా ఒక్కటే), ఇదే చెప్పదలచుకొన్నాను ప్రియతమా!'**

*- (బృహదారణ్యక ఉపనిషత్ - 2, 4:12 )*

**"ప్రార్థనలో, నిన్ను నువ్వు ఏమీకానట్టు పూర్తిగా మరచిపో. దైవదర్శనం కోసం ప్రార్థిస్తున్నట్టు మాత్రమే గుర్తుంచుకో. అప్పుడు నువ్వొక మానసిక ప్రపంచంలోకి ప్రవేశిస్తావు. సమయాతీతమైన ఒక మనోస్థితిలోకి. ఈ ప్రపంచంలో అన్ని సమానము మరియు ఒక్కటే - జననం, మరణం, నేల, నీరు మొదలైనవి - కానీ ఈ ప్రపంచంలోకి నువ్వు ప్రవేశించాలంటే ముందు నీ అహాన్ని, నీ సమస్త సమస్యల్ని త్యజించాలి"**

*- యూదు మార్మిక వాది రబ్బీఎలీజర్.*

**"దేవునితో ఆ సంయోగస్థితిలో, సంయోగ భావన సంయోగం నుంచే జనిస్తుంది.**
**నీళ్ళలో నీళ్ళు ఒక్కటైపోయినట్టు - గాలి ఆకాశంలోకి మాయమైపోయినట్టు.**
**ఆస్థితిలో కేవలం ఆనందం మాత్రమే మిగులుతుంది"**

*- జ్ఞానేశ్వరి : 134*

ధ్యానసాధన ఉత్కృష్ట స్థాయికి చేరినపుడు OAAలో కార్యకలాపాలు కనిష్ఠదశకు చేరిపోతాయని, SPECT స్కాన్‌ల ద్వారా నిర్ధారించబడింది. ఈ పరిస్థితిలో ఏమి జరుగుతుందో అనడానికి ఇవ్వబడిన పై వివరణతో అది సరిగ్గా సరిపోతుంది.

లింబిక్ వ్యవస్థ:- హైపోథాలమస్, థాలమస్, అమిగ్డలా మరియూ హిప్పోకాంపస్‌లు:-

**హైపోథాలమస్ - ముఖ్య నియంత్రకుడు:** - అసంకల్పిత లేదా స్వతంత్ర నాడీమండల వ్యవస్థను మెదడులోని పై నిర్మాణాలకు జతచేయడం దీని ముఖ్య విధులలో ఒకటి. దీని ద్వారా మెదడు శరీర అవయవాల పనితీరును నియంత్రించే ఆదేశాలను సరఫరా చేస్తుంది. ఇందులో రెండు భాగాలు ఉంటాయి. (1) లోపలిభాగం - ప్రశాంత భావనను జనింపజేసే విశ్రాంత వ్యవస్థకు అనుసంధానమై ఉండేది. (2) వెలుపలి భాగం - మెదడు యొక్క ప్రేరణ వ్యవస్థ యొక్క విస్తరణే దీని వెలపలి భాగం.

హైపోథాలమస్ కూడా మార్మిక అవయవాల వృద్ధిలో పాలుపంచుకుంటుంది. ఇది ఎలాగో తర్వాత వివరంగా చూద్దాము. హైపోథాలమస్ అనేది లింబిక్ వ్యవస్థలోని భాగమైనా, దీనికి అసంకల్పిత లేదా స్వతంత్ర నాడీమండల వ్యవస్థపై ఉన్న నియంత్రణ కారణంగా దీనిని, నాడీమండల వ్యవస్థకు - 'ముఖ్య నియంత్రకుడు'గా వర్ణిస్తారు.

***అమిగ్డలా - కాపలాదారు***:- భావావేశ, ప్రేరణ సంబంధ విధులతోపాటు అమిగ్డలా - ధ్యాస, అభ్యాస, జ్ఞాపకశక్తి చర్యలలో కూడా పాల్గొంటుంది. ప్రేరణ వ్యవస్థకు అనుసంధానమై ఉన్న హైపోథాలమస్ వెలుపలి భాగాల నుంచి వచ్చే నరాలు అమిగ్డలా వెలుపలి భాగాలకు జతకలుస్తాయి. అమిగ్డలా - అసంకల్పిత లేదా స్వతంత్ర నాడీ మండల వ్యవస్థను ప్రత్యక్షంగా నియంత్రించదు. హైపోథాలమస్‌ను ఉత్తేజపరచి, దాని ద్వారా ఆ పని చేయిస్తుంది. అమిగ్డలా జ్ఞానేంద్రియాల నుంచి వచ్చే సమాచారం కోసం ఎల్లప్పుడూ కాపలా కాస్తూ ఉంటుంది. అందుకనే దీనిని 'కాపలాదారు'గా వ్యవహరిస్తారు. ఉత్తేజ స్థితులలో, ఈభాగంలోని కార్యకలాపాలు అధికమవడాన్ని పరిశోధకులు గమనించారు.

***హిప్పోకాంపస్ - దూత***:- ఇది ఒక టెలీఫోను రిసీవరు ఆకారంలో ఉండి, అమిగ్డలాకు కొంచెం వెనుకవైపు ఉంటుంది. సమాచార విశ్లేషణ, జ్ఞాపకశక్తి సంబంధ, ధ్యాస మరియు అభ్యాస కార్యకలాపాల్లో ఇది ముఖ్య విధి నిర్వహిస్తుంది. హిప్పోకాంపస్ మరియు అమిగ్డలాలు కలిసి పనిచేస్తూ, ధ్యాసను లగ్నం చేయడం, భావావేశాలను ఉత్పత్తి చేయడం చేస్తాయి. హిప్పోకాంపస్ - థాలమస్‌తో కలిసి జ్ఞానేంద్రియ సమాచారాన్ని వివిధ అర్థగోళాల భాగాలకు సరఫరా అవకుండా ఆపగలదు. ఈ చర్యను 'సమాచార నిర్బంధం' (డీ-అఫరంటేషన్) అంటారు. దీనిని అర్థం చేసుకోవడం మార్మిక అనుభవాల అవగాహనకు ఎంతో అవసరం.

**అసంకల్పిత లేదా స్వతంత్ర నాడీమండల వ్యవస్థ :- (ప్రేరణ వ్యవస్థ మరియు విశ్రాంత వ్యవస్థ):**

మెదడు నుంచి వచ్చే ఆదేశాలకు అనుగుణంగా ఈ వ్యవస్థ జీవితానికి అవసరమైన, గుండె వేగము (కొట్టుకొనే రేటు), రక్తపోటు, శరీర ఉష్ణోగ్రత, జీర్ణక్రియలాంటి మౌలిక విధులను నిర్వహిస్తుంది. ఇందులో రెండు భాగాలు ఉంటాయి: ప్రేరణ వ్యవస్థ మరియు విశ్రాంత వ్యవస్థ. ప్రేరణ వ్యవస్థ - శక్తి ఖర్చయ్యే విధులైన 'పోరాడు-లేదా-పారిపో' లాంటి స్వభావాలను ఉత్పన్నం చేసే విధిని నిర్వహిస్తుంది. విశ్రాంత వ్యవస్థ - శక్తిని ఆదాచేసే - నిద్రను నియంత్రించడం, ప్రశాంత భావనను ఉత్పన్నం చేయడంలాంటి విధులను నిర్వహిస్తుంది. ఈ రెండు వ్యవస్థలూ పరస్పర భిన్నమైన విధులను నిర్వహిస్తున్నాయి. అంటే ఒక వ్యవస్థ ఎంత ఎక్కువగా ఉత్తేజితమయిఉంటే రెండవది అంత తక్కువగా ఉత్తేజితమయి ఉంటుంది. కానీ, కొన్ని సందర్భాలలో - ఒక వ్యవస్థను ఒక హద్దుకు మించి ప్రేరేపిస్తే అది రెండవ వ్యవస్థను ప్రేరేపించి, రెండు వ్యవస్థలూ ఒకేసారి పనిచేసే పరిస్థితి ఏర్పడుతుంది. దీనిని 'స్పిల్-ఓవర్' అంటారు. దీనివలన కొన్ని అసాధారణమయిన మానసిక స్థితులు ఉత్పన్నం అవుతాయి. ఇవే మార్మిక అనుభవాలుగా పరిణామం చెందుతాయి.

# 'స్వ' భావన

**"మనోస్థితులను అర్థం చేసుకోవడంలో అసలు సమస్య - ఎవరు లేదా ఏది ఆస్థితిని అనుభవిస్తుంది? (సాక్షి) అనేది. మన వివరణలన్నీ దానిని పరిగణనలోకి తీసుకోవు"**

*- ఆర్థర్ డీక్మన్*

అవునుమరి - అనుభవం అనేది పొందాలంటే, అనుభవించే ఒకసాక్షి ఉండాలి కదా. ఉదాహరణకు సినిమా అనుభవమైతే, సినిమాను చూసేవాడు సాక్షి. ఈ సాక్షి, అంటే - 'స్వ' భావన ('నేను', 'నా') లేకుండా ఏ అనుభవమూ పొందలేం, ఏమీ నేర్చుకోలేము, ఏమీ చేయలేము - ప్రతీపనిలో ఇది అవసరం.

OAA గురించి వివరించేటప్పుడు - ఇంద్రియ సమాచారం OAAకు చేరకపోవడం జరిగినపుడు - ఈ 'స్వ' భావన పరిమితులు చెరిపి వేయబడగలవని చూశాం. కానీ, ఈ 'స్వ' భావన అంటే ఏమిటి? ఇది ఎలా జనిస్తుంది? ఇది ఎలా తయారయింది? అనేది ఇప్పుడు చూద్దాం.

***'స్వ' భావన అనేది ఎలా తయారయింది?***

'స్వ' భావన అంటే - మన సొంత అస్తిత్వం యొక్క వివేచనా జ్ఞానం - 'నేను' (Ego) అన్న భావన అని మనందరికీ తెలుసు *

మెలకువ లేదా చైతన్యం (Consiousness) అనునది ఈ 'స్వ' భావన లేకుండా ఉండలేదు అని మనం అనుకుంటాం. కానీ కొన్ని మనోస్థితులలో ఇదే జరుగుతుంది. మన మెదడు ఈ 'స్వ' భావనను ఎలా త్యజించగలుగుతుంది? మనకి అర్థంకాదు. కానీ మార్మిక అనుభవాలలో జరిగేది ఇదే.

పిల్లలు వాదులాడుకోవటం మనం చూస్తాం. ఒక పిల్లవాడు 'ఎవడ్రా అలా అంది?' అంటే మరొకడు జవాబిస్తాడు - 'నేనే, నేను'. ఈ జవాబును గమనించండి. ఇందులో గమనించడానికి ఏముంది అనుకోకండి, ఇది మన 'స్వ' భావన ఎలా ఏర్పడిందో అర్థం చేసుకోవడంలో ఉపయోగపడనుంది. మీకు మీరుగా ఈ పదాన్ని మొదటిసారిగా ఎప్పుడన్నారో గుర్తుందా? చాలా చిన్నప్పుడు - కదా! ఈ 'స్వ' అనే భావన మన మెదడులోని నరవ్యవస్థలతో కూడిన కొన్ని ప్రత్యేక భాగాలలో అభివృద్ధి చెందుతుంది. ఇది మొత్తం అభివృద్ధి చెందడానికి కొన్ని సంవత్సరాలు పడుతుంది. అభివృద్ధి చెందిన తరువాత, మన ప్రతీ పనిలోనూ, ఆలోచనలోనూ దాని అవసరం ఉందని కూడా మనకనిపించనంత సమర్థవంతంగా పనిచేస్తూపోతుంది.

.......................................................................................

* *'స్వ' భావన మరియు 'ఆత్మ'లు ఒకటికావు - శాస్త్రపరంగా మరియు ఆధ్యాత్మికపరంగా కూడా.*

**ఈ 'స్వ'భావన అభివృద్ధి క్రింది ఘట్టాలలో జరుగుతోంది:**

- మన మొదటి పుట్టిన రోజుకి మన మెదడు అంతగా అభివృద్ధి చెంది ఉండదు. ఆ 'స్వ' భావన ఇంకా జనించి ఉండదు. అందుకని అప్పటికి మనం - 'ఇది నాది', 'అది నాది' అని అనలేము.
- సుమారు 18 మాసాల ప్రాయంలో మనం - ఈ 'నా', 'పర'ల మధ్య బేధాన్ని గుర్తించడం మొదలెడతాము. ఈ ప్రాయంలో దేనినైనా పట్టుకొని 'నాది' అనగలం.
- 15-24 నెలల మధ్యకాలంలో, మనం సొంత చైతన్యం (Consiousness) తో పనిచేయనారంభిస్తాం. అద్దం ముందు నిలబెడితే మన ముఖాన్ని గుర్తించగలిగే స్థాయికి చేరుకుంటాం. ఈ దశలో 'నా', 'నేను' అనే భావనలు ఇంకా అభివృద్ధి చెందుతూనే ఉన్నాయి. ముందుగా - 'నాది', తరువాత 'నేను', 'నువ్వు' అనే భావనలు వస్తాయి.[6]
- సుమారు 2 సం॥ల ప్రాయంలో మన మనోస్థితులను బయటివైపుకు మళ్ళించి, అక్కడ జరుగుతున్న దానిని బట్టి విశ్లేషణ జరిపి ప్రతిస్పందించగలం. ఎవరైనా ఏడుస్తుంటే, వెళ్ళి కళ్ళు తుడవటంలాంటి చేష్టలు దీనికి ఉదాహరణ. [7]
- ఇప్పటికి కూడా మనం మన అస్తిత్వం యొక్క స్థిరమైన భావనను పొంది ఉండం - ఇది మొత్తం ఏర్పడటం అనేది 6 నుంచి 9 సం।లు మధ్య జరుగుతుంది.[8] పది సం॥లు గడిచేసరికి, మన మెదడులోని అర్థగోళాలు అభివృద్ధిచెంది, సంకేతాలు ఒకవైపు నుండి మరోవైపుకు కార్పస్ కల్లోజమ్ ద్వారా పయనిస్తూ ఆరెండింటి సమర్థతలను కలిపి సంయుక్తంగా పనిచేస్తుంటాయి [9]

ఈవిధంగా 'స్వ'భావన జనించడం అనేది సుమారు పది సం॥లు సాగే ప్రక్రియ. చర్మం అనేది- 'నా', 'ఇతర' ల మధ్య వారధిగా నిర్ణయింపబడుతుంది. ఇలా అభివృద్ధి చెందిన తరువాత ఈ 'స్వ'భావన అనేది ఎల్లప్పుడూ మన మెదడులో ఎంతో సమర్థవంతంగా పనిచేస్తూ ఉంటుంది. ప్రతీక్షణం మనం పొందే అనుభవం, మన ప్రతీకదలిక, ఆలోచనలు దీని చూట్టూనే అల్లుకొని ఉంటాయి. అందువలన - ధ్యానసాధనలో ఈ 'స్వ' భావన కరిగిపోయినపుడు ఏర్పడే మనోస్థితి మన మెదడులో ఎంతో ప్రత్యేకమైన అనుభవాన్ని కలుగజేస్తుంది. మార్మిక అనుభవంలో జరిగేది ఇదే.

మార్మిక అనుభవాలకు సంబంధించిన మెదడులోని వివిధ భాగాల గురించి మరియూ మన 'స్వ' భావన ఎలా అభివృద్ధిచెందింది అనేవి నేర్చుకున్నాం. ఇప్పుడు మార్మిక అనుభవాన్ని వివరంగా పరిశీలిద్దాం.

***మీకెప్పుడైనా మార్మిక అనుభవం కలిగిందా?***

మార్మికవాదులకే ఈ అనుభవాలు కలుగుతాయి అనేది నిజంకాదు. మనందరిలోనూ ఇది పొందడానికి కావలసినవన్నీ ఉన్నాయి. ప్రేరణ ఒక్కటే తక్కువ. జీవితంలో ఎప్పుడోకప్పుడు, ఒక తక్కువ మోతాదులోనైనా మీరు దీనిని అనుభవించే ఉంటారంటే ఆశ్చర్యపోనవసరంలేదు.

ఉదాహరణకు మీకు సంగీతం చాలా ఇష్టం అనుకోండి. బాగా అలసిపోయి వచ్చిన మీరు మంచం మీద వాలి, నెమ్మదిగా సాగుతున్న మీ కిష్టమైన సంగీతాన్ని వింటున్నారనుకోండి. శ్రవణానంద భరితమైన ఆ లయలు మీ శరీరంలో - 'విశ్రాంత-వ్యవస్థ'ను ఉత్తేజితం చేస్తాయి. తద్వారా ప్రశాంత భావన జనిస్తుంది. హిప్పోకాంపస్ - OAA కు ఇంద్రీయ సమాచార ప్రవాహాన్ని కొద్దిగా నిరోధించడం ద్వారా - తక్కువ మోతాదులో ఒక ఐక్య స్థితిని పొంది, దానిని ఆహ్లాదకరమైన ప్రశాంతత రూపంలో అనుభవిస్తారు. సంగీతం కొనసాగితే ఈ ప్రశాంతతీవ్రత పెరుగుతూ పోతుంది. విశ్రాంత వ్యవస్థ చాలాసేపు ఉత్తేజితం అవడం వలన, OAA కు చేరవలసిన సమాచారం పూర్తిగా నిరోధించబడితే అప్పుడది ఒక బలమైన ఐక్యస్థితిని కలుగుజేసి - మీరు సంగీతంలోకి కరిగిపోతున్నట్లు లేదా లీనమైపోతున్న భావనను కలుగజేయగలదు. మార్మికభాషలో చెప్పాలంటే దీనిని - 'సంగీత-సమాధి' లేదా 'ఫనా-ఫీ-మ్యూజిక్' అనవచ్చు.

ఇంకొక ఉదాహరణ - 'ఫనా-ఫీ-క్రికెట్' లేదా 'క్రికెట్-సమాధి': మీరు క్రికెట్ ప్రియులై ఉండి, ఎంతో ఉత్కంఠ భరితమైన ఆటను (ఉదాహరణకు ఇండియా-పాకిస్థాన్‌ల మధ్య ప్రపంచకప్ ఫైనల్) చూస్తున్నారనుకోండి. మీరు ఎంతో ఉత్కంఠతకు గురయి, ఆట చూస్తున్నంతసేపూ మీ పరిసరాలను, సమయాన్ని మరచిపోయి, ఆటలోకి లీనమైపోవడం సంభవించవచ్చు.

వీటిని మన మనోస్థితుల వర్గీకరణలో (**32** వ పేజీ) - 6వ వర్గానికి చెందిన - 'లీనత్వం - ఇంద్రీయ గ్రహణ శక్తి ఉండేది - బాహ్యలీనత్వం' అనుభవంగా పేర్కొనవచ్చు.

ఇక్కడ మన చైతన్యం (Consiousness) ఒక బాహ్య సంఘటన (సంగీతం, క్రికెట్ మొ॥వి) లోకి లీనం అవడం జరుగుతుంది.

కాని మన ఈ అనుభవాలు మార్మికవాదుల అనుభవాలతో సాటిరావు. ఇవి వాటికంటే చాలారకాలుగా భిన్నమైనవి. ముందుగా మన అనుభవాలలో ఆధ్యాత్మిక భావం లేదు. ఇంకా లీనత్వం మోతాదు కూడా దేవునిలో జరిగినట్టు భావించబడే లీనత్వం మోతాదు కన్నా తక్కువ, 'స్వ' భావన మరియూ 'కాల-ప్రాంత' భావనలు పూర్తిగా అంతమైపోలేదు, కొద్దిగా తగ్గాయంతే.

ఇప్పుడు మనం మార్మికవాదుల అసలయిన మార్మిక అనుభవాలను పరిశీలిద్దాము. గమనించవలసింది ఏమిటంటే - అన్ని అనుభవాలు, మనోభావాలవలె, ఈ ఐక్యస్థితులు కూడా నాడీ సంబంధ వ్యవస్థల వలననే సాధ్యమౌతున్నాయి. ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే అవి OAA కు జ్ఞానేంద్రియాల సమాచారం నిరోధించబడటం ద్వారా కలుగుతున్న ఆ 'స్వ' భావనలో తగ్గింపువలన ఉత్పన్నమై, లీనత్వ భావనను కలుగజేస్తున్నాయి.

## మార్మికఅనుభవాల వెనుక మర్మం

మార్మిక అనుభవాల ఈ ప్రాథమిక అవగాహన ఆధారంగా మనం ఇప్పుడు ధ్యాన సాధన ద్వారా సంభవించే - మార్మిక అనుభవాలలో ఏమి జరుగుతుంది? ఏ నాడీమండల ప్రక్రియల ద్వారా ఆ ఐక్య స్థితులు, అనుభవాలు ఉత్పన్నం అవుతున్నాయి అనేది పరిశీలిద్దాము:

ఈ నిజమైన మార్మిక అనుభవాలు అందరికీ వాటంతట అవే రావు. మార్మికవాదులు అనేక రకాల సాధనలు చేస్తూ (ధ్యాన సాధనతోపాటు) వీటికి దగ్గరవడానికి కొన్ని నెలల నుంచి సంవత్సరాలు కూడా పట్టవచ్చు. అప్పుడు వారు ఆ మనోస్థితులను పొందగలుగుతారు. మార్మికవాదుల సన్యాస జీవితం వలన - ప్రాపంచిక విషయాలపై ఏమాత్రం ధ్యాస ఉండకపోవడంతో వారి మెదడులు అతి తక్కువ ఆలోచనలతో ప్రశాంతంగా ఉండనే ఉంటాయి. దీనికి ధ్యాన సాధన తోడయితే వారి ధ్యాస, నిమగ్నతలు ఇంకా ఎక్కువ అవుతాయి. అనుసరించే మార్మికవాద సాంప్రదాయాన్నిబట్టి వారికి, ఏదో ఒక విషయం లేదా వస్తువు మీద మనసును లగ్నం చేయమని చెప్పబడుతుంది. క్రైస్తవ మార్మికవాది 'శిలువ' గుర్తుమీద మనసు లగ్నంచేస్తే, బౌద్ధ సన్యాసి - ఒక కోయన్ (అంటే అర్థం-పర్థం లేని ఒక వాక్యం) వల్లించడమో లేదా ఒకనీటి పాత్రను తదేకంగా చూడడమో చేస్తే, సూఫీ మార్మిక వాది - అల్లా దర్శనానికి, లీనత్వానికి పరితపిస్తాడు.

మెహర్‌బాబాగారి 'ఉపదేశాలు (Discourses)'లో ధ్యాన సాధన ద్వారా దైవానుభవం పొందడానికి చాలా వివరణను పొందుపరచటం జరిగింది. సంపుటము 2 లో చాలా భాగం దీనికే కేటాయించడం జరిగింది. (65 పేజీలలో ఉన్న 8 అధ్యాయాలు).

"ధ్యాన సాధన ద్వారా మనసు లగ్నం చేయడం (Concentration) అనే ప్రక్రియ అభివృద్ధి అవుతుంది. లగ్నం చేయడంలో, మనసును ఒక వస్తువుమీద లగ్నం చేయడం ద్వారా దానితో ఐక్యతను కోరుకుంటే, ధ్యానసాధన (Meditation) లో ఒక వస్తువు గురించి అదేపనిగా ఆలోచించడం జరుగుతుంది (మిగిలినవన్ని మర్చిపోయి)"

*- మెహర్‌బాబా 'ఉపదేశాలు' - సంపుటము 2, 116వ పేజి.*

తరువాతి పేజీలో - మెహర్‌బాబా గారి ధ్యాన సాధన వర్గీకరణను తెలుపు పట్టికను పొందుపరచడం జరిగింది.

# <u>మెహర్‌బాబా గారి - ధ్యాన సాధనలోని రకాల వర్గీకరణను తెలుపు పట్టిక</u>

| | | | | | |
|---|---|---|---|---|---|
| A | సాధకునిగా మారకముందు చేసే పలురకాల ధ్యాన సాధనలు | | | | |
| B | సాధకుని ధ్యానంలోని రకాలు | i | సాధారణ ధ్యానం లేక పరమసత్యాన్ని గ్రహించడం | 1. | తత్వ ఆలోచన చేయటం. |
| | | | | 2. | గురువు ఉపన్యాసాన్ని వినటం |
| | | | | 3. | గురువులు వ్రాసిన వివరణలను చదవటం |
| | | ii | ప్రత్యేక ధ్యానం అనుభవ అంశము ఎంపిక చేసుకోబడును | 1. | అనుభవ క్రియలను గురించిన ధ్యానం |
| | | | | 2. | అనుభవ కర్తను గురించిన ధ్యానం |
| | | | | 3. | మానసిక చర్యలను గురించిన ధ్యానం |
| C | 'సహజ సమాధి' లేక ఆధ్యాత్మికంగా సంపూర్ణులైన వారి ధ్యానం | | | 1. | **'నిర్వాన' లేక 'లీనత్వం'** |
| | | | | 2. | **నిర్వికల్ప స్థితి (లేక) దైవ వ్యక్తీకరణ** |

*- మెహర్‌బాబా - ఉపదేశాలు - సంపుటము 2, 135వ పేజీ*

గమనిస్తే, మెహర్‌బాబా గారి - 'నిర్వాన' లేక 'లీనత్వం' - జేమ్స్ ఆస్టిన్‌గారి వర్గీకరణలోని - 'అసాధారణ మనోస్థితి : లీనత్వం - ఇంద్రీయ గ్రహణ శక్తి ఉండనిది - అంతర్లీనత్వం' అనియు, మెహర్‌బాబా గారి 'నిర్వికల్ప' - జేమ్స్ ఆస్టిన్ గారి వర్గీకరణలోని - 'అత్యంత అసాధారణ మనోస్థితి: వర్ణింపలేని పరమసత్య మనోస్థితి' అని తెలుస్తుంది.

## మార్మిక అనుభవం - 'లీనత్వం (ఇంద్రియ గ్రహణ శక్తి ఉండనిది) - అంతర్లీనత్వం'

## మెహర్‌బాబా గారి - 'నిర్వాన' లేక 'లీనత్వం'

లీనత్వం (సూఫీల 'ఫనా', హిందువుల 'సమాధి') ధ్యాన మార్గంలోని ఒక ఉత్కృష్ట మనోస్థితి. సంస్కృత పదమైన 'సమాధి' అర్థం - 'ఒక దగ్గరకు తేబడిన' లేక 'ఐక్యం చేయబడిన' అని. ఈ స్థితిలో స్పృహ (Awareness) - ధ్యాస నిలపబడిన లక్ష్యం వైపునకు మరలి, దానితో కలిసిపోయి, దానితో సమానం అయి, చివరకు లీనమైపోతుంది.

ఇక్కడ 'లక్ష్యం' అనే పదాన్ని గమనించండి. ఇది సాధకుడు దేనిమీద మనసు లగ్నం చేస్తున్నాడనేది తెలియజేస్తుంది. ఇది బాహ్యమైనది కావచ్చు లేదా అంతర్గతమైనది కావచ్చు. మనసులో ఊహించుకుంటున్న దాని మీద మనసును లగ్నం చేస్తే ఇది అంతర్గతమౌతుంది. బాహ్యమైనది అంటే - ఒక బాహ్య వస్తువుమీద మనసు లగ్నం చేయడం - ఉదాహరణకు అది ఒక కొవ్వొత్తి, నీటిపాత్ర మొదలైనదేదైనా కావచ్చు. సాధకుడు దానిలో లీనత్వాన్ని అనుభవిస్తాడు.

మెహర్‌బాబాగారు ఉపదేశించారు:

"మనసును ధ్యానించుచున్న ఒక వస్తువుపై సరిగా లగ్నం చేస్తే, అది సత్యంతో కలిసిపోయి, సహజసమాధిని లేక అడ్డంకులులేని 'స్వ' జ్ఞాన మహదానంద స్థితిని గానీ పొంది, సాధకుడు తన 'స్వ' భావనను కోల్పోయి తను ప్రతీదానిలోనూ ఉన్న దేవునితో సమానమని తెలుసుకుంటాడు".

*- మెహర్‌బాబా - ఉపదేశాలు - సంపుటము 2 - 172వ పేజి.*

"పనిచేస్తున్న మనసుతో ఈ స్థితిని పొందలేము. దైవస్థితి అనునది - మనసుకు ఆవల ఉండును. పరిమిత మనసు మాయమై, అనంతమైన దానిలో ఐక్యం కాగానే ఈ స్థితి ఉదయిస్తుంది"

*- మెహర్‌బాబా - ఉపదేశాలు - సంపుటము 2 - 176వ పేజి.*

"ఈ దైవానుభవ స్థితి - అనంతమైనది - పరిమితి (Limit) లేని అవగాహన, స్వచ్ఛత, ప్రేమ, ఆనందాలమయమై ఉండునది"

*- మెహర్‌బాబా - ఉపదేశాలు - సంపుటము 2 - 177వ పేజి.*

మెహర్‌బాబాగారు ముఖ్యంగా గురువు యొక్క అనేక అంశాల మీద ధ్యానించడమే కాక, రూపంలేని అనంతమైన దేవుడి మీద ధ్యానం చేయమని బోధించారు. మెహర్‌బాబా గారి 'ఉపదేశాలు'- సంపుటము 2, 150వ పేజీలో ఇవ్వబడిన పట్టిక చూస్తే ఈ విషయం అర్థం అవుతుంది.

***నాడీ మండల శాస్త్రవేత్త మరియు జెన్ సాధకుడు జేమ్స్ ఆస్టిన్ వివరణ (సొంత అనుభవాల ఆధారంగా):***

“7వ స్థితి (అంతర్లీనత్వం) మన చైతన్యంలో ఒక గొప్ప మార్పును తీసుకువస్తుంది. దాని ఫలితాన్ని ‘లీనత్వం’ అంటారు. ఇది అత్యంత స్పష్టమైన, గాఢమైన, అప్రయత్న చైతన్యంతో నిండి ఉంటుంది. కొన్ని రకాల భ్రమలు (మనం ఇంతకు ముందెన్నడో చూసిన దృశ్యాలు) ఎదురవ్వవచ్చు, కానీ మెదడు వాటిని అతి త్వరగా ప్రక్కన పెట్టేస్తుంది. ఇప్పుడు దృశ్య శ్రవణ మరియు శారీరక అనుభూతులు నిలచిపోతాయి. ‘స్వ’ భావన, ‘కాల-ప్రాంత’ భావనలు అంతమయిపోతాయి. అప్పుడు అనుభవంలోకి వచ్చేది - ఒక అధ్భుతమైన, అనంతమైన - శూన్యం.

**ఈ స్థితి యొక్క లక్షణాలు:-**

| | | |
|---|---|---|
| స్పృహాలక్షణం | : | అంతర్గత |
| దేనిగురించిన స్పృహ | : | స్పృహ గురించే, అనంతమైన,దట్టమైన నల్లని శూన్యం. |
| స్పృహ తీవ్రత | : | 4-5 |
| ‘స్వ’ భావ తీవ్రత | : | 0 |
| ‘కాల - ప్రాంత’ భావ తీవ్రత | : | 0 |
| ఇంద్రియ జ్ఞాన తీవ్రత | : | 0 |
| సత్ఫలితాలు | : | ముగ్ధమైన, ఆనంద పారవశ్యత, బయటకు రాగానే ఒక పవిత్ర భావన |
| పరిణామాలు | : | తేలిక అయిన భావన, ప్రశాంతత, మర్చిపోలేని మధురమైన భావన. |

(విలువలు : 0 = కనిష్ఠం, 5 = గరిష్ఠం)

ఈ స్థితి - మనసు లగ్నం చేసే ధ్యాన సాధన యొక్క సాధారణ పరిణామం.

ఇంద్రియ జ్ఞాన రాహిత్య భావన ప్రస్ఫుటం మరియు దాని తీవ్రత, వ్యవధి మరియు నాణ్యతలు ఒకరి నుంచి మరొకరికి మారవచ్చు.”[10]

**ఇప్పుడు, మెహర్ బాబాగారు, జేమ్స్ ఆస్టిన్‌లు వర్ణించిన మనోస్థితి ఒక్కటే అని అర్థం చేసుకోడానికి మీరు ధ్యాన సాధనలో గురువులు కావలసిన అవసరం లేదు. వర్ణించే తీరు వేరైనా అదే కథ - అదే అనుభవం.**

ఇలా ఒక చోట కూర్చుని చేసే ధ్యాన సాధనలోనే కాక, కదలికలో కూడా ‘లీనత్వ’ భావన పొందవచ్చు. జెన్ బుద్ధిజంలో ఇలా కూర్చునే కాక నడుస్తూ కూడా ధ్యానసాధన చేయడం జరుగుతుంది. ఈ రెండు విధానాలలోనూ ఒకే రకమయిన లీనత్వ భావన జనిస్తుంది.

ఇప్పుడు ఇవ్వబడుతున్న వివరణలో, ఒక బౌద్ధ సన్యాసి కూర్చుని తన కోయన్ మీద మనసులగ్నం చేస్తున్నాడనుకోండి. కోయన్ అంటే అర్థం లేని ఒక పదం అని ఇంతకు ముందే వివరించడం జరిగింది. ఇలాంటివి చాలా పదాలున్నాయి. ఉదాహరణకు ఈ సన్యాసి 'మ్యు' అనే పదం మీద మనసు లగ్నం చేస్తున్నాడనుకోండి. అంటే ఇక్కడ లక్ష్యం 'మ్యు' అన్నమాట.

**అతనికి మార్మిక అనుభవం ఈ క్రింది విధంగా సంభవిస్తుంది:**[11]

1. **గరిష్ఠ ప్రేరణ:** AAA మనసును లగ్నం చేసే విధిని నిర్వహిస్తుందని ఇంతకు ముందు నేర్చుకున్నాం. ఇక్కడ ఇది జరిగే క్రమంలో, దృశ్యనియంత్రణ భాగం (Visual Association Area) మరియు కుడి OAA లలో ఈ లక్ష్మ పదమైన 'మ్యు' స్థిరంగా చిత్రీకరించబడుతుంది. కుడి AAA నుంచి సంకేతాలు లింబిక్ వ్యవస్థ ద్వారా హైపోథాలమస్‌ను ప్రేరేపించి, ప్రేరణ వ్యవస్థను ఉత్తేజితం చేస్తాయి. ఈ లగ్నం చేసే స్థితి గాఢంగా మారినపుడు (ఎంతో ధ్యాన సాధన తరవాతే ఇది సంభవం), ఈ ప్రేరణ గరిష్ట స్థాయిని చేరుకుంటుంది.

2. **విశ్రాంత వ్యవస్థ ప్రేరణ:** ఇలా ప్రేరణ వ్యవస్థ గరిష్ఠ స్థాయికి చేరినపుడు - హైపోథాలమస్ యొక్క 'విశ్రాంత వ్యవస్థ' ప్రేరేపితమౌతుంది. ఇంతకు ముందు వివరించినట్టు దీనిని 'స్పిల్ - ఓవర్' అంటారు.

3. **గరిష్ఠ లగ్న స్థాయి:** ఇలా విశ్రాంత, ప్రేరణ వ్యవస్థలు ఒకే సారి పనిచేస్తూ, లింబిక్ వ్యవస్థ ద్వారా AAA ను మరింతగా ఉత్తేజ పరుస్తాయి. AAA లో కార్యకలాపాలు గరిష్ఠ స్థాయికి చేరి, దాని లక్ష్యం మీదున్న లగ్న స్థాయిని గరిష్ఠం చేస్తాయి.

4. **లీనత్వం:** హిప్పోకాంపస్ ప్రతిచర్య కారణంగా ఎడమ OAA కు ఇంద్రియ సమాచార సరఫరా నిలచిపోవడంతో 'స్వ' భావన అంతమైపోతుంది. ఎందుకంటే, ఎడమ OAA ఇంద్రియ సమాచారం ఆధారంగా ఈ 'స్వ' భావనను మరియు 'కాల' భావనను జనింపచేసే విధులను నిర్వహిస్తుంది.

కానీ కుడి OAA లో పరిస్థితి భిన్నంగా ఉంది. ఇది 'ప్రాంత' భావనను జనింపచేస్తుందని మనం తెలుసుకున్నాం. దీనిలో ప్రస్తుతం లక్ష్యపదమైన 'మ్యు' స్థిరంగా చిత్రీకరించబడి ఉండడం వలన, మిగిలిన సమాచారమంతా నిర్బంధించబడి, కేవలం 'మ్యు' చిత్ర సమాచారాన్నే అది అందుకుంటూ ఉంది. దీని వలన ఈ లక్ష్య పదం విస్తరించబడి అనంతమైపోయిన భావన జనిస్తుంది. 'అంతా ఇదే' (ఈ 'మ్యు' నే) ఇదే పరమ సత్యం (Ultimate Reality) - 'ఇది తప్ప ఇంకేమీ లేదు' - అనే భావన గాఢంగా జనిస్తుంది.

ఇప్పుడు మొత్తం మీద పరిస్థితి ఇలా ఉంది: స్వభావన, కాలభావనలు అంతమైపోయాయి (ఎడమ OAA లో సంభవించిన మార్పుల వలన). లక్ష్యపదం - పరమసత్యంగా మారిపోయింది (కుడి OAAతో పరిస్థితి వలన). స్వభావన పూర్తిగా అంతం కాగానే, పరమసత్యంలోకి కలిసిపోతున్న, లీనమైపోతున్న అనుభవం కలుగుతుంది. దీనినే Unio Mystica - మార్మిక ఐక్య భావన అని కూడా అంటారు.

మన వివరణలోని బౌద్ధ సన్యాసి ' మ్యు' లోకి పూర్తిగా లీనమైపోతూ, చివరకూ తను 'మ్యు' అయిపోయిన అనుభవాన్ని పొందుతాడు. ఇది 'మ్యు' మీద మనసు లగ్నం చేసే బౌద్ధ సన్యాసుల సాధారణ అనుభవం. D.T. సుజుకి తన ఈ అనుభవాన్ని ఇలా వివరించారు: అప్పటికి నేను 'మ్యు గురించిన చైతన్యం' అనే పదం ద్వారా ఉత్పన్నమయ్యే ప్రతీ కృత్రిమ వేరుతనాన్ని (అంటే 'మ్యు' వేరు, నా 'చైతన్యం' వేరు అనే భావనను) కోల్పోయాను. నేను 'మ్యు లో ఉన్నాను.' నా కోయన్ (మ్యు) లోకి లీనమై దానితో సమానమైపోయాను.[12]

మనసును లగ్నం చేస్తున్న ఈ లక్ష్యం సూఫీ యొక్క 'అల్లా' దర్శనమైతే, ఈ అనుభవం 'ఫనా-ఫీ-అల్లా', గా పరిణమిస్తుంది, యోగి యొక్క 'బ్రహ్మ' అయితే ఈ అనుభవం 'సమాధి'గా పరిణమిస్తుంది. జెన్ బుద్ధిజంలో దేవుడి భావనే లేదు (అందుకనేనేమో అర్థం లేని పదాలమీద, నీటి పాత్రల మీద మనసు లగ్నం చేయబడుతుంది). ఈ సాంప్రదాయంలో ఈ లీనత్వ అనుభవాన్ని 'సెకీడా' అంటారు. బుద్ధుల 'నిర్వాన' అంటే ఇది కాదు. నిర్వాన అనేది ధ్యాన సాధన మార్గంలో ఇంకా తరువాత కలిగే అనుభవం.

**ఇదీ - మార్మికవాద అనుభవమైన 'లీనత్వం' వెనుక మర్మం. ఇక్కడొక చాలా ముఖ్యమైన విషయాన్ని గమనించండి: మార్మికవాదికి తన లక్ష్యంలో లీనమైపోయిన ఎంతో బలమైన భావన కలిగింది. ఏ వివరణ ఇచ్చినా, అది జరగలేదని అతడు నమ్మలేడు. కానీ నిజం ఏమిటంటే 'మ్యు' లోకి అతను కరిగిపోలేదూ, దానితో సమానమైపోలేదు (మ్యు అయిపోలేదు) - ఎక్కడున్నాడో అక్కడే ఉన్నాడు. 'కాల' భావనను కోల్పోయాడు కానీ, కాలం అతని కోసం ఆగిపోలేదు. 'మ్యు' మీద కాక 'నీటి పాత్ర' మీద మనసు లగ్నం చేశాడనుకొందాం. ఇదే వివరణ వర్తిస్తుంది. అతను నీటి పాత్ర అయిపోలేదు. దానిలో లీనము అయిపోలేదు. నీటి పాత్ర - పరమసత్యమూ కాదు (అలాగని అతనికి బలంగా అనిపించినా సరే). ఇదే వివరణ ఏ లక్ష్యానికైనా వర్తిస్తుంది. జరుగుతున్నదేమీ లేదు - మెదడులో కలిగిన మార్పుల వలన పొందుతున్న అనుభవం తప్ప.**

ఇంకా ఈ అనుభవ క్రమంలో సంభవించే వింత పరిణామాలు: శ్వాసక్రియ మందగించిపోవచ్చు లేదా పూర్తిగా నిలచిపోనూ వచ్చు. ఇది మెదడులోని - శ్వాస నియంత్రణ ప్రక్రియను నిర్వహించే 'మెడుల్లా'కు సంకేతాలు నిరోధింపబడటం వలన జరుగుతుంది. పరమానంద - ప్రశాంత సంబంధ భావనలు మెదడు మధ్య భాగంలోకి కొన్ని పెప్టైడులు ఉత్పన్నం కావడం మూలంగా జరుగుతుంది అని కనుగొనబడింది.[13]

## జేమ్స్ ఆస్టిన్ ఈ అనుభవాన్ని ఇంకా వివరంగా, ఈ క్రింది చిత్రాల ద్వారా వర్ణించారు




***సాధారణ మనోస్థితి***




***అసాధారణ – లీనత్వ మనోస్థితి*** *

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

*ఈ స్థితిలో 'స్వ' పరిమితులు ఉండవు. చుక్కల వృత్తాలు - 'స్వ' భావన యొక్క పూర్వ పరిమితులు తెలియజేస్తున్నాయంతే.
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

## మార్మిక అనుభవం - 'పరమ సత్యం, వర్ణింపలేని భావన - సంపూర్ణ ఐక్యస్థితి'

మార్మికవాది 'లీనత్వం' నుంచి లేక 'సమాధి' నుంచి బయటపడుతున్నపుడు, ఏదైనా ప్రేరకం తరువాతి మనోస్థితులలో ఒకదానిని జనింపచేయవచ్చు. D.T. సుజుకి అనుభంలో, సమాధి (సెకీడా) నుంచి ఒక గుడి గంట ఆయనను బయటకు తేగానే, ఆయనకు అత్యంత అసాధారణ మనోస్థితి అయిన 'సతోరి' కలిగింది. కానీ ఈ స్థితి అనేక లీనత్వ అనుభవాల తరువాత, కొన్ని నెలలు, సంవత్సరాల అనంతరం కూడా రావచ్చు.

'లక్ష్యం' మీద లగ్న స్థాయి మందగించగానే, కుడి OAA కు అందుతున్న ఏకైక లక్ష్య సంబంధిత సమాచారం కూడా ఆగిపోతుంది. అంటే ఇప్పుడు కుడి, ఎడమ OAAలు రెండూ కూడా పూర్తిగా సమాచార సంకేతాలు అందకుండా ఉన్నాయి. ఇదే పరిస్థితి, ఒకవేళ మార్మికవాది - దేని మీదా మనసు లగ్నం చేయకుండా ధ్యాన సాధన చేసినా ఏర్పడుతుంది. దీనిని Passive Mediation అంటారు.

ఇంతకు ముందు మనం చూసినట్టు, కుడి OAA - 'ప్రాంత' భావనను జనింపచేస్తుంది. దానికి సంకేతాలు ఏమీ అందనప్పుడు అది ఒక ప్రాంత రహిత భావనగా మారిపోతుంది. తద్వారా మార్మికవాదికి కలిగే అనుభవం - అనంతమైన, కాలాతీత మయిన భావన. 'స్వ' భావన కూడా అంతమై పోవడంతో (ఎడమ OAA) మార్మికవాది తను అనంతమైన వాడినని, పరిమితులు లేనివాడిననీ, మరియు ప్రతీదానిలో - ప్రతీదానితో ఉన్నాననే అనుభవాన్ని పొందుతాడు.

ఈ స్థితిలో 'స్వ'భావన లేకపోవడంతో ద్వైతభావన - నిర్దిష్టమైన (వేరే) వస్తువులు అనే భావన ఉండదు. అంతా ఒకటిలా అనిపిస్తుంది. కాలగమనజ్ఞానం కోల్పోబడడంతో - కాలాతీత భావన జనిస్తుంది. అంతా ఒకటే - ఆలోచనలు గానీ, పదాలు గానీ ఏమీ లేని ఐక్యత. స్వచ్ఛమైన, పరిమిత భావన లేని (అనంతమయిన) చైతన్యం (Consciousness) మాత్రమే మిగిలి ఉంటుంది.

ఈ స్థితిని సంపూర్ణ ఐక్యస్థితి (Absolute Unitary Being) అంటారు. ఇదే గరిష్ఠ స్థాయి ఐక్యస్థితి. ఈ స్థితిలో కర్త-క్రియలలో, కర్త మాయమైపోయి క్రియమాత్రమే మిగులుతుంది. అనుభవించేది ఏదీ ఉండదు. అనుభవం మాత్రమే మిగులుతుంది. ఏ విధమైన తారతమ్యాలు గానీ, అసమానతలు గానీ ఉండవు. ఇదీ లేదు, అదీ లేదు - మార్మికవాదులన్నట్టు. కేవలం సంపూర్ణ ఐక్యత మాత్రమే మిగిలి ఇదే పరమ సత్యంలా తోస్తుంది - 'ఉన్నదంతా ఇదే - ఇది తప్ప ఇంకా ఏమీ లేదు' అనిపిస్తుంది. **గమనించవలసింది ఏమిటంటే, 'లీనత్వం' లో లక్ష్యమే పరమ సత్యంలా తోచినట్టు, ఈ స్థితిలో - లక్ష్యం ఏమీ లేకపోవటం వలన, మిగిలి ఉన్న ఆ చైతన్యమే పరమ సత్యంలా అనిపిస్తుంది. నీటిపాత్ర, మ్యూ వగైరాలు ఎలా పరమ సత్యం కావో, ఇది కూడా పరమ సత్యం కాజాలదు. ఒక్క మాటలో చెప్పాలంటే - నూతిలోని కప్పలు అదే ప్రపంచం అనుకోవటం లాంటిది ఈ మనోస్థితిలోని పరిస్థితి.**

## "నేను దేవుణ్ణి" - మాటల వెనుక రహస్యం

మార్మికవాదం గురించిన పరిచయ అధ్యాయం(2)లో వివరించినట్టు, మార్మిక వాదుల రచనలు, ఉపదేశాలను పోల్చి చూస్తే - మార్మిక వాదులందరూ - వారు ఏ సాంప్రదాయానికి చెందినవారైనా (సూఫీ, హిందూ, జొరాష్ట్రియన్, క్రిష్టియన్, యూద లేక బౌద్ధ) - అంతా ఒకే రకమైన మార్మిక అనుభవాలను పొందారు అనేది స్పష్టంగా తెలిసే విషయం. ఎందుకంటే - మానవులందరి మెదడులు - ఒకే రకమయిన నిర్మాణాన్ని కలిగి ఉన్నాయి మరియు అవి వాటి మీద ప్రభావం చూపే సాధనలకు - ఒకే రకంగా ప్రతిస్పందిస్తాయి. అందరి మెదడులు - అసాధారణ మనోస్థితుల ద్వారా మార్మిక అనుభవాలను జనింపజేసే సామర్థ్యాన్ని కలిగి ఉన్నాయి. మార్మికవాదులు ఈ మనోస్థితుల అన్వేషణలో ఉంటే, మిగిలిన వారు సాధారణ మనోస్థితిలోనే జీవితాన్ని గడుపుతారు. కానీ, సాధన చేస్తే ఎవరైనా ఈ అనుభవాలను పొందవచ్చు. ధ్యానం ఒక రకమయిన సాధన. ఇదొక్కటే కాక ఇంకా కొన్ని విధానాల ద్వారా కూడా మార్మిక అనుభవాలను పొందవచ్చు. ఉదాహరణకు కొన్ని సూఫీ వర్గాలకు చెందిన మార్మికవాదులు - వేగభరితమైన శరీర కదలికలతో కూడిన నృత్యాలు, మంత్రాల ఉచ్ఛరణ ద్వారా కూడా ఈ స్థితులలోకి జారుకోగలరు. ఈ చర్యలు కూడా ఆ ఐక్యస్థితులను కలిగిస్తాయి. ఇవి కాకుండా అనేక మందులు (మత్తు మందులు) కూడా ఈ మనోస్థితులను కలిగించగలవు. వీటి వలన కొన్ని అపాయాలు ఉన్నా, ఇవి కూడా ఆ ఐక్యస్థితులనే కలగజేయడం గమనించదగిన విషయం. మత్తుమందుల వలన కలిగే మార్మిక అనుభవాల గురించి తర్వాత వివరించడం జరిగింది.

ఇంతవరకు మనం గమనించినది ఏమిటంటే, మార్మిక అనుభవాలు మెదడులోని కొన్ని ప్రత్యేక మనోస్థితుల వలన కలుగుతున్నాయి. నిరంతర ధ్యాన సాధన ద్వారా వీటిని పొందవచ్చు. ఈ మనోస్థితులు మన మామూలు మనోస్థితుల కంటే ఎంతో వైవిధ్యమయినవి. మెదడులో - 'స్వ' ('నేను', 'నా' అనే) భావనను, 'కాల-ప్రాంత' భావనలను జనింపచేసే లేక నియంత్రించే కొన్ని భాగాలకు అవసరమయిన జ్ఞానేంద్రియ సమాచార సరఫరా నిలిపివేయబడడం వలన - ఈ భావనల ఉత్పత్తి నిలచిపోతుంది. ఈ భావనల ఆధారంగా లేక వీటి చుట్టూనే మన సాధారణ చైతన్యం నిరంతరం పనిచేస్తూ ఉంటుంది. అలాంటి ఎంతో ముఖ్యమైన ఈ భావనలు అంతమవడం వలన - ఒక స్వచ్ఛమైన, అనంతమయిన (పరిమితులు లేని), కాల - ప్రాంతాతీత చైతన్య భావన జనిస్తుంది. మనసును లగ్నం చేసే లక్ష్య వస్తువును బట్టి, అందులోకి గాఢమైన 'లీనత్వ' అనుభవం సంభవిస్తుంది. ఈ స్థితులలోని తర్వాతి దశలలో ఆత్యంత అసాధరణమైన 'సంపూర్ణ ఐక్యస్థితి' ఉంటుంది. ఈ స్థితిని అనుభవించిన మార్మికవాది - తాను అనంతమైన వాడినని, అన్నీ ఒక దానిలో ఒకటి కలసి ఉన్నాయనీ, అంతా ఒకటేననిపించే బలమైన భావనను పొందుతాడు.

ఈ అనుభవం ఎంత నిజంగా అనిపిస్తుందంటే - అతనికి ఎవరూ కూడా, తనకు తాను కూడా - తను పొందిన ఈ భావనలు నిజమైనవి కావు అని నమ్మించలేరు. ఇది ఎందుకంటే, నిజజీవితంలో ఇతర నిజ అనుభవాలను విశ్లేషించే మెదడులోని భాగాలే, ఈ మార్మిక అనుభవంలో కూడా ఉపయోగించబడుతున్నాయి. అవే భాగాలు - కానీ ఓ కొత్త శైలిలో పని చేస్తున్నాయి - కొన్ని భాగాలకు పనిచేయడానికి కావలసిన సమాచారం నిలిపివేయబడడం ద్వారా . ఇది నిజజీవిత అనుభవాల విషయంలో జరగదు. అంతే !

ఉదాహరణకు, మీరొక కలలో మీ మిత్రునికెవరికైనా మూడు తలలు ఉన్నట్టు చూసి, అతనికి మీ ఈ కలగురించి చెప్పారనుకోండి. ఆ మిత్రుడు మీతో ‘‘నువ్వా కలచూడలేదు, మాయమాటలు చెబుతున్నావంతే’’ అంటే మీకెలా అనిపిస్తుంది ? మీరంటారు - ‘‘లేదు, నేను నిజంగా ఆ కలను చూశాను. నేను నీకు మూడు తలలు ఉన్నాయనడం లేదు, ఉన్నట్టు కలలో చూశానంటున్నానంతే. ఆ దృశ్యం నాకింకా గుర్తుంది. ఇప్పటికీ నేనా దృశ్యాన్ని మననం చేసుకోగలను’’. మీరు చెప్పేది నిజం ఎందుకంటే - కలలోని ఆ సమాచారం కూడా మెదడులో విశ్లేషించబడింది. నిజ జీవిత అనుభవాలను విశ్లేషించే అదే మెదడులో.

మీరు మీ మిత్రునికి నిజంగా మూడు తలలున్నట్లు కల ద్వారా చూడడం వలన, మీరు మేల్కొనే సరికి రెండు కొత్త తలలు అతని శరీరం మీద రావు కదా? అలాగే మార్మికవాదుల మార్మిక అనుభవాలు వారికవి ఎంత యధార్థాలుగా అనిపించినప్పటికీ, నిజాలు కావలసిన అవసరం లేదు. కలల నిద్ర, మార్మిక అనుభవాలలో తేడాలున్నప్పటికీ, ఇవన్నీ కూడా మన మాములు మెళుకువస్థితికి భిన్నమైన మనోస్థితులనేది మనం మనోస్థితుల వర్గీకరణలో చూశాం.

**స్వచ్ఛమైన, అనంతమైన చైతన్యంతో, ‘స్వ’ - ‘కాల’- ‘ప్రాంత’ రహిత భావనలతో కూడి యుండిన ఆ మనోస్థితి మార్మికవాదికి ఇదే పరమసత్యము (ఉన్నదంతా ఇదే, ఇది తప్ప ఇంకేమీ లేదు) అనే బలమైన భావనను కలుగజేస్తుంది. దేవునిలో విశ్వాసం ఉంచే మార్మిక సాంప్రదాయాలు దీనిని దేవునిలా భావిస్తే, దేవునిపై విశ్వాసం లేని మార్మిక సాంప్రదాయాలు దీనిని శూన్యంలా వర్ణిస్తాయి.**

**మరియు ఈ అత్యంత అసాధారణమైన స్థితిని వీక్షించిన మార్మికవాది ఆ అనుభవాన్ని “నేను దేవుణ్ణి” అంటూ వ్యక్తం చేస్తాడు. మార్మికవాదులకు ఈ మానసిక స్థితే దేవుడు, ఈ దైవ భావనే పరమసత్యం .... అంతా ఇదే.... అంతా దేవుడే.... ఇది తప్పా ఇంకేమీ లేదు. అందుకని వారు తమని తాము దేవుళ్ళుగా, దేవుని అవతారాలుగా చెప్పుకోడానికి ఏ మాత్రం సంశయించరు.**

మార్మిక అనుభవాల వెనుక గల ఈ రహస్యాన్ని, యదార్థాన్ని తెలుసుకొన్న తర్వాత - మార్మిక అనుభవాలయిన ఈ మనోస్థితులకు ఆధ్యాత్మిక భావనను జతచేయడం ద్వారా జరిగిన మార్మిక వాదుల వ్యక్తీకరణ, ప్రకటనలు మనకిప్పుడు సులభంగా అర్థమౌతాయి.

## మార్మిక అనుభవాలు మరియు సాయిబాబా గారి వ్యక్తీకరణ

1886వ సంవత్సరంలో ఒకరోజు, సాయిబాబా గారు మహల్సపతితో 'నేను అల్లా దగ్గరకు వెళ్తున్నాను, నా శరీరాన్ని సంరక్షించు' అని చెప్పి, ధ్యాన ముద్రలోకి పోయి, చలనం కోల్పోయారు. సాయిబాబా గారు అప్పుడు మార్మిక అనుభవం పొందారు అనడంలో సందేహం లేదు. ఆయన సూఫీ సాంప్రదాయానికి చెందిన మార్మికవాది మరియు ఆయన 'లక్ష్యం' అల్లా కాబట్టి - ఆయన "ఫనా- ఫీ- అల్లా" అనుభవాన్ని పొంది ఉంటారు. సాధారణ మనోస్థితికి వచ్చిన అనంతరం ఆయన నానా చందోర్కర్ తో ఇలా అన్నారు.

"ఆ స్థితిలో, దేవుడు మనిషితో సమానం అయిపోతాడు. కీర్తి-అపఖ్యాతి (నింద)తో సమానమయినట్లు, కోరికలేమీ మిగలవు. (సిద్ధులు అనబడే) ఆ సంపూర్ణులకు - ఈ శరీరం తమ నివాసమని, ఆత్మ ('స్వ') అనే భావన వీడిపోతుంది. వాళ్లు తమ అస్తిత్వం దేవునితో సమానమని భావిస్తారు. 'నేను బ్రహ్మను' అనేది వీరి భావన."[14]

ఈ అనుభవాల పరంపరే, సాయి బాబా గారి ఈ దిగువ వ్యక్తీకరణను కూడా వివరిస్తాయి.

"దేవుడు ప్రతీ చోటా ఉన్నాడు. ఆయన లేని ప్రదేశం అంటూ లేదు. కానీ మాయ ప్రభావం వలన ఆయనను ప్రతీదానిలో చూడలేము. నేను, నీవు మరియు ప్రపంచం అంతా అంశాలే (అంటే దేవునిలో భాగాలే)."[15]

"నేను పర్వర్దిగార్ (దేవుడి)ని. నేను షిర్డీలో మరియు అంతటా ఉన్నాను. నా వయస్సు లక్షల సంవత్సరాలు. నా పని దీవెనలివ్వడం. అన్నీ నావే, నేనందరికీ అన్నీ ఇస్తాను."[16]

"నాకు రూపంలేదు. అంతటా వ్యాపించి ఉన్నాను. ప్రతీ దాంట్లో ఉన్నాను. అంతా నాతో నిండి ఉంది. మీరు చూసేవన్నీ కలిపి నేను. నేను నిశ్చలుడని".[17]

"మీరు చూస్తున్న దంతా నా రూపమే - చీమ, దోమ, యువరాజు, భిక్షాటకుడు."[18]

"నేను నీళ్ళలో ఉన్నాను. పొడి ప్రదేశాల్లో ఉన్నాను. చెట్లలో, జన సముహాల్లో , ఎడారుల్లో ఉన్నాను. నేనొక ప్రదేశానికి 'పరిమిత' మైనవాడను కాను."[19]

తనకివ్వబడిన ఆహారాన్ని ఒక కుక్కముందుంచుతూ:

"ఇదికూడా జీవమే కదా? మనం మాట్లాడతాం - ఇది మాట్లాడదు. ఇది ఆకలితో ఉంది. ఇదీ, నేనూ ఒకటే మరియు సమానం. నేను తిన్నా, ఇది తిన్నా ఒకటే."[20]

# మార్మిక అనుభవాలు మరియు మెహర్‌బాబా గారి వ్యక్తీకరణ

మార్మిక అనుభవాల అనంతరం మెహర్‌బాబా తన ఉన్నతులలో అత్యున్నతుడిని (Highest of the High) ప్రకటన చేస్తూ:

" ........... చివరకు, మనిషి తాను చైతన్యంతో - అనంతమైన వాడినని, కాలాతీతుడినని మరియు విభజింపశక్యం కాని (ఐక్యుడి ననే) అనుభవాన్ని పొందగానే, అతను తన అస్తిత్వం దేవునితో సమానమైనదని గుర్తించి, అనంతమైన జ్ఞానం, అనంతమైన శక్తి, అనంతమైన ఆనందం పొందుతాడు. ఇలా 'మానవుడు' దేవుడైపోతాడు. ఒక సంపూర్ణ గురువు - 'సద్గురు' లేక 'ఖుతుబ్' గా గుర్తించబడతాడు. ఇతడిని పూజిస్తే, దేవుడిని పూజించినట్టే".

మెహర్ బాబా గారి 'ఉపదేశాలు', పుస్తకాలు అన్నీ ఈ మనోస్థితుల వివరణలతోనే నిండి ఉన్నాయి:

"వ్యక్తిత్వం అనేది అపరిమితమైపోతుంది. మాయవలన ఉద్భవించిన వేరైన భావనకు దూరమై, దాని నుంచి బయటపడి, స్వచ్ఛమైన చైతన్యాన్ని, ఆనందాలు కల విముక్త స్థితిని అనుభవిస్తుంది. అలాంటి వ్యక్తికి ఎలాంటి భ్రమలు ఉండవు. ఒక రకంగా అతను చనిపోయాడు. అతని స్వభావన (అహంకారం) నాశనం చేయబడింది. ఇంకోరకంగా చూస్తే బ్రతికే ఉన్నాడు. ఎల్లప్పటికీ - కాల రహిత పరమానంద స్థితిలో. అతను అనంతమైన శక్తి, జ్ఞానం. ఈ సమస్త విశ్వం అతనికి మానవజాతిని సంపూర్ణం చేయడమనే ఆధ్యాత్మిక కార్యాన్ని నెరవేర్చేందుకు ఒక పరిధి లాంటిది".

*- మెహర్ బాబా - ఉపదేశాలు - సంపుటము 1, 43-44 పేజీలు.*

**గుర్తించవలసింది ఏమిటంటే, ఈ అహంకారం - Ego - 'స్వ' భావన అనేది కేవలం మార్మిక అనుభవమప్పుడు మాత్రమే కోల్పోబడింది. OAA కు జ్ఞానేంద్రియ సమాచారం నిలచిపోవటం వలన. మార్మిక అనుభవం నుండి బయట పడగానే - అంటే OAA కు జ్ఞానేంద్రియ సమాచార సరఫరా తిరిగి ప్రారంభం కాగానే, 'స్వ' భావన లేదా అహంకారం యధాతదంగా పునరుద్ధరింపబడింది. ఈ 'స్వ' భావన అనేది మన ప్రతీ పని, అనుభవంలో అవసరం అయినది, ఇది కనుక తిరిగి రాక పోతే ఆ వ్యక్తి మానసిక అసంతుల్యానికి గురికాక తప్పదు.**

## వివేకానంద గారు చెప్పినట్లు, ఇవే అనుభవాలు - యోగసాధనల యొక్క లక్ష్యాలు

"మనకు ఒక ఉన్నత స్థితి ఉంది. ఒక అసాధారణ మనోస్థితి, ఆ స్థితికి చేరినప్పుడు, ఈ వివరింపలేని జ్ఞానం వస్తుంది. యెగసాధనల ద్వారా మన లక్ష్యం 'సమాధి'ని పొందటమే. ఈ మనోస్థితిలో 'స్వ'భావన ఉండదు. అయినా మనసు పనిచేస్తూనే ఉంటుంది - అలసట లేకుండా, శరీర ధ్యాస లేకుండా. అపుడు పరమసత్యం బోధపడుతుంది - మనమంతా అనంతమైన వారమనీ, కాల - ప్రాంతాతీతుల మనీ, విముక్తులమనీ, మరియు మంచి, చెడు అన్నీ ఒకటయి - ఆ పరమాత్మతో సమానమని."[21]

యోగసాధనలో - మార్మిక అనుభవాలతో పాటు మరో మర్మానుభవం కూడా ఉంది. దీనిని 'కుండలిని' అంటారు. ఇది కొన్ని నెలలు మొదలుకొని సంవత్సరాల వరకూ సాగే ప్రక్రియ. దీని ద్వారా మనిషి అనేక మనోస్థితులు పొందుతాడు. 'కుండలిని' కి సంబంధించిన అనుభవాలు యోగసాధన ప్రారంభించిన కొన్ని నెలలు లేక సంవత్సరాల తరువాత మొదలౌతాయి. ఈ అనుభవాలు సాధారణంగా - చేతులు, కాళ్ళలో గిలిగింతలు, వెచ్చదనం లాంటి అనుభవాలతో మొదలయ్యి, రకారకాల కాంతులు కనబడడం, శబ్దాలు వినబడడం లాంటివి కూడా సంభవిస్తాయి. అనుభూతులు నడుము వెనుక భాగం నుంచి పైకి ప్రాకి, మెదద్వారా ముఖం మీదకు చేరుకుని - గొంతుక లేదా ఉదరభాగాల్లో అంతమౌతాయి. శరీరం యధేచ్ఛగా (దానంతట అది)- హఠయోగ భంగిమలలోకి పోవడం, అసాధారణ శ్వాసక్రియలు, చైతన్యం శరీరం నుంచి వేరయినట్టనిపించడం (దూరం నుంచి సొంత ఆలోచనలు, అనుభూతులు పరికిస్తున్నట్టనిపించడం), ఏకదృష్టి (రెండు కళ్ళు కలసిపోయి ఒకే దృష్టి ఉన్నట్టనిపించడం), బాహ్యశరీర అనుభవాలు (Out of Body Experiences), మహాశరీరానుభూతి (ఉన్న శరీరం కంటే పెద్ద శరీరం ఉన్నట్లనిపించడం) - ఇవన్నీ కూడా 'కుండలిని' లక్షణాలు. ఒకరి నుంచి ఒకరికి ఈ అనుభూతులు మారినా ఇవన్నీ కూడా ఈ అనుభవాల జాబితా నుంచే ఉంటాయి. నొప్పులు, నిద్ర లేని రాత్రులు, నిరుత్సాహం, నీరసం, పక్షవాతం లాంటి దుష్ఫలితాలు కూడా సంభవించవచ్చు.

సాధారణంగా నమ్మకంలో ఉన్నట్టు, ఇక్కడ కూడా దేవుడు, దేవతల ప్రమేయం లేదు. కొన్ని నిర్దిష్టమయిన యోగ సాధనా పద్ధతుల వలన, మెదడులో కొన్ని మార్పులు సంభవించి ఇదంతా జరుగుతుంది. శాస్త్రవేత్తలు - ఈ ప్రక్రియకు కారణమైన మెదడులోని భాగాలు, ఈ ప్రక్రియ సంభవించే మొత్తం తీరును కూడా కనుగొన్నారు.

ఇక్కడ 'కుండలిని' గురించి శాస్త్రపరమయిన వివరణ అంతా ఇవ్వడం అసందర్భమౌతుంది. మీకు దీని గురించి ఆసక్తి ఉంటే - "అనుబంధం A - 'కుండలిని' కు శాస్త్రజ్ఞాన వివరణ"ను చూడండి.

## అయితే ఏంటి ?

**బాబాల భక్తులు మరియు ఇతర విమర్శకులు అడుగవచ్చు - అయితే ఏంటి? మార్మిక అనుభవాలను సైన్స్ ఆధారంగా వివరిస్తున్నారా? మీరు ఆధ్యాత్మిక అనుభవాలను సైన్సు ద్వారా సవాలు చేస్తున్నారా? సైన్సు - దేవుడు లేడు అంటుంది. అందువలన శాస్త్రవేత్తలు - ఆధ్యాత్మికత అంతా ఒక పొరపాటని నిరూపించడానికి - వింత విశ్లేషణలను ఇస్తారు. ఇలా చేయడం వెనుక మీ ఉద్దేశ్యం ఏమిటి? మేము దీనిని స్వీకరించం - మీరు మా బాబాను, మా భక్తిని మరియు దేవునిలో మా నమ్మకాన్ని కించపరుస్తున్నారు.**

ఈ భావావేశంతో నేను ఏకీభవిస్తాను మరియు దీనిని అర్థం చేసుకోగలను. ఈ ప్రశ్నలన్నింటికీ వివరణ ఇవ్వడానికి ప్రయత్నిస్తాను. ముందుగా సైన్సు, శాస్త్రవేత్తలు - దేవుడులేడని నమ్ముతారనుకోవడం పొరపాటు. దీని గురించి మనం తరువాత చర్చించవచ్చు. తరువాత, నేను నాస్తికుడిని కాను - నేనూ మీలాగ దేవునిలో ధృడవిశ్వాసం ఉంచే వాడినే.

ఈ పుస్తకం ద్వారా నేను మీ ముందు ఉంచదలచుకున్నది - అన్ని కాలాల మార్మికవాదులు మన ముందుంచిన దేవుడి గురించిన భావననే. మార్మికవాదులయిన బాబాలపై ఉన్న భక్తి శ్రద్ధలతో మనం అసలు మార్మికవాదుల అభిప్రాయంలో, వాదనలో - దేవుడి నిర్వచనం ఏమిటి? అనేది ఆలోచించం, విశ్లేషించం. 'నా బాబాయే దేవుడు' అనే భావనను ఒక్క క్షణం ప్రక్కన పెట్టి, అసలు మీ ప్రియ బాబా దేవుని గురించి ఏమి చెబుతున్నారో పరిశీలించండి.

### మార్మికవాదుల దేవుని నిర్వచనం ఏమిటి ?

ఈ పుస్తకంలో పొందుపరచిన మార్మికవాదుల మాటలు, రాతలనూ పరిశీలిస్తే - మీరు ఈ విషయాన్ని గమనించవచ్చు: మార్మికవాదులు దేవుడిని - అనంతమయిన చైతన్యంగా (Infinite Consciousness) నిర్వచిస్తున్నారు.

సాయిబాబా గారు దేవుడిని బ్రహ్మగా వర్ణించేవారు. (శాసనాలు & వచనాలు - Charters & Sayings ద్వారా దొరికే వివరణ). ఆయన సూఫీ మార్మికవాది అయినప్పటికీ దేవుడిని అల్లా అనడంతోపాటు బ్రహ్మగా కూడా వర్ణించేవారు. గమనించవలసిన ముఖ్య విషయమేమిటంటే - ఇది వేదాలలో ఉన్న సృష్టికర్త - బ్రహ్మ కాదు. 'బ్రహ్మ' అనే భావన (స్వచ్ఛమైన, అనంతమయిన నిర్గుణ చైతన్యము) వేదాంతాలయిన ఉపనిషత్తులు వ్రాసిన మార్మికవాదుల ద్వారా ప్రచారంలోకి వచ్చింది.

మెహర్‌బాబా గారి 'ఉపదేశాలు' పరిశీలించిన వారికి కూడా - స్వచ్ఛమైన, మహదానంద భరిత, అనంతమైన చైతన్యస్థితియే దేవునిగా వర్ణించబడిందని అర్థం అవుతుంది. మరియు ఈ స్థితిని పొందడానికి అవలంబించవలసిన మార్గాల వివరణలతో ఆయన రచనలన్నీ నిండి ఉన్నాయి.

ఇదీ - మార్మికవాదుల దేవుని నిర్వచనం.

ఒక్క క్షణం - ఈ అధ్యాయంలో మీరు చదివిన శాస్త్ర జ్ఞాన సమాచారాన్ని కూడా ప్రక్కన పెట్టి, ఇప్పుడు ఇవ్వబడుతున్న వివరణను చదవండి.

"ఆ స్థితిలో 'స్వ' భావనను కోల్పోవడం జరుగుతుంది."

ఇది - నేను గాని, శాస్త్రజ్ఞానం గాని అంటున్న మాటే కాదు, మార్మికవాదులే తమ అనుభవాలను వర్ణిస్తూ ఇలా అంటున్నారు. దేవుడు మనకు ప్రసాదించిన అనేక అవయవాలతో పాటు మెదడు మరియు ఆ మెదడులో 'చైతన్యం' మరియు 'స్వ'భావనలు ఉన్నాయని మీరు అంగీకరిస్తారా? ఈ 'స్వ'భావన మన చైతన్యంతో జతకలసి, మెదడులో - 'స్వ' (నా, నేను, నాయొక్క) మరియు 'పర' (ఇతరం- నాది కానిదంతా) లను గుర్తించే సామర్థ్యాన్ని నెలకొల్పుతుంది. ఏదైనా కారణం వలన ఈ 'స్వ'భావన కోల్పోబడటం జరిగిందనుకోండి - అప్పుడు మిగిలింది ఏమిటి? చైతన్యం ఒక్కటే. పరిమిత జ్ఞానం నెలకోల్పే 'స్వ' భావన లేని స్వచ్ఛమైన చైతన్యం మాత్రమే మిగులుతుంది. ఇలా 'స్వ'భావన కోల్పోవడం జరిగిన వ్యక్తి ఖచ్చితంగా పరిమితిలేని, 'హద్దు' లేని చైతన్యాన్ని - అంటే అనంతమయిన చైతన్యాన్ని అనుభవిస్తాడు. అంతే! ఇది దేవుడు కాదు. మీరు దీనిని అర్థం చేసుకోడానికి నాడీ మండల శాస్త్రవేత్త కూడా కావలసిన అవసరం లేదు. మెదడులో ఈ 'స్వ'భావన ఎలా అంతమౌతుందో అనేది మనం శాస్త్ర జ్ఞాన వెలుగులో చూశాం. అంతే!

ధ్యానం అనేది మెదడును శాంతింపజేసే ప్రక్రియ. ఇదెలా జరుగుతుంది? మామూలుగా అయితే మన మెదడు ఎల్లప్పుడు పలు విషయాల గురించి ఆలోచిస్తూ ఉంటుంది - మన ఆలోచనలు ఒక విషయం నుంచి మరొక విషయానికి నిరంతరం మరలుతూ ఉంటాయి. ఇది మనందరికీ తెలిసిందే. ధ్యాన సాధన ద్వారా ఈ ఆలోచనలను ఒకొక్కటిగా నిష్క్రమింపజేసి, మెదడును ఒక ఆలోచనారహిత స్థితికి తీసుకుని రావచ్చు. ఈ స్థితిలో మిగిలేది ఏమిటి? ఆలోచనా రహిత 'చైతన్యం' మరియు 'స్వ' భావన. ఇక్కడ దాకా బాగానే ఉంది. మెదడుకు ఆలోచనలనుంచి విముక్తి కలిగి కొంచెం విరామం లభిస్తుంది. ధ్యాన సాధనను ఇంకా ముందుకు తీసుకొని పోతే ఆ 'స్వ'భావన అంతమైపోతుంది. అనుభవాన్ని పొందుతున్నవాడిని తీసేస్తే మిగిలింది అనుభవమే కదా ! ఇదెలా సంభవం? 'స్వ' అనే భావన లేకుండా ఉంటటం ఎలా సాధ్యం ? అని మీరడగవచ్చు. ఎందుకు సాధ్యం కాదు? మీరే ఆలోచించండి ... మనం పుట్టిందే ఈ 'స్వ' అనే భావన లేకుండా. పుట్టగానే మనకు నేను, నాది అనే భావనలు ఉండవు. కానీ మనం అప్పుడు ఆ అనంతమైన చైతన్యాన్ని అనుభవించేందుకు - మన మెదడు కూడా తగినంతగా అభివృద్ధి చెందిలేదు. ఇంతకు ముందు వివరించినట్లు 'స్వ'భావన లక్షణాలన్నీ మనం ఎదుగుతున్న కొద్ది నెమ్మదిగా అభివృద్ధి చెందాయి. ఈ విధంగా ఆ అసాధారణ మనోస్థితులలోనే 'స్వ' అనే భావన అంతమవడం జరగదు, మన జీవితాలే ఆ స్థితిలో మొదలయ్యాయి. అంతేకాదు, ప్రతీరోజూ నిద్రలో కూడా మనకీ భావన ఉండడం లేదు.

ఇది చాలా సులభంగా అర్థం చేసుకోగల వివరణ. దీనిని అర్థం చేసుకోడానికి, మీరు ఇంతవరకు ఇవ్వబడిన శాస్త్రీయ జ్ఞాన సమాచారాన్ని కూడా నమ్మవలసిన అవసరం లేదు. శాస్త్ర సమాచారం ఇదెలా జరుగుతుందో వివరిస్తుంది. అంతే!

ఇప్పుడు నేను 'మార్మికవాదులు అనుభవిస్తున్నది దైవాన్ని కాదు' అని వివిధ కోణాలలో నిరూపించే మరింత వివరణను ఇస్తాను.

“ఒక కేథలిక్కు సన్యాసినికి ఈ మార్మిక అనుభవం ద్వారా క్రీస్తులో లీనమైపోయిన భావన కలిగితే దైవభావనే లేని ఒక బౌద్ధ సన్యాసికి ఇది శూన్యంలోకి లీనమైపోయిన భావనను కలుగజేస్తుంది”[22]

మీరు గమనించి ఉంటే, నేను బౌద్ధ మతం గురించి, జపాన్‌లో దాని శైలి అయిన జెన్ బుద్ధిజం గురించి ముందు నుంచీ వివరిస్తున్నాను. మీరు బౌద్ధ మతం యొక్క మౌలిక భావనలు పరిశీలిస్తే, ఇందులో - దేవుడు అనే భావనే లేదు. అవును, అయినప్పటికీ బౌద్ధ సన్యాసులు మార్మికవాదులు పొందే అనుభవాలనే పొందుతారు. ఎందుకంటే వారు కూడా అదే ధ్యాన సాధన, సన్యాస మార్గాలను అవలంబించారు. అనుభవించింది వారు అనంతమైన శూన్యం అని చెబుతారే తప్ప అది దేవుడని అనరు. అనుభవాలలో సంపూర్ణమైన సారూప్యత ఎందుకుందంటే - అన్ని మానవ మెదడులూ - బౌద్ధ సన్యాసుల వైనా, సూఫీలవైనా లేక ఏ ఇతర మార్మిక సాంప్రదాయానికి చెందిన వారివైనా - ఒకే రకంగా పనిచేస్తాయి మరియు ధ్యాన సాధనకు ఒకే రకంగా ప్రతిస్పందిస్తాయి. నమ్మకం కలగడం లేదా? బౌద్ధ మతంలో దేవుడికి ఏ పాత్రా లేదని బౌద్ధులే ఇలా చాటుకుంటారు:

“బౌద్ధ మత ప్రారంభంలో - సృష్టికర్త, పాలకుడు అనే భావనలే లేవు. దేవునికి బదులు బౌద్ధుల పరమసత్యం మరియు లక్ష్యం - ‘నిర్వాన’ - జనన మరణ చక్రం నుంచి విముక్తి - తద్వారా బాధల నుంచి విముక్తి. ‘నిర్వాన’ పదం యొక్క అర్థం - ఆరిపోవడం.”[23]

“జెన్ బుద్ధిజం - ఈ విశ్వ వ్యవస్థకు అవతల - ఈ విశ్వాన్ని, మానవుడిని సృష్టించిన దేవుడనే వాడు ఎవడూ లేడని నమ్ముతుంది. దేవుడి భావనను ప్రక్కన పెడితే, ఈ విశ్వం, మానవుడు-ఒకే ఉనికి, అంతా కలిపి ఒకటి- ఇదే పరమ సత్యం. ఇది తప్ప ఇంకేమీలేదు. వేరు వేరుగా కనిపించే ఆకృతులు, వ్యవస్థలు అన్నీ (అణువుగాని, మొక్కగాని, ఎలుకగాని, మనిషిగాని) దీని రూపాలే. ప్రతీ క్రియ - జననం గాని, మరణంగాని, తినడంగాని, ప్రేమించడంగాని, -అన్నీ ‘దీని’ క్రియా రూపాలే. అంతా ఈ ‘ఇదే’. మనమంతా ఇందులోని అంశాలే. ఒక రూపంలోకి వచ్చినది, దాని పని పూర్తి కాగానే వేరే రూపంలోకి పరివర్తనం చెందిపోతుంది.”[24]

జేమ్స్ ఆస్టిన్ ఇలా వ్రాశారు: “............... విషయమేమిటంటే, జెన్ బుద్ధిజం యొక్క లక్ష్యం - ఈ పరమసత్యాన్ని తిలకించడమే, దేవుణ్ణి కాదు. మరలా అయితే ఈ అనుభవం ఎక్కడి నుంచి వస్తుంది? మెదడునుంచి - ఎందుకంటే మెదడే మనసు యొక్క అవయవం. మార్మిక అనుభవాలు వాటికవే వచ్చినా, ధ్యాన సాధన ద్వారా వచ్చినా, మత్తుమందుల వలన వచ్చినా - ఇదే సూత్రం వర్తిస్తుంది. ధ్యాన సాధన మరియు కొన్ని జీవిత విధానాలు, నాడీ సంబంధ వ్యవస్థలోని కొన్ని మౌలిక అనుభవాల విడుదలకు దోహదం చేస్తాయి. ఈ విధంగా మార్మిక అనుభవాలనేవి - సాధారణ ప్రక్రియలే - ఒక కొత్త శైలిలో పనిచేయడం వలన ఉత్పన్నమౌతాయి.”[25]

బౌద్ధుల అనుభవాలకు, ఇతర మార్మికవాదుల అనుభవాలకూ తేడా ఉందని మీకనిపిస్తే - 'జెన్ మరియు మెదడు' (Zen and Brain - Towards understanding Meditation & Consciousness) పుస్తకాన్ని చదవండి. ఈ అనుభవాలను ఒక నాడీ శాస్త్రవేత్త మరియు జెన్ సాధకుని కంటే బాగా వివరించగలవారెవరు? జేమ్స్ హెచ్. ఆస్టిన్,M.D., ఈయనే 'జెన్ మరియూ మెదడు' రచయిత- అమెరికాలోని యూనివర్శిటీ ఆఫ్ కొలరాడో గౌరవనీయ ప్రొఫెసర్. ఈయన నాడీ సంబంధ శాస్త్రాలపై అనేక ప్రచురణలకు కర్త. ఈయన జపాన్ దర్శించినపుడు, జెన్ ధ్యాన సాధనకు ఆకర్షితులై, దాని సాధన ద్వారా - అసాధారణ, అత్యంత అసాధారణ మానసిక స్థితులను పొంది, వాటిపై అధ్యయనం చేశారు. నాడీ శాస్త్రవేత్త కావడం వలన ఈయనకు మెదడు పనితీరుపై నైపుణ్యత ఉండనే ఉంది. అందుకని, ఈ మార్మిక అనుభవాలను శాస్త్రీయ రీతిలో వర్ణించగలిగారు. మెదడు పనితీరు, ధ్యానం, జ్ఞానోదయం - తదితర అంశాల గురించిన శాస్త్రీయ ధృక్పథంలో అవగాహనకు ఈయన పరిశోధనల ఆధారంగా రచించిన పుస్తకం ఎంతగానో ఉపయోగపడుతుంది. మార్మికవాదంలోని 'మర్మం' వీడి - దీనికీ, దేవునికీ ఏ సంబంధం లేదని మీకు అర్థం అవుతుంది.

బుద్ధుని చరిత్ర చదివిన వారికి - బుద్ధుడు ఒక నాస్తికుడు (దేవునిలో విశ్వాసం లేనివాడు) అయినప్పటికీ, తర్వాతి కాలంలో ఆయనపై బౌద్ధుల భక్తి శ్రద్ధల ప్రభావంతో దేవునిగా చిత్రీకరింపబడ్డాడని అర్థం అవుతుంది. నిజం చెప్పాలంటే - ఈ బౌద్ధమతం మార్మికవాదులకు ఒక సమస్యలా ఉంటుంది. మార్మికవాదులు అవలంబించే ధ్యాన సాధనే చేస్తూ, వారు పొందిన అనుభవాలే పొందుతూ కూడా వారు వాటిని దేవునిగా కాక 'శూన్యం' గా వర్ణిస్తుండడంతో - మార్మికవాదులు దానికి వివరణ ఇవ్వడానికి అనేక ఇబ్బందులు పడతారు.

ఉదాహరణకు స్వామి అభయానంద బుద్ధుడిని ఒక గొప్ప చారిత్రక మార్మికవాదిగా వర్ణిస్తూనే, బుద్ధుడు తాను అనుభవించింది దైవత్వం అని చెప్పడానికి భయపడ్డాడని ఇలా వివరించారు:

"అతను (బుద్ధుడు) - దేవుని ప్రలాపన - జ్ఞానోదయం పొందని వారు దేవుడిని సరిగా అర్థం చేసుకోలేకపోవడానికి దారితీసిన వైనాన్ని చూశాడు. అందుకని తన దైవలీనత్వాన్ని ఒక కొత్త పద్ధతిలో వివరించాలి అని దృఢంగా నిశ్చయించుకున్నాడు"[26]

(ఇది అభయానంద గారి సొంత వివరణ, దీనికి ఆయనేమీ బౌద్ధగ్రంథాల లేదా బుద్ధుని చరిత్రల మూలాన్ని పొందుపరచలేదు)

నిజం చెప్పాలంటే -దేవుడు - బ్రహ్మ (అంటే స్వచ్ఛమైన, అనంతమైన చైతన్యం) అనే భావన బుద్ధుని కాలమప్పుడు కొత్తేమీ కాదు. బుద్ధుడు ముందుగా వెళ్ళింది - ఈ బ్రహ్మ యోగులైన గురువుల వద్దకే. వాళ్ళ ఈ యోగానుభవాలలో నిజం లేదని భావించిన బుద్ధుడు వారిని విడిచిపోయాడు. బుద్ధుడు నిజం తెలుసుకోవాలని కృత నిశ్చయుడై ఉన్నాడు. అతను ఈ మార్మిక అనుభవాల ద్వారా పొందింది - దైవానుభవం అని భావించి ఉంటే, అలా చెప్పుకోడానికి ఎంత మాత్రం సంశయించేవాడు కాదు. సహేతుకం కాని హిందూ కుల వ్యవస్థను కాలుదన్నడంలో భయపడని వాడు, దేవుని గురించిన మౌలిక భావననే ప్రజలకు చెప్పడానికి సంశయించాడని మనం ఎలా అనుకోగలం?

ఇక మెహర్‌బాబా - బుద్ధుడిని తన ఆధ్యాత్మిక తలాల భావనలో వర్ణిస్తూ ఇలా అన్నారు:

"...... ముహమ్మద్ దైవానుభవం తరువాత ఏడవతలంలో ఉండినారు. బుద్ధుడు ఐదవ మరియు అజ్మీరు మొహియుద్దీన్ ఛిస్తీ కూడా ఐదవ తలంలో ఉండినారు."

*- మెహర్ బాబా - ఉపదేశాలు - సంపుటము 2, 110 వ పేజి*

మెహర్‌బాబా గారి వివరణ ప్రకారం 7 తలాలున్నాయి. ఒకొక్క తలం దాటుకుంటూ, 7వ తలంలోకి ప్రవేశించిన అనంతరం దైవానుభవ ప్రక్రియ సంపూర్ణమౌతుంది. పాపం బుద్ధుడు - అతను ఆసాధారణ, అత్యంత అసాధారణ మనోస్థితులెన్నో పొందినప్పటికీ - 5వ తలంలో మిగిలిన వాడిగానే వర్ణించబడ్డాడు. ఈ 5వ తలం అంటే ఏమిటని పరిశీలిస్తే:

"ఐదవ తలంలో లీనమవడాన్ని - 'ఫనా-ఎ-జబారుతి' లేక 'కోరికల సర్వనాశనం' అంటారు. ఇక్కడ సాధకుడు సాధారణంగా ఆలోచించడు, అయినా అతడు అనేక ఆలోచనలకు మూలమౌతాడు. అతను చూస్తాడు, కానీ కళ్ళతో కాదు. మనసు మనసుతో మాట్లాడుతుంది. చింతన గానీ, అనుమానం గానీ ఉండవు. అతను ఆధ్యాత్మికంగా సురక్షితంగా ఉన్నాడు. కానీ, ఇక్కడ అనేక మంది సాధకులు 'తాము దైవత్వం పొందేశా' మనే భ్రమనుంచి బయటపడలేరు. ఈ భ్రమలో అతను తాను దేవుడినని భావించి 'నేను దేవుణ్ణి' అంటాడు. ఆధ్యాత్మిక పథం చివరి గమ్యాన్ని చేరిపోయానని భావిస్తాడు."

*- మెహర్‌బాబా - ఉపదేశాలు - సంపుటము 2 - 26 వ పేజి.*

బుద్ధుని చరిత్ర చదివిన వారికి స్పష్టంగా కనిపించే విషయం - అతని ప్రవర్తనకు, మెహర్‌బాబా గారు చెప్పిన దానికీ ఏ మాత్రం పొంతన లేదనేది. "నేను దేవుణ్ణి" అని ప్రకటించుకోవడం కాదు కదా కనీసం దేవుని గురించి మాట్లాడడానికే నిరాకరించేవాడు బుద్ధుడు.

"మొదటి చారిత్రక ప్రాముఖ్యత గల నాస్తికుడు - గౌతమ బుద్ధుడే అయి ఉండాలి. ఇతనిని 'దేవుడున్నాడా? అని అడిగితే - మౌనం వహించేవాడు. ఒకసారి అతను ఈ క్రింది విధంగా జవాబిచ్చాడు:

ఒక వైద్యుడు, ఒక మనిషి వద్దకు గ్రుచ్చుకొని ఉన్న బాణాన్ని తీయడానికి వస్తాడు. ఆ మనిషి వైద్యుని చేయి పట్టుకొని - చికిత్సకు ముందు నాకు ఈ ప్రశ్నలకు జవాబివ్వండి - నాపై బాణం సంధించింది ఎవరు? అతను ఏ వర్గానికి చెందినవాడు? పొడవైన వాడా? పొట్టివాడా? ముసలివాడా? పిల్లవాడా? అతని రంగేమిటి? వైద్యుడు అతని ప్రశ్నలను పట్టించుకోకుండా బాణం తీసి చికిత్స చేశాడు. అతని ప్రశ్నలకు జవాబులిస్తూ కూర్చుంటే, రోగి చనిపోయి ఉండేవాడు. అందుకని దేవుని గురించిన ఈ ప్రశ్నకు నేను జవాబివ్వను."

"బుద్ధుని శాంత స్వరూపాన్ని చూసి ముగ్ధుడైన ఒక బ్రాహ్మణుడు, అతనితో ఇలా అన్నాడు.

'నీవు దేవుడివా?' - 'కాదు' అన్నాడు బుద్ధుడు,

'నీవు దైవ దూతవా?' - 'కాదు',

'మునివా?' - 'కాదు',

'మరి నీవెవరు?' - బుద్ధుడు ఇలా జవాబిచ్చాడు: 'నేను మేల్గొని ఉన్నాను.'

(సుతోపితక, అంగుత్తర నికాయ - పురాతన పాలి బౌద్ధ గ్రంథం నుంచి)

ఈ రకంగా బుద్ధునిలో - తాను దేవుడినని భ్రమపడి, దేవునిగా ప్రకటించుకున్న లక్షణాలేవి మనకు కానరావు.

దేవుని గురించి మాట్లాడితే ప్రజలు అపార్థం చేసుకుంటారేమోనని భయపడి, బుద్ధుడు దేవుని గురించి మాట్లాడలేదంటున్నారు స్వామి అభయానంద. దేవునిగా భ్రమపడి, 'నేను దేవుణ్ణి' అని ప్రకటించుకోవడం ద్వారా 5వ తలంలోనే చిక్కుకుని ఉండిపోయాడంటున్నారు మెహర్‌బాబా. ఎవరి వివరణ సరిఅయినది? ఈ రెండు వివరణలు సరిఅయినవి కావని చరిత్ర సాక్ష్యం చెబుతుంది. బుద్ధుడు తన మర్మిక అనుభవాల ద్వారా పొందినది దేవుడని ఎప్పుడూ అనుకోలేదు, తాను దేవుడినని భ్రమపడి అలా ప్రకటించుకుంటూ తిరగనూ లేదు.

బుద్ధుడు తన అనుభవాలను ఇలా వివరించాడు: "మొదటి స్థితిలో - శబ్దజ్ఞానం అంతమౌతుంది. రెండవ స్థితిలో - ఆలోచనలను వ్యక్తపరచు, వాదించు శక్తి అంతమౌతుంది. మూడవ స్థితిలో - ఆనంద భావన అంతమౌతుంది. నాలగవ స్థితిలో ఉచ్ఛ్వాస, నిశ్వాసలు అంతమౌతాయి. ఆ తర్వాత ఆనందమయిన అంతరాళ స్థితిలోకి చేరుకున్నప్పుడు రూపజ్ఞానం అంతమౌతుంది. తర్వాత అనంతమైన చైతన్యస్థితి చేరుకున్నపుడు, అనంత-అంతరాళ జ్ఞానం అంతమౌతుంది. ఆ తర్వాత అనంతమైన శూన్యస్థితిలోకి ప్రవేశించినపుడు, అనంత చైతన్యజ్ఞానం అంతమౌతుంది. తర్వాత గ్రహణశక్తి ఉండీ లేకుండని ఒక మనోస్థితిలోకి ప్రవేశించినపుడు - అనంత శూన్యస్థితి జ్ఞానం కూడా అంతమౌతుంది. ఆ తర్వాత గ్రహణ జ్ఞానం అంతమైనపుడు - అన్నిరకాల నీచ, వ్యామోహ, అసహ్య భావనలు అంతమౌతాయి." [27]

ఈ విధంగా బుద్ధుడు కూడా ఆ అసాధారణ మనోస్థితి అయిన - అనంతమైన చైతన్యస్థితి (సమాధి)ని పొందడమే కాక దాని తర్వాతి - అత్యంత అసాధారణ మనోస్థితులను కూడా పొందాడని అర్థం అవుతుంది.

ఇక్కడ మెహర్‌బాబా గారి 'నిర్వాన' పదోపయోగం గురించి కొంచెం వివరణ అవసరం. ఆయన దీనిని - 'లీనత్వం' లేదా 'సమాధి'కు పర్యాయ పదంగా వాడారు. బౌద్ధ సాంప్రదాయంలో కూడా లీనత్వం అంటే సమాధి. కానీ బౌద్ధుల 'నిర్వాన' చాలా తరువాత ఉంటుంది. ఇది అత్యంత అసాధారణ మనోస్థితి. దీనివలన 'నిర్వాన' పదం వలన కొంచెం అయోమయం కలుగుతుంది. ఇక్కడ గమనించవలసిన దేమిటంటే - బౌద్ధుల 'నిర్వాన'కు నిర్వచనం 'ఆరిపోవడం' అంటే శాంతిని పొందగానే కోరికల మంటలు ఆరిపోయినట్టు. ఇక ఏమాత్రమైన కోరికలు, ఆశలు మిగలక, మనుగడ ఒక అంతానికి వస్తుంది. ఆ తర్వాత మరలా జన్మించడం జరగదు (అని బౌద్ధుల విశ్వాసం). ఇదీ బౌద్ధుల ధ్యాన సాధన మార్గంలోని పరమ లక్ష్యం. ఈ విధంగా 'నిర్వాన' అనే అసలు పదానికి దేవునితో గానీ, దైవ భక్తితో గానీ ఏ విధమైన సంబంధం లేదు. బుద్ధుని తర్వాత 'నిర్వాన' అనే పదాన్ని 'బ్రహ్మ' అనే పదంతో హిందూ గ్రంధాలలో జోడించడంతో ఈ సంబంధం దానికి ఆపాదించబడిందనేది చారిత్రక సత్యం.

క్రీస్తు పూర్వం 50 - 500 ల మధ్య కాలంలో వ్రాయబడినదిగా భావిస్తున్న భగవద్గీతలో 'నిర్వాన' అనే పదం 'బ్రహ్మ' అనే పదంతో జతకలపబడి - 'బ్రహ్మ నిర్వాన' అనే కొత్త పదం ఏర్పడింది. ఈ విధంగా 'నిర్వాన'కు దైవ సంబంధిత అర్థాన్ని ఆపాదించడం జరిగింది. కానీ బుద్ధుని సమగ్ర చరిత్ర, గ్రంధాలు విషదపరిచే విషయం ఏమిటంటే - ఈ 'నిర్వాన' అనేది - 'లీనత్వం' లేదా 'సమాధుల' తరువాతి స్థితి. 'లీనత్వం' లేదా 'సమాధి' గానీ, 'నిర్వాన' గానీ దేవునికి సంబంధించినవని ఏ రకంగానూ బుద్ధునితో చెప్పబడలేదు.

## మరో మార్మికవాది - రామకృష్ణ (1836 - 1886)

కలకత్తాకు వెలుపల గల దక్షిణేశ్వర్ లోని కాళీ ఆలయంలో సహాయ పూజారిగా పనిచేస్తున్న రామకృష్ణ కాళీమాత ఆరాధనలో పూర్తిగా నిమగ్నమైపోయినపుడు అయనకు ఒక మార్మిక అనుభవం కలిగింది. కాళీ దర్శనం కోసం పరితపిస్తూ, ఆమె అన్వేషణలో నిర్విరామంగా అడవులలో గడుపుతూ మరియూ తర్వాత ఒక పాడుబడిన స్మశాన వాటికలో ధ్యాన సాధన చేయసాగారు రామకృష్ణ. ఆయన సోదరుడు ఆయన పరిస్థితి చూసి పిచ్చివాడైపోయాడేమోనని ఆందోళన చెందేవారు. అనంతరం రామకృష్ణ తనకు కలిగిన మార్మిక అనుభవాన్ని ఈ విధంగా వర్ణించారు:

"...... అకస్మాత్తుగా కాళీమాత ప్రత్యక్షం అయింది. వివిధ భాగాలు గల భవనాలు, ఆలయం అన్నీ కూడా నా దృష్టి నుంచి దూరం అయిపోయాయి. ఏ మాత్రం కనబడకుండా పోయాయి. వాటిస్థానే, నేనొక అపరిమితమైన, అనంతమయిన చైతన్య సాగరాన్ని చూశాను. నయనాలు చూడగలవరకూ, నలువైపుల నుంచి ఆవహించిన ఒక తేజోప్రవాహం, భయంకర శబ్దంతో నన్ను చుట్టి ఊపిరాడకుండాచేసింది. నేను స్పృహ తప్పిపోయాను. బాహ్య ప్రపంచంలో ఏమి జరుగుతుందో నాకు తెలియదు. కానీ నాలోపల ఒక స్వచ్ఛమైన, మహదానంద స్థితి నెలకొంది, కాళీ మాత సమక్షాన్ని నేననుభవించాను."[28]

ఒకసారి రామకృష్ణ కాళీమాతకు ఇవ్వవలసిన ఆహారాన్ని ఒక పిల్లికి తినిపించగా, ఈ చేష్టను చూసిన ఒకతను ఆలయాధికారి అయిన మాధుర్‌కు దీని గురించి ఫిర్యాదు చేశాడు. అప్పుడు రామకృష్ణ క్రింది విధంగా వివరణ ఇచ్చారు:

"కాళీమాత నాముందు ప్రత్యక్షం అయి, తనే పరమసత్యమనీ, ప్రతీవస్తువూ తనే అని నాకు చూపించింది. ఆమె నాకు ప్రతీది చైతన్యంతో నిండి ఉందని చూపించింది. విగ్రహం- చైతన్యం, బలిపీఠం - చైతన్యం, నీటి బిందెలు - చైతన్యం, పాలరాతి గుడి గచ్చు - చైతన్యం, ఇలా ప్రతీదీ చైతన్యమే. గదిలో ప్రతీవస్తువు ఒక మహదానంద స్థితిలో మునిగి ఉంది. గుడి బయట ఒక క్రూరుడైన వ్యక్తిని చూశాను. అతనిలో కూడా కాళీమాత శక్తినే చూశాను. అందుకనే కాళీమాతకు ఇవ్వవవలసిన ఆహారాన్ని పిల్లికి పెట్టాను. పిల్లితోసహా ఉన్నదంతాకూడా ఆ కాళీమాతే అనీ, అదే పరమ సత్యమనీ - అంతకుమించి ఏమీలేదని స్పష్టంగా అర్థం చేసుకున్నాను."[29]

'బ్రహ్మని' అనే ఒక సన్యాసిని రామకృష్ణను దేవుని అవతారంగా ప్రకటించింది. తర్వాత ఆమె అతనికి తాంత్రిక సాధనను నేర్పింది. దీని తరువాత రామకృష్ణ - తోతాపురి అనే ఒక శంకరాచార్యుల వంటి అద్వైతవాదిని కలిసారు. అతను రామకృష్ణను సన్యాసత్వంలోకి ప్రవేశపెట్టి, ప్రాపంచిక వ్యామోహాలన్నింటినీ త్యజించి, బ్రహ్మ లీనత్వం కోసం ధ్యానించమన్నాడు. కొంచెం ప్రయత్నం తరువాత రామకృష్ణకు బ్రహ్మ స్వరూప సాక్షాత్కరణ జరిగి, ఆయన ఆ స్థితిలో 3 రోజులు గడిపారు. తరువాత తన అనుభవాన్ని ఇలా వివరించారు:

"కాళీ, బ్రహ్మ ఇద్దరూ ఒక్కటే. కాళీ అనేది ఆదిశక్తి. ఆమె నిశ్చలంగా ఉన్నపుడు బ్రహ్మ. కానీ అది సృష్టి చేయడం, దానిని కాపాడటం, నాశనం చేయడం చేసినపుడు మనం దానిని కాళీ అంటాము."[30]

కాళీ, బ్రహ్మల ఈ సంబంధం మనకు తరువాతి అధ్యాయంలో మాయను గురించి చర్చించినపుడు విశదమౌతుంది. ఇక్కడ గమనించవలసినది - బ్రహ్మ, కాళీలను పొందడంలో రామకృష్ణ అనుభవాలలోని మార్మిక అనుభవాల సారూప్యత. ఆలోచించవలసింది - ఇది దేవుడా? అల్లా కోసం పరితపించే ఒక సూఫీ, యేసుక్రీస్తు కోసం తపించే ఒక క్రైస్తవ సన్యాసి, బ్రహ్మకోసం లేదా వేరే ఇతర ఇష్టదైవం కోసం పరితపించే హిందూ మార్మికవాది - అందరూ ఒకే అనుభవాన్ని పొందుతున్నారు. కొంతమంది, ఏ విధంగా కొలచినా దేవుడు పలుకుతాడనీ, దర్శనమిస్తాడనీ వివరణ ఇవ్వవచ్చు. కానీ దేవుని మీద ఏ మాత్రం నమ్మకం లేని బౌద్ధ సన్యాసి విషయంలో కూడా ఇదే జరుగుతుంది. మార్మికవాదుల అనుభవాలే వారూ పొందుతున్నారు. ఈ అనుభవ స్థితి దేవునితో సమానం అయితే, ఆయనపై ఉన్న నమ్మకానికి ప్రతిఫలం అయితే బౌద్ధుల విషయంలో అలా జరుగకూడదుగా మరి?

వీటన్నింటి వల్ల స్పష్టమయ్యేదేమిటంటే, ఈ 'తలాలు', 'మనోస్థితులు' - దేవుడు, దేవుడిని పొందినట్లూ కానే కావు. ఇవి ధ్యాన సాధన, లగ్న సాధనల కారణంగా మెదడులో ఆవిర్భవిస్తున్న కొన్ని ప్రత్యేక మనోస్థితులు మాత్రమే.

ఈ అనుభవాలు మెదడుకు సంబంధించినవే గానీ, దేవుడితో సంబంధం లేవనడానికి ఇంకొక కోణంలో వివరణను చూద్దాము.

## మత్తుమందులు మరియు మార్మిక అనుభవాలు

ప్రాచీన కాలంలోనే, మానవులు కొన్ని రకాల మొక్కలలో గ్రాహక తీరు, చైతన్యాన్ని మార్చగలిగే లక్షణాలు ఉన్నాయని కనుగొన్నారు. వీటిని సేవించడం ద్వారా ఒక స్పష్టమైన చైతన్యస్థితిని పొంది, మామూలుగా కనిపించని ఒక క్రొత్త ప్రపంచాన్ని చూసిన అనుభూతులు కలుగుతాయని తెలుసుకున్నారు.

ఇలాంటి మత్తు పదార్థాల సేవనం ఆదిజాతుల్లో ఒక మత పరమైన పూజా కార్యాక్రమంగా కూడా మారింది. సుదూర అమెజాన్ అడవుల్లో, ఆఫ్రికాలోని దూర ప్రాంతాల్లో మరియు ఆసియా ఖండంలో ఇలాంటి అనేక వృక్షజాతులు ఇప్పటికీ ఉన్నాయి. ఈ మొక్కల ద్వారా సంగ్రహించిన పదార్థాలను పొడిచేసి దానిని తినడం గానీ, ముక్కు ద్వారా పీల్చుకోవడం ద్వారా గాని - షమన్ జాతి ప్రజలు భౌతిక ప్రపంచాన్ని దాటి ఒక ఆత్మల ప్రపంచంలోకి వెళ్ళగలుగుతున్నామని ఇప్పటికీ నమ్ముతుంటారు.



ఇలాంటి ఒక పధార్థం **మెస్కలీన్**. ఇది కొన్ని రకాల క్యాక్టస్ మొక్కలలో తయారవుతుంది. ఇది మార్మిక అనుభవాలను కలుగజేస్తుంది. దీనిని సేవించిన వారు కొన్ని రకాల భ్రమలకు లోనవడం, అసాధారణ మనోస్థితులలోకి పోవడం జరుగుతుంది. ఈ స్థితులలో మహదానంద భావన కలగడం, రకరకాల కాంతుల దర్శనం జరగడంతో పాటు, 'స్వ' భావనను కోల్పోవడం కూడా జరుగుతుంది. బానిసత్వ అలవాటుగా మారే గుణం దీనికి లేదు. ప్రఖ్యాత ఆంగ్ల రచయిత ఆల్డస్ హక్స్లే దీనితో తన అనుభవాలను ఇలా వివరించాడు: కాంతి పుంజాలలో నిండి ఉన్న వర్ణణాతీతమైన- ఒక అందమయిన, భౌతిక ప్రపంచానికి ఆవలనున్న ప్రపంచం.

**యల్.యస్.డి.** (LSD)

1952వ సంవత్సరంలో, మన శరీరంలో ఉండే ఎడ్రినలిన్‌కు, మెస్కలిన్‌కు (ఇంతకు ముందు వివరించిన మత్తుపదార్థం) సారూప్యతలున్నాయని కనుగొనబడింది. తదుపరి పరిశోధనల్లో ఎర్గాట్ అనే పదార్థం నుంచి సంగ్రహించిన లైసర్జిక్ యాసిడ్ (దీనినే LSD అని అంటారు) కూడా వీటి రసాయన తత్వాలను పోలి ఉందని వెల్లడయినది. ఇది మెస్కలీన్ కన్నా అనేక రెట్లు శక్తివంతమయినది, ఒక గ్రాములో పదివేల వంతు కూడా మార్మిక అనుభవాలను కలిగించగలదు.

1960వ దశాబ్దం మధ్యకాలంలో కనుగొనబడి, అనేక వివాదాలకు కారణమైన LSD ను ప్రపంచ వ్యాప్తంగా నిషేధించారు. దీనిని కనుగొన్న స్విట్జర్లాండ్‌కు చెందిన శాస్త్రవేత్త - ఆల్బర్ట్ హాఫ్‌మన్: "LSD నాతో ఏదో చెప్పాలనుకుంది. అది నాకు అనేక మార్మిక అనుభవాలనిచ్చింది" అన్నారు. అమెరికాకు చెందిన సుప్రసిద్ధ మనస్తత్వ శాస్త్రవేత్త స్టానిస్లేవ్ గ్రాఫ్ LSDతో తన అనుభవాన్ని వర్ణిస్తూ ఇలా అన్నారు:

"నా చైతన్యం నా శరీరం నుంచి విడివడి నేను **అపరిమితుడనయిపోయాను**. నేను విశ్వవ్యవస్థ చైతన్యంగా మారిపోయాను. నక్షత్ర మండలాలు, బ్లాక్ హోల్స్, వైట్ హోల్స్ అన్నీ నాలోనే ఉన్నాయనిపించింది."

**డి. యమ్. టి.** (DMT)

DMT అంటే - డై మిథైల్ ట్రిప్టమిన్ ను హంగరికు చెందిన స్టీవెన్ సారా 1931వ సం॥రంలో కనుగొన్నారు. ఇది LSD కంటే ఎంతో శక్తివంతమయినదని తేలింది. అనేక రకాలయిన మార్మిక అనుభవాలను ఇది కలిగించగలదు. దీన్ని సేవించగానే, ఒక్కసారిగా కళ్లముందు అనేకానేక ఆకారాలు (వేరొక ప్రపంచం మనకళ్ల ముందు ప్రత్యక్షం అయినట్లు) దర్శనమిస్తాయి.

**క్యానిబాస్**

ఈ వనమూలిక కూడా ఇలాంటి లక్షణాలను కలిగి ఉంది. ఇది మనసును ప్రశాంతపరచి దానిని వ్యాకోచించేట్లు చేయగలదు (అంటే 'స్వ' భావనను అంతం చేయడం ద్వారా). యూనివర్శిటీ ఆఫ్ టెల్ అవీవ్‌లో జరిగిన పరిశోధనల సమాచారం ప్రకారం, ఇందులో ఉన్న ఒక రసాయనం, స్వభావ సిద్ధంగా మన మెదడులలో కూడా ఉంటుందని వెల్లడయినది.

ప్రపంచం నలుమూలల నుండి - మత్తుపదార్థాల ద్వారా కలిగిన అసాధారణ మనోస్థితులను అనుభవించిన లక్షల కొద్దీ ప్రజలు - ఒకే రకమయన అనుభవాన్ని వర్ణిస్తారు: అనంతమయిన చైతన్యంతో కూడి, అన్ని ఒకటిగా కలిసి ఉన్నాయి (లేదా అంతా ఒక్కటే) అనే భావనను కలిగించే మహదానంద భరిత కాలాతీతమయిన ఒక మనోస్థితి.[31]

ఈ అనుభవాలలోని సారూప్యత - మానవ మెదడులన్ని ఒకే రకమయిన నిర్మాణాన్ని కలిగిఉన్నాయనీ, ఒకే రకమయిన ప్రేరణకు (ఇక్కడ మత్తుమందులు) ఒకే రకమయిన ప్రతి స్పందన కలుగుతుందనీ సూచిస్తుంది.

## ఈ అనుభవాలు ఒక్కటేనా?

**మత్తుమందుల వలన జనించిన మార్మిక అనుభవాలు, ఇతర విధానాలు (ఉదాహరణకు ధ్యాన సాధన) ద్వారా కలిగిన మార్మిక అనుభవాలు ఒకటేనా?**

**1962 - గుడ్‌ఫ్రైడే ప్రయోగం:**

హ్యూస్టన్ స్మిత్ అనే శాస్త్రవేత్త - పై ప్రశ్నకు సమాధానం కోసం 44 సం॥ల క్రితమే ఒక ప్రయోగం చేశారు. ఈ అనుభవాలు ఒక్కటే అని నిరూపించే ఆధారాలను ఆయన తన ప్రయోగంలో కనుగొన్నారు. సిలోసైబిన్ అనే మత్తుమందుని 30 మంది హార్వర్డ్ యూనివర్శిటీకు చెందిన తత్వశాస్త్ర విద్యార్థుల మీద ప్రయోగించారు. ఇందులో 15 మందికి - గుడ్‌ఫ్రైడే రోజున డబల్ బ్లైండ్ ప్రక్రియ ద్వారా సిలోసైబిన్‌ను ఇచ్చారు. మిగిలిన 15 మందికి ఒక నకిలీ మందును ఇచ్చారు. దీనిని ప్లెసబో అంటారు - ఇది మత్తుమందు కాదు, అసలిందులో ఏ విధమయిన మందూ ఉండదు. వైద్య ప్రయోగంలో ఖచ్చితమయిన ఫలితాల కోసం దీనిని వాడతారు. డబల్ బ్లైండ్ ప్రక్రియ అంటే - ప్రయోగం పూర్తయ్యే వరకూ ప్రయోగంలో పాల్గొన్న వారి వివరాలు, ప్రయోగం నిర్వహించిన వారి వివరాలు గుప్తంగా ఉంచబడతాయి. ఎవరికి సిలోసైబిన్ (మత్తుమందు) ఇవ్వబడింది? ఎవరికి ప్లెసబో (నకిలీమందు) ఇవ్వబడింది? అనేది పరిశోధకులకు గానీ, ప్రయోగంలో పాల్గొన్న వారికి గానీ తెలియదు. దీని ద్వారా ఫలితాలలో నిర్దిష్టత పెరుగుతుంది. సిలోసైబిన్ ఇవ్వబడినవారు తమ జీవితంలో ఎన్నడూ అనుభవించని మతానుభవాన్ని పొందినట్లు వర్ణించారు. ఈ ప్రయోగ ఫలితాల ఆధారంగా, మత్తు మందుల ద్వారా కలిగిన మార్మిక అనుభవాలు, ఇతర విధానాల వలన కలిగిన అనుభవాలు ఒకే రకంగా ఉంటాయని నిర్ధారించారు స్మిత్.[32]

**మత్తుమందులతో అపాయం:**

ప్రయోగాలలో తేలినట్లు ఈ మత్తుమందుల వలన తలనొప్పి మొదలు పిచ్చి పట్టటం వరకూ అనేక దుష్ఫలితాలు ఉండగలవు. అందుకనే వీటిని నిషేధించడమైనది (1960-70ల మధ్య).

ధ్యాన సాధన అనేది తగురీతిలో చేస్తే - మెదడులో ఈ మార్మిక అనుభవాల పరిణామాన్ని సహజ సిద్ధంగా, ఒక క్రమమయిన రీతిలో నెలకొల్పే ప్రక్రియ అయితే మత్తుమందుల వలన ఈ పరిణామాలు అకస్మాత్తుగా సంభవించడం వలన ఈ దుష్ఫలితాలు కలుగుతాయి.

1960లలో, మెహర్‌బాబా కూడా 'గుళికలో - దేవుడు' (God in a pill) గా పిలవబడిన ఈ పరిస్థితికి వ్యతిరేకంగా ప్రచారానికి నడుం కట్టారు. ఈ మందులు ఆధ్యాత్మికంగా నష్టాన్ని కలుగజేస్తాయని ఆయన వివరించారు. 1990 వ సం॥రం తరువాత తిరిగి ఈ మత్తుమందుల మీద అనేక ప్రయోగాలు జరిగి ఎన్నో ఆసక్తికరమయిన ఫలితాలు వెల్లడయ్యాయి.

## మత్తుమందులు మార్మిక అనుభవాన్ని ఎలా కలుగజేస్తాయి?

మార్మిక అనుభవాలను కలిగించే LSD, సిలోసైబిన్, DMT లు రసాయనికంగా మన కేంద్ర నాడీ మండల వ్యవస్థలోని రసాయనాలను పోలి ఉంటాయని తేలింది మరియు ఈ మందులు మెదడులోని సెరోటినిన్ న్యూరో ట్రాన్స్‌మిటర్ అనే వ్యవస్థను ప్రభావితం చేస్తాయని వెల్లడయింది. ఈ వ్యవస్థ మన గ్రాహ్యక, చైతన్యతలను చేరే అనేక ఉత్తేజితాలను నియంత్రిస్తుంది.

మార్మిక అనుభవాల తీవ్రతకు, మెదడులోని సెరోటినిన్ రిసెప్టర్ల సంఖ్యకు విలోమ సంబంధం ఉందని పరిశోధకులు కనుగొన్నారు. అంటే మార్మిక అనుభవాలకు కారణమైన మెదడులోని వివిధ భాగాలలో సెరోటినిన్ రిసెప్టర్లు ఎంత తక్కువగా ఉంటే అంత ఎక్కువగా మార్మిక అనుభవ తీవ్రత ఉంటుందన్న మాట. ఈ విధంగా సెరోటినిన్ వ్యవస్థ మనకు ఆధ్యాత్మిక అనుభవాల వివరణలో ఉపయోగపడుతుందని పరిశోధకులు వెల్లడించారు.[33]

ఈ మత్తుమందుల సేవనం తర్వాత వింత వింత ఆకారాలు, వేరే ప్రపంచంలా అనిపించే దృశ్యాలు ఎలా ఆవిర్భవిస్తున్నాయో కూడా శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. మెదడు యొక్క Visual Cortex లోని న్యూరాన్లలో విచక్షణారహితంగా జరిగే discharge ప్రక్రియ పర్యవసానంగా చుట్టుపక్కల న్యూరాన్లలో సంభవించే పరిణామాల వలన ఇదంతా జరుగుతుంది. దీని గురించి ఇక్కడ సవివరంగా వివరించడం విషయాంతరం కాగలదు. గమనించవసినదేమిటంటే - కళ్లముందు ఏమీ లేకున్నాగాని మెదడులో సంభవించే పరిణామాల వలన అనేక దృశ్య, ప్రపంచ వీక్షణ అనుభవాలు సంభవమనేది.

ఈ విధంగా, కొన్ని రకాల మత్తుమందుల వలన కలిగిన మార్మిక అనుభవాలు మెదడులో రసాయన చర్యల ఫలితంగా సంభవిస్తున్నాయి. మార్మిక అనుభవాలను కలిగించే వ్యవస్థలు మెదడులో ఉన్నాయనేది దీని ద్వారా నిరూపితమయ్యే విషయం. ఉత్తేజితాలను బట్టి వేర్వేరు విధానాలలో అది జరుగవచ్చు. అంటే అనేక రకాలుగా ఆ వ్యవస్థలను ఉత్తేజితం చేయవచ్చు - మత్తు మందులు, ధ్యాన సాధన, ఇతర చర్యలు (వేగంగా చుట్టూ తిరుగుతూ మంత్రాలు వల్లిస్తూ కొంతమంది సూఫీలు చేసే నాట్యాలు). వీటన్నంటి ఫలితం ఒకే రకమయిన అనుభవాలు. ఇది శాస్త్రపరంగా ఋజువయిన విషయం. ఇదంతా మెదడులో జరుగుతుంది. ఒకవేళ ఈ మార్మిక అనుభవాలనేవి దేవుని అనుభవం పొందడం, దేవునితో సమానమవడం వంటి వాటికి ప్రమాణాలయితే ఇవి కనీసం మత్తుమందుల సేవనం వంటి చర్యల వలన కలుగకూడదని మీరు ఒప్పుకుంటారా?

మార్మిక అనుభవాలనేవి ఎంత నిజమైనవనిపించేటట్టున్నా - మెదడులో జనించే స్థితులేనని, దేవునితో సంబంధం లేనివనీ నిరూపించే ఆధారాలను పలు కోణాలలో మీ ముందుంచడం జరిగింది.

**"మార్మికవాది ఒక మహదానంద క్షణాన్ని, జీవితాంత అయోమయ వ్యయంతో కొనుక్కొంటాడు. ఈ అయోమయాన్ని ఇతరులకు వ్యాపింపజేస్తాడు. కవిత్వాన్ని – మనస్తత్వశాస్త్ర భాషలో వర్ణించినట్లు – ఒక అనుభవాన్ని మరొక భావంలో వర్ణించడం ఓ గొప్ప అయోమయానికి దారి తీస్తుంది."** - బంటింగ్ బాసిల్.

ఇదీ మార్మిక వాదుల ప్రకటన అయిన ''నేను దేవుణ్ణి'' మరియు మార్మిక వాదతత్వమయిన అద్వైత సిద్ధాంతాల వెనుక గల మార్మిక అనుభవాల గురించి శాస్త్రజ్ఞాన పరిశోధనలలో వెల్లడయిన నిజం.

దేవుని భావన ఉన్న మార్మికవాద సాంప్రదాయాల్లో - మార్మికవాదులు వాళ్ళ గురువులద్వారా, శిక్షణ ద్వారా ఈ అనుభవాలు దైవానుభవాలని బోధింపబడి, వీటికోసం సంవత్సరాల కొద్ది నిరీక్షిస్తారు. వారి సాధనల వలన, మెదడులో పరిణామాలు సంభవించి, ఈ అనుభవాలు  పొందగానే వారు - జ్ఞానోదయం పొందామని, పరమసత్యాన్ని గ్రహించామని, దేవునితో లీనం అయ్యామని, దేవుళ్ళమని చెప్పుకుంటారు. లీనత్వం (సమాధి), సంపూర్ణ ఐక్యస్థితులు కలిగి, నిజాతి నిజాలుగా అనిపించే ఈ అనుభవాలు వారిలో ఈ నమ్మకాన్ని మరింతగా పెంచుతాయి.

ఈ మార్మిక అనుభవాల అనంతరం వారు ప్రపంచాన్ని ఒక కొత్త దృక్పథంలో చూడనారంభిస్తారు. వారు అనుభవించింది పరమసత్యమని (అంతా అదే, అది తప్ప మరేమియులేదు), ఆ అనంతమయిన చైతన్యస్థితి - అంతా ఒక దానితో మరొకటి అల్లుకుపోయి ఉన్నట్టనిపించిన (అంతా ఒకటే అనిపించే ఆ స్థితి) ఆ భావనయే పరమసత్యమని అనిపిస్తుంది.  ఈ విధంగా 'అంతా దైవమే, మనం కూడా ఆ దేవునిలో ఒక భాగమే' అనే భావనలు మార్మికవాదులచే ప్రాచుర్యంలోకి తేబడినాయి.

ఇలా దేవుడు అనంతమయిన చైతన్యమనే మార్మికవాదం యొక్క మౌలిక భావనే అన్నివిధాలా తప్పని ఋజువు అవుతుంది . మార్మికవాదులు మతాలన్నింటి మీదా, తమ ప్రభావం చూపారు. అయితే, హిందూ మతం మీద దీని ప్రభావం అత్యధికంగా కనబడుతోంది. మాయ, పునర్జన్మ, మోక్ష భావనలు -  మార్మికవాదులు చెప్పే అర్థాలతో వేదాలలో లేవు. ఈ భావనలు వేదకాలం తర్వాత, మార్మిక వాదులచే వెలుగులోకి తేబడిన వేదాంతాలయిన ఉపనిషత్తులలో దర్శనమిచ్చాయి. ఇవి ఎలా హిందూ మతాన్ని సమూలంగా మార్చివేశాయో తరువాతి అధ్యాయంలో చూద్దాం.

“ మనం మార్మిక వాదుల్ని అనుసరిస్తాం.

వాళ్ళెకడికెళ్తున్నారనేది వారికి తెలుసు.

కానీ, వాళ్ళు కూడా దారి తప్పుతారు.

అదికూడా మర్మమయిన, అంధకార, రహస్య రీతిలో... ”

-కపుసిన్స్కి రైజాడ్

# 5. హిందూ మతంపై మార్మికవాద ప్రభావం

## మాయ, పునర్జన్మల మార్మికవాద సిద్ధాంతం



ఆత్మ యొక్క 'జనన-మరణ-పునర్జనన' చక్రాన్ని విశదీకరించే చిత్రం.[1]

'మాయ' అనేది మార్మికవాద తత్వంలో ఎంతో ముఖ్యమయిన భావన. మాయను తెలుసుకోవడమే - జ్ఞానోదయమంటే. 'మోక్షం' పొందాలంటే మాయను దాటి తీరాల్సిందే. అది జరగనంతవరకూ 'సంసార' గా పిలువబడే 'జనన-మరణ-పునర్జనన' చక్రం ఆగదు. ఈ విధంగా మానవ జీవిత పరమ లక్ష్య మయినటువంటి 'మోక్షం' 'మాయ'తో ముడిపడి ఉంది. మాయ - సంసార - మోక్ష అనే ఈ భావనలు మెహర్‌బాబా, సాయిబాబాలు కొత్తగా బోధించినవేమీ కావు. ఇవి హిందూ మార్మికవాద సాంప్రదాయం యొక్క మౌలిక భావనలు. మెహర్ బాబా ఈ భావనలను, జొరాష్ట్రియన్ మార్మికవాద మరియు సూఫీ సాంప్రదాయాల భావనలతో మిళితం చేసి వీటికి ఓ కొత్త రూపాన్నిచ్చారు.

మార్మిక అనుభవసమయంలో - మెదడులోని OAA భాగానికి సమాచార నిర్బంధన (డి-అఫరెంటేషన్) జరగడంతో - 'స్వ'భావన (పరిమిత భావన) కోల్పోబడడంతో, మార్మికవాది- ఒక అనంతమయిన చైతన్య స్థితిని పొందుతాడు. మార్మికవాది విశ్వాసాన్ని బట్టి ఇది దేవునిగా లేక శూన్యంగా వర్ణించబడుతుంది. వర్ణన ఏమయినా గానీ - ఈ అనుభవంలో మార్మికవాదికి - ఒక బలమైన, నిజాతినిజంగా అనిపించే 'ఇదే పరమసత్యం - ఉన్నదంతా కూడా ఈ అనంతమైన ఇదే - ఇది తప్ప మరేమీ లేదు' అనే భావన కలుగుతుంది. ఎందుకంటే ఈ స్థితిలో 'పరిమిత' భావనే లేకపోవడం వలన. ఈ అనుభవం నుంచి బయటపడిన వెంటనే (డీ-అఫరెంటేషన్ - సమాచార నిర్బంధం అంతమయి, మాములు చైతన్యస్థితి నెలకొల్పబడిన పిమ్మట) - మార్మికవాది ఒక వైరుధ్య భావనకు గురౌతాడు. మార్మిక అనుభవంలో పరమసత్యాన్ని తిలకించిన భావన కలిగింది. మరి తను ఇప్పుడు చూస్తున్నదేమిటి? తన శరీరం, పరిసరాలు ఈ ప్రపంచం మొదలైనవి? దీనికి వివరణగా మార్మిక వాది - ఆ అనంతమయిన చైతన్యం లేదా పరమాత్మయే పరమసత్యమని, ఈ ప్రపంచమంతా ఒక భ్రమ, మాయ అని వర్ణిస్తాడు.

## పునర్జన్మ భావన వెనుక తర్కం

బ్రహ్మలో ఐక్యతను పొందువరకూ మానవుడు ఒక జన్మ తరువాత మరొక జన్మ - ఇలా నిరంతరం జన్మలెత్తుతూ ఉంటాడనే భావన ఎలా రూపుదిద్దుకుందో శ్రీ డా॥ S. రాధాక్రిష్ణన్ ఇలా వివరించారు:

"ఉపనిషత్తులలో పునర్జన్మకు ఒక ప్రత్యేకస్థానం ఉంది. వాటి అభిప్రాయంలో మనిషి చనిపోయిపుడు అతని ఆత్మ నశించదు, జీవితం నిరంతరం సాగుతూ ఉంటుంది అని వాటి ధృడమయిన విశ్వాసం. ఇది వారి కర్మఫలముననుసరించి ఉంటుంది. 'బ్రహ్మణం' (వేదాల)లో నిర్వచించిన పునర్జన్మ పరలోకంలో అనే భావనకు పూర్తిగా విరుద్ధంగా, ఉపనిషత్తులలో పునర్జన్మ ఈ లోకమందేనని మార్పు గావించబడింది. బ్రహ్మలో ఐక్యతే నిజమయిన నిత్యజీవితం. కాబట్టి బ్రహ్మలో లీనమయిపోవడమే శాశ్వతత్వము. దీనికి అనర్హమయిన ఆత్మ నిరంతరం చావు పుట్టుకల విధికి కట్టుబడి ప్రపంచంలో అనేక జన్మలు ఎత్తి చిట్టచివరకు ఈ పరంపర నుండి విడివడును. వాడు చేసుకున్న కర్మలకు అనుగుణంగానే వాడికి జన్మ కలుగుతుంది. ఒక జన్మకు మరొక జన్మకు నడుమ విడువడని అనుబంధం ఉంటుంది" [2]

ఈ విధంగా వేదాలలో ఉన్న పరలోక పునర్జన్మ భావన, ఆ తరువాత వ్రాయబడిన ఉపనిషత్తులలో ఇహలోక పునర్జన్మ భావనగా మార్చివేయబడింది.

ఇతర మత గ్రంథాలలో (యూద, క్రైస్తవ, ఇస్లాంలలో) కూడా వేదాలతో ఏకీభవించే పరలోక పునర్జన్మ భావన ఉంది. అంటే మనం మరలా జన్మించబడతామని - ఈ లోకంలో కాదు, పరలోకంలో మరియు ఈ లోకంలో మన కర్మలను బట్టి తీర్పుదినం నాడు మనకు స్వర్గం లేదా నరకం ప్రాప్తిస్తాయనేది. ముఖ్యమయిన విషయమేమిటంటే - ఈ పరలోక జీవితం అనేది శాశ్వతమయినది. అందువలన అక్కడినుండి మరలా ఈ లోకంలోకి వచ్చి జన్మనెత్తడం అనేది ఉండదు.

ఈ విధంగా మార్మికవాదం ప్రతిపాదించే ఇహలోక పునర్జన్మ భావన, మత గ్రంథాలలో ఉన్న పరలోక పునర్జన్మ భావనలు పరస్పరం విరుద్ధం అనేది సుస్పష్టం. వీటిలో ఏదో ఒకటి మాత్రమే సత్యం కాగలదు, రెండవది అసత్యం లేదా కల్పితం.

మార్మిక అనుభవాలు ఏవిధంగా ఈ భావనలకు (మాయ, బ్రహ్మలో ఐక్యత లేక సమాధి, ఇహలోక పునర్జన్మ) దారితీశాయో విజ్ఞానశాస్త్రం ఆధారంగా ఇప్పటివరకూ పరిశీలించడమయినది. అయితే కొంతమందికి ఈ వివరణ మీద నమ్మకం కలుగకపోవచ్చు. ఈ అధ్యాయంలో దీనిని హిందూ మత గ్రంథాలు ఏమి ప్రబోధిస్తున్నాయి? అనే కోణంలో విశ్లేషించడం జరిగింది.

హిందూ మతం ఈ రెండు పరస్పర విరుద్ధ సిద్ధాంతాలలో దేనిని ప్రబోధిస్తుంది? ఏ మతమయినా, రెండు పరస్పర విరుద్ధ సిద్ధాంతాలను ప్రతిపాదించడమనేది అసహేతుకం కదా? హిందూ మతంలో ప్రామాణిక గ్రంథాలుగా పరిగణించబడే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీతలు ఏ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నాయనేది ఒక్కసారి పరిశీలిద్దాం.

## వేదాలలో ఇహలోక పునర్జన్మ భావన లేదు

ఇహలోక పునర్జన్మ సిద్ధాంతం - హిందూ మత నమ్మకంలో భాగంగా ఎంతగా ప్రచారం చేయబడినదంటే, ఇది ఒక సర్వసాధారణ విషయంగా మారిపోయింది. 'అంతా పూర్వజన్మ సుకృతం, ఇదంతా నాకర్మ' మొదలయిన పదాలను పరిశీలిస్తే - పునర్జన్మ సిద్ధాంతాన్ని మనమెంత మౌలిక జీవిత నియమంగా భావిస్తున్నామో అర్థం అవుతుంది. 'ఎప్పటికీ ఇక్కడే ఏదో ఒక రూపంలో ఉంటాం' అని మన మస్తిష్కాలలో బలంగా నాటుకుపోయిన భావనవలన, మనం మరణానంతర పరిస్థితుల గురించి పెద్దగా పట్టించుకోని పరిస్థితి ఏర్పడింది.

వేదాలు హిందూ మతం యొక్క అత్యంత ప్రాచీనమయిన మరియూ ప్రామాణికంగా పరిగణించబడే గ్రంధాలు. ఇహలోక పునర్జన్మ సిద్ధాంతం వేదాలలో ఏ కోశానా లేదు. వేదాలు చదివిన వారికి - ఆర్యులు పరలోక పునర్జన్మ సిద్ధాంతాన్ని నమ్మేవారనేది బోధపడుతుంది.

'తీర్పుదినాన్ని ధిక్కరించి, బోధనల తత్వాన్ని పెడచెవినపెట్టి - వారు నేను విధించిన హద్దులను అతిక్రమించుచున్నారు' *(ఋగ్వేదం 1-4-3).*

''................ ఓ అగ్ని - అహంకారులు, ధనికులు - తీర్పుదినంనాడు నాతో ప్రశ్నింపబడుదురు'

*(యజుర్వేదం 50-11-75).*

వేదాలలో ఇహలోక పునర్జన్మ భావన లేదనేది అనేకమంది వేద పరిశోధకులు వెల్లడించిన వాస్తవం:

- డా॥ రాధాక్రిష్ణ గారు - 'ఇండియన్ ఫిలాసఫీ' (సంపుటము1)లో : 'వేదాలలో పునర్జన్మ సిద్ధాంతంలేదు' అని వ్రాశారు. అనేకమంది హిందూ మేధావులు ఆయనతో ఏకీభవించారు. హిందూగ్రంథాల ప్రముఖ పాశ్చాత్య పరిశోధకుడు - మాక్స్ ముల్లర్ కూడా - దీనిని ధృవీకరించారు.

- సత్యార్థ విద్యఅలంకార్ ఇలా వ్రాశారు: 'నేను వేదాలలో పునర్జన్మ భావన లేదని పందెం కూడా కాయగలను' *(ఆవగ్వాన్, 104వ పేజి)*

- డా॥ పరోడా చౌహాన్ తన పుస్తకంలో వ్రాశారు: 'వేదాలు మనకు పునర్జన్మ గురించి చెబుతాయి. కానీ - ఒకే ఒక్కసారి పరలోకంలో పునర్జన్మిస్తామని. అంతేగాని, మరల మరలా ఇక్కడే పునర్జన్మిస్తామని కాదు.' *('పునర్జనమ్ అండ్ వేదాస్', 93వ పేజి)*

## ఉపనిషత్తులు - మార్మికవాదానికి శ్రీకారం

భారతీయ తత్వశాస్త్రానికి మూలాలుగా ఎంచబడుతున్న ఉపనిషత్తుల కాలం క్రీస్తు పూర్వం 1000 నుండి 300-200 మధ్యగా భావించబడుతుంది. 100కు పైగా ఉన్న ఉపనిషత్తులు అనేకానేకులచే వ్రాయబడ్డాయి. ఈ పుస్తకంలో విశ్లేషించినట్టుగా వాటిలో మార్మిక అనుభవాల వర్ణనలు, తద్వారా వెలువడిన సిద్ధాంతత్వాలు స్పష్టంగా దర్శనమిస్తాయి. ఉపనిషత్ (ఉప-ని-సద్) అంటే 'సమీపంలో కూర్చోవడం' అని అర్థం. అంటే గురువు సమీపంలో కూర్చుని శిష్యులు విద్యాభ్యాసం చేయటం.

''నేను దేవుణ్ణి'' అనే మార్మికవాద సిద్ధాంత సారం మొత్తం ఈ క్రింది నాలుగు ఉపనిషద్ వాక్యాలలో ఉందని చెప్పవచ్చు:

**"ప్రజ్ఞానం బ్రహ్మ = ప్రతీ జీవిలో ఉండే స్వ స్వరూపానికి సంబంధించిన ఎరుక లేదా చైతన్యమే బ్రహ్మ"**
**- ఐతరేయ ఉపనిషత్తు**

**"తత్ త్వమ్ అసి = అది నీవే అయి ఉన్నావు" - ఛాందోగ్య ఉపనిషత్తు**

**"అహం బ్రహ్మాసి = నేనే బ్రహ్మను అయి ఉన్నాను" - బృహదారణ్యక ఉపనిషత్తు**

**"అయమాత్మా బ్రహ్మ = ఈ ఆత్మయే పరబ్రహ్మ" - మాండూక్య ఉపనిషత్తు**

ఉపనిషత్తులనే వేదాంతం అంటారు. అంటే సమస్త వేదసారం నింపిన గ్రంధాలని. కానీ అవి వైదిక కర్మకాండకు బహుదూరమేకాక దానిని వ్యతిరేకించి, అప్పటివరకూ లేని పునర్జన్మ, సంసార, మోక్ష భావనలతో కూడిన ఒక నూతన మార్మికవాద సిద్ధాంతత్వాన్ని ప్రతిపాదించాయనేది స్పష్టంగా తెలుస్తోంది. నండూరి రామమోహనరావు గారు ఇలా వ్రాశారు:

**"ఉపనిషత్తులు వేదాలపై తిరుగుబాటు, ఉపనిషత్తులు బోధించిన మతం వేదమతం కంటే భిన్నమయినది".[3]**

అవైదిక సిద్ధాంతాలు కలిగి ఉన్న ఉపనిషత్తులను వేదాంతం అని నామకరణం చేయటం ఒక పెద్ద వైరుధ్యం అనేది సుస్పష్టం. అవైదిక (వేదాలను తిరస్కరించిన లేదా వ్యతిరేకించిన)సిద్ధాంతాలుగా ముద్ర పడకుండా నిరోధించడం మరియు దానికి వేదాలకున్న ప్రామాణికతను కల్పించడం అనేది ఆ నామకరణం వెనుక ఉన్న గూడార్థం అనేది సులువుగా అర్థం అవుతుంది. లేకపోతే బౌద్ధ, జైన మతాలలాగ అదికూడా ఒక అవైదిక మతంగా గుర్తించబడేది. వేదాంతం అనే పేరువలనే అది బహుళ జన ప్రాచుర్యాన్ని, ఆమోదాన్ని పొందింది. వేదాల పేరుతో దీనిలో చెప్పబడింది గుడ్డిగా నమ్మడమే గాని అసలు ఈ సిద్ధాంతాలు వేదాలలో ఉన్నయా? లేదా? అని తర్కించుకునేవారెంతమంది?

## హిందూ మతంలో విభజనలకు దారితీసిన మార్మికవాదం

మన దేశ ఆధ్యాత్మిక చరిత్రలో గమనించదగ్గ ఒక ముఖ్యవిషయం - మతభావనలు, దైవభక్తి, తత్వ సిద్ధాంతాలు, మార్మికవాదం, కాల్పనికగాధలు మొదలయినవన్నీ కలగలసిపోవటం. అదెలాగో గమనించండి:

మార్మిక సిద్ధాంతాలతో పాటు అనేకానేక తత్వ విచారాలతో నిర్దిష్టరహితంగా, పరస్పర విరుద్ధ భావాలతో ఉన్న ఈ ఉపనిషత్తులను సూత్రబద్ధీకరించి, ఒక దర్శన శాస్త్రంగా మలచిన ఘనత బాదరాయణుడిది (ఇతని పేరు మినహా ఇతర వివరాలు తెలియవు). ఇతని రచనలనే వేదాంత సూత్రాలు లేదా బ్రహ్మసూత్రాలు అంటారు.

ఈ సూత్రాలనుండి అద్వైత సిద్ధాంతం (మార్మికవాదం) స్థాపిస్తూ శంకరాచార్యులవారు, విశిష్టాద్వైత సిద్ధాంతం నిరూపిస్తూ రామానుజులవారు, ద్వైత సిద్ధాంతం నిరూపిస్తూ మాధవాచార్యులవారు భాష్యాలు వ్రాశారు. ఇంకా అనేకులు అనేకానేక భాష్యాలు వ్రాశారు. ఇవన్నీ పరస్పర విరుద్ధ సిద్ధాంతాలు. అద్వైత సిద్ధాంతం తరువాత వచ్చిన సిద్ధాంతాలన్నీ అద్వైత సిద్ధాంతంలోని నిర్గుణ, నిరాకార, నిష్క్రియ దైవ భావనను ఖండించడానికి చేయబడ్డాయనేది గమనించదగ్గ విషయం.

అద్వైత సిద్ధాంతం: ఈ జగత్తు సమస్తం,జీవం- మాయ లేదా మిధ్య (ఒక భ్రాంతి), ఏమీ లేదు. ఉన్నది ఒక్కటే - అదే బ్రహ్మం- నిర్గుణ, నిరాకార, నిష్క్రియ చైతన్యం. అదియే పరమ సత్యం, తక్కినదంతా అసత్యం. జ్ఞానం ఒక్కటే మోక్షమార్గం.

విశిష్టాద్వైత సిద్ధాంతం: జగత్తు, జీవాత్మ మిధ్య కాదు. బ్రహ్మం నిర్గుణం కాదు, సగుణం. అదియే విష్ణువు. జీవుడు వేరు, బ్రహ్మం వేరు కాని బ్రహ్మం స్వతంత్రం, జీవం పరతంత్రం. భక్తి ఒక్కటే మోక్షమార్గం.

ద్వైత సిద్ధాంతం: జీవం వేరు, దేవుడు వేరు. జగత్తు వేరు, దేవుడు వేరు. జీవుడు, జగత్తు మిధ్య కాదు, సత్యం. బ్రహ్మం నిర్గుణం కాదు, సగుణం, జగత్కర్త..విష్ణువు... ఆయనే నారాయణుడు, శ్రీహరి, వాసుదేవుడు, కృష్ణుడు. భక్తి ఒక్కటే మోక్షమార్గం.

ఇది ఇలా ఉండగా, అవైదిక భావనలతో నిండిన పురాణాలు అనేకం రచించబడ్డాయి. పురాణాలలోని భాగవత పురాణంలో విష్ణువు దశావతారాల కథలు, ముఖ్యంగా శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, అద్భుతాలు మొ॥వి ప్రచారం చేయబడ్డాయి. పురాణాలలో శివ పురాణాలు కూడా ఉన్నాయి. వైష్ణవులు విష్ణువుకు పెద్దపీట వేయగా, శైవులు పరబ్రహ్మం శివుడేనని సిద్ధాంతం చేశారు. ఆయన అర్ధాంగి పార్వతి కూడా అనేక పేర్లతో (ఉమ, గౌరి, దుర్గ, కాళి, చాముండి మొ॥వి)ఆరాధ్యురాలయింది. ఈ విధంగా మార్మికఅనుభవ మూలాలు గల సిద్ధాంతత్వాలను ఖండించడానికి చేయబడిన సిద్ధాంతత్వాలతో అవైదిక పురాణ గాధలు సంయోగం చెందాయి.

## భగవద్గీతలో 'పరలోక' పునర్జన్మ భావన

"అర్జునా! ఒకవేళ నీవీ ధర్మయుద్ధమందు శత్రువులచే చంపబడినచో స్వర్గమును బొందెదవు. అట్లుగాక నీవే జయించినచో భూలోక రాజ్యముననుభవించెదవు. ఈ ప్రకారముగ రెండు విధముల మేలే. కావున లెమ్ము, యుద్ధమునకు సంసిద్ధుడవు కమ్ము" (గీత 2:37)

"అజ్ఞానముచే మోహము (భ్రమ) నొందువారును, అనేక విధములయిన చిత్తచాంచల్యములతో గూడినవారును, మోహము (దారాపుత్ర క్షేత్రాదులందు అభిమానము) అను వలచే బాగుగా గప్పబడినవారును, కామములననుభవించుటయందు మిగుల యాసక్తిగల వారును అయి, వారు (అసుర ప్రకృతి గలవారు) అపవిత్రమయిన నరకమునందు పడుచున్నారు." (గీత 16:16)

" ఏ మనుజుడు శ్రద్ధతో గూడిన వాడును, అసూయ లేనివాడును ఈ గీతా శాస్త్రమును వినునో, అట్టివాడును పాప విముక్తుడయి పుణ్యకార్యములు చేసినవారి యొక్క పుణ్యలోకములను పొందును." (గీత 18:71)

**"మూడు వేదముల నధ్యయనము చేసినవారును, సోమపానము గావించినవారును, పాపకల్మషము తొలగినవారునగు మనుజులు యజ్ఞములచే నన్ను పూజించి స్వర్గము కొరకై నన్ను ప్రార్థించుచున్నారు. వారు (మరణానంతరము) పుణ్యఫలమగు దేవేంద్రలోకమును బొంది, అట్టి స్వర్గమందు దివ్యములగు దేవభోగములననుభవించుచున్నారు." (గీత 9:20)**

మోక్షం అంటే శాశ్వతమయిన స్వర్గాన్ని పొందడమే గాని దేవునిలో ఐక్యం అవడం కాదని ఇలాంటి అనేక శ్లోకాల విశ్లేషణ ద్వారా తెలుస్తుంది. ఒకవేళ మోక్షం అంటే 'దేవునిలో కలసిపోవడం' అయిఉంటే మరియు అది ఈ స్వర్గాన్ని పొందడం కంటే కూడా లాభదాయకం అయి ఉంటే - వేదవేదాంగ పారంగతులు, యాగయజ్ఞాదులనాచరించి, సర్వ పాపములు క్షమించబడినవారు కూడా మోక్షం పొందడానికి దేవునిలో లీనం చేయమని కోరుకోవడానికి బదులుగా స్వర్గప్రాప్తినే ఎందుకు కోరుకుంటారు? దేవునిలో లీనమవడమే స్వర్గధామం కంటే కూడా శ్రేష్టమయినదయితే అట్టి పుణ్యాత్ములు స్వర్గం కొరకు ఎందుకు ప్రార్థిస్తారు? దేవునిలో లీనం చేసుకోమని ఎందుకు ప్రార్థించడం లేదు? నిజానికి మనిషి కోరేది మోక్షమే కదా? మరి వారు స్వర్గం కొరకు ప్రార్థించారంటే దీనివలన మోక్షార్హులకు లభించే స్థానం స్వర్గం అని తెలుస్తుంది. కాబట్టి మోక్షం అంటే స్వర్గప్రాప్తమే గాని దేవునిలో లీనం అయిపోవడం కాదు అని బోధపడుతుంది.

ఈ విధంగా మార్మికవాదానికి వ్యతిరేకమయిన స్వర్గ, నరక భావన భగవద్గీతలో ఉంది. అంతేకాక, ఇహలోక పునర్జన్మ భావనను నీరుగార్చే సందేశం కూడా అందులో ఉంది:

''ఓ అర్జునా! ప్రాణకోట్లన్నియు పుట్టుకకు పూర్వం కనబడకయు పుట్టిన పిదప (దేహముతో గూడి) కనబడుచును, మరణించిన పిదప కనబడకయు నుండుచున్నవి. అట్టివాని విషయమై శోకింపనేల?'' (గీత 2:28)

జన్మ తరువాత జన్మ (ఇహలోకంలో) అనే సిద్ధాంతం వాస్తవం కాదని తెలుపడానికి ఈ ఒక్క శ్లోకమే చాలు.

''ఓ అర్జునా! అశ్రద్ధతో చేయబడిన హోమము గాని, దానము గాని, తపస్సు గాని, ఇతర కర్మలు గాని 'అసత్తని' చెప్పబడును. అవి ఇహలోకఫలమును (సుఖమును) గాని, పరలోకఫలమును (సుఖమును) గాని కలుగజేయవు.'' (గీత 17:28)

''ఓ అర్జునా! అట్టి యోగభ్రష్టునకీ లోకమందు గాని, పరలోకమందు గాని వినాశము కలుగనే కలుగదు. నాయనా! మంచి కార్యములు చేయువాడెవడును దుర్గతి పొందడు గదా!'' (గీత 6:40)

''జ్ఞానము లేనివాడు, శ్రద్ధరహితుడు, సంశయచిత్తుడు వినాశనమునే పొందును. సంశయచిత్తునకు ఇహలోకమునగాని, పరలోకమునగాని సౌఖ్యము లేవు.'' (గీత 4:40)

మనిషి నిరంతరం స్వయంగా దేవునిలో కలసిపోయే వరకూ (లీనం అయిపోయేవరకూ) జన్మ తరువాత జన్మ ఎత్తుతూనే ఉంటాడు అన్నదే నిజమయితే, మనిషి మరణం తరువాత దుఃఖము చేత బాధకు గురికావడం లేక సుఖసంతోషాలలో తూలతూగడం వంటివి జరిగే చోటు 'పరలోకం' అని పై శ్లోకాలన్నింటిలోను చెప్పే ఆవశ్యకత ఏముంది?

## భగవద్గీతలో 'ఇహలోక' పునర్జన్మ భావన

అయితే ఈ శాశ్వత స్వర్గ, నరకాల పరలోక పునర్జన్మ భావనకు వ్యతిరేకంగా భగవద్గీతలో ఇహలోక పునర్జన్మ భావనగల శ్లోకాలు కూడా దర్శనమిస్తాయి. ఈ రెండు పరస్పర విరుద్ధ భావనల మధ్య రాజీ కుదర్చడానికన్నట్టు అవి స్వర్గ, నరకాలకు కాల పరిమితిని నియమించాయి. అంటే కొంతకాలం స్వర్గం లేదా నరకంలో గడిపి తిరిగి ఈ లోకంలో పునర్జన్మ ప్రాప్తిస్తుందని చెప్పబడింది.

"యోగభ్రష్టుడు (మరణానంతరము) పుణ్యాత్ముల లోకములనుపొంది, అట అనేక వత్సరములు నివశించి, తదుపరి పరిశుద్ధులయినట్టి (సదాచారవంతులయిన) శ్రీమంతుల యొక్క గృహమునందు పుట్టుచున్నాడు. లేక, (ఉత్తమతరగతి యోగియైనచో) జ్ఞానవంతులగు యోగులయొక్క వంశమందే జన్మించుచున్నాడు. ఈ ప్రకారమగు జన్మము లోకమున మహాదుర్లభమైనది." (గీత 6:41,42)

"ఓ అర్జునా! అట్లాతడు యోగులవంశమున జన్మించి పూర్వదేహ సంబంధమైన (యోగవిషయిక) బుద్ధితోటి సంపర్కమును పొందుచున్నాడు. అట్టి (యోగ) సంస్కారము వలన నాతడు సంపూర్ణయోగసిద్ధి (మోక్షము) కొరకై మరల తీవ్రతర ప్రయత్నమును సల్పుచున్నాడు." (గీత 6:43)

"పట్టుదలతో ప్రయత్నించునట్టి యోగి పాపరహితుడై, అనేక జన్మలందు చేయబడిన అభ్యాసముచే యోగసిద్ధినిబొందినవాడై, ఆ పిదప సర్వోత్తమమగు (మోక్ష) గతిని బడయుచున్నాడు." (గీత 6:45)

ఈ విధంగా రెండు పరస్పర విరుద్ధ సిద్ధాంతాలు మనకు భగవద్గీతలో ప్రక్కప్రక్కనే దర్శనమిస్తాయి. ఏ దివ్యగ్రంధమయినా రెండు పరస్పర విరుద్ధ సిద్ధాంతాలను ఎలా ప్రతిపాదించగలదు? కావునా ఈ రెండు సిద్ధాంతాలలో ఏదో ఒకటి మాత్రమే నిజం కాగలదు, రెండవది అసత్యం లేదా కల్పితం. అవైదికమైన ఇహలోక పునర్జన్మ భావనను బోధించే ఈ శ్లోకాలు వాటిలో అవే అనేక వైరుధ్యాలు కలిగి ఉండడం అవి కల్పించబడ్డాయనే వాస్తవానికి సాక్ష్యంగా నిలుస్తున్నాయి*. వేదాలు, భగవద్గీతలలో ఉన్న పరలోక పునర్జన్మ భావనలను వ్యతిరేకిస్తూ, వేదాలలో లేని మార్మికవాద భావనలు - భగవద్గీతలో మార్మికవాదులచే కాలక్రమంలో చొప్పించబడ్డాయనేది దీనిద్వారా సులభంగా అర్థం చేసుకోవచ్చు.

భగవద్గీత చారిత్రకంగా మార్పులు చెందిందనేది నిర్వివాదాంశం. అవతరించిన కాలం తరువాత దానిలో ఎన్నో మార్పులు, చేర్పులు చేయబడ్డాయని చాలా మంది చారిత్రక పరిశోధకులు వెల్లడించారు. ఉదాహరణకు నండూరి రామమోహన రావు గారు ఇలా వ్రాశారు:

"భారతం ఎలాగయితే ఒక్కసారిగా ఒక్క చేతి మీదుగా రాలేదో, దానిలో భాగంగా ప్రసిద్ధమయిన భగవద్గీత కూడా అంతే. దానిలో పద్దెనిమిది అధ్యాయాలు, 700 శ్లోకాలు వున్నాయి. అవన్నీ విభిన్న వ్యక్తులు, విభిన్న కాలాలలో వ్రాసి చేర్చుతూ పోయారనేది పరిశోధకుల అభిప్రాయం. ఇలా అనడానికి ముఖ్య కారణం గీతలో అనేక అంతర్వైరుధ్యాలు, చర్విత చర్వణాలు ఉండడం."[4]

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

\* ఈ కల్పిత శ్లోకాలలోని నిస్సారమరస్యత, అంతర్వైరుధ్యాలను సమగ్రంగా అర్థం చేసుకోదలచినవారు 'అహ్మద్ అలి' గారి పుస్తకం: "గీత ప్రామాణిక వాస్తవాలు - ఖుర్ఆన్ ధృవీకరణ" చదువగలరు.
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

## అవైదికం, అసహేతుకం అయిన అవతార భావన

**"…..అవివేకులైన ప్రజలు నేనే స్వయంగా మానవ అవతారమెత్తి వస్తుంటానని భావిస్తున్నారు." (గీత 7:24)**

మార్మికవాదంతో బాటు కాలక్రమంలో హిందూ మతంలో చోటుచేసుకున్న అవైదిక భావనలు - మూర్తిపూజ మరియు అవతారవాదాలు.

"పరమేశ్వరుడు నిరాకారుడని మాకు తెలుసు. కాని అతడు శివ, విష్ణు, గణేశ దేవ్యాదుల శరీరములను ధరించి, రామ కృష్ణ ప్రభృతుల రూపమున అవతరించెను. కావున వారి మూర్తులు నిర్మింపబడును. ఇది కూడా అసంబంధమేనా?" అనే ప్రశ్నకు వేద పండిత మహర్షి దయానంద సరస్వతి ఇలా జవాబిచ్చారు:

"అవునవును. ఇది కూడా **అసత్యమే**. ఏలననగా - 'అజ ఏకపాత్', 'అకాయమ్' - పరమేశ్వరుడు జన్మరహితుడు, శరీరము లేనివాడను విశేషణములు గలవాడు. **అతనికి జనన మరణములు, శరీర ధారణము ఉండవని వేదములు చెప్పుచున్నవి.** యుక్తితో ఆలోచించినను, పరమేశ్వరుడవతరింపజాలడనియే తెలియుచున్నది. కారణమేమిటంటే పరమేశ్వరుడాకాశము వలె అంతట వ్యాపకుడు, అనంతుడు, సుఖదుః ఖదృశ్యత్వాది గుణములు లేనివాడు. అట్టివాడు చిన్న శరీరములో ఎట్లు రాగలుగును? అచలుడు, అదృశ్యుడు, ప్రతి పరమాణువునందును నిండియుండువాడు అవతరించుచున్నాడనడం వంధ్యా పుత్రునకు వివాహము చేసి అతని పౌత్రుని దర్శించుటవంటిదగును."[5]

ఈ అవతార భావన ముఖ్యంగా పురాణగాథల ద్వారా జన ప్రాచుర్యం గావించబడింది. విష్ణు దశావతారాల కథ ఎంత ప్రాచుర్యం పొందినదో, ఎంతగా నమ్మబడుతుందో వేరే చెప్పనవసరం లేదు.
వేదపండితులు విశ్లేషణ ప్రకారం ఈ అవైదిక అవతార భావన క్రింది విధంగా రూపుదిద్దుకుంది:

పూర్వకాలంలో సూర్యుని పేరు విష్ణువు. ఇది విష్ణు పురాణంలో, మహాభారతంలో కూడా ఉంది. అలాగే ఆకాశానికి విష్ణుపదం అని పేరు ఉంది - సూర్యుని స్థానం ఆకాశంలో కాబట్టి (పదం = స్థానం)

సూర్యునికి బదులు విద్వాంసులు విష్ణువును కల్పించారు. ఇలా తమ కల్పిత దేవునికి సూర్యుని పేరును గ్రహించి నామకరణము చేయడంలో ముఖ్యోద్దేశ్యము - సామాన్య జనాలకు అర్థం అయ్యేరీతిలో వేదాలను వర్ణించడం మరియు బుద్ధిమంతుల దృష్టిని వేదాల వైపునకు మరల్చడం కావచ్చును. గమనించవలసినదేమిటంటే - తదనుగుణంగానే సూర్యునిలో ఉండే గుణాలే విష్ణువులో కూడా స్థాపించారనేది.

పురాణాలలో విష్ణు భగవానుడు క్షీర సాగరంలో నివసించునట్లు వర్ణించారు. వాస్తవం ఏమిటంటే, వైదిక భాషలో 'సముద్రం' అనేది ఆకాశానికి గల పేర్లలో ఒకటి. (ఉదాహరణకు, అధర్వ వేదంలో ఇలా ఉంది: సహస్ర శృంగో వృషభోయః **సముద్రా**దుదీచరత్. అంటే - వేయి కొమ్ములు గల ఎద్దు అనగా సూర్యుడు - సముద్రాత్ అనగా ఆకాశము నుండి ఉదయించెను. ఇలాంటి మరెన్నో ఉదాహరణలు వేదాలలో ఉన్నాయి.) అలాగే 'ఆపః' అనే శబ్దానికి కూడా వైదిక భాషలో ఆకాశమని అర్థం. కాని దానిని జలమనే అర్థంతో సంస్కృత భాషలో వాడనారంభించారు. 'జలమున శయించి యోగ నిద్రయందున్న భగవానుని నాభికమలము నుండి ప్రజాపతులకు ప్రభువగు బ్రహ్మ ఉద్భవించెను……' లాంటి కథలగు ఆరంభమిదే.

ఈ విధంగా ఆకాశంలో ఉన్న సూర్యుడి గురించి వైదికభాషలో ఉన్న వర్ణనలను సముద్రంలో విష్ణుభగవానుడున్నట్లు వర్ణించి, అంతటితో ఆగక దాని చుట్టూ అనేక కథలల్లారు మన పురాణ రచయితలు.

వైదిక వర్ణనలను గాథలుగా అల్లడంలోని పురాణకర్తల ఊహాచాతుర్యమే కాలక్రమంలో అవతార భావనకు దారితీసింది. అదేలాగో గమనించండి!

అగస్త్యుడు సముద్రాన్ని శోషించిన (త్రాగిన) కథలో వాస్తవానికి అగస్త్యుడంటే సూర్యుడు, సముద్రమంటే ఆకాశం. శరదృతువులో సూర్యుణ్ణి అగస్త్యుడని అంటారు. అగస్త్యుడంటే మేఘాలను నష్టభ్రష్టం చేసేవాడని అర్థం. శరదృతువులో సూర్యుడు ఆకాశంలోఉన్న మేఘాలను నష్టం చేస్తున్నందువలన అగస్త్యుడని చెప్పబడుచున్నాడు. ఈ వర్ణణను అగస్త్యుడనే ఒక ఋషి సముద్రాన్ని త్రాగాడని కల్పించి కథలల్లసాగారు.

అలాగే సుప్రసిద్ధమయిన సముద్రమధన గాథ కూడా. ఇది భాగవత పురాణంలోనేగాక మహాభారతంలో, వాల్మీకి రామాయణంలో అనేక వ్యత్యాసాలతో వ్రాయబడి ఉంది. ఈ వ్యత్యాసాలన్నింటిని ప్రక్కన పెడితే మొత్తం మీద కథా క్రమం ఇలా ఉంటుంది: దేవతలు, అసురులు సముద్ర మధనం చేసి అమృతం వెలికి తీస్తారు. అసురులు అమృతాన్ని తీసుకొని పారిపోతుంటే, విష్ణువు మోహిని రూపంలో వచ్చి, మాయ చేసి, అమృతాన్ని దేవతలకు ఇప్పించి వారిని అమరులను చేస్తాడు. ఈ కథలోని నిజభావం ఏమిటంటే - ఇంతకుముందు వివరించినట్టు, సముద్రం అంటే ఆకాశం, 'అసుర' అనే పదానికి అర్థం 'మేఘం'. దేవతలంటే సూర్యకిరణాలు, మధించబడుతున్నది ఆకాశం, అమృతమంటే జలము లేక నీరు (నీరు నశించదు: వర్షరూపంలో, మంచు లేదా ఆవిరి రూపంలో ఎల్లప్పుడూ ఉంటుంది కనుకనే అమృత వర్ణన), వర్షానికి ముందు వేగంగా కదలే నల్లని మేఘాలు అసురులు అమృతాన్ని తీసుకొని పారిపోవడం, విద్యుత్ (పిడుగు రూపంలో) మేఘాలను ఛిన్నాభిన్నం చేసి వర్షాన్ని కురిపించడమనేది విష్ణువు మోహిని రూపం దాల్చి అసురుల నుండి అమృతాన్ని తస్కరించడంగా వర్ణింపబడింది. అంటే, వర్షం కురవడమనే ప్రాకృతిక దృశ్యం ఈ రకంగా వర్ణించబడిందంతే. ఈ భావాన్ని గ్రహించక, ఇలాంటి కథలను సత్యాలుగా భావించడం వివేకులకుచితం కాదనేది వేద పండితుల అభిప్రాయం.[6]

## వామనావతార గాథ

ఇలాగే, వామనావతార గాథకు కూడా ముఖ్యకారణం సూర్యుడే. త్రివిక్రముడంటే సూర్యుడు. ఎందుకంటే త్రివిక్రముడంటే మూడు లోకాలను వ్యాపించినవాడని అర్థం. సూర్యకిరణాలు ద్యులోకం, అంతరిక్షం, భూలోకాలలో వ్యాపించి ఉండడమే దీని వెనుక అర్థం.

వామనావతారగాథ: దేవతల, అసురుల సంగ్రామం జరిగినపుడు అందులో అసురులు విజయం సాధించి, దేవతల అధికారాలన్నీ వారి వశమౌతాయి. ఇలా దేవమాత అదితి పుత్రులంతా అధికారం కోల్పోయి, స్వర్గాన్ని అసురులు పాలు చేసి బాధపడుతుంటారు. ఒకరోజు కశ్యప మహర్షి వారి ఆశ్రమానికొచ్చి, జరిగింది తెలుసుకొని, భగవానుని ప్రార్థించమని చెప్తాడు. కొంత కాలానికి, అదితి గర్భంనుండి వామనుడు ఉదయిస్తాడు. దేవతలందరూ కలిసి అతనికి నమస్కారం చేస్తారు. వామనుడు అసురుల రాజు 'బలి చక్రవర్తి' వద్దకు వెళ్లి, మూడు పదముల భూమిని దానంగా అడుగుతాడు. బలి అందుకు ఒప్పుకోగానే వామనుడు బృహద్రూపుడై ఒక పాదంతో భూమిని, రెండవ పాదంతో ద్యులోకాన్ని కొలచి మూడవ పాదం బలిపై మోపి అతడిని పాతాళానికి పంపించివేస్తాడు.

ఈ అవతార గాథ వెనుక భావన ఇది: ప్రాతః కాలంలో సూర్యుడు తీవ్రత లేక ప్రకాశిస్తున్నప్పుడు అంధకారం (అవతార కథలో 'బలి') లోకమంతా ప్రబలి ఉంటుంది. ఉదయం కాగానే, సూర్యుడు తీవ్రరూపం దాల్చి ఉదయించే కొలదీ అంధకారం నశించిపోతుంది. **ఈ దశనే విష్ణువు బలిని పాతాళానికి అణగదొక్కినట్టు వర్ణించారు.** అప్పుడు దేవగణములు అనగా జీవులు ప్రసన్నులవుతారు.

ఈ విధంగా వైదిక వర్ణనలకు వక్రార్థాలు, విపరీతార్థాలతో అల్లబడిన కథలు కాలక్రమంలో సత్యాలుగా పరిగణించబడసాగాయి. దీని ఫలితంగా ఈ గాథలలోని ఊహాజనిత పాత్రలను ప్రజలు దేవునికి సమానం చేసి ఆరాధించడం మొదలయింది.

దీనంతటికీ మార్మికవాదంతో సంబంధం ఏమిటని పరిశీలిస్తే, విశేష జన ప్రాచుర్యం పొందిన ఈ అవతార భావనను మార్మికవాదులు తమ వ్యక్తిత్వ ఆరాధనను సమర్థించుకోవడం కోసం ఉపయోగించుకున్నారు.

అవతారాలసంఖ్య పురాణాల్లో కూడా నిర్దిష్టంగా లేదు. ఒకచోట 10, ఇంకొకచోట 22, 25..... ఈ పౌరాణికాల పుణ్యమా అని నాస్తికుడయిన బుద్ధుడు కూడా దేవుని ఒక అవతారం అయిపోయాడు. దీనిని బట్టి కూడా ఈ అవతార భావన ఎంత కాల్పనిక భావనయో అర్థం అవుతుంది. ఈ అవతార భావనలోకి నవయుగ మార్మికవాదులు తమను తాము చొప్పించుకొనే ప్రయత్నం చేశారు. కొంతమంది మార్మికవాదులు తమను తాము అవతారాలుగా ప్రకటించుకోగా, మరికొంతమంది వారి భక్తుల ద్వారా అవతారాలుగా ప్రకటించబడ్డారు.

సాయిబాబా భక్తులు ఆయనను బుద్ధుని (9వ అవతారం), కల్కి (చివరి అవతారం)ల మధ్య నిలబెట్టారు (నరసింహస్వామి శాసనాలు & వచనాలు - 147). మెహర్‌బాబా భక్తులు ఇప్పుడు ఆయనను కల్కి అంటున్నారు. కల్కి అవతారం గురించిన వివరణ కొంచెం చదివితే చాలు..అది తప్పని అర్థంకావటానికి. కల్కిని నేనంటే నేనని చాలా మంది (మార్మికవాదులు) ప్రకటించుకున్నారు. ఉదాహరణకు: బహాఉల్లా (పర్షియా), అదీ దా (అమెరికా), అలెజాండ్రో బ్యుందిని(అర్జెంటీనా) మరియు ఈ మధ్యకాలంలో తమిళనాడుకు చెందిన విజయ్‌కుమార్ (కల్కిభగవాన్).

ఏది ఏమైనా, మెహర్‌బాబా తనను తాను స్వయంగా దేవుని అవతారంగా ప్రకటించుకున్నారనేది నిర్వివాదాంశం. అనేక సందర్భాలలో ఆయన బహిరంగంగా తాను దేవుని అవతారాన్నని ప్రకటించుకున్నారు. తరువాతి అధ్యాయంలో మెహర్‌బాబా గారి ఈ అవతార వాదనను సవివరంగా పరిశీలిద్దాం.

" అచలుడు, అదృశ్యుడు, ప్రతి పరమాణువునందును
నిండియుండువాడు అవతరించుచున్నాడనడం
వంధ్యా పుత్రునకు వివాహము చేసి అతని పౌత్రుని
దర్శించుటవంటిదగును "

-మహర్షి దయానంద సరస్వతి

# 6. మెహర్‌బాబా మరియు అవతారవాదం

**"దైవ - మానవుడు, ఐదుగురు సద్గురువులచే ప్రతీ 700-1400 సం॥ల మధ్య ఒకసారి పిలువబడే దేవుని ప్రవక్త లేక అవతారము".** *- మెహర్‌బాబా-ఉపదేశాలు - సంపుటము3, 35వ పేజి.*

**"దేవుని అవతారాలలో అత్యధికంగా గుర్తింపబడి కొలవబడే వాటిలో మొదటిది - జురాష్టర్. రాముడు, క్రిష్ణుడు, బుద్ధుడు, ఏసుక్రీస్తు మరియు ముహమ్మద్ లకు ముందు. దైవ-మానవుని దేవునిగా స్వీకరించినవారు అతన్ని పూజిస్తారు. దేవునిగా ఎరిగినవారు, అతనిని భూలోకంలో దేవునిగా కొనియాడతారు."**

*- మెహర్ బాబా (1953వ సం॥ సెప్టెంబరు 7న ఇవ్వబడిన 'ఉన్నతులలో అత్యున్నతుడు' ప్రకటన)*

తాను దేవుని అవతారాన్నని మెహర్‌బాబా గారు మనముందుంచిన భావన సరికాదని నిరూపించడానికి చాలా ఆధారాలున్నాయి. ఆయన ముహమ్మద్ (సఅస)* ప్రవక్త గురించి చేసిన వ్యాఖ్యలలోని వైరుధ్యాలను ఇక్కడ మీముందుంచడం జరిగింది:

ముహమ్మద్ (సఅస) గారి గురించి తెలియని వారి ఉపయోగార్థం ఈ వివరణ ఇవ్వడం జరిగింది: ముస్లింలు ముహమ్మద్(సఅస) గారిని దేవుని అంతిమ ప్రవక్త లేక సందేశహరునిగా నమ్ముతారు. ఇస్లాంలో - దైవప్రవక్త ఒక సాధారణ మానవుడే, కాని అతను దైవ సందేశాన్ని మానవులకు తెలియజేసే మహత్తర కార్యానికి ఎన్నుకోబడ్డాడు. కాబట్టి అతనికి ఒక ప్రత్యేకమైన హోదా ఉంటుంది. దైవప్రవక్త ఏ విధంగానూ దైవం కాజాలడు. ఎందుకంటే ఇది ఇస్లాం యొక్క దేవుని మౌలిక భావనకే వ్యతిరేకం. "అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యదైవం లేడు మరియు ముహమ్మద్ ఆయన దాసుడు మరియు ప్రవక్త" అనేది ఇస్లాం యొక్క ప్రాథమిక సూత్రం.

ముహమ్మద్ (సఅస)గారి గురించిన వివరాలు తరువాతి అధ్యాయాలలో ఇవ్వబడ్డాయి. ప్రస్తుతానికి - ఆయన మానవుడైన దైవ ప్రవక్త అనీ, దైవ సందేశం ఆయనకు దివ్యగ్రంథమైన ఖురాను రూపంలో జిబ్రాయిల్ (అస) అనబడే దైవదూత ద్వారా అవతరింపజేయబడిందనేది గుర్తుంచుకుంటే చాలు.

## ముహమ్మద్ (సఅస) ఒక మానవ మాత్రుడే:

దేవుడు (అల్లాహ్) స్వయంగా - ముహమ్మద్ (సఅస) ప్రవక్తను - తనను తాను ఒక మానవ మాత్రునిగా మాత్రమే ప్రకటించుకోమని శాసిస్తున్నాడు.

దివ్య ఖురానులో అల్లాహ్ ఇలా అంటున్నాడు:

"ప్రవక్తా ! ఇలా చెప్పు, నేను కేవలం ఒక మానవుణ్ణి, మీలాంటివాణ్ణి, నాకు దైవవాణి ద్వారా ఇలా తెలుపబడింది: మీ దైవం కేవలం ఒకే దైవం. కనుక తన ప్రభువును కలుసుకోవాలని ఆశించేవాడు సత్కార్యాలు చేయాలి. ఆరాధనలో తన ప్రభువుతో పాటు మరెవ్వరినీ చేర్చకూడదు" *(18:110)*

"ఓ ప్రవక్తా ! నీకు పూర్వం కూడా మేము మానవులనే ప్రవక్తలుగా పంపాము. వారికి మేము దైవవాణి ని అందచేశాము. ఒకవేళ మీకు ఇది తెలియకపోతే, గ్రంథ ప్రజలను అడగండి." *(21:7)*

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

\* *'సఅస' అనే అరబీ అక్షరాలకు 'ఆయనపై శాంతి నెలకొనుగాక' అనేది అర్థం. ఇది ప్రవక్త ముహమ్మద్ పేరు తర్వాత జతచేయడం అనేది ముస్లిముల సాంప్రదాయం. ఈ సాంప్రదాయాన్ని అనుసరిస్తూ ముహమ్మద్ పేరు తర్వాత ఈ అక్షరాలను పుస్తకమంతటా ఉపయోగించడం జరిగింది. అలాగే 'అస' - ఇతర దైవ ప్రవక్తలు, దైవదూతల పేర్ల తర్వాత జతచేయడం జరుగుతుంది.*
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

**ముహమ్మద్ (సఅస) తనను ఆరాధించమని ఎప్పుడూ అనలేదు:**

ముహమ్మద్ (సఅస) గారి కర్తవ్యం - మానవజాతిని ఒకే దైవం యొక్క ఆరాధనకు ఆహ్వానించడమే. మెహర్‌బాబా గారి సందేశం - అంతాదైవమే మరియు నేను ఆ దేవుని అవతారాన్ని అనేది. మెహర్‌బాబా గారు బహిరంగంగా అవతారానికి పూజ, ఆరాధనలను సమర్థించి, ప్రోత్సహించగా, ముహమ్మద్ (సఅస) గారు తన పూజ తాను బ్రతికుండగానే కాక తరువాత కూడా జరుగకుండా జాగ్రత్తలు తీసుకున్నారు.

ముహమ్మద్ (సఅస) ప్రవక్త గారు - తనకు ముందు ప్రవక్తలు మరణించిన పిమ్మట అప్పటి ప్రజలు చేసిన తప్పులు, తన మరణానంతరం పునరావృత్తం కాకుండా ఉండేందుకు విశేషంగా జాగ్రత్త తీసుకున్నారు. తదనుగుణంగా, తన గురించి అతిగా భక్తి శ్రద్ధలు అంటగట్టడం వలన ఉత్పన్నమయ్యే పరిస్థితుల గురించి తన అనుచరులను హెచ్చరించే విషయంలో ఆయనెప్పుడు అలసిపోలేదు. ముహమ్మద్ (సఅస) ఇలా అన్నారు:

“మర్యం (మేరీ) కుమారుడైన దైవప్రవక్త యేసుక్రీస్తు (అస) గురించి ప్రజలు చేసేటటువంటి ప్రలాపనలు నా విషయంలో చేయకండి. నేను దేవుడి యొక్క సేవకుడను మరియు దైవప్రవక్తను మాత్రమే. అందుకని, నన్ను అలా మాత్రమే పిలవండి.” *(మూలం: బుఖారి మరియు ముస్లిం)*

“తమ ప్రవక్తల సమాధుల్ని పూజించే తప్పిదం, కొన్ని జాతులు చేశాయి. మీరలా చేయకుడదు. జాగ్రత్త ! నేను మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను.” *(మూలం: ముస్లిం)*

అదే విధంగా, దైవ ప్రవక్త ముహమ్మద్ (సఅస) గారు ఈ విధంగా ప్రార్థించేవారు:

“ ఓ అల్లాహ్! నా సమాధికి పూజ జరగకుండా చూడు” *(మూలం: మలిక్)*

అంతేకాదు, ముహమ్మద్ (సఅస) గారు, తన ముందు మర్యాదపూర్వకంగా వంగడం లాంటి చిన్న చిన్న చర్యలు కూడా నిషేధించారు. ఈ క్రింద ఇవ్వబడిన సంఘటన దీనికొక ఉదాహరణ:

“ముహమ్మద్ (సఅస) గారి అనుచరులు కొంతమంది ఒక పరదేశం వెళ్ళారు. అక్కడ వారు తమ నాయకుల ముందు ఆ దేశ ప్రజలు సాష్టాంగ పడటం చూశారు. తిరిగి వచ్చిన తరువాత, తమ అనుభవాలను ప్రవక్త గారికి వివరిస్తూ, తమకు కూడా అలా చేయడానికి అనుమతి కోరారు. అప్పుడు ప్రవక్త వారిని ఇలా అడిగారు: ‘నేను చనిపోయిన తరువాత కూడా మీరు ఇలా నా సమాధి ముందు సాష్టాంగ పడతారా?’. సమాధి దగ్గర సాష్టాంగం అనేది ఎప్పటికీ చెల్లదని బాగా తెలిసిన ఆ అనుచరులు అలా చేయమని సమాధానమిచ్చారు. అప్పుడు దైవప్రవక్త (సఅస) వారితో ఇలా అన్నారు: ‘నేనొక మానవ మాత్రుణ్ణే అని, ఒకరోజు మరణిస్తానని, పాతిపెట్టబడతానని, ఆ తరువాత నాకెలాంటి సాష్టాంగాలు చేయకూడదనీ తెలిసిన మీరు, ఇప్పుడు మాత్రం అది ఎందుకు చేయాలి?’ ” *(మూలం: అబూదావుద్)*

పర్షియాకు చెందిన హజ్రత్ సల్మాన్ గారి ఇలాంటి విన్నపానికే ప్రవక్త (సఅస) ఇలా బదులిచ్చారు: “నాముందు వంగడం, సాష్టాంగ పడడం చేయకండి. దానిని అంతమొందని, మరణం లేని ఆ దేవునికి మాత్రమే చేయండి.” *(మూలం: కంజుల్ ఉమ్మల్)*

మెహర్‌బాబా గారి ‘ఉపదేశాలు’ చదివితే - ఆయన తన పూజ, ఆరాధనలను ఒక గురువు, అవతారం రూపాలలో బహిరంగంగా సమర్థించి, ప్రోత్సహించి, స్వీకరించారని అర్థం అవుతుంది. దానితో ముహమ్మద్ (సఅస) గారి ఈ ఆదేశాలను పోల్చి చూడండి. వీరిద్దరి మధ్య ఉన్న వ్యత్యాసం మీకే అర్థం అవుతుంది.

**మానవ ఆరాధన (వ్యక్తిపూజ)కు బాగా అలవాటు పడిపోయిన కొంతమంది ఇలా అడుగవచ్చు: ముహమ్మద్ (సఅస) గారిని పూజిస్తే తప్పేంటి? మెహర్‌బాబాగారు చెప్పినట్లు ముహమ్మద్ (సఅస) కూడా దేవుని ఒక అవతారమే కదా? అందుకని ఆయనను పూజించడంలో తప్పులేదు. ముహమ్మద్ (సఅస) గారికి పూజలు చేయించుకోవడంలో ఆసక్తి ఉండి ఉండకపోవచ్చు. అందుకని వాటిని ఆయన నిరాకరించి ఉండవచ్చు. అంతే కదా !**

దీనికి జవాబు : ఆరాధన విషయంలో - ఇస్లాంలో ఖచ్చితమైన మార్గదర్శకత్వం ఉంది: ఆరాధనకు అర్హత కేవలం ఆ ఒక్క దైవానికి మాత్రమే ఉంది. ఆయననే మనం స్తుతించాలి, ఆయనకే సేవ చేయాలి, ఆయనకే భయపడాలి, అవసరం వస్తే ఆయన కొరకే ప్రాణాలివ్వాలి. ఆయన విధించిన ధర్మాన్ని పాటించాలి, ఆయన ప్రవక్తల్ని అనుసరించాలి, వారి ద్వారా అవతరించిన దివ్యగ్రంథాలను గౌరవించాలి. చిట్టచివరి దివ్యగ్రంథమైన ఖురానును స్వీకరించి, అందులోని ఆజ్ఞలను పాటించాలి.

ఎవరయినా, ఈ పై కార్యాలలో దేనినయినా గాని దైవేతరులకోసం చేస్తే, దానిని 'షిర్క్' అంటారు. 'షిర్క్' అంటే దైవత్వంలో సహవర్తులను నిలబెట్టడమే.

## 'షిర్క్' అనేది దేవుడెన్నటికీ క్షమించని - అత్యంత హీనమైన పాపం

'షిర్క్' అనేది దేవుని దృష్టిలో అత్యంత పెద్దదైన పాపం. దేవుడు ఈ పాపం చేసేవారిని, వారు గనుక అదే స్థితిలో మరణిస్తే ఎన్నటికీ క్షమించనని హెచ్చరిస్తున్నాడు. ఇది ఎంత పెద్ద పాపమంటే దేవుడు ఈ ఒక్క పాపం తప్ప ఏ ఇతర పాపాలనయినా క్షమిస్తానని వాగ్దానం చేస్తున్నాడు. ఖురానులో ఇలా తెలియజేయడం జరిగింది:

"అల్లాహ్* క్షమించనిది కేవలం షిర్క్ మాత్రమే. అది తప్ప ఏ ఇతర పాపాన్ని అయినా ఆయన తాను ఇష్టపడిన వారికొరకు క్షమిస్తాడు. ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా చేసేవాడు, ఎంతో ఘోరమైన అబద్ధాన్ని కలిపించాడు అన్న మాట, అది ఎంతో తీవ్రమైన పాపపు మాట." *(4:48)*

"అల్లాహ్ దృష్టిలో కేవలం షిర్క్ ఒక్కటే క్షమార్హం కానిది. అది తప్ప తాను కోరిన వారి అన్ని పాపాలను ఆయన క్షమిస్తాడు. ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా చేసిన వాడు అపమార్గాన బహుదూరం వెళ్ళిపోయాడు." *(4:116)*

## 'షిర్క్' నరకానికి దారి తీస్తుంది

దివ్యఖురానులో ఇలా చెప్పబడింది:

"ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా చేసేవారికి అల్లాహ్ స్వర్గాన్ని నిషిద్ధం చేశాడు. వారి నివాసం నరకం. అటువంటి దుర్మార్గులకు సహాయం అందించే వాడెవడూ లేడు." *(5:72)*

అంతేకాదు, 'షిర్క్' మాననంత వరకూ, చేసిన మంచి పనులు (దానధర్మాలు, సంఘసేవ తదితరమైనవి) కూడా పరిగణనలోకి రావు:

"ఒకవేళ మీరు షిర్క్ (బహుదైవారాధన) చేస్తే, మీ కర్మలన్నీ వ్యర్థమైపోతాయి, మీరు నష్టానికి గురి అవుతారు. కనుక (ఓ ప్రవక్తా) నీవు కేవలం అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించు. కృతజ్ఞులై ఉండే దాసులలో చేరిపో". *(39:65-66)*

దైవప్రవక్తలందరూ ఈ 'షిర్క్' అనే మహాపాపాన్ని గురించి ప్రజలను వారించడానికి, దాని పర్యవసానాన్ని గురించి హెచ్చరించడానికి వచ్చిన వారే.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

\* *ఇంతకు ముందు పేర్కొన్నట్టు - 'అల్లాహ్' కు అర్థం 'పూజింపయోగ్యుడు' అని మాత్రమే. తెలుగులో దీనిని 'దేవుడు' అని అనువాదం చేయవచ్చు. కానీ, అరబిక్ పదమైన అల్లాహ్‌కు ఒక విశిష్టత ఉంది. అదేమిటంటే దానికి బహువచనం లేనేలేదు. అలాగే లింగబేధం కూడా లేదు. దేవుడుకి బదులు దేవుళ్ళు, దేవత అని అనవచ్చుగానీ, అల్లాహ్ పదాన్ని అలా మార్చలేము.*
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ఈ విధంగా ముహమ్మద్ (సఅస) ఒక దేవుని అవతారం (స్వయానా దేవుడు) అనే మెహర్‌బాబా గారి వాదన ఎంతో తప్పయినదిగా ఋజువు అవుతుంది. దేవుడు ఇంత తప్పుగా మాట్లాడగలడని మీరు నమ్మదలిస్తే తప్ప, మెహర్‌బాబాగారి అవతారవాద భావన కూడా సత్యరహితమని నిరూపణ అవుతుంది.

అలా కాకుండా, మెహర్‌బాబాగారి 'అవతారం' యొక్క నిర్వచనం - దేవుని యొక్క సందేశహరుడు: మానవరూపంలోని దేవుడు కాదు, దేవుని సందేశాన్ని వ్యాపింపచేసే ఒక మానవుడు అనుకుందాము. అవతారం గురించిన మెహర్‌బాబా గారి ఇతర వర్ణనల ఆధారంగా ఇలా అనుకోవడం చాలా కష్టం. కానీ, విశ్లేషణ కొరకు అలా అనుకుంటే, గుర్తించవలసిన విషయం ఏమిటంటే-

ముహమ్మద్ (సఅస) మానవాళికి అంతిమ ప్రవక్త. ముస్లింలే ఇలా అనడం లేదు. ఇది దివ్య ఖురానులో దేవునిచే ప్రకటించబడింది:

"మానవులారా ! ముహమ్మద్ అల్లాహ్ యొక్క ప్రవక్త, దైవ ప్రవక్తల పరంపరను సమాప్తం చేసే చివరి వారు. అల్లాహ్ సకల విషయాల జ్ఞానం కలవాడు." *(33:40)*

"అల్లాహ్ దృష్టిలో అసలు ధర్మం కేవలం ఇస్లాం మాత్రమే..........." *(3:19)*

"ఎవరైనా ఈ విధేయతా విధానాన్ని (ఇస్లాం) కాక మరొక మార్గాన్ని అవంబించదలిస్తే, ఆ మార్గం ఎంత మాత్రం ఆమోదించబడదు. అతడు పరలోకంలో విఫలుడౌతాడు, నష్టపోతాడు." *(3:85)*

అంతేకాదు. అనేక మత గ్రంధాలలో కూడా ముహమ్మద్ (సఅస) అంతిమ దైవప్రవక్తగా వర్ణింపబడ్డారు.

తర్కబద్ధంగా ఆలోచిస్తే - మెహర్‌బాబాగారు మనముందుంచిన అవతార భావన తప్పని నిరూపించడానికి ఇప్పటిదాకా చేసిన విశ్లేషణ సరిపోతుంది. ఆయన అనేకమంది మార్మికవాదులలో ఒకరు మాత్రమేనని అర్థం అవుతుంది.

**మెహర్‌బాబా భక్తులు ఇలా అనవచ్చు: "లేదు, మాకు ముహమ్మద్ (సఅస) గారితో పనేంటి? మాకు మెహర్‌బాబా దేవుడు, అంతే."**

మరలా అయితే దేవుడు అంత తప్పుగా ఎలా మాట్లాడగలడు? అనేది వారు ఆలోచించవలసిన విషయం.

"అవతారం ఎప్పుడూ ఒక్కడే, ఎందుకంటే దేవుడు ఎల్లప్పుడూ ఒక్కడే, శాశ్వతమైనవాడు, అనంతమయిన వాడు, మనిషి రూపంలో జన్మించే అవతారం, అయనే ప్రవక్త, పురాతనమైనవాడు, అందరికంటే గొప్పవాడు" -మెహర్‌బాబా

మెహర్‌బాబా కూడా దేవుని అవతారమై, అనంతమయిన, సంపూర్ణమయిన జ్ఞానం కలవారైతే, ముహమ్మద్ (సఅస) గురించి అంటే - ఆయన ప్రకారం తన ముందు అవతారం గురించిన ఆయన వివరణ ఇంత తప్పుగా, ఏమాత్రం పొంతన లేకుండా మరియు పూర్తిగా వ్యతిరేకంగా ఎందుకు ఉంది?

ఒకవేళ మెహర్‌బాబా గారు ముహమ్మద్ (సఅస) ప్రవక్త గురించి మాట్లాడి ఉండకపోయి ఉంటే పరిస్థితి వేరే విధంగా ఉండేది. కానీ అలా కాదే !

**"ముహమ్మద్ దైవానుభవం తర్వాత ఏడవతలంలో ఉండినారు.** బుద్ధుడు ఐదవ మరియు అజ్మీరు మొహియుద్దీన్ ఛిస్తీ కూడా ఐదవ తలంలో ఉండినారు."

*- మెహర్‌బాబా - ఉపదేశాలు - సంపుటము2-110వ పేజీ.*

**ఏడవ తలం గురించిన మెహర్ బాబా గారి వివరణ:**

"సాధకుడు ఏడవ తలానికి చేరుకుంటే అతడు దేవునిలో చివరి విలీనాన్ని అనుభవిస్తాడు. దీనిని ఫనా-ఫీ-అల్లా లేదా దేవునితో అంతిమ లీనత్వం అంటారు. ఈ విలీనం ద్వారా అతడు తన సొంత అస్తిత్వాన్ని కోల్పోయి, దేవునిలో ఎల్లప్పటికీ విలీనమైపోతాడు. అతడు ఇప్పుడు దేవునిలో ఒకడు. తనను తాను దేవునిగా అనుభవిస్తాడు. ఇది యాత్రికుని చివరి మజిలీ. అతని నిరీక్షణ, అన్వేషణ అంతమయ్యేచోటు. ఇది మానవ రూపంలో దేవుడి లక్షణమైన సహజ సమాధి లేక నిర్వికల్ప సమాధి అని కూడా పిలవబడుతుంది. ఇదే నిజమైన జ్ఞానోదయం. యాత్రికుడిప్పుడు తన ఊహాసముద్రం యొక్క ఆవలి తీరాన్ని చేరుకుని, ఇదే పరమసత్యమని, అంతవరకూ చూసిన ఘట్టాలన్ని కూడా భ్రమలే అని తెలుసుకుంటాడు. అతడు తన అంతిమ గమ్యానికి చేరుకున్నాడు." *- మెహర్‌బాబా - ఉపదేశాలు - సంపుటము2- 27-28వ పేజీ.*

దైవ ప్రవక్త ముహమ్మద్ (సఅస) గారి జీవిత చరిత్రలో ఆయన మార్మికవాది అనిగానీ, మార్మికవాద సాధనలు ఆచరించారని గాని, మార్మిక అనుభవాలు పొందారని గాని తెలిపే సంఘటన మచ్చుకైనా కానరాదు. ఫనా, ఫనా-ఫీ-అల్లా అనే పదాలు గాని, భావనలు గాని ఖురానులో, దైవ ప్రవక్త (సఅస) ప్రవచనాలలో ఎక్కడా కానరావు.

**దైవప్రవక్త ముహమ్మద్ (సఅస) మరియు మెహర్‌బాబాల మధ్య గల వ్యత్యాసాల విశ్లేషణ మెహర్‌బాబా గారి స్థానాన్ని దిగజార్చడానికి చేయబడుతుందనుకోవడం పొరపాటు. ఈ విశ్లేషణ మెహర్‌బాబాగారి అవతార వాదం నిజమా? కాదా? అనేది ఋజువు చేయడానికి చేయబడుతుంది. 'దేవుని అవతారాన్ని' అని చెప్పుకోవడం మాటలు కాదు. అవతార నిర్వచనం ఏదైనప్పటికీ కూడా - అంటే మానవరూపంలో దేవుడని గానీ, దేవుని సందేశం అందించే మానవుడని గానీ. సత్యాసత్యాల పరీక్షలో అది నిలబడాలి. గమనించవలసింది ఏమిటంటే - ఇక్కడ నేను ఒక బాహ్య ప్రమాణాన్ని ఆపాదించడంలేదు, వేరొక మతం యొక్క సిద్ధాంతాల ఆధారంగా విశ్లేషణ చేయడమూ లేదు. నేను స్వయంగా మెహర్‌బాబా గారి వచనాలనే తీసుకుని అవి నిజాలా? కాదా? అని నిర్ధారిస్తున్నాను. దైవ ప్రవక్త ముహమ్మద్ (సఅస) గారి చారిత్రక మరియు నమోదు చేయబడిన జీవిత యదార్థాలు, దివ్య ఖురాను గ్రంథంలోని సమాచారంతో వాటిని సరిచూస్తున్నానంతే. ఈ విషయాలు బహిరంగంగా అందరికీ అందుబాటులో ఉన్నవే. మెహర్‌బాబా గారు ముహమ్మద్ (సఅస) ప్రవక్త గురించి చెప్పిన మాటలలో నిజం మచ్చుకైనా లేదని నమ్మలేని విమర్శకులు - ముహమ్మద్ (సఅస) గారి జీవిత చరిత్ర, ఖురానులు చదివితే మెహర్‌బాబా గారి మాటల్లో నిజం ఎంతున్నది అనేది స్వయంగా అర్థం చేసుకోగలుగుతారు. ఆయన 'దేవుడు ఇంత తప్పుగా మాట్లాడగలడు' అని నమ్మడంలో అభ్యంతరం లేని వారికి మాత్రమే ఒక అవతారంలా మిగులుతారు.**

# మౌలిక సిద్ధాంతాలలో వైరుధ్యం - 'సృష్టి'

మెహర్‌బాబా గారి ప్రకారం:

"ఈ సృష్టి జరగడానికి మూలకారణం- ఆత్మ, తన అనంతమయిన పరమాత్మ స్వభావాన్ని తెలుసుకొని అనుభవించడానికే. ఆత్మ - పరమాత్మలో ఎల్లప్పటికీ ఒక్కటి అయినప్పటికీ ఇది ఏకత్వం తెలుసుకోవాలంటే సృష్టి అవసరం. సృష్టి అనేది సమయావధిలో ఉంటుంది. పరమాత్మలో ఏకమైన తన నిజస్వరూపాన్ని తెలుసుకోవాలంటే ఆత్మ తన చైతన్యాన్ని పరిణామం చేసుకోవాలి. ఈ చైతన్య పరిణామానికి ద్వైత సంబంధం అవసరం - కర్త, కర్మల సంబంధం."

*- మెహర్‌బాబా ఉపదేశాలు - సంపుటము 2, 142-143వ పేజీలు*

"ఈ సృష్టి జరగడానికి మూలకారణం, పరమాత్మ తన గురించి తాను తెలుసుకోవడం కోసం"

*- మెహర్‌బాబా ఉపదేశాలు - సంపుటము 1, 62వ పేజి*

పరమాత్మ, అనంతమైన చైతన్యం, బ్రహ్మ - ఇవన్నీ దేవునికి సంబంధించిన మార్మిక వాదుల పర్యాయపదాలు. దేవుడేంటి? తనను గురించి తాను తెలుసుకోడానికి తాపత్రయ పడటం ఏమిటి? అని ఆశ్చర్యార్థకంగా అడిగితే మార్మిక వాదులు దానికిచ్చే వివరణ ఏమటంటే - దేవుడు అనంతమయిన చైతన్యం కనుక ఒక రూపం తీసుకుంటే గానీ తన గురించి తాను తెలుసుకోలేడు. ఇదీ - దేవుని గురించిన మార్మికవాదుల భావన!

<u>సృష్టి కారణం - దివ్య ఖురాను గ్రంథం నుంచి:</u>

" నేను జిన్నాతులనూ, మానవులనూ నా ఆరాధన కొరకు తప్ప మరి దేని కొరకూ సృష్టించలేదు."

*(51:56)*

"అల్లాహ్‌ను ఆరాధించండి, ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు"

(7:59)

"విశ్వసించి సత్కార్యాలు చేసిన వారికి ఆతిథ్యంగా స్వర్గపు ఉద్యానవనాలు ఉంటాయి."

*(18:107)*

"...........వారే స్వర్గాన్ని పొందేవారు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు"

*(23:11)*

"కానీ తనకు ఋజుమార్గం విశదమైనప్పటికీ ఎవరైనా ప్రవక్తకు వ్యతిరేకంగా నడుంబిగిస్తే, విశ్వాసుల వైఖరి కాక మరొక వైఖరి అవలంబిస్తే, అతన్ని మేము అతడు మళ్ళిన దిక్కుకే నడిపిస్తాము. ఇంకా అతన్ని నరకంలో పడవేస్తాము. అది అతినీచమైన నివాసస్థలం."

*(4:115)*

ఇదీ మానవ సృష్టి యొక్క కారణం మరియు మార్గదర్శకత్వం - దైవం మానవాళికి తన ప్రవక్తల ద్వారా తెలిపిన వివరణ.

మెహర్‌బాబా కూడా దేవుని అవతారమో, దైవప్రవక్తో అయి ఉంటే, ఇంత ముఖ్యమయిన అంశం గురించి ఇంత వైవిధ్యత ఉండేది కాదు. సందేశాలలో కొంచెమైననూ సారూప్యత ఉండియుండేది.

కొంతమంది ప్రజలు ప్రాపంచిక సంబంధాలు త్రెంచుకొని, అతిగా ఉపవాసాలుంటూ, నిద్రాహారాలు త్యజించి దైవారాధనలో మునిగిపోయి ఉంటున్నారని తెలుసుకున్న ముహమ్మద్ (సఅస) ప్రవక్త గారు ఇలా అన్నారు:

"వీళ్ళు ఇలా ఎందుకు చేస్తున్నారు? నేను ఉపవాసాలుంటాను మరియు మానేస్తాను. దైవారాధన చేస్తాను, సక్రమంగా నిద్రకూడా పోతాను. స్త్రీలను వివాహమాడతాను (సన్యాసం పాటించను). ఎవరైతే నా ఈ సమతుల్య సాంప్రదాయాన్ని విడనాడతారో వాళ్ళు నాలోని వారు కారు."

ఇంకా ఆపై ఇలాంటి జీవితం ఖురానులో నిషేధింపబడిందని గుర్తు చేస్తూ ఈ శ్లోకాన్ని చదివారు:

"...ఈ వైరాగ్యజీవిత విధానాన్ని వారు స్వయంగా కనిపెట్టారు. మేము దానిని వారిపై విధించలేదు"

(57:27)

ఇలా మనం పోల్చుకుంటూ పోతే, ముహమ్మద్ (సఅస) మరియు మెహర్‌బాబాల సిద్ధాంతాల విషయంలో పోలికలైతే కానరావు గాని, అన్నీ విభేదాలే బయట పడతాయి.

మెహర్‌బాబాగారు ముహమ్మద్ (సఅస) తన పూర్వపు అవతారమని, అవతారం ఎల్లప్పుడు ఒక్కటేననీ సెలవిస్తున్నారు. మరి అలాంటప్పుడు, అనంతమైన జ్ఞానం కలిగి ఉన్నవారు తన పూర్వపు అవతారం (లో తాను) ఏమి బోధించారు? ఏమి చేశారు? అనే విషయంలో ఇంత తప్పుగా ఎలా ఉండగలరు? ముహమ్మద్ (సఅస) ప్రవక్త గురించిన మెహర్‌బాబా గారి అవగాహనా లోపాలు ఇక్కడ ప్రస్ఫుటంగా గోచరిస్తున్నాయి. తద్వారా ఆయన అనంతమైన జ్ఞానవాదం, అవతారవాదం మొదలైనవి అన్ని విధాలా తప్పని రుజువు అవుతుంది.

## బోధనలలో ఇంతతేడా ఎందుకు ఉంది?

ఎందుకంటే, మానవసృష్టి కారణంతో మొదలు, సొంత అస్తిత్వం వరకూ మెహర్‌బాబా గారి సిద్ధాంతాలు మార్మిక అనుభవాలు మరియు మార్మిక సిద్ధాంతాల అవగాహనల ప్రభావంతో ఏర్పడినవి. మార్మికవాదులకు దైవం - ఆ మార్మిక అనుభవంలోని అనంతమైన చైతన్యమే.

మీరు మెహర్‌బాబా గారి పుస్తకం 'గాడ్ స్పీక్స్' చదివితే, అందులోని తొలిపరిచయంలోనే వ్రాయబడినట్టు - "ఈ చైతన్య పరిణామం, సంపూర్ణతయే సృష్టి యొక్క మూలకారణం" అని తెలుస్తుంది. ఆత్మ, పరమాత్మలోని భాగమయినా - అది అనేక దశలలో (రాయి-లోహం-చెట్టు-క్రిమి-చేప-పక్షి-జంతు-మానవ) పరిణామం చెందుతూ తనను తాను అనుభవిస్తూ, మానవ జన్మతో ఆ అనుభవాన్ని సంపూర్ణం చేసుకుంటుంది.

ఈ భావనలు, ముహమ్మద్ (సఅస) గారి బోధనలు (ఆయన ద్వారా మనకందజేయబడిన సృష్టి యొక్క మూలకారణం, సృష్టి జరిగిన తీరు మొదలైనవి) ఎంతో వైవిధ్యంగా ఉన్నాయనేది సుస్పష్టం. తేడా ఏమిటంటే - ఈ జ్ఞానం మార్మిక అనుభవాల జ్ఞానంకాదు, ఇది స్వయానా దైవం తన ప్రవక్తకు పంపిన జ్ఞానవాణి.

మెహర్‌బాబా మరియు ముహమ్మద్ (సఅస)ల భావనల, బోధనల మధ్య ప్రస్ఫుటమైన, ఆశ్చర్యకరమైన తేడాలన్నింటినీ ఇక్కడ పొందుపరచడం కుదరదు. మెహర్‌బాబా భక్తులుకానీ, వేరే ఎవరైనా విమర్శకులు గానీ - మెహర్‌బాబా గారి 'గాడ్ స్పీక్స్' మరియు దివ్య ఖురాను గ్రంథాలను చదివితే - ఆ వైవిధ్యాల, వైరుధ్యాల స్వరూపం వాళ్ల ముందుకు వస్తుంది. అప్పుడు మెహర్‌బాబా గారు తనను తాను ముహమ్మద్ (సఅస) యొక్క తదుపరి అవతారం అని, ఈ తరానికే అవతారాన్నని చేసుకున్న ప్రకటనలు ఎంత వరకూ నిజాలనేది స్వయావగాహనకు వస్తుంది.

# మార్మిక స్వ-అస్తిత్వాల ప్రకటనలలో వైరుధ్యాలు

మెహర్‌బాబా గారి ప్రకారం-సాయిబాబా గారు ఒక సద్గురువు, సాలిక్ లేక మానవదైవం. దీనికి ఆయన నిర్వచనం:

"మానవుడు దేవుడై సృష్టి చైతన్యాన్ని కలిగి ఉన్నపుడు, అతనిని సద్గురువు (మానవ దేవుడు) అంటారు. దేవుడు మానవుడైనపుడు అతన్ని అవతారము(దైవ-మానవుడు) అని అందురు."

*-మెహర్‌బాబా ఉపదేశాలు-సంపుటము3-29వ పేజి*

కానీ సాయిబాబా గారు తన మార్మిక అనుభవాలను వర్ణిస్తూ ఇలా అన్నారు:

"ఆ స్థితిలో దేవుడు మనిషికి సమానం అయిపోతాడు.........."

*-సాయిబాబా శాసనాలు & వచనాలు-122*

"నేను దేవుణ్ణి....నేను షిర్డీలోనూ మరియూ అన్ని చోట్లా నివాసముంటాను.

నా వయసు లక్షల సంవత్సరాలు. నాపని ఆశీర్వాదాలు ఇవ్వడమే. అన్ని వస్తువులు నావే.

నేను ప్రతీదీ ప్రతీ ఒక్కరికీ ఇస్తున్నాను."

*- సాయిబాబా శాసనాలు & వచనాలు-62*

**"నేను అల్లాను"** *- సాయిబాబా-భక్తుల అనుభవాలు-సంపుటము1, 26వ పేజి*

మెహర్‌బాబా గారు చెప్పినట్లు సాయిబాబా గారు ఒక సద్గురువైతే మరి సాయిబాబా గారు సరాసరి 'నేను అల్లాను' అని ఎందుకు ప్రకటించుకున్నారు? అంతే కాదు. మెహర్‌బాబా గారి ప్రకారం అవతారం ప్రతీ 700 నుంచి 1400 సంవత్సరాల లోపు వస్తాడు. దీని ప్రకారం చూస్తే, వీరిద్దరూ సకాలీనులు కాబట్టి ఇద్దరిలో ఒకరు మాత్రమే అవతారం కాగలరు. ఐతే, సాయిబాబా గారు కూడా తాను అవతారాన్నని ప్రకటించుకుంటూ ఇలా అన్నారు: " తర్వాత వచ్చేది దశావతారాలు. అవి- మత్స్య, కచ్ఛ, వరహ, నరసింహ, వామన, పరశురామ, క్రిష్ణాజీ, బుద్ధ, నేను, కల్కి ....." (సాయిబాబా శాసనాలు & వచనాలు - 147), "......ప్రస్తుత కలియుగ అవతారము - సాయిబాబా .........." (అబ్దుల్ గారి పుస్తకం).

**అంతేకాక- అవతారాల, సత్పురుషుల శ్రేణుల విషయంలో కూడా మెహర్‌బాబా, సాయిబాబాల వివరణల మధ్య ఎన్నో విభేదాలు, వైరుధ్యాలు ఉన్నాయి. వీటన్నింటినీ వివరిస్తూ ఇంకో పుస్తకం వ్రాయగలిగినన్ని! దీనిని బట్టి - మార్మిక వాదుల సొంత అస్తిత్వాల విషయంలోని వారి ప్రకటనలలో ఎంత నిజం ఉందనేది మీరే అర్థం చేసుకోవచ్చు. ఇది మార్మిక అనుభవాల స్వభావానికి మరికొంత నిరూపణ- అందరు మార్మికవాదులు దేవునితో లీనమైనట్లు వారు భావించిన ఆ అనుభవాన్ని పొందుతారు. అందుకని ఎప్పుడోకప్పుడు తాను అవతారాన్నని ప్రకటించుకొంటారు. కాని నిజజీవితంలో వారు ఇతర మార్మికవాదులను ఎదుర్కొంటారు. అందుకని వారు ఈ శ్రేణుల ఆశ్రయం పొందుతారు- కుతుబ్‌లు, అబ్దాల్‌లు, సద్గురువులు, అవతారాలు అని వివరణ ఇస్తారు. ఒక వేళ వారు మార్మిక అనుభవాలనుంచి పొందిన జ్ఞానం సరిఅయినది, సంపూర్ణమైనది అయితే ఇలాంటి వైరుధ్యాలు ఉండజాలవు. కానీ భక్తులుగా ఇవేమీ మనకు పట్టవు. 'నా బాబా దేవుడు', మిగిలిన వారి గురించి, మిగతా విషయాల గురించి నాకనవసరం అని ముద్రవేసుకుని కూర్చుంటాం.**

# మెహర్‌బాబా గారి అస్తిత్వ వక్రీకరణ

మెహర్‌బాబా గారి తత్వం మార్మిక వాదమైన అద్వైత సిద్ధాంతము - 'అంతా మాయ' అనే వాదనతో ఇది మన ఉనికి యొక్క మౌలిక సత్యాలను కూడా వివరించలేదనేది గమనార్హం. ఈ తత్వానికి కారణమైన మార్మిక అనుభవాలు - ధ్యానసాధనల ఫలితంగా మెదడులో జనించే కొన్ని మానసిక స్థితులేననీ, దేవునితో అసంబంధమైనవనీ తెలుసుకున్నాం. మెహర్‌బాబా గారి అవతారవాదం సరిఅయినది కాదని ఆయన ఇచ్చిన వివరణల పరిశీలనలోనే తేలింది. మార్మిక అనుభవాల ప్రభావంతో తన అస్తిత్వాన్ని స్వయంగా వక్రీకరించుకున్న మెహర్‌బాబా - ఆయన మండలి మరియు భక్తుల ద్వారా ఎలా మరింత వక్రీకరణకు గురిచేయబడుతున్నారనేది క్రింది ఇవ్వబడిన యధార్థాలు వివరిస్తాయి.

**దర్శన వైరుధ్యం మరియు అకస్మిక మరణం :-**

1968వ సం॥రం జూలై నెలలో, మెహర్‌బాబాగారు తన 'ఏకాంత కార్యసాధన' నూటికి నూరిపాళ్లు అనుకున్నట్లుగా పూర్తయిందని ప్రకటించారు. 'కార్యం' నెరవేరింది కాబట్టి ఇక 'దర్శనం' ఇవ్వాలని భక్తులు కోరారు. దానికి ఆయన అక్టోబరు నెలలో - వచ్చే సంవత్సరం వేసవి కాలంలో పూనాలో దర్శనమిస్తానని ఒక సందేశం ద్వారా జవాబిచ్చారు. కాని ఆయన ఈ జోస్యం నెరవేరలేదు.

1968 డిసెంబరు చివరకే ఆయన ఆరోగ్యం పూర్తిగా పాడయింది. జనవరి 31 (1969)న ఆయన మిట్టమధ్యాహ్న సమయంలో తన మంచం మీదే తీవ్రమైన కండర సంకోచవ్యాకోచాలకు గురై కన్నుమూశారు. ఎరుచ్ జెస్సావాల - ఫ్రాన్సిస్ బ్రాబజాన్ మరియు భాకల్చురీల సహకారంతో సుమారు 30 నిమిషాలపాటు నోటితో గాలిని పంపి మెహర్‌బాబా గారిని కాపాడడానికి ప్రయత్నించారు. డాక్టర్ గోహర్ ఆయన శరీరానికి పలు ఇంజెక్షన్‌ల ఇచ్చి బ్రతికించడానికి ప్రయత్నించారు. మండలి సభ్యులకు మెహర్‌బాబా గారి మరణం నమ్మశక్యం కాలేదు. బాబాగారి చెల్లెలు మని ఇరానీ, డా॥ గిండే గారితో బాబా 'కోమాలోకి వెళ్తే ఏడు రోజుల తర్వాత మరలా మామూలు మనిషి అవుతాను' అని అన్నారని వాదించారు. డాక్టర్ గిండే ఆమెకు, కోమాలోకి వెళితే గుండె కొట్టుకుంటూ ఉండాలని కానీ ఇక్కడ పరిస్థితి వేరని వివరణ ఇచ్చారు. అయినా సరే మని ఇరానీ గారు డాక్టర్‌ల వివరణను అంగీకరించలేదు.[1] చాలా సేపు వివరించిన పిమ్మటనే ఆమె బాబా ఇకలేరనే నిజాన్ని ఆమోదించారు.

ఆయన దగ్గరి భక్తులు కూడా మెహర్‌బాబా గారి మరణంలో ఏమాత్రం అసాధారణత (సంచలనత) లేకపోవడంతో ఎంతో నిరాశ చెందారు. ఒకే అసాధారణత ఏమిటంటే బాబాగారు ఎవరికీ చెప్పకుండానే పోయారనేది. దీనికి వారు నిర్ఘాంతపోయారు.[2]

భక్తుల, సందర్శకుల దర్శనార్థం మెహర్‌బాబా గారి భౌతికకాయాన్ని మెహరాబాద్‌లోని ఆయన సమాధి వద్ద వారం రోజులు ఉంచారు. ఇది ఫిబ్రవరి(1969) మొదటి వారంలో జరిగింది. ముందు దీనిని 'చివరి దర్శనం'గా పేర్కొన్నారు. కానీ తర్వాత 1969 వేసవిలో పూనాలోని 'గురుప్రసాద్'లో ఇంకొక దర్శన కార్యక్రమం నిర్వహించబడింది. ఈసారి దర్శనార్థం బాబా గారి భౌతిక కాయం లేదుగానీ, సందర్శకులు బాబాగారి చివరి దర్శనం చేసుకుంటున్నామనే నమ్మకంతో వచ్చారు. ఈ రెండు చివరి దర్శనాలలో ఏది అసలైన చివరి దర్శనం అనే మీమాంసను ప్రక్కన పెట్టి, పూనాలో జరిగిన దానిని 'మహాదర్శనం' అని వర్ణించడం జరిగింది.[3]

**మౌనవ్రత విరమణ వైరుధ్యం:-**

మెహర్‌బాబా గారు మౌనం వీడతానని, తదనంతరం ఒక 'గొప్ప వచనం' పలుకుతానని అక్షర పలక సహాయంతో చెప్పుకొనేవారు. చాలమంది భక్తులు దీనికోసం ఎదురు చూశారు. కాని బాబా గారు ఏ 'వచనం' పలుకలేదు. ఈ వైరుధ్యం కారణంగా చాలామంది (ఇదమిద్ధంగా తెలియని సంఖ్యలో) భక్తులు ఆయనలో నమ్మకాన్ని కోల్పోవడం జరిగింది.[4] 2001 సంవత్సరంలో భాకల్బురీ గారు మెహర్‌బాబా గారి ఒక కొత్త ఉపదేశాన్ని బయటపెడుతూ, మరణానికి ముందు బాబా తనతో 'గుర్తుంచుకోండి, నేను ఈ శరీరాన్ని కాను' అన్నారని వెల్లడించారు. తన గొంతు మూగబోలేదని నిరూపించడానికే బాబా గారు ఇలా నాతో అన్నారు, ఇది ఆయన ప్రకటించిన వచనానికి సమానం కాదని భాకల్బురీ వివరణ ఇచ్చినా, ఈ ఉపదేశం అసలు ఇవ్వబడిందా లేదా అనే ప్రశ్నమీద మండలి సభ్యులలో విభేదాలు తలెత్తాయి. డాన్ స్టీవెన్స్, భాకల్బురిల మధ్య జరిగిన వాదోపవాదాలు దీనికి నిదర్శనం.[5]

**వారసుడి వైరుధ్యం:-**

1962వ సం॥లో జరిగిన ఒక కార్యక్రమంలో మెహర్‌బాబా గారు ఛార్లెస్ పర్డోమ్‌తో తనకు వారసుడు ఉంటాడని (అంటే ఆధ్యాత్మిక రంగంలో) చెప్పారు. కాని అతను లేక ఆమె ఎవరనేది చెప్పలేదు.[6] కాని బాబా గారి మరణానంతరం, మండలి సభ్యులు బాబా గారికి వారసులెవరూ లేరని నొక్కిచెప్పడం ద్వారా బాబా గారి అవతార హోదాను మరింతగా ఎక్కువ చేశారు.

**మెహర్‌బాబా గారి అస్తిత్వ వక్రీకరణలో- మండలి సభ్యుల పాత్ర:-**

మని కె. ఇరానీ గారు బాబా నిజంగా చనిపోలేదనే భావనను ప్రచారం చేశారు.[7] డాన్ ఇ. స్టీవెన్స్ అనే అమెరికాకు చెందిన మండలి సభ్యుడు, బాబా గారి ఉపదేశాలలో మంచిపట్టు ఉన్నవాడినని స్వతహాగా భావిస్తూ, అవతారవాద ఉపన్యాసాలనే ఇచ్చేవారు.[8] మెహర్‌బాబా గారి మరణానంతరం ఆయనపై మితిమీరిన భక్తి, వ్యక్తి పూజలను బలపరచడంలో ఇలాంటి మండలి సభ్యుల పాత్ర ఎంతైనా ఉంది.

1960-70 సం॥లలో అమెరికాలో మత్తుమందులకు బానిసలైన అనేక మంది బాబా భక్తులుగా మారారు. వాళ్ళు 'చింతించకు. సంతోషంగా ఉండు', 'బాబా గారి గొడుగు' అనే నినాదాల్ని విపరీతంగా ప్రచారం చేసి ఒక రకంగా బాబా గారి ఉపదేశాలను వక్రీకరించారు.

కెవిన్ గారు ఇలా వ్రాశారు: డెలియా డె లెయన్ (మ॥1993) గారు బాబాను నూతన తర సంరక్షకుడిగా చిత్రీకరించడంలో ప్రముఖ పాత్ర పోషించారు. ఈ నూతన తర ప్రకటనలో 'చింతించకు, సంతోషంగా ఉండు, నేను నీకు సహాయం చేస్తాను' అని ఉంది. సందర్భ ప్రస్తావన లేని ఈ నినాదం వక్రీకరణ సాధనంగా మరియు ఒక కొత్త మతంలోకి సభ్యులను ఆకర్షించడానికి ఉపయోగపడింది. నిజానికి మెహర్‌బాబా గారు ఒక కొత్తమతాన్ని స్థాపించాలనేది తన లక్ష్యమే కాదని ఖచ్చితంగా ప్రకటించారు.[9]

మెహర్‌బాబా గారి ఉపదేశాలు, మాటలు కూడా చాలా వక్రీకరింపబడ్డాయి. బాబా గారు మరణానంతరం కూడా భక్తులకు సహాయం చేస్తున్నారనీ, వాళ్ళకు ఆధ్యాత్మిక మార్గం చూపగలరని మండలి సభ్యులు ప్రచారం చేశారు. కానీ, మెహర్‌బాబా గారు ఈ బాధ్యతలను గురించి ఎప్పుడూ మాట్లాడనే లేదు. తన సమాధి దర్శింపబడుతుంది అని మాత్రమే ఆయన చెప్పారు (ఇది సూఫీ గురువుల సాధారణ నమ్మకం).

సమాధుల సందర్శన విషయంలో మెహర్‌బాబా గారు ఇలా అన్నారు: "గురువులు సమాధులలో నివాసం చేయరు, వారి అవశేషాలైన ఎముకలలో కూడా ఏమీ ప్రత్యేకత లేదు. చుట్టూ ఉండే ఆధ్యాత్మిక వాతావరణం మాత్రమే వారి సమాధులకు విలువనిస్తుంది."[10] కానీ మండలి సభ్యులు మెహర్‌బాబా గారి సందర్శకులను సూఫీ దర్గాలాగ ఉన్న ఆయన సమాధివద్ద ఆరతి నిర్వహించడానికి, ఆరతిపాటలు పాడడానికి ప్రోత్సహించడంలో వెనుకాడలేదు. మరణానంతరం వ్యక్తిగత సహాయం గురించి మెహర్‌బాబా గారి సందేశాల్లో ఎలాంటి వివరణ లేదు. కానీ మండలి సభ్యులు 'చనిపోయిన 100 సం॥ల వరకు బాబా సమాధి దగ్గర గడపడం బాబా బ్రతికుండగా ఆయనతో గడపడంతో సమానం' అనే కొత్త సందేశాన్ని ప్రచారం చేశారు. బాబా గారి హిందూ భక్తుడైన బాల్‌నాతు దీనిని ఆవిష్కరించారు (కల్పించారు).[11]

జె.ఎ. గ్రాంట్ గారు వ్రాసిన పుస్తకం 'మెహర్‌బాబా గారితో ఆధ్యాత్మికత' వెనుక ఇలా వ్రాసారు: "గురువులు, సద్గురువులు మరణానంతరం తమశక్తులు కలిగే ఉన్నా, వాటిని వారు ఉపయోగించలేరు. కానీ అవతారం విషయంలో ఇదివేరు. దేవుడు ఎల్లప్పుడు అత్యంత శక్తిశాలి. శరీరంలో ఉన్నా లేకున్నా దానిని ఆయన ఉపయోగించగలడు."[12]

ఈ కొత్త భావావిష్కరణ మెహరాబాద్, మెహరాజాద్‌ల వద్ద సందర్శకులను ప్రోత్సహించడం కోసం చేయబడింది. తద్వారా అక్కడ మెహర్‌బాబా గారి సమక్ష్యాన్ని ఆశ్వాదించవచ్చు అనే భావన ప్రచారం చేయబడింది. మెహర్‌బాబా గారి ప్రకారం అవతారం ప్రతి 700 నుంచి 1400సం॥లకు ఒకసారి పునర్జన్మిస్తాడు. మరి అతను చనిపోయిన అనంతరం కూడా అక్కడే ఉంటే మరలా పునర్జన్మించడమెందుకు? మరి అలా అయితే పాత అవతారాల మాటేమిటి? భక్తులు తమతోనే ఉన్న అవతారం యొక్క తదుపరి అవతారంకోసం వేచి చూడడమేమిటి? ఇలాంటి అనేక సందేహాలకు ఈ భావావిష్కరణ కారణమయింది.

ఇదేవిధంగా డాన్ ఇ. స్టీవెన్స్ గారు 'సదా జీవించే సద్గురువు' అని అవతారానికి నిర్వచనాన్ని మెహర్ బాబా గారి 'ఉపదేశాలు' యొక్క 7వ కూర్పు(ఎడిషన్)లో పొందుపర్చారు. ఇది మెహర్‌బాబా గారి కాలంలో ప్రచురించబడిన 6వ కూర్పులో లేదు.

మెహర్‌బాబాగారు ఒక కొత్త మతాన్ని స్థాపించాలని ఎన్నడూ భావించలేదు. కానీ ఆయన భక్తులు - ఆయనను దేవునిలా పూజిస్తూ, మందిరాలు నిర్మిస్తూ, ఆయన సిద్ధాంత తత్వాన్ని నెమ్మదిగా ఒక మతంలాగా మార్చివేస్తున్నారు. ఇది మెహర్‌బాబా గారి సైద్ధాంతిక విలువలకే వ్యతిరేకం. బాబా కేంద్రాల స్థాపన విషయంలో కూడా మెహర్‌బాబా గారు సుముఖంగా ఉండేవారు కారు. 1954వ సం॥లో ఆయన రాజమండ్రి పర్యటించినపుడు, మార్చి 1న ఒక భక్తుల సభను నిర్వహించారు. "నా పనికి కేంద్రాలు, డబ్బులు వసూలు చేయడం లాంటివి అవసరం లేదు" అన్నారు.[13] ఏవైనా కేంద్రాలు తన పేరు మీద మొదలయితే దానికి తాను బాధ్యత వహించనని కూడా స్పష్టంచేశారు. బాబాకేంద్రాలలో నెలకొన్న హద్దుకు మించిన భక్తిపారవశ్యాన్ని ఖండిస్తూ, బాబా కేంద్రాలు మరియు మెహర్ పబ్లికేషన్స్‌లను మూసివేయాలని ఆదేశించారు.

'అవతార్ మెహర్ బాబా కీ జై' అనే నినాదం 1954 సం॥నుంచి ఆంధ్రాలో ఎక్కువగా ప్రచారం చేయబడసాగింది, తదుపరి సంవత్సరం దీని గురించి మాట్లాడుతూ మెహర్‌బాబా ఇలా అన్నారు: "అప్పుడప్పుడు అవతార్ కీ జై అని అరవడంలో అర్థం లేదు, అలా అరవాలనుకుంటే మీ మనసుల్లో అరచుకోండి, వేరేవారికి వినిపించనట్టు''. ప్రజలు మార్మికవాద మోక్షమార్గాన్ని అవలంబించడం ద్వారా మోక్షాన్ని పొందాలేగానీ, ఇలా అప్పుడప్పుడు పైపై నినాదాలు, మౌనవ్రతాలు, తనకు పూజలుచేయడంతో సరిపెట్టుకోకూడదనేది ఆయన అంతరార్థం అయి ఉండవచ్చు.

వీటన్నింటినీ బట్టి అర్థమయ్యే విషయమేమంటే - మెహర్‌బాబా గారు ఒక మార్మికవాది. అనేక మంది మార్మికవాదులు పొందిన మార్మిక అనుభవాలనే ఆయనా పొందారు. చదువుకున్నవారు, ఆధునిక సమాజంలో నివసించిన వారు కాబట్టి ఇతర మార్మికవాదులు చేసిఉండని అనేక కార్యక్రమాలు ఆయన చేయగలిగారు. విదేశాలకు పయనించి, పాశ్చాత్తులను శిష్యులుగా చేసుకోవడంతో పాటు, మండలి ద్వారా భక్తులతో పటిష్టమైన ప్రచార యంత్రాంగాన్ని నిర్వహించగలిగారు. ఆయన సిద్ధాంత తత్వం - సూఫీ, వేదాంత మరియు జొరాష్ట్రియన్ మార్మికవాద సాంప్రదాయల సమ్మేళనం. ఆయన మిగిలిన జీవిత విశేషాలు చాలా సాధారణంగా కనిపిస్తాయి. ఆయన ఇతరులలాగ రోగాలను అనుభవించారు, ప్రమాదాలకు గురయ్యారు మరియు అకస్మత్తుగా మరణించారు. ఈ పుస్తకంలో విశ్లేషించబడిన మార్మిక అనుభవాల కారణంగా ఆయన తనను తాను దేవునిగా, అవతారంగా ప్రకటించుకున్నారు. ఈ అస్తిత్వ వక్రీకరణను, ఆయన మరణానంతరం మండలి సభ్యులు సంపూర్ణం చేస్తున్నారు. అయితే ఆయన పేదలకు, కుష్టురోగులకు, మతిస్థిమితం లేని వారికి చేసిన సేవలు ఎనలేనివి మరియు ఆదర్శప్రాయమైనవి.

" 'వైరుధ్యం' అనేది భావార్ద్రతను సవాలు చేస్తుంది.
కానీ ఒక్కోసారి భావార్ద్రత ఎంత బలంగా ఉంటుందంటే
- 'వైరుధ్యం' అందులోకి కరిగి, కనబడకుండా
పోతుంది".

- మాసన్ కూలె

# 7. సాయిబాబా గారి అస్తిత్వ వక్రీకరణ

దేవుణ్ణి అమితంగా ప్రేమించే భక్తులు దైవాన్వేషణలో వెళ్ళి, తామే స్వయంగా దేవుళ్ళలా అయిపోతారో ఎప్పుడైనా ఆలోచించారా?

ఇదెందుకు, ఎలా జరుగుతుందో మనం నాలుగువ అధ్యాయంలో చూశాం. ఈ విధంగా వారికి మునుపు వేల మంది మార్మికవాదులు చవిచూసిన మార్మిక అనుభవాలనే సాయిబాబా మరియు మెహర్‌బాబాలు కూడా పొందారు. మార్మిక విలీనత్వం, సంపూర్ణ ఐక్యస్థితి మొదలైనవి పొంది "నేను దేవుణ్ణి" అని ప్రకటించుకున్నారు.

మార్మికవాదము, మార్మిక అనుభవాల గురించి కించెత్తు జ్ఞానం లేక బాబాల చుట్టూ ఉన్న వారిని గురించి ఊహించుకోండి. వారు "నేను దేవుణ్ణి" అనే ఈ ప్రకటనను ఎలా స్వీకరిస్తారు? "దేవుడు" అనే పదానికి అర్థం సరిగా తెలియని వారే ఒక మనిషిని దేవునిగా నమ్ముతారు.

మన్సూర్ హల్లాజ్ మన దేశంలో నివసించి ఉంటే ఈ రోజు మనకు సాయిబాబా, మెహర్‌బాబాలతో పాటు మన్సూర్‌బాబా భక్తులు, ఆలయాలు కూడా ఉండి ఉండేవి.

సాయిబాబా, మెహర్‌బాబా భక్తులు ఆశ్చర్యపోవచ్చు: మార్మికవాదము, దాని సిద్ధాంతత్వం, మార్మిక అనుభవాల శాస్త్రీయ విశ్లేషణ వెలుగులో చూస్తే వారి బాబాల గురించిన ఒక సరికొత్త అవగాహన వారిలో జనించవచ్చు. కానీ ఇంకా చాలామంది సంశయంతో అడగవచ్చు: "మరి అలాగైతే భక్తులు వారిని అంత పరిపూర్ణ విశ్వాసంతో దేవుని అవతారాలుగా ఎలా కొలుస్తున్నారు?" అని. ఈ ప్రశ్నకు సమాధానం ప్రశ్నలోనే ఉంది - "భక్తులు". మార్మికవాదులు తమ మార్మిక అనుభవాల ద్వారా దేవుళ్ళుగా భ్రమపడ్డారు. మనం (భక్తులం) వారిని నిజంగానే దేవుళ్ళుగా మార్చివేశాం.

నిజం ఏమిటంటే ఈ అస్తిత్వవక్రీకరణ మార్మికవాదుల ప్రకటనలనుంచే మొదలవుతుంది. వారిని అనుసరిస్తున్నవారు దానిని వారిపై గల అమితమయిన గౌరవం మరియు భక్తిశ్రద్ధలతో పరిపూర్ణం చేస్తారు. మార్మికవాదుల మరణానంతరం, ఈ భక్తి దారితప్పి కొత్తరూపం దాల్చడంతో వారి మందిరాలు వెలుస్తాయి. ఇదీ ఇప్పుడు మనం చూస్తున్న మార్మికవాద దేవుళ్ళ పరిస్థితి వెనుక వాస్తవం.

ఈ అధ్యాయంలో సాయిబాబాగారి విషయంలో ఈ ప్రక్రియ ఎలా జరిగిందనేది సవివరంగా మీముందుంచబడింది.

# సాయిబాబా- సూఫీ అస్తిత్వం నుంచి హిందూఅవతార- పరిణామ క్రమం

ముస్లిం సూఫీ ఫకీరు - సాయిబాబా ఎక్కడ? హిందూ అవతార రూపం - సాయిరామ్ ఎక్కడ? అస్తిత్వంలో ఎంత వక్రీకరణ? ఇది భక్తి పారవశ్యతలో మన అంధత్వం తప్ప మరేమీ కాదు. భక్తిరస ప్రభావంలో మన ఇష్ట దైవాలుగా ఎంచుకున్న వారి గురించి ఏమి చెప్పబడినా గుడ్డిగా నమ్మేస్తాం. హేతువాదం, యథార్థాల పరిశీలన గురించి కొంచెం కూడా ఆలోచించం.

వారెన్ గారు ఇలా వ్రాసారు - "సాయిబాబాగారు ప్రేరేపించిన భక్తిని కించపరచడం నా ఉద్దేశ్యం కాదు. మహానుభావులందరూ ఒక ప్రత్యేక సాంప్రదాయం నుంచి ఆవిర్భవిస్తారనేది జగమెరిగిన సత్యం. వారి సందేశాన్ని, వారి సాంప్రదాయ వెలుగులోనే మనం సరిగ్గా అర్థం చేసుకోగలం. ఉదాహరణకు, యూద సాంప్రదాయ అవగాహన ద్వారానే యేసుక్రీస్తు గారి సందేశాలను సరిగ్గా అర్థం చేసుకోగలము. అలాగే హిందూ సాంప్రదాయానికి చెందిన బుద్ధుడి విషయంలో కూడా. నా పరిశోధన నిగ్గుతేల్చిన విషయమేమిటంటే సాయిబాబాగారు సూఫీ సాంప్రదాయనికి చెందినవారు. ఆ పథంలోనే పయనించి ఆయన దైవత్వ అనుభవాన్ని పొందారు. మరలాంటప్పుడు ఆయనను ఒక హిందూ అవతారంలా భావించడం ఎంత వరకు సబబు?"[1]

**ఈ అస్తిత్వవక్రీకరణ జరిగిన తీరిది:**

సాయిబాబాగారు షిర్డిలో 1858 నుంచి 1918 వరకు నివసించారని భావిస్తే ఇది సుమారు 60 సం॥ల కాలం. కానీ ఇందులో చివరి 10సం॥లు మాత్రమే ఆధారాలతో పొందుపర్చబడ్డాయి. గ్రామీణ భారతదేశంలో, ఆ రోజుల్లో వ్రాతల రూపంలో కాకుండా మాటల రూపంలోనే ఒక తరం నుంచి ఇంకొక తరానికి సమాచారం సంక్రమించేది. సాయిబాబాగారు ప్రసిద్ధి చెందినప్పటికే ఆయనను యువదశలో గుర్తించిన వారు మరణించి ఉంటారు. అందుకని ఆ దశ గురించి సవివరంగా తెలియజేసేవారు ఆయన వృద్ధాప్య కాలంలో చాలా అరుదుగా ఉండి ఉండటం వలన సత్య దూరమైన పౌరాణిక గాథల రూపంలో తప్ప ఖచ్చితమైన వివరాలు అందుబాటులో లేవు.

సాయిబాబాగారి గురించిన వివరాలు పుస్తకాల్లో మాత్రమే పొందుపర్చబడ్డాయి. ఇప్పటికి ఆయన మరణించి 88సం॥లు దాటిపోవడంతో ఆయనతో వ్యక్తిగత సంబంధం ఉన్న వాళ్ళుందరూ చనిపోయారు. వారెన్ గారి పరిశోధనానుభవంలో షిర్డీలోని హిందువులను విచారించేటప్పుడు ఆమె గమనించినది ఏమిటంటే- వృద్ధులు కూడా 'శ్రీ సాయి సత్చరిత' లాంటి పుస్తకాలలో ఉన్న వివరాలను పునరావృత్తం చేస్తున్నారే తప్ప ఇతర ఏవిధమైన ప్రత్యక్ష సమాచార జ్ఞానం కలిగిలేరు.[2]

సాయిబాబాగారి జీవిత చరిత్ర యొక్క అధిక భాగం ఆయన మరణానంతరం వ్రాయబడింది. ధబోల్కర్ గారు 1910వ సం॥లో అంటే సాయిబాబాగారు జీవించి ఉన్నప్పుడే ఆయన జీవిత చరిత్రను 'శ్రీ సాయి సత్చరిత' రూపంలో వ్రాయడానికి పూనుకున్నప్పటికి, 1918 సం॥లో అంటే సాయిబాబా గారు మరణించే సమయానికి 53 అధ్యాయాలలోని రెండు అధ్యాయాలు మాత్రమే వ్రాయబడ్డాయి. మిగిలిన అధ్యాయాల సంకలనం, ప్రచురణ 1929వ సం॥ వరకు జరగలేదు. ఇక నరసింహస్వామి గారి సాయిబాబా జీవిత చరిత్రపై పరిశోధన 1936వ సం॥లో మొదలయింది. అంటే సాయిబాబాగారు మరణించిన 18 సంవత్సరాల అనంతరం. ఇది పూర్తయి ప్రచురణ జరిగింది 1955-56 సం॥ల మధ్య. ఈ కారణాలవలన హిందూ కోణంలో సాయిబాబా గారి జీవిత విశేషాలను మలచడానికి చాలా అవకాశం దొరికి ఉండవచ్చునేది స్పష్టమవుతుంది.

ముస్లింలు 'సూఫీజం' మీద ఆసక్తిని కోల్పోవడమే కాక, తమ మతాచారాలను అంతగా పాటించని సాయిబాబాగారిని ఆమోదించడానికి వెనుకాడారు. దీనికి కారణాలు మనం (3వ అధ్యాయంలో) చూశాం. మహాఖ్యాతి గాంచిన ఆ సూఫీ పరంపరలు అంతమైపోయాయి. ముస్లింలు సన్యాస జీవితం గడపడానికి ఇష్టపడటంలేదు. తాతముత్తాతలు సూఫీ గురువులైన చాలామందిని వారెన్ కలిసారు. వారంతా ఇప్పుడు పాఠశాల గురువులుగా స్థిరపడడమో, ఇతర వృత్తులు చేసుకోవడమో చేస్తున్నారే తప్ప వారి తాతముత్తాతల సిద్ధాంతాల గురించి పట్టించుకోవడంలేదు.[3]

1897వ సం॥లో సాయిబాబాగారి గౌరవార్థం షిర్డీలో ఒక సంబరం నిర్వహించబడింది. కొంతమంది ముస్లింలు తమ గురువుల గౌరవార్థం చేసే ఈ సంబరాన్ని 'ఉరుసు' అంటారు. ఇలా మొదలైన ఈ కార్యక్రమం 15 సం॥ల పాటు (1912 వరకు) ప్రతి సంవత్సరము క్రమం తప్పకుండా నిర్వహించబడింది. 1912 వ సం॥లో దానిని హిందువుల 'రామనవమి' పండగ సంబరాలతో జతచేయాలని సూచింపబడింది. హిందూ భక్తుల ఈ కోరికను సాయిబాబా కాదనలేకపోయారు. కాలక్రమంలో ఈ 'ఉరుసు' ఉత్సవం పూర్తిగా మాయమైపోయి, రామనవమి ఉత్సవమే నిర్వహించబడుతుంది. ఈ ఉత్సవ మూలమైన ముస్లిం అస్తిత్వం కూడా అలాగే మరుగున పడిపోయింది.

సాయిబాబాగారి మరణానంతరం, 3-4సం॥ల వరకు సాయిబాబాగారి సమాధి, ఆయన సేవకుడైన అబ్దుల్ గారి ఆధీనంలో ఉండేది. కానీ ఆయన ఒక బీద ఫకీరు. 1922 వ సం॥లో హరి సీతారాం దీక్షిత్ అనే భక్తుడు షిర్డీ వచ్చినపుడు - సాయిబాబాగారి సమాధి సరిగా చూడబడడం లేదని ఆగ్రహించారు. ఆయన దాని మీద అబ్దుల్ గారి అధికారాన్ని సవాలుచేస్తూ, హిందూ సభ్యులే అధిక సంఖ్యలో ఉన్న ఒక సంస్థానాన్ని (Public Trust) జిల్లా కోర్టు ద్వారా ఏర్పాటు చేశారు. అబ్దుల్ గారు ఈ చర్యను సవాలు చేస్తూ, సాయిబాబా గారు బ్రతికుండగా 29 సం॥లు ఆయన సేవలో గడిపిన తనకే ఆయన సమాధి వారసత్వం చెందాలని వాపోయారు. అబ్దుల్ గారు కేసు ఓడిపోయి, సాయిబాబా సమాధి వద్దనుండి బహిష్కరింపబడ్డారు. ఈ చర్యల ద్వారా హిందువులు బహిరంగంగా సాయిబాబాగారి సమాధిని స్వాధీనం చేసుకున్నట్లయింది. కొంత కాలం తరువాత అబ్దుల్ గారిని మరలా సమాధి దగ్గరకు రానివ్వడం జరిగింది. కానీ అప్పటికే జరిగిన సంఘటనల వలన, అక్కడ జరుగుతున్న మార్పులను ఆయన వ్యతిరేకించే అధికారం కోల్పోయారనేది స్పష్టంగా తెలుస్తుంది.

అప్పటివరకూ ఒక చిన్న ఫొటోతో ఉన్న సమాధి, ఎక్కువ సంఖ్యలో హిందువులు రావటం మొదలవటంతో అనేక మార్పులు చెందసాగింది. ఫొటో పెద్దదిగా చేయబడి, దానిపై, ఒక గొడుగు వెలసి, 'ఓం' అనే అక్షరాలు సాయిబాబాగారి పేరు మీద వ్రాయించబడ్డాయి.

ఈ విధంగా, అప్పటి వరకు అతి సాధారణంగా, ఒక సూఫీ దర్గాను పోలి ఉన్న సాయిబాబాగారి సమాధి, 'సమాధి మందిరం' గా పరిణామం చెంది, తరువాతి సంవత్సరాలలో హిందూ సాంప్రదాయక పూజలెన్నో అక్కడ ప్రారంభం అయ్యాయి.[4] ఈ సమాధి పరిణామ క్రమం వారెన్ గారి పుస్తకంలో ఫొటోలతో సహా వివరింపబడింది.

1952 వ సం॥లో అబ్దుల్ గారు మరణించడానికి 2 సం॥ల ముందు, సంస్థానం వారు సాయిబాబాగారి ఒక పెద్ద పాలరాతి విగ్రహాన్ని, ఆయన సమాధి వెనుక ఆవిష్కరించారు. ముంబాయికి చెందిన- బాలాజీ వసంత్ తలిమ్ గారు ఈ విగ్రహాన్ని రూపొందించారు.

అబ్దుల్ గారి మరణానంతరం, సాయిబాబాగారి మూర్తిని సంస్థానం వారు - ఒక వెండి గొడుగుతో ఉన్న వెండి సింహాసనం మీదకు మార్చారు. విగ్రహం మీద హిందూ భక్తులు ఇలా వ్రాయించారు: 'రఘుపతి రాఘవ రాజారామ్, పతిత పావన సాయినామ్'. దీనర్థం- 'రఘువంశ మహారాజు- రాముడు - సాయినామంతో పిలువబడువాడు - పీడిత భక్తులను ఉద్ధరించు (ఆదుకొను) వాడు'. అసలు భజనలో 'సీతారాం' అని ఉండేది, దానిని 'సాయినామ్' అని మార్చివేశారు. ఈ విధంగా రామునితో, సాయిబాబా గారి అస్తిత్వం జోడించబడింది. ఈ చర్య తర్వాత - ఇంతకుముందు వచ్చే ముస్లింలే కాకుండా సూఫీ ఫకీర్లు కూడా అక్కడకు రావడం మానేశారు.[5]

సాయిబాబాగారిని మతాల సమానత్వానికి చిహ్నంగా వర్ణిస్తారు. కానీ ఇలాంటి చర్యల వలన ఆయన యొక్క ఆ అస్తిత్వ గుణంపై కూడా మచ్చపడింది.

## అస్తిత్వ వక్రీకరణలో రచనల పాత్ర

సాయిబాబాగారి జీవిత చరిత్రలు ఆయన మరణానంతరమే వ్రాయబడ్డాయి. ఇంకొక ముఖ్యవిషయం ఏమిటంటే - ముస్లింలు ఎవ్వరూ ఆయన జీవిత చరిత్రను వ్రాయలేదు. వ్రాసిన వారందరూ బ్రాహ్మణులే. ఇస్లాం గురించి, సూఫీజం గురించి అవగాహన లేని వీరు సాయిబాబాను వారి భక్తి పారవశ్యత వలన హిందూకోణంలో చూడటం, హిందూ సాంప్రదాయంలో ఆయనను ఇమడ్చడంలోనే ఎక్కువ ఆసక్తి, ఉత్సుకతలను చూపించారు.

### ధబోల్కర్ - సాయిబాబా గారి మొదటి చరిత్ర కారుడు:

ఈయన పూర్తిపేరు- గోవిందరావ్ రఘునాధ్ ధబోల్కర్. అన్నాసాహెబ్‌గా కూడా పిలువబడే ఆయనను సాయిబాబా 'హేమద్ పంద్' అని పిలిచేవారు.

ఈయన 1910 వ సం॥లో నానాచందోర్కర్ ద్వారా సాయిబాబా గురించి తెలుసుకుని, సాయిబాబా మరణించే వరకు గల 8 సం॥లలో అప్పుడప్పుడు ఆయనను కలిసేవారు.

ఆయన సాయిబాబాగారి భక్తిపరమైన జీవిత చరిత్రను మరాఠీ భాషలో వ్రాశారు. సాయిబాబాగారు మరణించిన 11 సం॥ల తర్వాత, 1929 లో అది 'శ్రీ సాయి సత్చరిత' గా ప్రచురింపబడింది.

మహారాష్ట్రకు చెందిన సాంప్రదాయ శైలిని అనుసరిస్తూ, 15 వ శతాబ్దానికి చెందిన మరాఠీ గ్రంథం- 'శ్రీ గురు సచరిత'ను పోలిఉండే విధంగా ఆయన దానిని వ్రాశారు. శ్రీ గురు లేక దత్తాత్రేయల జీవిత చరిత్రయిన 'శ్రీ గురు సచరిత'ను గంగాధర్ సరస్వతి వ్రాశారు.

'శ్రీ సాయి సత్చరిత' పద్యరూపంలో వ్రాయబడింది. ఇందులో మొత్తం 53 అధ్యాయాలు ఉన్నాయి (51 అధ్యాయాలు, ఒక తుదిపలుకు, ఒక సారాంశం).

ధబోల్కర్ ఒక బ్రాహ్మణుడు. ఆయనకు ఇస్లాం గురించి గానీ, 'సూఫీజం' గురించి గానీ ఏ మాత్రం అవగాహన లేదు. ఈ కారణంగా ఆయన సాయిబాబాగారి జీవిత సంఘటనలు, వచనాలను తన మత సాంప్రదాయ పరిజ్ఞానంతోనే విశ్లేషించారు. దీనికి ఒక ఉదాహరణ:

## గోధుమపిండి మహత్యం (తిరగలి విసురుట - దాని వేదాంత తత్వము)

సాయిబాబాగారు గోధుమలను పిండి చేసి, దానిని ఊరి పొలిమేరల్లో విసిరి వేయించిన తరువాత కలరా వ్యాధి తగ్గడం గమనించారు ధబోల్కర్. ఈ సంఘటనను వివరించేందుకు, హిందూ ఆధ్యాత్మిక కోణంలో ఆలోచిస్తూ ధబోల్కర్ ఈ క్రింది వివరణ ఇచ్చారు:

“తిరగలి విసురుటను గూర్చి శిరిడీ ప్రజలనుకొను రీతియే కాక దీనిలో వేదాంత భావము కూడా కలదు. సాయిబాబా శిరడీ యందు సుమారు 60 ఏండ్లు నివసించెను. ఈ కాలమంతయు వారు తిరగలి విసురుచునే యుండిరి! నిత్యము వారు విసురునది గోధుములు కావు, భక్తుల యొక్క పాపములు, మనోవిచారములు మొదలైనవి. తిరగలి యొక్క క్రింది రాయి కర్మ, మీది రాయి భక్తి, చేతితో పట్టుకొనిన పిడి జ్ఞానము. జ్ఞానోదయమునకు కాని, ఆత్మసాక్షాత్కారమునకు గానీ మొట్టమొదట పాపములను, కోరికలను తుడిచివేయవలెను. అటు పిమ్మట త్రిగుణ రాహిత్యము పొందవలెలను. అహంకారమును చంపుకొనవలెను”.[6]

ఈ వివరణను ధబోల్కర్ తన ‘శ్రీ సాయి సత్చరిత’లో పొందుపరిచారు. సాయిబాబాగారి జీవిత సంఘటనలను ఆయన చరిత్రకారులు ఈ విధంగా హిందూ సాంప్రదాయ కోణంలో చూసి విశ్లేషించడం ద్వారా ఆయనను హిందు సాంప్రదాయంలో ఇమిడ్చి వేశారనడానికి ఇది ఒక చిన్న ఉదాహరణ మాత్రమే.

ఇదే సంఘటనను ఒక ముస్లిం చరిత్రకారుడు ఎలా వర్ణించి ఉండేవాడో చూద్దాము.

సూఫీ సిద్ధాంత కోణంలో చూస్తే : గోధుమలపై పొట్టును మన అజ్ఞానపు తెరలుగా భావిస్తే, వాటిని పిండి చేయడం అనేది సూఫీలు అనుసరించే ఫకీరు మరియు ఇతర సాధనలతో పోల్చవచ్చు. రాతి చక్రాలను - నిష్ఠ, సబూరి అనవచ్చు - దేవునిలో నమ్మకం మరియు సహనం. ఈ రెండు గుణాలు ఎంతో ముఖ్యమైనవిగా వర్ణించేవారు సాయిబాబా. వీటి సహాయంతో అజ్ఞానపు తెరలను అధిగమించి - స్వచ్ఛమైన పిండి లాంటి దైవగుణాన్ని పొందడంలా ఈ చర్యను వర్ణించవచ్చు. ఈ సూఫీ వివరణ సరి అయినదే. సాయిబాబాగారి జీవిత చరిత్రకారుడు సూఫీ అయి ఉంటే ఇలానే వ్రాసేవాడు.[7]

ముస్లింల ఆచారాలు, భాష తెలియకపోయినా సరే ధబోల్కర్, సాయిబాబాగారి ముస్లిం ఆచారాలను, పలుకులను యధాతథంగా పొందుపరిచినారు. ఉదాహరణకు, ధబోల్కర్ - సాయిబాబా మేకను ముస్లింల సాంప్రదాయ రీతిలో వధించేవారని నమోదు చేశారు.

**ఆంగ్ల అనువాదకుడు - గునాజీ:**

ఈయన పూర్తి పేరు నగేష్ వాసుదేవ్ గునాజీ. మరాఠీ భాషలో ధబోల్కర్ వ్రాసిన ‘శ్రీ సాయి సత్చరిత’ను ఈయన ఆంగ్లభాషలోకి అనువదించారు. ఈ పుస్తకం 1944వ సంవత్సరంలో ప్రచురించబడినది.

నగేష్ గునాజీ ఈ పుస్తకం కేవలం అనువాదం మాత్రమే అని పేర్కొన్నా, వారెన్ గారి పరిశీలనలో ఇది నిజం కాదని తేలింది.[8]

గునాజీ అనువాద క్రమంలో చాలా హెచ్చు తగ్గులు చేశారు. ఎలాగంటే ఆయన - సాయిబాబాగారి మాటలకు, చేతలకు తన సొంత హిందూ సాంప్రదాయ విశ్లేషణను చాలా చోట్ల జతచేశారు. 1920వ సంవత్సరంలో ప్రారంభమై, భక్తుల అనుభవాలను ప్రచురిస్తున్న షిర్డీ సంస్థాన్ యొక్క అధికారిక సంస్థ అయిన శ్రీ సాయిలీలా జర్నల్ నుంచి అనేక ఉల్లేఖనాలను తన అనువాదంతో మిళితం చేశారు. కొన్నిచోట్ల ధబోల్కర్ పొందుపరచని అదనపు వివరాలు కూడా గునాజీ జతచేశారు. ఉదాహరణకు ఆయన సాయిబాబా పాదముద్రలు నిమ్మచెట్టు కింద ఎలా ప్రతిష్టించబడ్డాయో వివరించే కథను తన అనువాదంలో జతచేశారు.[9]

కొన్నిచోట్ల ధబోల్కర్ గారి వివరణలను పూర్తిగా వదిలివేయడం కూడా జరిగింది. ఉదాహరణకు, సాయిబాబాగారు మేకను ముస్లింల సాంప్రదాయశైలిలో ఎలా బలి ఇచ్చారో వివరించే సన్నివేశాన్ని 38వ అధ్యాయం నుంచి పూర్తిగా తొలగించి, దానికి బదులు 'సాయిబాబాగారు మాంసంతో పలావు చేశారు' అని మాత్రమే వ్రాయబడింది.

ముస్లిం సాంప్రదాయాలు, గుర్తులు, సూఫీ అస్తిత్వం కళ్ళముందుంచే అనేక భాగాలను అనువాద క్రమంలో వదిలి వేశారు గునాజీ. సాయిబాబాగారు ఒకసారి తుఫానును శాంతింప చేయడానికి - 'సబూర్, సబూర్' అని ఉర్దూలో అరిచినట్లు ధబోల్కర్ వ్రాశారు. కానీ దీనిని గునాజీ ఆంగ్ల అనువాదం చేసినపుడు వాడిన పదాలు వాటి ఉర్దూ అస్తిత్వ మూలాన్ని కోల్పోయాయి. [10] ఆయన దీనిని ఆంగ్లంలో: 'Stop, Stop your Fury' గా వ్రాశారు. (తెలుగు 'శ్రీ సాయి సత్చరిత'లో - 'దిగు, దిగు శాంతించు' అని ఉంది.)

ధబోల్కర్ కూడా హిందూ కోణం నుంచే (హిందూ అవతారాల, శాస్త్రాల జ్ఞానం ఆధారంగా) తన విశ్లేషణలు జరిపినప్పటికీ, సాయిబాబాగారి ముస్లిం అస్తిత్వానికి చెందిన సంఘటనలు చాలా పొందుపరిచారు. కానీ గునాజీ మాత్రం - సాయిబాబాగారి ముస్లిం అస్తిత్వాన్ని కళ్లకు కట్టే ఎన్నో వివరాలను నొక్కి వేశారు. దీనికి ఒక పెద్ద ఉదాహరణ -

సాయిబాబా గారు ఒకానొక సన్నివేశంలో తనను తాను ముస్లింగా ప్రకటించుకుంటూ ఇలా అన్నారు: 'నేను ముస్లిం జాతికి చెందినవాణ్ణి' (మా జాతిక ముసల్మాన్ - మరాఠీలో). ధబోల్కర్ పొందుపరిచిన ఈ వివరణను గునాజీ తన అనువాదంలో పూర్తిగా విసర్జించారు.[11] డా॥ పండిత్ గారు సాయిబాబా నుదిటిపై చందనం పూసినపుడు, దానికి ఆయన ఎలా అంగీకరించారనే ప్రశ్నకు బాబా ఇలా బదులిచ్చారు:

"Baba replied that Dr. Pandit believed Him to be the same as his Guru, Raghunath Maharaja of Dhopeshwar, known as Kaka Puranik, and he applied the paste to His forehead, as he was doing to his Guru. Hence He could not object."

గునాజీ గారి పై ఆంగ్ల అనువాదంలో ఎక్కడా కూడా ముస్లిం అనే మాట లేకపోవటం గమనించండి. ఇప్పుడు తెలుగు 'శ్రీ సాయి సత్చరిత' ను గమనించండి: "నేనొక ముసల్మానుననీ, తానొక సద్బ్రాహ్మణుడననీ, ఒక మహమ్మదీయుని పూజించుట ద్వారా తాను మైల పడిపోవుదననే దురభిమానము లేకుండా అతడు నాలో తన గురువుని భావించుకొని అట్లు చేసెను....." (11:84)

మరాఠీ మూలంలో లేని డా॥ పండిత్ గారి గురువు పేరుని కూడా పొందుపరచటంలో గల ఆసక్తి, గునాజీ గారికి సాయిబాబా గారి స్వ వచనాలను అనువాదం చేయడంలో లేకపోవటం గమనార్హం.

తదుపరి ఆంగ్ల రచయితలందరూ - గునాజీ గారి ఈ అనువాదం ధబోల్కర్ గారి 'శ్రీ సాయి సత్చరిత'తో సమానం అనుకునే పొరపాటుచేశారు. వారెన్ గారు ఇలా అభిప్రాయపడ్డారు: చాలామంది ద్వితీయ శ్రేణి రచయితలు ఈ పొరపాటును చేశారు.[12] దీనికి ఉదాహరణలు - పెరిన్ ఎస్.బరుచా, సత్యపాల్ రూహేలాలు సాయిబాబాపై వ్రాసిన పుస్తకాలు.

ఈవిధంగా సాయిబాబాగారి ముస్లిం అస్తిత్వం మీద తెరవేయడం జరిగింది.

సకాలీన భక్తుల జ్ఞాపకాలు:

దాస్ గాను, జి.ఎస్. ఖపార్డె, రావ్ బహదూర్, ఎమ్.వి. ప్రధాన్, హరి సీతారాం దీక్షిత్, వమన్‌భాయ్ పటేల్ తదితరులు కూడా తమ జ్ఞాపకాలను సాయిబాబాగారి మరణానంతరం ప్రచురించారు. గమనించవలసిన దేమిటంటే - వీరంతా కూడా బ్రాహ్మణులే.

దాస్ గాను ఒక కీర్తకుడు, గురువుల ఖ్యాతిని కీర్తిస్తూ పాటలు పాడుకునేవాడు. 1897వ సం॥ నుంచి సాయిబాబాగారి 'ఉరుసు' సంబరాలలో మరియు 1912 తర్వాత రామనవమి ఉత్సవాల్లో పాల్గొన్నాడు. గురువులను కీర్తిస్తూ ఇతను మరాఠీలో చాలా పుస్తకాలు వ్రాసాడు. అలాగే సాయిబాబాగారి మీద శ్రీ సాయినాథ్ - స్థవన మంజరి అనే పద్యాన్ని రచించాడు.

దాస్ గాను హిందువు అవడం వలన సాయిబాబాను హిందూ సాంప్రదాయక శైలిలో పౌరాణిక కథాక్రమంలో కీర్తించాడు. ఆ కీర్తనలలో ఇంతకు ముందు ప్రచారంలో ఉన్న కథలను జతపరిచాడు.

1910 వ సం॥రం తరువాత, సాయిబాబా దర్శనార్థం ముంబాయి నుండి వచ్చే భక్తుల సంఖ్య విపరీతంగా పెరిగింది. వీరిలో అధిక శాతం మంది బ్రాహ్మణులే. వీరంతా దాస్ గాను కీర్తనాలాపనలు వినడం ద్వారా మరియు నానా చందోర్కర్ గారి ప్రమేయం ద్వారా వచ్చినవారే. నానా చందోర్కర్ అప్పటి బోంబే ప్రభుత్వంలో డెప్యుటీ కలెక్టర్‌గా పనిచేస్తూ, మంచి పలుకుబడి కలిగినవారు.

ఎమ్.వి ప్రధాన్ గారు 1933 వ సం॥లో ఒక చిన్న పుస్తకాన్ని 'షిర్డీ సాయిబాబా - భారతీయ ఆధ్యాత్మికత' అనే పేరుతో ప్రచురించారు. వారెన్ దీని గురించి ఇలా అభిప్రాయ పడ్డారు: ఈ పుస్తకం సాయిబాబాగారి జీవితం చివరిదశను వర్ణిస్తుంది. ఒక హిందువు మార్మికవాది వచనాలను అర్థం చేసుకోడానికి పడుతున్న తాపత్రయం ఇందులో కనబడుతుంది.[13]

ద్వితీయశ్రేణి రచయితలు : నరసింహస్వామి - సాయిబాబా గారి దూత :

సాయిబాబా గారి ద్వితీయ చరిత్రకారులైన నరసింహ స్వామి, 1933వ సంవత్సరంలో మొదటి సారిగా సాయిబాబా గురించి విన్నారు. అప్పటికి సాయిబాబా మరణించి 15 సంవత్సరాలు గడిచిపోయాయి. అప్పటికే సాయిబాబాను హిందూ సాంప్రదాయంలో ఇనుమడించే ప్రక్రియ కార్యరూపం దాల్చి ఉంది.

నరసింహస్వామి గారు వ్రాసిన సాయిబాబా గారి జీవిత చరిత్ర Life of Sai Baba. ఈయన చెన్నైలో 'ఆల్ ఇండియా సాయి సమాజ్' ను స్థాపించి, సాయిబాబాగారి ఖ్యాతిని దక్షిణ భారత దేశంలో వ్యాపింపజేయడంలో ప్రముఖ పాత్ర పోషించారు.

ఈయన అసలు పేరు - నరసింహ అయ్యర్. ఈయన ఒక సాంప్రదాయక బ్రాహ్మణుడు, బాల్యంలో తెలివైన విద్యార్థి, పేరు గాంచిన న్యాయవాది. సేలమ్‌లో ఈయన చాలా చురుకుగా పనిచేసేవారు. ఈయనకు భార్య, ఇద్దరు పిల్లలు ఉండేవారు. ఇంటిలోని బావిలో పడి ఇద్దరు పిల్లలూ దుర్మరణం చెందిన విషాధ సంఘటన ఈయన జీవితాన్నే మార్చి వేసింది. ప్రాపించిక జీవితానికి స్వస్తిపలికి, ఒక ఆధ్యాత్మిక గురువు అన్వేషణలో బయలు దేరారు.

తిరువన్నమలాయి లోని రమణ మహర్షి దగ్గర కొంతకాలం గడిపి, ఆయన జీవిత చరిత్రను వ్రాశారు. కొన్ని సంవత్సరాల తరువాత, రమణ మహర్షి బోధించిన 'జ్ఞాన' ఆధ్యాత్మిక మార్గం తనకు సరి అయినది కాదని గ్రహించి, పుణ్యక్షేత్రాలను, సాధువులను సందర్శించాలని నిర్ణయించుకున్నారు.

ఈవిధంగా ప్రయాణిస్తూ ఆయన మెహర్ బాబా, ఉపాసని మహరాజ్‌లను కలిసారు. ఉపాసని మహరాజ్ గారి జీవిత చరిత్రను వ్రాశారు. 1930వ సంవత్సరం చివరిలో ఉపాసని మహరాజ్ గారి మీద వచ్చిన లైంగికపరమైన అపవాదులకు తాళలేక అక్కడ నుంచి నిష్క్రమించి, ఇంకొక గురువుకోసం అన్వేషించసాగారు.

ఉపాసని మహరాజ్ తన గురువర్యులైన సాయిబాబా గురించి ఘనంగా మాట్లాడినా సాయిబాబా ఒక ముస్లిం అని తెలవడం వలన నరసింహస్వామి ముందు ఆయన గురించి పట్టించుకోలేదు. కానీ 1936వ సంవత్సరంలో ఆయన సాయిబాబాగారి భక్తుల అనుభవాలను విని, ఆయన వైపుకు ఆకర్షితులయి సాయిబాబా ఖ్యాతిని వ్యాపింపజేయడానికి నడుంకట్టారు.

ఈయన 1942వ సంవత్సరంలో 'షిర్డీ సాయిబాబా - భక్తుల అనుభవాలు' (Devotees Experiences of Saibaba of Shiridi) ప్రచురించారు. ఇందులో 1936 - 1938 సంవత్సరాల మధ్యకాలంలో వివిధ భక్తులను విచారించడం ద్వారా ఈయన సేకరించిన వారి అనుభాలను పొందుపరచడం జరిగింది. మరియు ఆ భక్తుల నుంచి సాయిబాబా గారి 'ప్రవచనాలు' కూడా సేకరించి, 1942 వ సంవత్సరంలో 'శ్రీ సాయిబాబా - శాసనాలు, ప్రవచనాలు' (Sri Sai Baba's Charters & Sayings)గా ప్రచురించారు.

నరసింహస్వామిగారు కలిసిన భక్తులలో అత్యధిక శాతం మంది - బ్రాహ్మణులు. వారెన్ గారి పుస్తకంలోని అనుబంధం-**E** లో వారి వివరాలు ఇవ్వబడ్డాయి.

'సాయిబాబాగారికి సంస్కృత భాషవచ్చు మరియు ఆయన భగవద్గీతలో ప్రావీణ్యం గలవారు' అని ప్రచారం చేసింది నరసింహస్వామి. కానీ ఇది - నానా చందోర్కర్ మరియు సాయిబాబాల మధ్య జరిగిన ఒక చిన్న సంఘటనను అపార్థం చేసుకోవడం వలన కలిగిన భ్రమ. దీని పూర్తి వివరాలు వారెన్‌గారి పుస్తకంలో (356-359 పేజీలు) పొందుపర్చబడ్డాయి.

చాలామంది హిందూ రచయితలు నరసింహస్వామిగారి ఈ ప్రచారాలను వాడుకోవడం ద్వారా సాయిబాబాగారికి మరికొంత హిందూ అస్తిత్వాన్ని అంటకట్టడం జరిగింది.

నరసింహస్వామి గారి ప్రశ్నావళిలో ఒక ప్రశ్న - సాయిబాబాగారు 'వేదాంత' ను బోధించారా? అని. అందరూ దానికి కాదనే సమాధానం చెప్పారు. ఎందుకంటే సాయిబాబాగారు బోధించింది సూఫీ సిద్ధాంతాలను. కానీ ఆయన జీవిత చరిత్రను హిందువులు వ్రాయడం వలన ఇలాంటి వివరాలకు ప్రాముఖ్యత ఇవ్వకపోవడం ద్వారా ఆయన ముస్లిం అస్తిత్వాన్ని రూపుమార్చడం జరిగింది.

సాయిబాబా గారితో పరిచయం ఉన్న వ్యక్తులను, భక్తులను అన్వేషించి, విచారించే క్రమంలో నరసింహస్వామి అబ్దుల్ గారిని కూడా కలిసారు. అప్పుడు అబ్దుల్ గారు ఆయనకు తను సాయిబాబా సమక్షంలో వ్రాసుకున్న పుస్తకాన్ని చూపించారు. సాయిబాబా ముస్లిం-సూఫీ అస్తిత్వాన్ని చాటే ఎన్నెన్నో వివరాలు ఉన్న ఆ పుస్తకానికి నరసింహస్వామి గారు ఏమాత్రం ప్రాముఖ్యత, ప్రాచుర్యత ఇవ్వకుండా, అందులో హిందూ దశావతారాల గురించి కూడా ఒకచోట వ్రాయబడి ఉంది కాబట్టి 'నిశ్చయంగా సాయిబాబా, అబ్దుల్‌లు హిందూ అవతారాలయిన మారుతి తదితరులను పూజించేవారు' అని మాత్రం వ్రాశారు.[14]

ఎన్నో సంవత్సరాల క్రితం జరగబడినవిగా భావిస్తున్న సంఘటనల పాత జ్ఞాపకాలు, భక్తి రసాన్ని ఆపాదించిన భక్తుల అనుభవాలను ఎంతో శ్రద్ధగా సమీకరించి, ప్రచురించిన నరసింహస్వామి గారు, తాను సాయిబాబాగారి దూతనని భావిస్తూ కూడా, స్వయానా సాయిబాబాగారి సుమారు 30 సం॥ల సేవకుడు అయిన అబ్దుల్ గారు ఇష్టపూర్వకంగా సమర్పిస్తున్న 130 పేజీలకు పైబడి ఉన్న ఈ ప్రత్యక్ష సమాచారానికి ఇవ్వవలసిన రీతిలో ప్రాచుర్యత ఇవ్వకపోవటం, సాయిబాబాగారికి హిందూ కోణంలోనే ప్రాచుర్యత ఇవ్వాలన్న ఆయన సంకల్పానికి అద్దం పడుతుంది. ఒక ఆంగ్ల రచయిత్రి (వారెన్) మన దేశానికి వచ్చి పరిశోధన చేస్తే గాని మనకీ ప్రత్యక్ష సమాచారం సంపూర్ణంగా అందుబాటులోకి రాలేదు. అంతేకాదు, 'శ్రీ సాయి సంస్థాన్' కూడా దీనిని ప్రచురించలేదు. వారెన్ గారు దీని గురించి ఇలా అభిప్రాయపడ్డారు: "అబ్దుల్ గారి పుస్తకం ద్వారా బహిర్గతం అయ్యే వివరాలు సంస్థానం వారు సాయిబాబాగారిపై చేస్తున్న హిందూ అస్తిత్వ ప్రచారంతో ఏకీభవించవనే కారణంతో సంస్థానం వారు దీనిని ప్రచురించలేదనేది స్పష్టమౌతుంది."[15]

ఇంకా చాలామంది హిందూ రచయితలు - ధబోల్కర్, గునాజీ, నరసింహస్వాములు సాయిబాబాకు అంటగట్టిన హిందూ అస్తిత్వాన్ని మరింతగా బలపరిచారు.

మని సాహుకార్ గారు సాయిబాబాగారి మీద వ్రాసిన పుస్తకం 1952వ సంవత్సరంలో ప్రచురితమయింది. ఈమె ఉపాసని మహరాజ్ మరియు ఆయన వారసురాలయిన సతి గోదావరి మాతల భక్తురాలు. ఈమె సాయిబాబాగారిని ఎంతగా హిందూ అస్తిత్వంలో వర్ణించిందంటే సాయిబాబా గురించి కొత్తగా చదువుతున్న వారికి ఆయన ఒక హిందూ గురువు, అవతారం అనే అభిప్రాయమే కలుగుతుంది.[16]

రావ్ సాహెబ్ హర్షద్ మెహతా గారి పుస్తకం 1952 వ సంవత్సరంలో ప్రచురించబడింది. ఈయన తన పుస్తకం ద్వారా సాయిబాబాగారిని ఒక సార్వజనిక అస్తిత్వంలో ఇమడ్చడానికి ప్రయత్నించారు. బైబిలు చరిత్రలోని అంశాలు, భగవద్గీత, శంకరాచార్యుల వారి అద్వైత సిద్ధాంతం మరియు ఇతర మార్మిక వాదుల భావనలను ఇందులో వాడడం జరిగింది. ఈయన కూడా ఒక హిందువే.[17]

ఆర్థర్ ఆస్‌బర్న్ గారి పుస్తకం 1957వ సంవత్సరంలో మన దేశంలో, ఆతర్వాత 1958వ సంవత్సరంలో బ్రిటన్‌లో ప్రచురింపబడి - సాయిబాబాగారిని పాశ్చాత్తులకు పరిచయం చేసింది. ఆస్‌బర్న్ రమణ మహర్షి అనుచరులు మరియు హిందూ మార్మికవాద సిద్ధాంతాలను నమ్మేవారు. ఈయన నరసింహస్వామి గారి రచనల ద్వారా సాయిబాబా గురించి తెలుసుకున్నారు. ఈ విధంగా ఈయన సాయిబాబాగారి అస్తిత్వ పరిణామ క్రమాన్ని ఇంకొంచెం ముందుకు తీసుకు వెళ్ళారు.

ఈ మధ్యకాలంలో సాయిబాబాగారి మీద చిత్రీకరించబడిన చలన చిత్రాలు కూడా ఈ రచనల ఆధారితాలు కావడం చేత, ప్రజలలో ఆయన గురించిన ఈ తప్పుడు చిత్రీకరణే ముద్రవేసుకుంది.

ఇతర రచయితలు: క్రిష్ణారావ్ జగేశ్వర్ భీష్మ:-

కీర్తాంకరుడయిన ఈయన వలన సాయిబాబాగారి మీద ఓ కొత్తరకం భక్తి రచనలు వెలుగులోకి వచ్చాయి. సాయిబాబాగారి పూజల కోసం ఈయన చాలా మరాఠీ భజనలు, ప్రార్థనలు, పాటలు (అభంగాలు), ఆరతులు, స్తోత్రాలు వ్రాసారు.

పంఢ్రాపూర్‌లోని విఠల యొక్క భక్తుడు కావడంతో ఈయన తన ఆరతులను అక్కడి పాటల శైలిలో మలిచారు. ఉదయం కకడ ఆరతి, మధ్యాహ్న ఆరతి, సాయంత్రం ఆరతి మరియు రాత్రి ఆరతి - అచ్చం పంఢ్రాపూర్‌లో పాడబడే విధంగా.

ఇంకా ఈయన 'మహిమ స్తోత్రం' అనుదానిని కూడా వ్రాశారు. ఇవన్నీ సాంప్రదాయ హిందూ పూజా విధానాలు. ఈ విధంగా ఇవి సాయిబాబాగారిచే జతచేయబడి, షిర్డిలో నిత్యం ఆయన సమాధి మందిరం దగ్గర ఆచరింపబడుతున్నాయి.

జగేశ్వర్ గారి ఈ రచనలన్నీ 'శ్రీ సద్గురు సాయినాథ్ సగుణోపాసన' అనే పేరుతో సమీకరింపబడ్డాయి.

ఈ కారణాలన్నింటి వలన సూఫీ మార్మికవాది, ముస్లిం ఫకీరు అయిన సాయిబాబాగారి అస్తిత్వం హిందూ అవతారంగా పరిణామం చెంది, ఆయనను దేవుడిలా పూజించడం జరుగుతుంది. ఈ రకంగా హిందువులు ఆయనకు అంటగట్టిన అస్తిత్వ ముసుగును తీసివేసి, ఆయన గురించి ప్రచారంలో ఉన్న ఆధార రహిత కథనాలను కాకుండా, యథార్థాలను పరిశీలిస్తే - సాయిబాబాగారి సూఫీ అస్తిత్వం బయటపడుతుంది.

షిర్డీలో సాయిబాబా సమాధి మందిరాన్ని దర్శించినవారు - ఉదయం అక్కడ కాకడ ఆరతితో పాటు సాయిబాబా గారి పాలరాతి విగ్రహాన్ని పాలతో అభిషేకం చేసి, దానిని ఆరనిచ్చి, తిరిగి కొత్త బట్టలతో చుట్టే కార్యక్రమం అంతా చూడవచ్చు. ఇస్లాం ఆచరణలకు పరమ విరుద్ధమయిన ఈ పూజా కార్యక్రమాలను వీక్షించిన వారికి సాయిబాబా హిందువనే అనిపిస్తుంది. ఆయనను అప్పుడప్పుడు చరిత్రకారులు పొరపాటున ముస్లింగా వర్ణిస్తారే కాని ఈయన ఒక హిందూ గురువు అని భ్రమ పడతారు మరియు తాము ఒక హిందూ మహానుభావుడి దర్శనం చేసుకున్నామనే అనుభవంతో తిరిగివెళ్తారు. ఇది వాస్తవానికి వ్యతిరేకం. షిర్డీలోని సాయి సంస్థాన్, అన్ని మతాల వారూ అక్కడికి వస్తారని ప్రకటించుకున్నా వచ్చేవారిలో అత్యధికులు హిందువులే.

ఒక విధంగా చెప్పాలంటే, సాయిబాబాగారే - తన చివరి కాలంలో హిందూ భక్తులకు పూజా కార్యక్రమాలు నిర్వహించే వెసులుబాటు ఇచ్చి, తన అస్తిత్వ పరిణామానికి స్వయంగా బీజం పోశారు (పేజి 84 కూడా చూడండి).

## అసలు సాయి అంటే అర్థం ఏమిటి?

19వ శతాబ్దంలో దేశ దిమ్మరులుగా తిరిగే సూఫీ ఫకీర్లను, పర్షియన్ పదమైన 'సాయ్య'లుగా పిలిచేవారు. 'సాయి' అనే పదానికి మూలం ఇదే అయి ఉండవచ్చని వారెన్ అభిప్రాయపడ్డారు.[18]

కానీ ఇప్పుడది భక్తులచే సాక్షాత్ ఈశ్వర (దేవుని సాక్షాత్కారం) గా మార్చి వేయబడింది. ఇంగ్లీషు పదమైన సాక్షాత్ ఈశ్వరలో 'సాయి' అనే అక్షరాలుండటం దీనికి ఆధారమని వివరించే మహానుభావులూ ఉన్నారు (SAkshat Iswara).

# మహాత్మ్యాలు/మహిమలు/చమత్కారాలు

## మెహర్‌బాబా మరియు మహిమలు

ఈ విషయం గురించి వ్రాయడానికి ఏమీ లేదు. ఎందుకంటే మెహర్‌బాబా ఎప్పుడు ఏ మహిమలను ప్రదర్శించలేదు. ప్రదర్శించగలనని దావాకూడా చేయలేదు. మహిమలు దైవత్వానికి సంకేతాలు కానే కావని ఆయన ఖచ్చితంగా చెప్పారు. ఇంకా ఇలా మహిమలు ప్రదర్శించడం ద్వారా సాధకులు క్రిందటి తలాలలోనే చిక్కుకొని ఆధ్యాత్మిక పథంలో ముందుకు సాగలేరని కూడా వివరించారు.

మహిమలను ఆశించవద్దని ఆయన తన భక్తులకు పదేపదే చెప్పారు. సిద్ధులు ప్రదర్శించే మహిమల గురించి కూడా నిరాశక్తత వ్యక్తం చేసేవారు. తన దగ్గర రోగాలను నయం చేసే శక్తి ఉందని కూడా ఆయన ఎప్పుడు చెప్పుకోలేదు. ఈ శక్తులకు ప్రాముఖ్యత కూడా ఇవ్వలేదు.[19]

ఇంకా మెహర్‌బాబా ఇలా అన్నారు: ‘‘నా దగ్గరకు వచ్చేవారు నానుంచి ఆరోగ్యం, ఆస్తి, భార్య, పిల్లలు మొదలగునవి ఆశించరాదు. నాతో ప్రేమ బంధంలో జతబడిన వారు (ఆధ్యాత్మికపరంగా), ప్రాపంచిక అవసరాలు తీరక చాలా బాధలు పడ్డారు. జాగ్రత్త.’’[20]

## సాయిబాబా మరియు మహిమలు

సాయిబాబాగారి విషయంలో పరిస్థితి వేరు. ఈయన ఎన్నో మహిమలను ప్రదర్శించిన వారిగా పేరొందారు. ఈయన రోగాలను నయంచేయడం, సంతానప్రాప్తి కలగ జేయడం వంటివి చేశారనే నమ్మకం చాలా ప్రచారంలో ఉంది.

మార్మికవాదుల మాటలను అర్థం చేసుకోగలగడానికి- మార్మికవాదం, మార్మిక అనుభవాలను అర్థం చేసుకోవడం ఎంత అవసరమో అలాగే మార్మికవాదులకు అంటగట్టబడే ఆ మహిమల వెనుక - నిజఘటనల వక్రీకరణ, గోరంతను కొండంత చేయడం, చిన్న పిల్లల మనస్తత్వం లాంటి వెన్నో ఉంటాయని అర్థం చేసుకోవడం అవసరం. ఉదాహరణకు బుద్ధుడు మహిమలేమీ ప్రదర్శించక పోయినా, తరువాతి కాలంలో అతనికి ఎన్నో మహిమలు అంటకట్టబడ్డాయి. బుద్ధుడి సమగ్ర జీవన చరిత్ర అధ్యయనం చేస్తే ఈ విషయం అర్థం అవుతుంది. ఈ మధ్య వస్తున్న టీవి సీరియల్స్‌లో సాయిబాబా గారు ఎన్నో మహిమలు చేసినట్లుగా చూపించబడుతుంది. కానీ ఇవన్నీ ప్రచారంలో ఉన్న కథలు (పౌరాణికాలు) ఆధారంగా నిర్మితమైనవని ఎంతమంది గుర్తుంచుకుంటారు? చూస్తున్న వారికి ఇదంతా ఎలా చూపించబడుతుందో అలానే జరిగి ఉంటుందనిపిస్తుంది. ఈ విధంగా పౌరాణిక గాథలు చరిత్రగా పరిణామం చెందుతాయి.

సాయిబాబాగారితో ముడిపడి ఉన్న మహిమలను వివరంగా పరిశీలిస్తే, ఆయన తలచిందే తడవు - మహిమలు జరిగేవనేది - సత్యదూరమనేది బోధపడుతుంది. సాయిబాబా గారి మహిమల గురించి ఈ క్రింది అంశాలను పరిగణించాలి:

జస్టిస్ యమ్.బి. రెగె గారు నరసింహస్వామి గారి 'సాయిబాబా - శాసనాలు & వచనాలు' తొలిపలుకులో ఇలా వ్రాశారు: "శాస్త్ర రంగంలో జరుగుతున్న అభివృద్ధి ఈ మహత్యాలకు వివరణ అందించవచ్చు. ఈ పుస్తకంలో ఉన్న మహత్యాలను చూసి విమర్శకులు అశ్చర్యపోవచ్చు. కానీ అనంతమైన బాబా భక్తులకు ఇవి పరిణామక్రమంలో ఘటనలు మాత్రమే. సాధారణ మానవులకు అసాధ్యాలుగా అనిపించినా, భక్తి, ప్రేమల వెలుగులో చూస్తే, ఇవి సాధ్యాలే".[21]

**సాయిబాబా గారు ఒక హకీము (వనమూలికా వైద్యుడు):**

షిర్డీ మొదటిసారిగా వచ్చినపుడు, సాయిబాబా, అమన్ భాయ్ పటేల్ అనే ఒక ముస్లిం వద్ద బస చేశారు. అమన్ భాయ్‌కు చెందిన ఒక బంధువు రోగగ్రస్తుడై ఉంటే, అతని దగ్గరకు వెళ్ళి సాయిబాబా అతనికి కోబ్రా విషాన్ని మందుగా ఇచ్చి వ్యాధిని నయం చేశారు.[22] కానీ ఏదో కారణం వలన సాయిబాబా అతనికి మందు ఇవ్వటం ఆపివేశారు. వ్యాధి ముదరడంతో అతను చనిపోయాడు.

**భక్తుల అనుభవాల నుంచి ఇలాంటి మరో సంఘటన:**

"బాబా అతనికి ఏవో మందులు ఇచ్చి, ఇనపవూచలతో వాతలు కూడా ఇప్పించారు (నుదిటిపై మరియు వెనుక), బాగూజీ ఆరోగ్యం కుదుట పడింది. బాగూజీకి కుష్టురోగం కూడా ఉండేది. అది బాబా అనుగ్రహం వలన యథాలాపంగా ఉండింది, కాని నయం కాలేదు".[23]

ఇలా చూస్తే - సాయిబాబాగారు మందులివ్వగానే కుష్టురోగం, ఇతర రోగాలు నయం అయ్యేవి అనడం పొరపాటు. సాయిబాబాగారు అడవులలో చాలా సంవత్సరాలు సంచరించారు. అ సమయంలో ఆయన - వన మూలికలతో చిన్న చిన్న రోగాలను నయం చేసే ప్రావీణ్యత సంపాదించి ఉండవచ్చు. పై సంఘటనలను మహత్యాలుగా భావించడం పచ్చి అవివేకం యొక్క మహత్యమే.

ముందు సాయిబాబా వనమూలికలు వాడేవారు. తర్వాతి కాలంలో రద్దీ ఎక్కువవడంతో, బూడిదను ప్రసాదంగా ఇవ్వడం మొదలెట్టారు. భక్తులు ఇందులో వ్యాధులను నయం చేసే శక్తి ఉందని నమ్మారు.

**సాయిబాబాగారు తాను మహత్యాలు చేయలేనని చెప్పారనీ మరియు ఆయన భవిష్యవాణి కూడా అన్ని సందర్భాలలో నిజం కాలేదని నిరూపించే ఒక భక్తుడి వర్ణన:-**

“మేమంతా బాబాగారి చమత్కారాలు, భవిష్యవాణులు, ఉపదేశాల గురించి ఉత్సుకతతో ఉండేవారము. ఆయన సిద్ధాంతత్వం గురించి పట్టించుకొనేవారము కాదు. మా నాన్న గారు చెప్పినదాని ప్రకారం, 1913వ సంవత్సరం తర్వాత బాబాను దర్శించే భక్తుల సంఖ్య విపరీతంగా పెరిగింది. దీనివలన బాబా గారికి మనశ్శాంతి లేకుండా పోయింది. ఒకసారి బాబా ఏడుస్తూ ఇలా అన్నారు:

‘నా దగ్గర సమృద్ధిగా ఉండి, నేను ఇవ్వదలచుకున్న దానిని గురించి ఎవరూ ఆలోచించడం లేదు, నేను ఇవ్వలేనిది నా నుంచి కోరుకుంటున్నారు’.

ఒకసారి బాబా గారు చమత్కారాల గురించి ఆశ్చర్యకరమైన విషయాలు చెప్పారు. అది 1903-1904 సంవత్సరాల మధ్యకాలం. నా అక్క మీనాథాయ్ ప్రసవ సమయంలో, బాబాగారు గోసావి ద్వారా ఊథి (బూడిద)ను పంపి సహాయపడ్డారు. కానీ ఆ బిడ్డ పసిప్రాయంలోనే చనిపోయింది. మా అక్క కూడా వితంతువు అయిపోయింది. ఈ ఘటనల వలన మేమెంతో బాధలో ఉన్నాం. అంతా కలసి షిర్డీ వెళ్ళాము. అక్కడ -

**బాబా :** మీరు ఎందుకు ఇలా నిశ్శబ్దంగా ఉన్నారు?

**చందోర్కర్ :** బాబా, మీకంతా తెలుసు - మేము మీ సంరక్షణలో ఉండగా, ఈ ఉపద్రవాలు మామీద వచ్చి పడ్డాయి. పసిపిల్లవాడు, అల్లుడు మరణించారు.

**బాబా :** మీరు పిల్లవాడి గురించి (లేక అల్లుడి గురించి) బాధపడి నాదగ్గరకు వస్తే - నన్ను మీరు అపార్థం చేసుకున్నారు. మీరు వీటికోసం నా దగ్గరకు రానవసరం లేదు. ఇవి నా వశంలో లేవు. ఇవి (పిల్లలు పుట్టడం, బంధువులు పోవడం) పూర్వకర్మ ఆధారితాలు*. పరమేశ్వరుడు కూడా వీటిని మార్చలేడు.

దేవుడు సూర్యుడినిగానీ చంద్రుడినిగానీ ‘నీ స్థానానికి రెండు గజాల దూరంలో ఉదయించు’ అని చెప్తాడా? లేదు. అతనలా చెప్పలేడు, చెప్పడు. అది తీవ్ర సంక్షోభానికి దారి తీస్తుంది.

**చందోర్కర్:** మరి అలాగైతే, మీరు కొందరికి ‘నీకు కొడుకు పుడతాడు’ అనగానే కొడుకు పుడుతున్నాడు, ‘నీకు ఉద్యోగం వస్తుంది’ అనగానే ఉద్యోగం వస్తుంది. ఇవి మరి మీ మహత్యాలు కావా?

**బాబా :** లేదు నానా. **నేనెలాంటి మహిమలు (చమత్కారాలు) చేయను.** మీ ఊరిలో జ్యోతిష్కులు ఉన్నారుకదా. వాళ్లు రెండు-నాలుగు రోజులు ముందుగా జోస్యం చెబుతారు. అందులో కొన్ని నిజాలవుతాయి. నేను ఇంకా ముందు చూస్తాను. నేను చెప్పేది జరుగుతుంది. నా ఈ కళ కూడా జ్యోతిష్యం లాంటిదే. కానీ మీకు అర్థంకాదు. మీకు నా మాటలు మహత్యాలలాగ కనిపిస్తాయి. ఎందుకంటే మీకు భవిష్యత్తు తెలియదు. అందుకని మీరు జరిగిన వాటిని బట్టి అవి నా మహిమలకు నిదర్శనాలని భావించి మీ భక్తి శ్రద్ధలు నావైపు పెంచుకుంటారు. నేను వాటిని దేవుని వైపు మరల్చి మీరు లబ్ధిపొందేటట్లు చూస్తాను.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

\* సాయిబాబా గారు సూఫీ అనటానికి ఇది ఇంకొక నిదర్శనం. పునర్జన్మ, పూర్వకర్మ భావనలు ఇస్లాంలో లేనేలేవు. కానీ సూఫీలు వీటిలో నమ్మకముంచుతారు. దీనిని సూఫీల పరిభాషలో తనాసుఖ్ అంటారు.
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

బాబా చాలా ఉపదేశాలిచ్చారు. అవన్నీ నాకు గుర్తు లేవు. 1913-1914 సంవత్సరాల మధ్యకాలంలో మా నాన్నగారు అనారోగ్య కారణం వలన సెలవు మీద ఉన్నారు. ఆయన షిర్డీ వెళ్ళి అక్కడ గడిపారు. అమ్మగారు కూడా అక్కడే ఉన్నారు. వాళ్ళు బాబా ప్రక్కన ఉండి, నేను బాబాను పూజిస్తుండగా బాబా ఇలా అన్నారు. 'నేనిప్పుడు వెళ్ళిపోతాను. బాపు బిడ్డగా మరలా పుడతాను. అప్పుడు నానా మెడ (లేక చేయి) ఇలా ఊగుతూ ఉంటుంది' (అంటూ తన చేతితో ముసలివాడి మెడ ఊగేటట్టుగా చేసి చూపించారు).

మా నాన్నగారు దీనివలన, నాకు కొడుకు పుట్టేవరకూ తాను బ్రతికే ఉంటానని ఊహించుకున్నారు. కానీ ఆయన 1921 సంవత్సరంలో చనిపోయారు. ఆయన మరణావస్థలో ఉన్నపుడు నేను బాబాగారి ఈ జోస్యం గుర్తు తెచ్చుకొని, నాన్నగారు బ్రతుకుతారని ఆశించాను. ఎందుకంటే అప్పటికి నాకు పెళ్ళేకాలేదు, ఇక కొడుకు ఎక్కడి నుంచి వస్తాడు? కానీ, విధి మరోలా ఉంది. మా నాన్నగారు చనిపోయారు. నేను 1922వ సంవత్సరంలో పెళ్ళి చేసుకున్నాను. నాన్నగారి మెడ ఎప్పుడూ ఊగలేదు''

(బాపురావ్ ఎన్. చందోర్కర్, నానాసాహెబ్ చందోర్కర్ గారి కుమారుడు) [24]

ఇలాంటి వివరణలు చదివితే, అవి మహిమలు తలపింపజేయవుగానీ సాయిబాబాగారు ఒక మార్మికవాది అని, ఆయన దయగల ఒక వనమూలికా వైద్యుడని (ఆయన వైద్యం ఒకోసారి పనిచేసేది, ఒకోసారి కాదు) మరియు ఒక రకమయిన జ్యోతిష్యుడు అని (ఆయన జోస్యం ఒకోసారి నిజమయేది, మరోసారి కాదు) విశదమౌతుంది.

మరి అలాంటప్పుడు, సాయిబాబాగారి విషయంలో మహిమల గురించి అంతగా ప్రచారంలో ఎందుకు ఉంది? ఇది ఆయన మరణానంతరం, తరువాతి కాలంలో నరసింహస్వామి, రామలింగస్వామిలాంటి భక్తుల ప్రమేయం ద్వారా జరిగింది.

**<u>బహిరంగ మహిమ:</u>** 1890వ సంవత్సరంలో జరిగినట్లు భావిస్తున్న ఒక సంఘటనకు చాలా ప్రాచుర్యత ఇవ్వబడింది. నరసింహస్వామిగారు దీనిని తన సాయిబాబాగారి జీవితచరిత్ర పుస్తకంలో పొందుపరుస్తూ, ఇది సాయిబాబాగారి మొదటి బహిరంగ మహిమ అని సెలవిచ్చారు. ఇందులో బాబాగారు - స్థానిక దుకాణాల వారు ఆయనకు తైలం ఇవ్వడానికి నిరాకరిస్తే నీళ్ళని తైలంగా మారుస్తారు.

కెవిన్‌గారు ఇలా అభిప్రాయపడ్డారు: ఆయనేమైనా మాయాజాలం చేశారా? లేక ఆయన వద్ద అదనపు తైలం ఉందా? లేక ఇదంతా పౌరాణిక కథల ఫలితమా? ఏది ఏమైనా ఇలాంటి సంఘటనలు ఆధ్యాత్మికతకు ప్రమాణాలు కావు, వీటిని నమ్మేవారి చిన్న పిల్లల స్వభావాన్ని తలపిస్తాయే తప్ప.[23] ఒక విమర్శకుడు - సాయిబాబాగారు నీళ్ళను తైలంగా మార్చుకోగలవారైతే, రోజూ తైలం అడుక్కోవడం దేనికి? అని అడగవచ్చు. జరిగింది ఏమైనా, ఇలాంటి ఆధారాలు, సాక్షులు లేని సంఘటనలు - నరసింహస్వామిలాంటి చరిత్రకారుల ద్వారా మహిమలుగా ప్రసిద్ధికెక్కుతాయి. వీరి ఉత్సుకత - నిజాలను రాబట్టడంకంటే కూడా మహిమలను అన్వేషించడంలోనే ఎక్కువగా ఉండడం దీనికి కారణం.

రామలింగ స్వామి గారి - 'ఆంబ్రోసియా ఇన్ షిర్డీ'లో పౌరాణికంగా సమీకరించబడ్డ 200లకు పైగా సాయిబాబాగారి మహత్యాలు ఉన్నాయి. వీటిలో సగం మహిమలు సాయిబాబాగారి మరణానంతరం జరిగినట్టుగా చెప్పబడ్డాయి. పౌరాణికాలంటే సత్యదూరమైనవని నిఘంటువు నిర్వచనం. ఇలాంటి రచనలు సాయిబాబాగారి మహిమాశక్తుల ప్రచారంలో ఉపయోగపడిన సాధనాలంటే అతిశయోక్తికాదు. ఇది కాలక్రమేణా - సాయిబాబాగారి గురించి ఇచ్చే సాధారణ వివరణకంటే మహమలతో కూడుకున్న వివరణను సులువుగా అర్థంచేసుకోగలిగే భక్తుల మానసిక పరిస్థితికి దారితీసింది.

మార్మికవాదుల మీద రచనలు చేసే ప్రొఫెసర్ ఆర్.ఎన్. కౌల్ గారు సెలవిచ్చినట్టు : "మార్మికవాదుల జీవితాల విషయంలో, నిజాలను కథలతో అల్లడం సర్వసాధారణమే కాకుండా ఒక నివారించలేని ప్రక్రియగా మారిపోయింది. మహిమలు అనేవి వారి సందేశం లేక తమ సొంత అనుభవాల మూల అంశాలుగా మారిపోతాయి. ఒకవేళ మహిమలేవీ జరగనప్పటికీ వాటిని కల్పించడం కొన్ని సందర్భాలలో అవసరం అవుతుంది. తద్వారా భక్తుల ఆధ్యాత్మిక, ప్రాపంచిక జీవితాలను క్రమశిక్షణలో పెట్టడం జరుగుతుంది. ఈ మహిమలు మార్మికవాదుల ఆధ్యాత్మిక మరియు నిగ్రహశక్తులకు నిదర్శనాలుగా నిలుస్తాయి. ఈ మహిమలే గనక లేకపోతే, వారి జీవితాలు మరియు వారి సందేశాలు సామాన్యజనాల తలకెక్కవు మరియు రుచిలేని కూరల్లా మిగులుతాయి."[24]

All Characters are not Authentic. They are based on certain folk-lore and many legend prevalent about this mythology which have been used to dramatise the narration

(ఇందులోని పాత్రలన్నీ యదార్థాలు కావు. అవి కొన్ని జానపద, పౌరాణిక గాథలననుసరించి నాటకీయంగా రూపొందించబడ్డాయి.)

**స్టార్‌ప్లస్ ఛానల్‌లో వచ్చే సాయిబాబా కార్యక్రమం ముందు చూపించే గమనిక.**

**అసత్యాన్ని భక్తి పారవశ్యంతో చూస్తే నిజంలా భ్రమపడే అవకాశం ఉంది.**

" అవివేకమనేది -

అమాయకత్వం కాదు, పాపం"

- రాబర్ట్ బ్రౌనింగ్

# 8. మీరు ఆలోచించవలసినది - ఏమిటి?

ఇప్పటివరకు ఈ పుస్తకంలో, సాయిబాబా మరియు మెహర్‌బాబాలు ఒక ఏకైక సిద్ధాంతత్వం అయిన మార్మికవాదానికి చెందినవారనడానికి సహేతుకంగా వివరణ ఇవ్వడం జరిగింది. వారు ధ్యానమార్గాన ప్రయాణించిన అనేకవేలమంది కల మార్మికవాదుల వర్గానికి చెందినవారు. మార్మిక అనుభవాల ద్వారా దైవప్రాప్తి మరియు దైవలీనత్వం సాధించామని తలంచినవారు.

మార్మిక అనుభవాల వెనుకగల సత్యాసత్యాలను మనం శాస్త్రీయ జ్ఞానం ఆధారంగా పరిశీలించాము. అవి మెదడులో ఎలా ఉత్పన్నమయ్యే మానసికి స్థితులో నేర్చుకున్నాం. కొన్ని అసాధారణ మానసిక స్థితులలో అనుభవంలోకి వచ్చే అనంతమయిన చైతన్యస్థితిని మార్మికవాదులు ఎలా దేవునిగా భ్రమపడుతున్నారో వివరంగా పరిశీలించాము. ఇది దేవుడిని పొందినట్లు, దేవునితో సమానమైనట్లు ఎందుకు కాదనే దానికి అనేక కోణాలలో వివరణను చూశాము.

మార్మిక అనుభవాలనేవి - 'మాయ-సంసార-మోక్ష' భావనలు కలిగి ఉన్న మార్మికవాద సిద్ధాంతాల అభివృద్ధికి మూలాధారాలు. 'అంతా మాయ' అనే వాదనతో ఈ సిద్ధాంతాలు మన ఉనికి యొక్క మౌలిక సత్యాలను కూడా వివరించలేవనేది చూశాము. ఈ భావనలు బలపడడం వెనుక ఉన్న మార్మిక అనుభవాల స్వభావాన్ని చూశాము. ఈ మార్మికవాద తత్వాలు హిందూ మతాన్ని ఎలాప్రభావితం చేశాయనేది కూడా పరిశీలించాము. మెహర్‌బాబాగారి అవతార వాదం ఆయన సొంత వర్ణనల వివరాల పరిశీలన ఆధారంగానే ఎలా సరి అయినది కాదో నిశితంగా పరిశీలించడం జరిగింది. మార్మికవాదుల సొంత అస్తిత్వం విషయంలో ఉన్న విభేదాలు, వైరుధ్యాలు మీ ముందుంచడం జరిగింది. సాయిబాబా గారి సూఫీ-ముస్లిం ఫకీరు అస్తిత్వం ఏవిధంగా హిందూ అవతార అస్తిత్వానికి పరిణామం చెందిందో విశదీకరింపబడింది.



మార్మిక అనుభవాలు ఈ అసహేతుక సిద్ధాంతాలకు, నమ్మకాలకూ మూలకారణాలు. ఈ అనుభవాలు ధ్యాన, ఇతర సాధనల ఫలితంగా మెదడులో జనిస్తున్న మనోస్థితులనేది సత్యం. ఈ స్థితులు మానవుడిని - దేవుడితో లేక దేవుడిని - మానవునితో సమానం చేస్తాయనేది అసత్యం. మార్మికవాదుల 'నేను దేవుణ్ణి', 'నేను అవతారాన్ని' అనే ప్రకటనలు ఈ అనుభవాల వలన కలిగిన భ్రమ ఫలితాలే. ఈ అనుభవాల విశ్లేషణ వలనే - 'మాయ-సంసార-మోక్ష' భావనలు కలిగిన మార్మికవాదతత్వం, అద్వైత సిద్ధాంతాలు వెలుగులోకి వచ్చాయి. కాని ఇవి మన ఉనికికి సంబంధించిన మౌలిక ప్రశ్నలకు కూడా సమాధానాలు పొందుపరచలేవు - అనంతమయిన దేవుడి ఉనికి ఒకటే నిజమైనదనే వాదనను తప్ప. భక్తులు, అనుచరులు అజ్ఞానంతో మార్మికవాదులను దేవుళ్ళనుచేసి, వారికి మందిరాలను కట్టిస్తారు. ఈ ప్రక్రియ అంతా ఎలా రూపుదాల్చుకొంటుందో వివరించబడింది.

మీ ముందుంచబడిన ఇన్ని యదార్థ వివరాల వెలుగులో కూడా మీరు, దేవుడిని ఒక బాబాతో పోల్చడం (లేదా ఒక బాబాని దేవునితో పోల్చడం) తగదని అంగీకరించలేకపోతే, మీరు చేస్తున్నది సరిఅయినదా కాదా అనేది ఒక్కసారి విశ్లేషించుకోండి అనేది నా మనవి. ఇలా విశ్లేషించుకోవడానికి మీరు ఆలోచించవలసినది ఏమిటి అనేది ఈ అధ్యాయంలో పొందుపర్చబడింది.

## మీరు మోక్షమార్గంలో ఉన్నారా?

ఒక బాబాని మీరు దేవునిగా లేక గురువుగా నమ్మి స్వీకరించారంటే దానర్థం మీరు మార్మిక సిద్ధాంత తత్వాన్ని నమ్మి, మార్మిక మోక్షమార్గాన్ని ఎంచుకున్నారన్నది. కానీ ఈ మార్గంలో మోక్షం పొందడానికి అవసరమైనది, సరి అయినది మీరు చేస్తున్నారా?

అన్ని మార్మికవాద సాంప్రదాయాలలోనూ ఈ 'గురు-శిష్య/సిద్ధ' వ్యవస్థ ఒకేరకంగా ఉంటుంది. దైవానుభవం పొందిన ఒక గురువు, శిష్యులకు అదే లక్ష్యసాధన కోసం మార్గదర్శి కావడం. గురుభక్తి అనే భావన ఈ వ్యవస్థ నుంచి జనించినదే.

మీరు ఈ మార్గంలో పయనించి, మీ లక్ష్యమయిన మోక్షాన్ని చేరాలి. మాయను దాటడమే మోక్షమని గుర్తుంచుకోండి. ఇది సాధించనంత వరకూ మీరు మోక్షాన్ని పొందలేరు. కానీ మీరు చేస్తున్నది ఏమిటి? ఒక మార్మికవాదిని దేవుడిగా భావించి పూజలు చేయడం. కేవలం ఇదే. ఇది మీకు మోక్షాన్ని మార్మికవాద సిద్ధాంతపరంగా కూడా ప్రసాదించదు.

ఉదాహరణకు, నిజజీవితంలో (మాయా జీవితంలో అనాలా?) గురు-శిష్య సంబంధాన్నే తీసుకోండి. ఒక విద్యార్థి పరీక్షలో ఎలా సఫలం కాగలడు? గురువు చెప్పిన పాఠ్యాంశాలను అర్థంచేసుకొని, వాటిని పుస్తకంలో పఠించడం ద్వారా జ్ఞానాన్ని పెంపొందించుకొని, ప్రయోగాలుచేసి, కష్టపడి పరీక్షరాసి మాత్రమే ఉత్తీర్ణుడు కాగలడు. కేవలం గురువుని ధ్యానించడం, పూజించడంచేసి ఉత్తీర్ణుడు కాగలడా? బ్రతికున్న గురువైతే అప్పటికీ ఏదోరకంగా సహాయపడగలడు, ఈ లోకంలో లేని గురువుని పూజించి ఎవరైనా పరీక్షలో ఉత్తీర్ణులు కాగలరా?

మెహర్‌బాబా, సాయిబాబాలకు కూడా గురువులుండేవారు (ఉపాసని మహరాజ్ మరియు వెంకుష). అయినా వారు తమ గురువులను పూజిస్తూ కూర్చోకుండా, ధ్యాన మార్గంలో శ్రమించి, తమ సాధనల ద్వారా మార్మిక అనుభవాలను పొంది మోక్షాన్ని పొందామని ప్రకటించుకున్నారు. అదేవిధంగా మీరు కూడా ఈ మార్మిక అనుభవాలే మోక్షమని నమ్మదలిస్తే - ఆ మార్గంలో పయనించి, కష్టపడి సాధన చేస్తే తప్ప మోక్షాన్ని పొందలేరు. లేకపోతే ఎప్పటికీ 'సంసార' చక్రంలో చిక్కుకుని ఉంటారు. అవునా? కాదా? ఒక బాబాని దేవునిగా భావించి, నిత్యం ఆయనను పూజిస్తూ, ప్రతీది ఆయన నుంచి కోరుకుంటూ, ఆయన సమాధిని దర్శించినంత మాత్రాన మీకు మోక్షం ప్రాప్తించదు. ఇలా చేయడం ద్వారా - మీరు నమ్మకముంచుతున్న సిద్ధాంతాన్నే మీరు అనుసరించడం లేదు.

ఎవరైనా మంచి క్రికెట్ క్రీడాకారునిగా అవ్వాలనుకుంటే, క్రికెట్ గురించి తెలుసుకుని, నేర్చుకొని, సాధనచేసి మాత్రమే కాగలరు. సచిన్ టెండూల్కర్ మంచి క్రికెట్ క్రీడాకారుడు అని తెలుసుకోవడం ద్వారానో, కేవలం ఆయనను అభిమానించడం ద్వారానో అలా కాలేరు. కదా?

మీరు అనుసరిస్తున్న సిద్ధాంతం ప్రకారం దేవుడి నిర్వచనం - స్వచ్ఛమైన, అనంతమయిన, రూపరహిత చైతన్యం. వేలమంది మార్మికవాదులు ఈ దైవానుభవం, లీనత్వ అనుభవం పొంది 'నేను దేవుణ్ణి' అని ప్రకటించుకున్నారు. మెహర్‌బాబా ఇలా అన్నారు:

'నిర్వాణ లేక నిర్వికల్ప స్థితులు - ముక్తి లేదా మోక్ష స్థితులతో సమానం. ఇవి మానవ ఆత్మ దేవునితో కలసిపోయి తద్వారా శాశ్వతమైన ఆనందం, అనంత జ్ఞానప్రాప్తిని సూచిస్తాయి. కానీ, ముక్తి, మోక్ష అనేది ఆత్మ శరీరాన్ని వదిలే వరకూ అనుభవంలోకి రాదు' - ఉపదేశాలు - సంపుటము 2, 178వ పేజి.

బాబాలంతా మోక్షాన్ని పొందారనుకుంటే వాళ్ళు ఈ దేవునిలోకి లీనమైపోయారు. అలాగ దేవుడు మరలా ఆ స్వచ్ఛమైన, రూపరహితమయిన, అనంతమయిన నిర్గుణ చైతన్యం (మార్మికవాదం ప్రకారం). ఒక మార్మికవాదితో మీరు దేవుడిని పోల్చలేరు. మీరు ఈ మార్మిక మార్గాన పయనించి, స్వతహాగా దైవానుభవం పొందితే తప్ప మోక్షాన్ని పొందలేరు. మెహర్‌బాబా గారి ప్రకారం:

'....... అందుకని, నిజాన్ని తెలుసుకొని, మానవరూపంలోనే 'నేను దేవుణ్ణి' అనే స్థితిని చేరడమే లక్ష్యం'

*(గాడ్ స్పీక్స్ - 190వ పేజి)*

సాయిబాబా గారు ఏడుస్తూ ఉండేవారని చదివాము. ఎందుకు?

ఆయన దగ్గర సమృద్ధిగా ఉన్న ఆ ఆధ్యాత్మిక జ్ఞానం కోసం కాకుండా తానివ్వలేని వాటికోసం ప్రజలు తన దగ్గరకు వస్తున్నారనేదే ఆయన వేదన, మోక్షం అనేది ఆ మార్గం ద్వారా పయనించి పొందవలసిందేగానీ, ఇలా తనమీద మితిమీరిన భక్తిశ్రద్ధల ప్రదర్శన ద్వారా ప్రాప్తించదనేది ఆయన భావన.

మీరది చేస్తున్నారా? అలా చేయాలంటే మీరు మార్మికవాదుల అడుగుజాడల్లో నడవాలి - కోరికలన్నీ త్యజించాలి. సన్యాసజీవితం గడుపుతూ ధ్యానసాధనలో గడపాలి. ఇదే మార్మికవాద సిద్ధాంతత్వం. ఈ మార్గంలో చాలా ఆపదలు కూడా ఉన్నాయి. మెహర్‌బాబాగారు ఇలా అన్నారు:

'కొంతమంది వారి అసాధారణ శక్తుల మాయలోపడి, వాటిని ఉపయోగించబోయి, మార్గమధ్యంలో చిక్కుకుపోతారు. మాధ్యమిక తలాల చైతన్యంలో ఇరుక్కుపోతారు. కొంతమంది అయోమయానికి, భ్రాంతులకు గురి అయితే మరికొంతమంది నేరుగా కోమాలోకి పోతారు.'

*- ఉపదేశాలు - సంపుటము 3-25 పేజి.*

ఇది పరిహాస్యం కాదు. శారీరక దండనలు మరియు తీవ్రమయిన ధ్యాన సాధనలు చాలా మందిని పిచ్చివాళ్ళుగా మిగిల్చాయి. ఈ స్థితిలో ఉన్నవారిని ఎక్కువగా మన భారత ఉపఖండంలో తరచూ సూఫీల సమాధుల దగ్గర చూడవచ్చు. వాళ్ళని 'మజూబ్'లుగా పిలుస్తారు. మెహర్‌బాబాగారు వీరిని తరచూ సందర్శించేవారు. వాళ్లని 'మస్త్-అల్లా'లు అంటే 'దేవుని మైకం ఆవహించినవారు' అని నిర్వచించారు. కానీ నిజం ఏమిటంటే మన మెదడులు ఇంత దండనను తట్టుకోలేవు. ధ్యాన సాధన మితిమీరినా లేక సరి అయిన రీతిలో చేయకున్నా అది మానసిక అసంతుల్యానికి దారితీస్తుంది. దీనిని 'దేవుని మైకం ఆవహించడం' అనడం ఎంతో అసహేతుకం మరియు శోచనీయం.

## విమోచనమా లేక దాస్యమా?

కొంతమంది విశాల దృక్పథం కలవారు, ఆధ్యాత్మిక వేత్తలు - మార్మికవాదము మరియు మార్మిక వాదులను - ప్రజలను అర్థం, పర్థంలేని మతపరమైన మూఢాచారాలు, వర్గవిభేదాలు మరియు చిల్లర దేవుళ్ల చాకిరీ నుంచి విముక్తులను చేసి, దైవానుభవం పొందగలిగే దారి చూపించే వారిగా కొనియాడతారు. వారి మాటల్లో కొంత నిజం లేకపోలేదు.

కాని, ఇది అంతా నిజమా? మీరే ఆలోచించండి, మార్మికవాదులు - ప్రజలను దేవుని యొక్క నిజ అస్తిత్వం నుంచి దూరంచేసి, దేవుణ్ణి కేవలం ఒక స్వచ్ఛమయిన, నిర్గుణ చైతన్యంగా వర్ణించి, ఈ సృష్టి కర్తత్వాన్ని కూడా ఆయనకు ఆపాదించకుండా, తమను తాము దేవుళ్లుగా ప్రకటించుకొని, దేవుళ్లుగా మార్చేసుకున్నారు. మార్మిక సాంప్రదాయంలో గురు-శిష్య సంబంధాన్ని పరిశీలించి చూస్తే - గురువుని ఖచ్చితంగా, షరతులేమీ లేకుండా పూర్తి విధేయతతో గౌరవించాలి మరియు ఆరాధించాలి అనేది బోధపడుతుంది. సూఫీ సాంప్రదాయంలో ఈ గౌరవ మర్యాదలు ఎంత అచంచలంగా ఉంటాయో వివరించాలంటే ఇక్కడ చోటు చాలదు. మెహర్‌బాబాగారి ఉపదేశాలు - గురువుకు ఎలా సేవచేయాలి, విధేయత చూపాలి, ధ్యానించాలి మరియు ఆరాధించాలి అనేది వర్ణిస్తాయి. ఇది ఏరకమయిన విముక్తి? మార్మికవాదులు ప్రజలను దేవుని పూజల నుంచి విముక్తులనుచేసి వారి ఆరాధనా దాస్యంలో బంధించారు. వారు బంధించారు అనేది నమ్మశక్యంగా లేకపోతే మనలను మనం బంధించుకున్నాం అని కూడా అనవచ్చు. వీటిలో ఏదైనాకానీ, మనం దేవుని నిజ అస్తిత్వ ఆరాధనకు దూరమయ్యామనేది అర్థం చేసుకుంటే చాలు. మార్మికవాదులు - దేవునికి చేయబడే ఆరాధనాచారాలకు వ్యతిరేకులు. మూడవ అధ్యాయంలో మనం పరిశీలించినట్టు వీరు వీటికి బహిరంగంగా ఉద్వాసన పలుకుతారు. మరి మనమేంటి? ఇవే పూజాచారాలను వారికోసం ప్రత్యేకిస్తున్నాం? మందిరాలు కట్టి వాళ్ళను దేవుళ్లుగా కొలుస్తున్నాం? మీకీ 'విరుద్ధత' అర్థం అయిందా? మార్మికవాదులూ మనుషులే. మిగతా మనుషులాగా బ్రతికి మరణించారు. వాళ్ళూ రోగగ్రస్థులయ్యారు, ప్రమాదాలకు గురయ్యారు. వాళ్ళ 'విధి' మీద వాళ్ళకు నియంత్రణ లేనప్పుడు - మీ విధిరాతను వాళ్ళు నియంత్రణ చేయగలరనీ, మీకు ఏకంగా మోక్షాన్నే ప్రసాదించగలరనీ మీరెలా నమ్ముతున్నారు?

మార్మికవాదుల దైవ అసమానతను నిరూపించే ఇన్ని ఆధారాలను, వివరణలనూ చూడగలిగినవారు ఆలోచించే విషయం - మరి సరిఅయిన మోక్షమార్గం ఏది?

**మార్మికవాదులు దేవుడిని ఒక స్వచ్ఛమయిన, అనంతమయిన చైతన్యంగా వర్ణించారు. దేవుని గురించిన వివరణ ఇంతేనా? వేరే ఏదైనా ఉందా? అసలు దేవుడనేవాడు ఉంటే, మనకు స్పష్టమైన మార్గాన్ని ఎందుకు చూపలేదు? మోక్షాన్ని పొందే మార్గం గురించి ఎందుకు తెలియపరచలేదు? ఈ ప్రశ్నలకు జవాబు - దేవుడు మనకు అత్యంత స్పష్టమయిన మోక్షమార్గాన్ని పదేపదే చూపించాడు - తన ప్రవక్తల ద్వారా.**

# దైవ ప్రవక్తలా? వీళ్ళెవరు?

వీళ్లు మానవ - దైవాలు, దైవ- మానవులు కారు, దైవప్రవక్తలు లేక సందేశహరులు కేవలం మనుషులే. మనలాంటి వారే కాని వారి ప్రత్యేకత ఏమిటంటే వారు దైవ సందేశ ప్రచారం కోసం ఎన్నుకోబడ్డారు. మొదటి దైవప్రవక్త, మొదటి మానవుడు - ఆదం (అస) మరియు చిట్టచివరి దైవప్రవక్త - ముహమ్మద్ (సఅస). వీరికి నడుమ - నోహ్, ఇబ్రహీం, మూసా మరియు ఈసా - యేసుక్రీస్తు (అస) లాంటి ఎందరో గొప్ప ప్రవక్తలు ఆవిర్భవించారు.

**ముహమ్మద్ (సఅస) అంటే ముస్లిముల ప్రవక్త కదా? మరి ముస్లిములు కానివారు ఆయన సందేశాన్ని ఎందుకు వినాలి?**

ముహమ్మద్ (సఅస) ఒక ప్రత్యేక జాతికో, దేశానికో పంపబడ్డ ప్రవక్త కారు. ఈయన మొత్తం మానవాళికి చిట్టచివరి ప్రవక్త. అనేక మత గ్రంథాలను సమగ్రంగా అధ్యయనం చేసిన పండితుల నిరూపణ ఇది. వివరాలకు 'అనుబంధం B - అదనపు సమాచారం' చూడండి.

**ముహమ్మద్ (సఅస) గారి సందేశాన్నే మనమెందుకు వినాలి? మిగిలిన ప్రవక్తల మాటేమిటి?**

దైవ ప్రవక్తలందరూ ఒకే సందేశాన్ని తీసుకువచ్చారు. కానీ ఆ సందేశం కాలక్రమంలో పెడచెవిన పెట్టబడింది, వక్రీకరించబడింది మరియు మూలన పడవేయబడింది. అన్ని మతాలలోనూ దేవుడు ఒక్కడేనని, అతనిని మాత్రమే ఆరాధించాలనీ ఉండడాన్ని మనం చూస్తాం. కానీ, ఈనాడు మనం ఏ మతాన్ని అనుసరించేవారిని పరిశీలించినా వారు ఆ నిజ దైవాన్ని వదిలివేసి, వారి ప్రవక్తలనో, సత్పురుషులనో, మార్మికవాదులనో లేదా వారి పూర్వీకులు కల్పించుకున్న గాథలలోని పాత్రల యొక్క ఊహారూపాలనో ఆరాధిస్తున్నారనేది విశదమౌతుంది. దేవుని నిజ అస్తిత్వం, ఆయన సందేశాల నుంచి, ఆరాధన నుండి ప్రజలను దూరంచేసే ఈ ప్రక్రియలో మార్మికవాదులు కూడా ప్రముఖ పాత్ర పోషించారు. ముహమ్మద్ (సఅస) మానవాళికి చివరి దైవప్రవక్త మరియు ఆయన సందేశం సార్వజనీకమైనది. ఈ సందేశాన్ని వక్రీకరింప వీలుకాని ఒక దివ్య గ్రంథరూపంలో పరిరక్షిస్తానని దేవుడు మాట ఇచ్చాడు. ఆ దివ్య గ్రంథమే - ఖురాను.

చిల్లర స్వాములు చేసే దైవ ప్రేలాపనని కూడా ఎంతో ఆసక్తితో వినే మనం, దేవుని చిట్టచివరి ప్రవక్తగా అనేక మత గ్రంథాలలో చెప్పబడుతున్న ముహమ్మద్ (సఅస) గారి సందేశాన్ని, ఆయన దేవుని గురించి ఏమంటున్నారో అనే దానిని ఒక్కసారి విని, అర్థం చేసుకొనే ప్రయత్నం చేయలేమా?

తదుపరి అధ్యాయంలో - దైవ ప్రవక్తల సందేశం ఏమిటి? ఇది మార్మికవాదుల సందేశాలకు ఏ విధంగా భిన్నమైనది మరియు ముఖ్యంగా ఇది శాస్త్రీయ జ్ఞాన మరియు హేతువాద పరీక్షలలో నిలబడగలుగుతుందా? అనే విషయాలను పరిశీలిద్దాము.

## ఒక మహామార్పు - పేరడైమ్ షిఫ్ట్

'పారడైమ్' అనే పదం - గ్రీకుపదమయిన 'పారడిగ్మా' అనగా 'నమూనా' నుంచి వచ్చింది. అంటే ఇది సాధారణంగా అమలులో ఉన్న నమ్మకాలు, విశ్వాసాలు, శాస్త్ర సాధనలు తలపించే సాధారణ శాస్త్రాన్ని (ఇది ఏరంగానికైనా చెంది ఉండవచ్చు) సూచిస్తుంది.

కాలనుక్రమంలో ఈ 'నమూనా'లు మారతాయి. ఈ మార్పు - అమలులో ఉన్న నమ్మకం ఏదైనా అపసృతిని ఎదుర్కొంటే - అంటే ఇప్పుడు అమలులో ఉన్న నమ్మకం సరికాదు అనిపించినపుడు సంభవిస్తుంది. ఆ పాత నమ్మకం మన మనసుల్లో ఎంతో ధృడంగా పాతుకుపోయి ఉండటం వలన ఆ అపసృతిని ముందు అనుమానించడం, హేళన చేయడం, తిరస్కరించడం వంటివి జరుగుతాయి. దానికి ఏదోరకంగా వివరణ ఇవ్వడానికి కూడా ప్రయత్నం జరుగుతుంది. దీనికి ఒక మంచి ఉదాహరణ - వెయ్యేళ్లకుపైగా ఖగోళ శాస్త్రజ్ఞులు గ్రీకు తత్వవేత్త ప్టోలమి 140వ సంవత్సరంలో ప్రవేశపెట్టిన 'భూ' కేంద్ర సిద్ధాంతాన్ని నమ్మారు. దీని ప్రకారం - సూర్యుడు, చంద్రుడు, గ్రహాలు, నక్షత్రాలు అన్నీ కూడా భూమి చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. ఇతర శాస్త్రజ్ఞులు దీనికి వ్యతిరేకంగా చూపే ఆధారాలను పెడచెవిన పెట్టడమో, వాటికి వింత వివరణలు ఇవ్వడానికి ప్రయత్నించటమో జరిగేది. కాపర్నికస్, గలీలి, కెప్లర్ మరియు న్యూటన్ లాంటి శాస్త్రజ్ఞుల అన్వేషణల ఫలితాల ఆధారంగా - ఎంతోకాలంగా నిరాకరింపబడ్డా, చివరకు - భూమి కేంద్రంకాదు, 'సూర్యుని చుట్టూ అన్నీ పరిభ్రమిస్తున్నాయి' అనే సత్యాన్ని ఆమోదించడం జరిగింది.

మార్మికవాదులు ప్రాబల్యంలోకి తెచ్చిన దేవుడు అనంతమయిన చైతన్యం అనే దైవ వర్ణనలు, నా బాబాయే దేవుడు అనే భావనలకు అలవాటు పడిపోయిన మనకు, వారిమీద, వారి సిద్ధాంతాల మీద మనసులో ధృడంగా పాతుకుపోయి ఉన్న అపరిమితమయిన భక్తివలన - దేవుడి గురించిన ఇతర ఏ వివరణ విన్నా అది నిజం కాదు, నిజమయినా మనకు సంబంధించింది కాదు అనిపించవచ్చు. మన భావనలు హేతువాద, సత్యాసత్యాల, శాస్త్రజ్ఞానాల వెలుగులో అసత్యాలుగా నిరూపించబడ్డప్పటికీ మనం వాటినే పట్టుకొని వేలాడతాం.

దేవుని నిజ అస్తిత్వాన్ని, సందేశాన్ని గుర్తించడానికి కావలసింది - మన ఆలోచనలలో, నమ్మకాలలో మార్పు - సత్యాకాంక్షే అలాంటి మార్పును తేగలదు.

**'ప్రతీ సత్యం మూడు దశలను దాటిన తర్వాతే నమ్మబడుతుంది -**
**ముందు అది, పరిహాసానికి గురౌతుంది.**
**తర్వాత అది తిరస్కరించబడుతుంది,**
**ఆ తర్వాత అది స్వాభావికంగా నిజమైనదిగా ఆదరింపబడుతుంది'**

*- ఆర్థర్ స్కో పెన్‌హార్.*

“ మేము త్వరలోనే వారికి మా సూచనలను
వారిచుట్టూ ఉన్న పప్రంచంలోనూ
చూపిస్తాము, వారిలోనూ చూపిస్తాము.
చివరకు ఈ ఖురాన్ నిస్సందేహంగా
సత్యమైనదని వారికి విశదమైపోతుంది.”

*- (దివ్య ఖురాను 41:53)*

# 9. దేవుని నిజ అస్తిత్వం మరియు సందేశం

**దివ్యఖురాను గ్రంథంలో దేవుడు ఇలా విశదపరుస్తున్నాడు:**

"మేము **నూహ్**ను అతని జాతి వద్దకు పంపాము. అతను ఇలా అన్నాడు: నా జాతి సోదరులారా, అల్లాహ్*ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు. మీ విషయంలో ఒక భయంకర దినం నాటి శిక్షను గురించి నేను ఆందోళన పడుతున్నాను. ఆయన జాతి సర్దారులు ఇలా పలికారు: 'నీవు స్పష్టమైన అపమార్గానికి గురి అయినట్లు మాకు కనిపిస్తున్నది'. నూహ్ ఇలా అన్నాడు: 'నా జాతి సోదరులారా, నేను ఏ అపమార్గంలోనూ పడలేదు. యదార్థానికి నేను సకలలోక ప్రభువునకు ప్రవక్తను. నా ప్రభువు సందేశాలను మీకు అందజేస్తాను. మీ శ్రేయోభిలాషిని' " (7:59-61).

"ఆద్ జాతి వైపునకు మేము వారి సోదరుడయిన **హూద్**ను పంపాము. అతను ఇలా అన్నాడు: 'నా జాతి సోదరులారా, అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు. మీరు సృష్టించినటువంటివి కేవలం అబద్ధమే. ఈ పనికై నేను మీ నుండి ఏ ప్రతిఫలాన్నీ కోరను. నాకు ప్రతిఫలం ఇవ్వడం నన్ను సృష్టించిన వాడి బాధ్యత. - మీరు తెలివిని ఏమాత్రం ఉపయోగించరా?' (11:50-51)

"…. వారు ఇలా జవాబు ఇచ్చారు: 'నీవు మా వద్దకు రావడానికి కారణం మేము ఒక్క అల్లాహ్‌నే ఆరాధించాలనా? సరే నీవు నిజం చెప్పేవాడివే అయితే నీవు మమ్మల్ని బెదిరిస్తూ ఉన్న ఆ శిక్షను తీసుకురా.' అతను ఇలా అన్నాడు: 'మీపై అల్లాహ్ శాపం, ఆయన ఆగ్రహం ఇదివరకే విరుచుకుపడ్డాయి. అల్లాహ్ ఏ ప్రమాణాన్నీ పంపని, మీరూ మీ తాతముత్తాతలు పెట్టుకున్న పేర్ల విషయంలో మీరు నాతో ఘర్షణ పడుతున్నారా?** సరే, అయితే మీరూ నిరీక్షించండి, మీతోపాటు నేనూ నిరీక్షిస్తాను.' చివరకు మేము మా కృపతో హూద్‌నూ, అతని అనుయాయులనూ రక్షించుకున్నాము. మా ఆయతులు అసత్యాలని తిరస్కరించిన వారినీ, విశ్వసించనివారిని మేము సమూలంగా నాశనం చేశాము." (7:70-72).

"సమూద్ జాతి వద్దకు మేము వారి సోదరుడైన **సాలిహ్**ను పంపాము. అతను ఇలా హితోపదేశం చేశాడు: 'నా జాతి ప్రజలారా, అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు. ఆయనే మిమ్మల్ని భూమి నుంచి సృష్టించాడు. ఇక్కడ మీకు నివాసం ఏర్పాటు చేశాడు. కనుక మీరు ఆయనను క్షమాభిక్ష కోరండి. ఆయన వైపుకు పశ్చాత్తాపంతో మరలండి. నిశ్చయంగా నా ప్రభువు దగ్గరలోనే ఉన్నాడు. ఆయన ప్రార్థనలకు సమాధానం కూడా ఇస్తాడు'. వారు ఇలా అన్నారు: 'సాలిహ్, నిన్నటి వరకు మా మధ్య ఉన్న నీమీద మేము పెద్ద పెద్ద ఆశలు పెట్టుకున్నాము. మా తాతముత్తాతలు పూజించిన దేవుళ్లను పూజించకుండా మమ్మల్ని ఆపదలచుకున్నావా? నీవు ఏ మార్గం వైపునకు పిలుస్తున్నావో, ఆ మార్గాన్ని గురించి మాకు పెద్ద అనుమానం ఉన్నది. అది మమ్మల్ని కలతకు గురిచేసింది'. సాలిహ్ ఇలా అన్నాడు: 'నా జాతి సోదరులారా, కొంచెం ఈ విషయాన్ని గురించి కూడా ఆలోచించారా, ఒకవేళ నేను నా ప్రభువు తరఫు నుండి వచ్చిన ఒక స్పష్టమైన నిదర్శనాన్ని కలిగి ఉంటే, ఇంకా ఆయన నాకు తన కారుణ్యాన్ని కూడా ప్రసాదించి ఉంటే, ఆ తరువాత ఒకవేళ నేను అల్లాహ్‌కు అవిధేయత చూపితే, ఆయన పట్టు నుండి నన్ను ఎవడు రక్షిస్తాడు? మీరు నాకు ఏవిధంగా ఉపయోగపడతారు? నన్ను ఇంకా నష్టంలోకి నెట్టటానికి తప్ప?''' (11:61-63)

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

\* *ఇంతకు ముందు వివరించినట్లు, అల్లాహ్ అనే అరబిక్ పదానికి అర్థం 'ఆరాధ్యనీయుడు' అని. అల్లాహ్ అంటే ముస్లిముల దేవుడు అని అనుకోవడం పొరపాటు. ఎందుకంటే ఆయన కేవలం ముస్లిముల దేవుడేకాదు, మొత్తం మానవాళికే దేవుడు మరియు సృష్టికర్త.*

** అంటే ఒకరిని వానకు, ఒకరిని గాలికి, ఒకరిని సిరికి, ఒకరిని రోగానికి ప్రభువు అంటారు. వాస్తవానికి వారిలో ఎవరూ యధార్థంగా దేనికీ ప్రభువు కారు. ఇవన్నీ కేవలం మీరు పెట్టుకున్న పేర్లే. వీటికొరకు తగాదా పడేవాడు అసలు కొన్ని పేర్లకోసమే తగాదా పడుతున్నాడేగానీ ఏ యధార్థం కోసం కాదు.
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

"మద్‌యమ్ ప్రజల వైపునకు మేము వారి సోదరుడైన **షుఐబ్‌**ను పంపాము. అతను ఇలా అన్నాడు: 'నా జాతి ప్రజలారా, అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు ఎవ్వడూ లేడు. కొలుచుటలో, తూచుటలో తక్కువ చెయ్యకండి. నేను ఈనాడు మిమ్మల్ని మంచి స్థితిలో చూస్తున్నాను. కానీ రేపు మీపైకి ఒక దినం రానున్నది అనీ, దాని శిక్ష మీ అందరినీ చుట్టు ముట్టుతుంది అనీ నేను భయపడుతున్నాను' " (11:84)

"**ఇబ్రాహీమ్‌**ను పంపాము. అప్పుడు అతను తన జాతి వారితో ఇలా అన్నాడు: 'అల్లాహ్‌ను ఆరాధించండి, ఆయనకు భయపడండి. మీరు అర్థంచేసుకుంటే ఇదే మీకు మేలైనది. అల్లాహ్‌ను కాకుండా మీరు పూజిస్తూ ఉన్నవి కేవలం విగ్రహాలు మాత్రమే. మీరు ఒక అభూత కల్పన చేస్తున్నారు. యదార్థానికి అల్లాహ్‌ను కాదని మీరు పూజిస్తున్నవి మీకు ఏ ఉపాధినీ ఇచ్చే అధికారం కలిగిలేవు. ఉపాధి కొరకు అల్లాహ్‌ను అడగండి, ఆయనకే దాస్యం చేయండి, ఆయనకు కృతజ్ఞతలు తెలుపండి. ఆయన వైపునకే మీరు మరలింపబడతారు. ఒకవేళ మీరు తిరస్కరిస్తే, మీకు పూర్వం ఎన్నో జాతులు తిరస్కరించాయి. స్పష్టంగా సందేశాన్ని అందజేయడం తప్ప దైవప్రవక్తపై మరొక బాధ్యత ఏదీ లేదు.' (29:16-18)

'అతను ఇలా అన్నాడు: మీరు ప్రపంచ జీవితంలో అల్లాహ్‌ను కాదని విగ్రహాలను మీ మధ్య ప్రేమకు సాధనంగా చేసుకున్నారు. కానీ ప్రళయంనాడు మీరు ఒకరినొకరు తిరస్కరించుకుంటారు. ఒకరినొకరు శపించుకుంటారు. అగ్ని మీ నివాస స్థలమౌతుంది. మీకు సహాయం చేసే వాడెవ్వడూ ఉండడు' (29:25)

ఇబ్రాహీమ్ తన తండ్రితో ఇలా అన్నాడు: 'తండ్రీ, నా వద్దకు వచ్చిన జ్ఞానం మీ వద్దకు రాలేదు. మీరు నన్ను అనుసరించండి. నేను మీకు సరిఅయిన మార్గం చూపుతాను. తండ్రీ, మీరు షైతానుకు దాస్యం చేయకండి, షైతాను కరుణామయుణ్ణి ధిక్కరించాడు. తండ్రీ, మీరు కరుణామయుని శిక్షకు గురి అవుతారేమో అని, షైతాను సహచరులైపోతారేమో అని నాకు భయంగా ఉంది' (19:43-45)

'జీవన్మరణాలు ఎవరి ఆధీనంలో ఉన్నాయో, ఆయనే నా ప్రభువు' అని ఇబ్రాహీము అన్నప్పుడు, అతను ఇలా జవాబు పలికాడు: 'చావు బ్రతుకులు రెండూ నా ఆధీనంలోనే ఉన్నాయి'. ఇబ్రాహీము ఇలా అన్నాడు: 'సరే, అల్లాహ్ సూర్యుణ్ణి తూర్పు నుండి ఉదయింపజేస్తాడు. నీవు కాస్త దానిని పడమర నుండి ఉదయింపజెయ్యి'. ఇది విన్న ఆ సత్యధిక్కారి బిత్తరపోయాడు. అయితే అల్లాహ్ దుష్టులకు ఋజుమార్గం చూపడు. (2:258)

ఇబ్రాహీము ఇలా అన్నాడు : 'మీరు అల్లాహ్ విషయంలో నాతో కలహిస్తున్నారా? వాస్తవానికి ఆయన నాకు ఋజుమార్గం చూపించాడు. మీరు నిలబెట్టిన భాగస్వాములకు నేను భయపడను. అయితే నా ప్రభువు ఏదైనా కోరితే అది తప్పకుండా జరగవచ్చు. నా ప్రభువు జ్ఞానం ప్రతీదానిని ఆవహించియున్నది. మీరు స్పృహలోకి రారా? నేను అసలు మీరు నిలబెట్టే భాగస్వాములకు ఎందుకు భయపడాలి? వాటి విషయంలో అల్లాహ్ మీపై ఏ ప్రమాణాన్నీ అవతరింపజేయనప్పటికీ వాటిని మీరు ఆయనతోపాటు దైవత్వంలో భాగస్వాములుగా చేస్తూ భయపడనప్పుడు? మన ఉభయ పక్షాలలో ఎవరు మోక్షానికి ఎక్కువ అర్హులో మీకేమైనా తెలిస్తే చెప్పండి? వాస్తవానికి విశ్వసించే వారికే, తమ విశ్వాసాన్ని దుర్మార్గంతో కలుషితం చేయని వారికే మోక్షం, వారు మాత్రమే ఋజుమార్గంపై ఉన్నారు' (6:80-82)

అప్పుడు అతను (ఇబ్రాహీము) తన తండ్రినీ, తన జాతి వారిని, మీరు వేటిని పూజిస్తున్నారు? అని అడిగాడు. వారు: 'ఇవి కొన్ని విగ్రహాలు, వాటిని మేము పూజిస్తాము, వాటి సేవలోనే మేము నిమగ్నులమై ఉంటాము'

అని జవాబు పలికారు. అతను వారిని ఇలా అడిగాడు: 'మీరు వీటిని పిలిచినప్పుడు ఇవి మీ మొర ఆలకిస్తాయా? లేక ఇవి మీకేమైనా లాభాన్నిగానీ, నష్టాన్నిగానీ కలిగిస్తాయా?' వారు ఇలా అన్నారు: 'లేదు, కానీ మేము మా తాతముత్తాతలు ఇలా చేస్తూ ఉండగా చూశాము'. అప్పుడు ఇబ్రాహీము ఇలా అన్నాడు: 'మీరు, పూర్వం మీ తాతముత్తాతలు పూజిస్తూ వస్తున్న వాటిని ఎప్పుడైనా మీరు (కళ్లుతెరచి) చూశారా?'

*(26:70-76)*

అతను (ఇబ్రాహీం) తన తండ్రితో, తన జాతి వారితో ఇలా అన్నప్పటి సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో, 'మీరు అమితభక్తితో ఆరాధిస్తున్న ఈ విగ్రహాలు ఏమిటి?' వారు దీనికి ఇలా బదులు చెప్పారు: 'మా పితృ పితామహులు వాటిని ఆరాధిస్తూ ఉండగా మేము చూశాము.' అతను : 'మీరు మార్గభ్రష్టులే, మీ పితృపితామహులు కూడా పూర్తిగా మార్గభ్రష్టులే' అని అన్నాడు. వారు, 'నీవు మా ముందు అసలైన నీ ఆలోచననే ప్రకటిస్తున్నావా లేకు పరిహాసమాడుతున్నావా?' అని అడిగారు. అతను ఇలా జవాబు పలికాడు: 'లేదు, వాస్తవానికి భూమికీ, ఆకాశాలకూ ప్రభువైనవాడే, వాటిని సృష్టించినవాడే మీ ప్రభువు. ఈ విషయం గురించి నేను మీ ముందు సాక్ష్యమిస్తున్నాను, దేవునిపై ప్రమాణం చేసి చెబుతున్నాను.' (21:52-56)

అప్పుడు అతను (ఇబ్రాహీం) ఇలా అన్నాడు, 'స్వయంగా మీరే చెక్కుకున్న వస్తువులను మీరు పూజిస్తారా? వాస్తవానికి అల్లాహ్‌యే మిమ్మలని సృష్టించాడు, మీరు తయారుచేసే వస్తువులనూ సృష్టించాడు' "

*(37:95-96)*

"మేము ఇస్రాయీలు సంతతిని సముద్రం దాటించాము. తరువాత వారు పోసాగారు, మార్గమధ్యంలో ఒక జాతి ప్రజల వద్దకు పోవటం జరిగింది. ఆ జాతి వారు తాము ఆరాధించే కొన్ని విగ్రహాల పట్ల ప్రేమకు పూర్తిగా అంకితమైనవారు. ఇస్రాయీలు సంతతివారు ఇలా అన్నారు: '**మూసా** ! వాళ్ల దేవుళ్లవంటి ఒక దేవుణ్ణి మాకు కూడా చేసిపెట్టు.' మూసా ఇలా అన్నాడు: 'మీరు చాలా అజ్ఞానపు మాటలు మాట్లాడుతున్నారు. ఈ ప్రజలు అవలంబిస్తున్న విధానం నాశనం అయ్యేదే. ఇంకా వారు చేస్తూ ఉన్న పని పూర్తిగా అసత్యమైనది'. మళ్లీ మూసా ఇలా అన్నాడు: 'నేను అల్లాహ్‌ను కాదని మరొక దైవాన్ని మీ కొరకు అన్వేషించాలా? వాస్తవానికి ప్రపంచంలోని సమస్త జాతులకంటే మీకు ఔన్నత్యాన్ని ప్రసాదించింది అల్లాహ్‌యే. (అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు) : మేము మీకు ఫిరౌన్ ప్రజల బారి నుండి విముక్తి కలిగించిన సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకోండి. వారు మిమ్మల్ని ఘోర యాతనకు గురిచేసేవారు. మీ కుమారులను చంపేవారు, మీ స్త్రీలను మాత్రం బతకనిచ్చేవారు. ఇందులో మీ ప్రభువు తరపునుండి మీకు ఒకపెద్ద పరీక్ష ఉండినది.' (7 :138-141)

"**ఈసా (యేసుక్రీస్తు)** ఇలా పలికాడు: నేను అల్లాహ్ దాసుణ్ణి. ఆయన నాకు గ్రంథాన్ని ఇచ్చాడు. ప్రవక్తగా నియమించాడు. నేను ఎక్కడున్నాసరే, ఆయన నన్ను శుభవంతునిగా చేశాడు. నేను జీవించి ఉన్నంతకాలం నమాజును, జకాతును పాటించు అని ఆజ్ఞాపించాడు. నా తల్లి హక్కును నెరవేర్చే వానిగా నన్ను చేశాడు. నన్ను దౌర్జన్యపరునిగాను, పాషాయ హృదయునిగాను చేయలేదు. నేను పుట్టినరోజునా, నేను మరణించే రోజునా, బ్రతికింపబడి లేపబడే రోజునా నాకు శాంతి కలుగుతుంది. ఇతనే మర్యమ్ కుమారుడు ఈసా, ఇదే అతనికి సంబంధించిన అసలు నిజం. దానిని గురించి ప్రజలు సందేహిస్తున్నారు.' (19:30-34)

ఈసా (యేసుక్రీస్తు) అన్నాడు: 'అల్లాహ్‌యే మీ ప్రభువు, నా ప్రభువూనూ, ఆయననే మీరు ఆరాధించండి, ఇదే సరిఅయిన మార్గం.' (43:64)

ఈసా (యేసుక్రీస్తు) అన్నాడు: 'ఇస్రాయిలు సంతతి వారలారా, నేను మీ వద్దకు అల్లాహ్‌చే పంపబడిన సందేశహరుణ్ణి, నాకు పూర్వం వచ్చిన తౌరాత్ గ్రంథాన్ని ధృవపరుస్తున్నాను, నా తర్వాత అహ్మద్ అనే ప్రవక్త రాబోతున్నాడు అనే శుభవార్తను అందజేస్తున్నాను.' "(61:6)

**ఇదియే దైవప్రవక్తలందరి ఏకైక సందేశం - దేవుడి నిజ అస్తిత్వాన్ని గుర్తించి, ఆయనకు లేని రూపాన్ని, సహవర్తులను జతచేయకుండా పూజించడం. యేసుక్రీస్తు (అస) తరువాత వచ్చిన మరియు ప్రవక్తల పరంపరలో చిట్టచివరివారు - ముహమ్మద్ (సఅస). దేవుడు ఇలా సెలవిస్తున్నాడు:**

"ముహమ్మద్! ఇలా ప్రకటించు: 'మానవులారా! నేను మీ అందరి వైపునకు వచ్చిన అల్లాహ్ సందేశహరుణ్ణి. ఆయన తప్ప మరొక దేవుడు లేడు. ఆయనే జీవితాన్ని ప్రసాదిస్తాడు. ఆయనే మృత్యువును ఇస్తాడు. కనుక, విశ్వసించండి అల్లాహ్‌ను, ఆయన పంపిన నిరక్షరాస్యుడైన ప్రవక్తను." (7:158)

'మానవులారా!, ఈ ప్రవక్త మీ వద్దకు మీ ప్రభువు తరపు నుండి సత్యం తీసుకువచ్చాడు. అతన్ని విశ్వసించండి, మీకే మంచిది. కాని మీరు గనక తిరస్కరిస్తే, ఆకాశాలలో, భూమిలో ఉన్నదంతా అల్లాహ్‌దే అనే విషయము తెలుసుకోండి. అల్లాహ్ అన్నీ తెలిసినవాడు, అత్యంత వివేకీనూ.' (4:170)

'మానవులారా!, మీ ప్రభువు ఆగ్రహం నుండి మిమ్మల్ని మీరు రక్షించుకోండి. యదార్థం ఏమిటంటే, ప్రళయంనాటి భూకంపం మహా (భయంకరమైన) విషయం.' (22:1)

'మానవులారా!, ఒకవేళ మీకు మరణానంతర జీవితం గురించే ఏదైనా సందేహం ఉంటే, మీరు ఈ విషయాన్ని తెలుసుకోవాలి: మేము మిమ్మల్ని మట్టితో సృష్టించాము, తరువాత వీర్యబిందువుతో, ఆ తరువాత నెత్తుటి గడ్డతో, ఆపై మాంసపుకండతో, అది రూపం కలదిగానూ, రూపం లేనిదిగానూ ఉంటుంది. (మేము ఈ విషయాన్ని) మీకు యదార్థం ఏమిటో స్పష్టం చెయ్యాలని (తెలుపుతున్నాము.) మేము కోరిన (వీర్యబిందువును) దానిని ఒక ప్రత్యేకకాలం వరకు మాతృగర్భాలలో నిలిపి ఉంచుతాము. తరువాత మిమ్మల్ని ఒక శిశువు రూపంలో బయటకి తీస్తాము. (ఆ తరువాత మీకు పెట్టి పోషిస్తాము) మీరు నిండు యౌవన దశకు చేరటానికి. మీలో ఒకడు ముందుగానే వెనుకకు పిలుచుకోబడతాడు, మరొకడు అతి నికృష్టమయిన వయస్సు వైపునకు మరలింపబడతాడు, అంతా తెలిసిన తరువాత కూడా ఏమి తెలియకుండా ఉండటానికి. ఎండిపోయిన నేలను మీరు చూస్తున్నారు. తరువాత మేము దానిపై వర్షం కురిపించగానే, అకస్మాత్తుగా అది పులకరిస్తుంది

మరియు ఉబుకుతుంది, ఇంకా ఇది అన్ని రకాల మనోహరమైన మొక్కలను మొలకెత్తించటం ప్రారంభిస్తుంది. దీనికంతటికీ కారణం అల్లాహ్‌యే సత్యం కావటం, ఆయన మృతులను బ్రతికించటం మరియు ప్రతిదానిపై అధికారం కలిగి ఉండటం, ఇంకా (ఇది మరొక విషయానికి కూడా నిదర్శనమే) ఏమిటంటే, ప్రళయ ఘడియ తప్పకుండా వచ్చి తీరుతుంది, ఇందులో ఏ అనుమానానికీ ఆస్కారం లేదు, గోరీల(సమాధి)లోకి వెళ్ళిపోయిన వారిని అల్లాహ్ తప్పకుండా లేపుతాడు.' (22:5-7)

'విశ్వసించిన ఓ మానవులారా!, అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించండి. ఉదయం, సాయంత్రం ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉండండి.' (33:41-42)

'మానవులారా!, మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుంచి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకొనేందుకు మిమ్మల్ని జాతులుగానూ, తెగలుగానూ చేశాము. వాస్తవానికి మీలో అందరికంటే ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు. నిశ్చయంగా అల్లాహ్ సర్వజ్ఞానం కలవాడు, సకల విషయాలూ తెలిసిన వాడూను.' (49:13)

'విశ్వాసులారా!, మీరు మిమ్మల్నీ, మీ కుటుంబ సభ్యులనూ మానవులు, రాళ్ళు ఇంధనం కాబోయే అగ్నినుండి కాపాడుకోండి. దానిపై ఎంతో బలిష్ఠులు, అత్యంత కఠినులు అయిన దైవదూతలు నియమించబడి ఉంటారు, వారు ఎన్నటికీ అల్లాహ్ ఆజ్ఞను ఉల్లంఘించరు, వారు తమకు ఏ ఆజ్ఞ ఇచ్చినా, దానిని పాటిస్తారు (అప్పుడు ఇలా అనడం జరుగుతుంది), అవిశ్వాసులారా, ఈనాడు సాకులు చెప్పకండి, మీరు చేస్తూ ఉండిన చేతలకు తగినట్లుగానే మీకు ప్రతిఫలం ఇవ్వబడుతుంది.' (66:6-7)

'విశ్వసించిన ప్రజలారా!, అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ విధేయత చూపండి. ఆజ్ఞ విన్న తరువాత దాని నుండి మరలకండి.' (8:20)

'విశ్వసించిన ప్రజలారా!, బుద్ధిపూర్వకంగా అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ నమ్మకద్రోహం చెయ్యకండి. మీ అమానతుల విషయంలో ద్రోహానికి పాల్పడకండి.' (8:27)

**పై వాక్యాలను పరిశీలిస్తే బోధపడే విషయం, ముహమ్మద్ (సఅస) ముందు వచ్చిన దైవప్రవక్తలు కొన్ని ప్రత్యేక జాతుల, వర్గాల ప్రజలనుద్దేశించి పంపబడినవారు. ఆ ప్రవక్తలందరూ - 'ఓ నా జాతి సోదరులారా, ప్రజలారా' అని సంబోధించడం గమనించండి. కాని ముహమ్మద్ (సఅస) గారి సందేశం సర్వమానవాళికీ అందజేయబడింది: 'ఓ మానవులారా', 'ఆదము సంతానమా', 'విశ్వసించిన ప్రజలారా', 'అవిశ్వాసులారా' అనే సంబోధనలు గమనించండి. ఈవిధంగా ముహమ్మద్ (సఅస) గారి సందేశం ఏ అరబ్బులకో, ఇతర దేశాల వారికో పరిమితంకాదు. ఇది సర్వమానవ సమాజానికి ఉద్దేశించినది.**

# దైవప్రవక్త ముహమ్మద్ (సఅస) గారి సందేశం

ఒకసారి ముహమ్మద్ (సఅస) గారు తన అనుచరులతో కూర్చుని ఉన్న ప్రదేశానికి, తెల్లని వస్త్రాలలో ఉన్న ఒక వ్యక్తి వచ్చారు. ఆ వ్యక్తిని అక్కడ ఉన్న వారెవ్వరూ మదీనా నగరంలో అంతకు పూర్వం చూసి ఉండలేదు మరియు ఆయన ప్రయాణంలో ఉన్న జాడలు కూడా లేవు.

ఆయన ముహమ్మద్ (సఅస) ప్రవక్తను ఇలా అడిగారు: 'ఓ దైవప్రవక్తా! విశ్వాసం అంటే ఏమిటో దయచేసి నాకు వివరించండి?'. ముహమ్మద్ (సఅస) ఇలా బదులిచ్చారు. విశ్వాసం అంటే:

- అల్లాహ్‌ను మాత్రమే విశ్వసించి, ఆరాధించడం - ఆయనకు సహవర్తులెవరనీ నిలబెట్టకుండా.
- దైవ ప్రవక్తలందరనీ విశ్వసించడం.
- దేవుని ద్వారా అవతరించిన గ్రంధాలన్నింటినీ నమ్మడం.
- దైవదూతలను విశ్వసించడం.
- పరలోక జీవితాన్ని నమ్మడం.
- 'విధి' ని నమ్మడం (అంటే సృష్టిలో జరిగేదంతా దేవుని చేతిలో ఉందని నమ్మడం).

అప్పుడు ఆ వ్యక్తి ఇలా అన్నాడు: 'నీవు సత్యాన్ని పలికితివి'. తరువాత ఆయన ముహమ్మద్ (సఅస) ప్రవక్తను ఇలా అడిగారు - 'ఓ దైవప్రవక్తా! ఇస్లాం (విధేయత) అంటే ఏమిటో దయచేసి నాకు వివరించండి'.

ముహమ్మద్ (సఅస) ఇలా బదులిచ్చారు: ఇస్లాం (విధేయత) అనేది 5 పునాదులపై నిర్మింపబడి ఉంది:

- అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్య దైవం లేడని మరియు ముహమ్మద్ ఆయన ప్రవక్త అని సాక్ష్యమివ్వడం.
- నమాజు (ప్రార్థన)ను స్థాపించడం, రంజాను మాసంలో రోజాలను (ఉపవాసాలను) పాటించడం.
- జకాతు (ఆస్తిలో పేదవారి హక్కు)ను చెల్లించడం.
- హజ్ (మక్కా యాత్ర)ను నిర్వహించడం.

అప్పుడు ఆ వ్యక్తి ఇలా అన్నాడు: 'నీవు సత్యాన్ని పలికితివి'. అలా అని ఆ వ్యక్తి వెళ్ళిపోయారు. పిమ్మట, ముహమ్మద్ (సఅస) ప్రవక్త తన అనుచరులతో ఇలా అన్నారు: 'అతను దైవ దూత అయిన జిబ్రయీలు (అస), మీకు ధర్మాన్ని బోధించడానికి మానవరూపంలో వచ్చారు.'

పై హదీసు (ప్రవక్త ప్రవచనాలు) నుండి మరియు అనేక ఇతర హదీసులు ద్వారా - ముహమ్మద్ (సఅస) ఇస్లామ్ యొక్క ఈ ఐదు పునాదులను ఖచ్చితంగా ప్రకటించారని తెలుస్తుంది. దేవుని మీద భక్తి విశ్వాసాలు ఉండి, తీర్పు దినానికి భయపడే ఏ ముస్లిమూ ఇందులో హెచ్చుతగ్గులు చేసే సాహసం చేయడు.

***అల్లాహ్ ఖురాను గ్రంథం ద్వారా ఇలా తెలియపరుస్తున్నాడు :***

**'అల్లాహ్ దృష్టిలో అసలు ధర్మం కేవలం ఇస్లాం మాత్రమే. గ్రంథం ఇవ్వబడినవారు ఈ ధర్మాన్ని త్రోసిరాజని విభిన్న విధానాలను అవలంబించారు. వారి ఈ వైఖరికి కారణం, వారు జ్ఞానం వచ్చిన తరువాత కూడా ఒకరిపై ఒకరు అత్యాచారం చెయ్యటానికి సంకల్పించటమే. అల్లాహ్ ఆజ్ఞలను, ఆయన బోధనలను శిరసావహించటానికి తిరస్కరించేవారి లెక్కలను పరిష్కరించటం అల్లాహ్‌కు ఎంతో సేపు పట్టదు.' (3:19)**

**'ఎవడైనా ఈ విధేయతా విధానాన్ని (ఇస్లాం) కాక మరొక మార్గాన్ని అవలంబించదలిస్తే, ఆ మార్గం ఎంతమాత్రం ఆమోదించబడదు. అతడు పరలోకంలో విఫలుడౌతాడు, నష్టపోతాడు.' (3:85)**

**'.....ఇక ఈ జ్ఞాపిక, దానిని మేము అవతరింపజేశాము. స్వయంగా మేము దానిని రక్షిస్తాము' (15:9)**

ఈ విధంగా అంతవరకూ ఉన్న సమస్త మత శాసనాలను పటిష్టంచేసి, చివరి దినం వరకూ వర్తించే ఒక సార్వజనీక సందేశాన్ని దైవం తన చివరి ప్రవక్త అయిన ముహమ్మద్(సఅస) ద్వారా దివ్యగ్రంథమయిన ఖురాను రూపంలో అవతరింపచేశాడు. దీని పరిరక్షణ బాధ్యతను స్వయంగా తనే తీసుకున్నాడు - తద్వారా ప్రళయదినం రోజున ఎవరూ కూడా తమకు ఆ సందేశం అందలేదని సాకులు చెప్పకుండా ఉండేందుకు. దివ్యఖురాను గ్రంథం అవతరించిన కాలంనుండే వ్రాతరూపంలో పొందుపరచబడి - మార్పులు, చేర్పులు జరగకుండా కాపాడబడింది.

ముహమ్మద్ (సఅస) ప్రవక్త వ్యక్తిత్వానికి ఇంకా తార్కాణాలు అవసరం అనుకున్నవారు - మైకెల్ హెచ్. హార్ట్ గారి పుస్తకం - Hundred Most Influential People in the World (ప్రపంచ చరిత్రలో వంద మంది మహానుభావులు) చూడండి. ఆయన మొదటి స్థానాన్ని - ముహమ్మద్ (సఅస) గారికి ఇచ్చారు. న్యూటన్‌కు రెండవ స్థానం ఇవ్వగా, ఈసా - యేసుక్రీస్తు (అస) గారికి మూడవ స్థానం ఇవ్వబడింది.

**కొంతమంది ఇలా అనవచ్చు - ఈ పుస్తకంలో ఎవరికీ అర్థం కాని మెదడుకు సంబంధించిన పదాలు, భావనల ద్వారా వివరణలు ఇచ్చి, దేవుని అవతారాలయిన మా బాబాలను దిగజార్చి, దేవునితో ఏమీ సంబంధం లేని వారిగా చిత్రీకరించడం జరిగింది. మేము కూడా ఇట్లే శాస్త్రీయ జ్ఞానం ఆపాదిస్తే, ప్రవక్తల విషయంలో కూడా ఇదే జరుగుతుంది.**

నేను ఈ సవాలును స్వీకరిస్తున్నాను. ముహమ్మద్ (సఅస) మరియు దివ్యఖురానులను శాస్త్రీయ జ్ఞాన వెలుగులో పరిశీలిద్దాము:

ముందుగా గుర్తించవలసినదేమిటంటే - దైవ ప్రవక్తలు మార్మికవాదులు కారు. వారు సన్యాసత్వం, ధ్యానంలాంటి సాధనలు చేయలేదు. దైవానుభవాలు పొందామనీ, దేవుళ్ళమనీ, అవతారాలమని చెప్పుకోలేదు. దైవవాణి వారిలో కొంతమందికి నేరుగా దైవం నుంచి వస్తే మరికొంత మందికి దైవదూతల ద్వారా అవతరించింది.

కొంతమంది శాస్త్రజ్ఞులు ఇలా వివరణ ఇస్తారు: 'మార్మిక అనుభవాలనేవి అన్ని మతాల ఆవిర్భావానికీ మూలాలు.' మార్మిక అనుభవాలను మెదడు యొక్క పనిగా ఆధారాలతో నిరూపించి, అందువలన మతాలే కాకుండా అసలు దేవుడు అనే భావన కూడా మెదడు నుంచి జనించినదే అని సెలవిస్తారు.

ఇది చాలా పెద్దపొరపాటు. ఎందుకంటే, దైవప్రవక్తలు మార్మికవాదులు కారన్నది యదార్థం. దైవప్రవక్తల జీవిత వివరాలను పరిశీలించిన వారెవరికయినా కానవచ్చే సత్యం - వారు మార్మికవాదులు చేసిన సాధనలూ చేయలేదు మరియు దేవుళ్ళమని చెప్పుకోనూలేదు. దైవ ప్రవక్త అయిన ముహమ్మద్ (సఅస) మరియు మార్మికవాది అయిన మెహర్‌బాబాల విషయంలో మనం ఈ పరిశీలనను సవివరంగా చూశాం.

తరువాత, కొంతమంది శాస్త్రజ్ఞులు ముహమ్మద్ (సఅస) ఏదో ఒక మానసిక వ్యాధిగ్రస్థులై ఉండవచ్చని దావా చేస్తారు. కొంతమంది అది 'ఎపిలెప్సీ' (మూర్ఛరోగం)గా పేర్కొంటూ - దానివలన వారికి వివిధ రకాలయిన మాటలు వినిపించడం, భ్రమలు కలగడం వంటివి జరిగి వాటిని ఆయన ఖురాను రూపంలో పొందుపరచారని వివరణ ఇస్తారు. సత్యాభిలాషులు అన్ని విషయాలనూ పరిగణనలోకి తీసుకోవాలి. ఇలాంటి వివరణలు సత్యాసత్యాల వెలుగులో నిలుస్తాయా లేదా అనేది పరిశీలిద్దాం.

నేను కొంతమంది శాస్త్రజ్ఞులు ఇలా అంటారని ఎందుకన్నానంటే, మరికొంతమంది శాస్త్రజ్ఞులు దీనికి భిన్నమయిన వివరణను ఇస్తారు. వారు ముహమ్మద్ (సఅస) తప్పకుండా దేవుని ప్రవక్త అయి ఉండాలి అని అంటారు. ముస్లిమేతర శాస్త్రజ్ఞులు కూడా చాలామంది ఇలా అభిప్రాయ పడతారన్నది సత్యం. అయితే తేడా ఏమిటంటే - ముహమ్మద్ (సఅస) పిచ్చివారు అనేవారు ఇస్లాం అధ్యయనంగానీ, ఖురాను పరిశీలనగానీ చేయలేదు మరియు వారిలో చాలామంది నాస్తికులు (దేవుడు లేడని నిరూపించడమే వీరి ధ్యేయం), ముహమ్మద్ (సఅస) తప్పకుండా దైవ ప్రవక్త అయి ఉంటారని చెప్పే శాస్త్రవేత్తలు ఖురాను మరియు ముహమ్మద్ (సఅస) గారి ప్రవచనాలను పరిశీలించినవారు. ఈ శాస్త్రజ్ఞులు దివ్యఖురాను మరియు ముహమ్మద్ (సఅస) ప్రవక్త గురించి ఏమంటున్నారో చూద్దాం:

# డాక్టర్ మూర్

*(గౌరవ ప్రొఫెసర్ - యూనివర్సిటీ ఆఫ్ టోరాంటో - శరీర నిర్మాణ, కణజీవ శాస్త్ర విభాగం, ప్రసిద్ధ పిండ శాస్త్ర నిపుణులు మరియు 'ద డెవలపింగ్ హ్యూమన్' లాంటి అనేక వైద్య గ్రంథాల కర్త)*

ఈయన ఇలా అన్నారు: 'గత మూడు సంవత్సరాలుగా నేను జెద్దా - సౌదీ అరేబియాలోని - కింగ్ అబ్దుల్ అజీజ్ యూనివర్సిటీకు చెందిన - 'పిండశాస్త్ర' అధ్యాయన బృందంలో- మానవ పునరుత్పత్తి, శిశువు ఎదుగుదల అనే అంశాల గురించి - ఖురాను గ్రంథం మరియు ముహమ్మద్ ప్రవక్త ప్రవచనాల సమాచారాన్ని- శాస్త్రీయంగా అధ్యయనం చేస్తున్నాను. ముందుగా నేను ఏడవ శతాబ్దంలో నమోదైన ఈ వాక్యాలలోని నిర్దిష్టతకు ఆశ్చర్యచకితుణ్ణి అయ్యాను. ఎందుకంటే అప్పటికి పిండ అధ్యయన శాస్త్రం ఏర్పడనే లేదు. పదవ శతాబ్దానికి చెందిన ముస్లిం శాస్త్రజ్ఞుల ఘనత, వైద్య రంగానికి వారి సేవల గురించి తెలిసి ఉన్నప్పటికి, ఖురాను గ్రంథంలో మరియు ముహమ్మద్(సఅస) ప్రవక్త సాంప్రదాయంలోని మతపరమయిన అంశాలు, నమ్మకాల గురించి నాకు తెలియదు.[1]

కైరో (ఈజిప్టు)లో జరిగిన ఒక సభలో ఆయన తన పరిశోధనా ఫలితాలను వెల్లడిస్తూ ఇలా అన్నారు: మానవ పునరుత్పత్తి, శిశువు ఎదుగుదల అనే అంశాల మీద ఖురాను గ్రంథంలో ఉన్న పరిజ్ఞానానికి శాస్త్రీయ ధృక్పథంలో పరిశీలించి, వివరణ ఇచ్చే కార్యాన్ని చేపట్టినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. ఈ వాక్యాలు ముహమ్మద్(సఅస) కు దైవం తరపు నుండి వచ్చాయనేది నాకు అవగతమయినది. ఎందుకంటే ఈ జ్ఞానం కొన్ని శతాబ్దాల తర్వాత గానీ మనం కనుగొనలేదు. దీనిని బట్టి ముహమ్మద్(సఅస) అల్లాహ్ లేదా దేవుని ప్రవక్త అని నాకు నిరూపితమయినది.'[2]

ఆయన ఇంకా ఇలా అన్నారు: 'శిశువు ఎదుగుదల అనేది ఎంతో క్లిష్టమైన పరిణామం, ఎందుకంటే ఇది నిరంతరం మార్పులు చెందుతూ ఉంటుంది. అందుకని, ఖురాను మరియు ప్రవక్త సాంప్రదాయంలో వాడబడిన పదాలను ఉపయోగించి- శిశువు ఎదుగుదలలోని దశలను విభజించే విధానాన్ని నేను కనుగొన్నాను. ఈ విధానం ద్వారా శిశువు ఎదుగుదలను సులభంగా మరియు సంపూర్ణంగా అర్థంచేసుకోవచ్చు. ఇప్పుడున్న ఆధునిక పిండ పరిణామ జ్ఞానంతో అది ఏకీభవిస్తుంది.

గత నాలుగు సంవత్సరాలుగా ఖురాను, ప్రవక్త ప్రవచనాల మీద జరిగిన పరిశోధనలో వెల్లడయిన సమాచారాన్ని బట్టి- పిండ పరిణామ దశలను విభజించే ఒక అద్భుతమయిన వ్యవస్థ కనుగొనబడింది. ఇది ఒక అద్భుతమే. ఎందుకంటే - ఈ సమాచారం 7వ శతాబ్దంలో నమోదు చేయబడింది. కానీ అది అప్పటి పరిజ్ఞానం ఆధారంగా వ్రాసినది కాదు.'[3]

**డా.మూర్ గారు పై విధంగా అనడానికి కారణమేమిటి? ఆయన పరిశోధనలో వెల్లడయిన విషయాలు:**

ఖురాను గ్రంథంలో శిశువు ఎదుగుదలలోని దశల గురించి చాలా నిర్దిష్టంగా వ్రాయబడిందని డా.మూర్ గుర్తించారు. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు గత 15 సంవత్సరాలలో కనుకొన్న పరిజ్ఞానం దీనితో ఏకీభవిస్తుంది.

ఈ వర్ణనలు - స్త్రీ గర్భాన్ని చీల్చి, పిండాన్ని పరీక్షించి వ్రాసి ఉండవచ్చుకదా? అనే ప్రశ్నకు డా.మూర్ ఇలా బదులిచ్చారు: ' ఆ దశలో - పిండ పరిమాణం ఒక మిల్లీ మీటరులో పదవ వంతు మాత్రమే ఉంటుంది.- అంటే మనకంటికి ఒక చిన్న చుక్కలాగ కనిపిస్తుంది. దాని ఆకృతిని వర్ణించడానికి, శక్తివంతమయిన మైక్రోస్కోపులు అవసరం - అవి 7వ శతాబ్దంలో లేనేలేవు'. ఖురాను గ్రంథంలో ఇలా వ్రాయబడి ఉంది: 'దేవుడు మిమ్మల్ని మీ తల్లుల గర్భాలలో దశల వారీగా, మూడు చీకటి తెరలలో అభివృద్ధిచేస్తాడు'. ఈ మూడు తెరలు - ఉదరపు పొర, గర్భాశయ పొర మరియు అమ్నియో కొరియానిక్ అనబడే పొరలని డా.మూర్ వివరించారు. మరోచోట ఇలా వ్రాయబడింది: ' ఆతర్వాత, ఆ చుక్కనుండి జలగలా వేలాడే ఒక ఆకృతిని తయారు చేస్తాము'. 24 రోజుల పిండం జలగ ఆకృతిలో ఉండి, గర్భాశయ గోడకు వేలాడుతూ ఉంటుందని డా.మూర్ కనుగొన్నారు. దాని తర్వాత ఈ శ్లోకంలో జలగ ఆకృతిలో ఉన్న పదార్థం - నములబడిన పదార్థ ఆకృతిలోకి మారుతుందని ఉంది. ఇది కూడా ఖచ్చితమయిన వర్ణనే అని డా. మూర్ గారి పరిశోధనలో తేలింది. ఆ దశలో కొన్ని అవయవాలు మాత్రమే కాన వస్తాయని వ్రాయబడి ఉంది. అవి గుండె మరియు కను రెప్పలని డా. మూర్ వివరించారు.

ఇదికాక, విడుదలైన వీర్యంలోని అతి కొద్దిమోతాదు మాత్రమే ఫలదీకరణకు ఉపయోగపడుతుందనేది కూడా వివరింపబడిందని మూర్ కనుగొన్నారు.18వ శతాబ్దంలో - ఆడ మరియు మగ సంయోగజనిత పదార్థాలు మిళితము అయితే గాని ఎదుగుదల పరిణామం సాధ్యపడదని, 'స్పలంజని' అనే శాస్త్రవేత్త ప్రయోగాత్మకంగా నిరూపించారు. కానీ, ఈ విషయము 11 శతాబ్దాలకు పూర్వం ఖురాను గ్రంథంలో 'మిళిత-చుక్క' లా వర్ణింపబడిందని డా.మూర్ వివరించారు.

ఇంకొక వచనంలో- వీర్యంలోని అత్యంత చిన్నదైన కణం (వీర్యకణం)లో శిశువు యొక్క లక్షణాలు, ఆకృతులు పొందుపర్చబడి ఉంటాయని ఉంది. ప్రవక్త(సఅస) గారి ఒక ప్రవచనములో ఫలదీకరణము అయిన 42 రోజుల తర్వాత ఈ చుక్కలాంటి పదార్థానికి జ్ఞానేంద్రియాలు (చెవులు, కళ్ళు మొదలగునవి) ప్రసాదించబడతాయని ఉంది. ఇవన్నీ ఇప్పుడున్న ఆధునిక పిండ పరిణామ జ్ఞానంతో ఏకీభవించే విషయాలే.

డా. మూర్ అభిప్రాయంలో, ముస్లిములు ఈ వచనాలు దేవుని నుంచి అవతరించాయని నమ్మడం ఎంతో సమంజసమైనదే. అందువలనే అవి అంత నిర్దిష్టంగా ఉన్నాయి.

## ఇ. మార్షల్ జాన్‌సన్

(అధ్యక్షులు మరియు ప్రొఫెసర్ - శరీర నిర్మాణ - పరిణామ శాస్త్ర విభాగం, అధ్యక్షులు - డేనియల్ ఇన్‌స్టిట్యూట్ - థామస్ జెఫర్ సన్ యూనివర్శిటీ - ఫిలడల్ఫియా, అమెరికా)

'సంక్షిప్తంగా చెప్పాలంటే, ఖురాను - పిండం యొక్క బాహ్య రూపాంతరమేకాక, అంతర్గత దశలను - దాని ఆవిర్భావం, అభివృద్ధి, పరిణామ దశలను, ఇప్పటి శాస్త్రజ్ఞానం పోల్చుకోగలిగేంత వివరంగా వర్ణిస్తుంది.

నేను పిండ పరిణామ మరియు శిశు పరిణామ శాస్త్రాలకు సంబంధించిన అంశాలను అర్థం చేసుకోగలను. ఖురాను గ్రంథంలో నుంచి నాకు వినిపించబడిన వచనాలను నేను అర్థం చేసుకోగలను. ఇంతకు ముందు చెప్పినట్లు, నన్ను ఆ కాలానికి పంపిస్తే, నేను వీటి గురించి ఇంతలా వర్ణించగలిగి ఉండేవాడిని కాను.........

ముహమ్మద్ (సఅస) ప్రవక్తకు ఈ సమాచారం అందింపబడి ఉంటే తప్ప ఇది సాధ్యం కాదు. అందువలన నేను దైవవాణి ముహమ్మద్ (సఅస)కు అంది ఉంటుంది, తద్వారానే ఆయన ఇలా అనగలిగారు అనే భావనతో ఏకీభవిస్తున్నాను.'[4]

## టి.వి.ఎన్. పర్సూడ్

*(ప్రొఫెసర్ - శరీర నిర్మాణ శాస్త్ర విభాగం, ప్రొఫెసర్ - శిశు ఆరోగ్య శాస్త్ర విభాగం - యూనివర్శిటీ ఆఫ్ మనిటోబా, విన్నీపెగ్ - కెనడా)*

ముహమ్మద్ ప్రవక్త ఒక సామాన్యమయిన వ్యక్తి. ఆయనకు చదవటం, వ్రాయటం రాదు. ఆయన ఒక నిరక్షరాస్యుడు.

మనం 1400 సంవత్సరాల క్రితం గురించి మాట్లాడుతున్నాం. ఒక నిరక్షరాస్యుడైన వ్యక్తి - శాస్త్రీయ జ్ఞాన ఆవిష్కరణలతో ఏకీభవించే ప్రకటనలు చేశారు.

ఇవి నోటికొచ్చిన మాటలని నేనంగీకరించలేను. అలా అయితే అవి ఇంత నిర్దిష్టంగా ఉండి ఉండేవి కావు. డా॥ మూర్ లాగ నేను కూడా ఇది దైవవాణి ద్వారానే సాధ్యమని భావిస్తున్నాను.' [5]

## జో లీ సింప్సన్

*(అధ్యక్షులు, ప్రొఫెసర్ - స్త్రీ మరియు ప్రసవ శాస్త్ర విభాగం, బేలర్ కాలేజ్ ఆఫ్ మెడిసిన్, హూస్టన్, టెక్సాస్ - అమెరికా)*

'.......... ఈ ప్రవచనాలు అప్పటి శాస్త్రజ్ఞానాల ఆధారంగా చెప్పబడినవి కావు............ ఈవిధంగా ఇస్లాంకు మరియు జన్యుశాస్త్రానికి ఎలాంటి విభేదాలు లేవు. నిజం చెప్పాలంటే, ఇస్లాం శాస్త్రజ్ఞానాన్ని మరింత ముందుకు తీసుకుపోగలదు....... శతాబ్దాల తరువాత నిరూపితమయిన ఎన్నో ప్రకటనలు మనకు ఖురాను గ్రంథంలో కానవస్తాయి. దీని ఆధారంగా ఈ జ్ఞానం దేవుని నుంచి వచ్చిందనటంలో సందేహం లేదు.'[6]

## గెరాల్డ్ సి. గోరింగర్

*(ప్రొఫెసర్ మరియు సమన్వయకర్త - పిండ పరిణామ, కణజీవ శాస్త్ర విభాగం - స్కూల్ ఆఫ్ మెడిసిన్, జార్జిటౌన్ యూనివర్సిటీ, వాషింగ్టన్ డి.సి., అమెరికా)*

'కొన్ని వచనాలలోనే - మానవు శిశు ఎదుగుదల గురించి (పిండ ఆవిర్భావం నుంచి, అవయవాల పరిణామం వరకూ) వివరించబడింది. ఇలాంటి సంపూర్ణమయిన వివరణ - దశల, ఆకృతుల వర్ణన అంతకుముందు ఎన్నడూలేదు. మరియు శాస్త్ర పరిజ్ఞానం ఆధారంగా రూపొందింపబడిన వివరణ కన్నా ఇది కొన్ని శతాబ్దాలకు ముందు అవతరించింది.''[7]

## సియావెద

*(ప్రొఫెసర్ - సముద్ర - భూ విజ్ఞాన శాస్త్రం - జపాన్)*

ఖగోళ రహస్యాల గురించి ఈ మధ్యనే శాస్త్రజ్ఞుల ద్వారా నిరూపితమయిన సమాచారం ఖురాన్ మరియు ప్రవక్త ప్రవచనాలలో ఉంది. దీని గురించి మీ అభిప్రాయం ఏమిటి? అన్న ప్రశ్నకు ఈయన ఇలా జవాబిచ్చారు.

'ఇది నాకో పెద్ద నమ్మలేని రహస్యంలా కనిపిస్తోంది. మీరిచ్చిన సమాచారం నిజమైతే ఈ పుస్తకం నిజంగానే ఒక అద్భుతమయిన పుస్తకం అని నేనొప్పుకుంటాను.'[8]

## అల్‌ఫ్రెడ్ క్రోనర్

(ప్రొఫెసర్ - భూ విజ్ఞాన శాస్త్ర విభాగం, యూనివర్సిటీ ఆఫ్ మాయింజ్, జర్మనీ)

"ముహమ్మద్ గారి పుట్టుపూర్వోత్తరాలను సమీక్షిస్తే...... విశ్వం యొక్క ఆవిర్భావమూలం లాంటి విషయాలు ఆయనకు స్వతహాగా తెలవడమన్నది అసాధ్యం. ఎందుకంటే శాస్త్రజ్ఞులు - అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానం సహాయంతో, గత కొన్ని సంవత్సరాల క్రితమే ఈ విషయాన్ని కనుగొన్నారు.

1400 సంవత్సరాలకు పూర్వం, అణు-భౌతిక శాస్త్ర అవగాహన ఏమాత్రం లేకుండా - భూమ్యాకాశాలు ఒకే ఆవిర్భావ మూలాన్ని కలిగి ఉన్నాయని స్వతహాగా తెలుసుకోగలగడం అసంభవం. ఈ విషయ సమాచారాన్నంతటినీ సమీకరిస్తే - ఇవన్నీ ఇప్పటి శాస్త్రజ్ఞానం ఆధారంగా నిరూపింపబడిన నిజాలనీ మరియు ఖురాను గ్రంథం సామాన్య మానవుడికి ఒక సులభకరమయిన శాస్త్రగ్రంథం అని మనకు అర్థం అవుతుంది. అప్పుడు పొందుపరచబడిన సమాచారం అప్పటికాలంలో నిరూపించలేనిది. ఇప్పటి శాస్త్రీయ జ్ఞానం ఆధారంగా మనం ముహమ్మద్ 1400 సం॥ల క్రితం చేసిన ప్రకటనలు నిరూపించే స్థితిలో ఉన్నాము."[9]

## యుషిద్ కుసున్

(నిర్దేశకులు - టోక్యో అబ్సర్వేటరీ, టోక్యో, జపాన్)

ఖురాను గ్రంథంలోని విశ్వావిర్భావం మరియూ భూమ్యాకాశాల సంబంధాన్ని వివరించే పలు శ్లోకాలు ఆయన పరిశీలనకు ఇవ్వబడ్డాయి. అప్పుడాయన ఆశ్చర్యచకితులై, ఇలా అన్నారు:

"ఖురాన్ విశ్వాన్ని అత్యంత దూరమయిన పరిశీలనా ప్రదేశం నుంచి చూసినట్లు వర్ణిస్తుంది. ఖురాను గ్రంథంలో ఉన్న ఖగోళ నిజాలను చూసి నేనెంతో ఆశ్చర్యపోయాను. ఆధునిక ఖగోళ శాస్త్రజ్ఞులుగా మనం బహుకొద్ది విశ్వాన్ని మాత్రమే తిలకించాం మరియు అన్వేషిస్తున్నాం. ఎందుకంటే, మన టెలీస్కోపుల ద్వారా మనం చూడగలిగింది అంతే. అందుకని ఖురాను గ్రంథంలోని సమాచారం భవిష్యత్తులో జరిగే పరిశోధనలలో ఎంతగానో ఉపయోగపడుతుందని నేను భావిస్తున్నాను" [10]

## ఆమ్‌స్ట్రాంగ్

(ఈయన నాసా (NASA) సంస్థతో పనిచేస్తున్నారు. మరియు ప్రొఫెసర్ - ఖగోళశాస్త్ర విభాగం, యూనివర్సిటీ ఆఫ్ కన్సస్, లారెన్స్, అమెరికా)

ప్రశ్న: "అత్యాధునిక పరిజ్ఞానంతో రూపొందింపబడిన రాకెట్లు, శాటిలైట్ల ఆధారంగా మీరు ఖగోళశాస్త్రాన్ని తిలకించారు. ఖురాను గ్రంథంలో కూడా ఖగోళశాస్త్ర పరిజ్ఞానం ఇమిడి ఉంది. ఈ రెండింటికీ గల సంబంధం విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?".

జవాబు: "1400 సంవత్సరాలకు పూర్వం పరిస్థితి ఎలా ఉంది అనేది నేను ఊహించలేను. కానీ, అప్పుడు ఇవ్వబడిన వివరణలు - ఇప్పటి ఖగోళ శాస్త్ర జ్ఞానంతో ఏకీభవించడం ఆశ్చర్యకరం.

ఇది ఎంతో అసాధారణమయిన విషయం. దీనికి శాస్త్రీయ వివరణ ఉందో లేదో తెలియదుగానీ, ఖురానులోని ఈ వర్ణనల వెనుక మానవాతీత శక్తి ప్రమేయం ఉందనేది సంభవం". [11]

## విలియం హే

(ప్రొఫెసర్ - సముద్ర గర్భ పరిశోధనా శాస్త్ర విభాగం, యూనివర్సిటీ ఆఫ్ కొలరాడో, బౌల్డర్, కొలరాడో, అమెరికా)

ఖురాను గ్రంథంలోని - సముద్ర ఉపరితల, ఎగువ-దిగువ జలపాతాల మధ్య ఉండే విభజన రేఖ, సముద్ర భూ ఉపరితల మరియు సముద్ర గర్భ సమాచారం గురించి ఈయన ఇలా అన్నారు:

"దివ్య ఖురాను అనబడే పురాతన గ్రంథంలో ఇలాంటి సమాచారం ఉండటమనేది నన్నెంతో ఆశ్చర్య పరచిన విషయం. అది ఎక్కడి నుండి వచ్చిందో తెలుసుకొనే అవకాశం నాకు లేదు. ఎన్నో వచనాలలో నిక్షిప్తమై ఉన్న ఇలాంటి సమాచారాన్ని నేను అన్వేషిస్తున్నాను"

ఖురాను గ్రంథమూలం ఏమై ఉంటుందన్న ప్రశ్నకు ఆయన ఇలా బదులిచ్చారు:

"ఇది ఖచ్చితంగా దైవం తరపు నుంచి వచ్చిందని నేననుకొంటున్నాను"[12]

## దుర్గారావ్

(ప్రొఫెసర్ - సముద్రగర్భ జంతు శాస్త్రము, అధ్యాపకులు - కింగ్ అబ్దుల్ అజీజ్ యూనివర్సిటీ, జెద్దా - సౌదీ అరేబియా)

ఆయనకు సంబంధించిన శాస్త్రరంగానికి సంబంధించిన శ్లోకాలను పరిశీలించిన ఆయనను ఇలా అడగడం జరిగింది - "ఖురాను గ్రంథంలోని శాస్త్రసమాచారం గురించి మీ అభిప్రాయం ఏమిటి? 14 శతాబ్దాల క్రితమే ముహమ్మద్ (సఅస) గారికి ఈ విషయ పరిజ్ఞానం ఎలా వచ్చి ఉంటుంది?" ఆయన ఇలా బదులిచ్చారు:

"1400 సం॥ల క్రితం ఇలాంటి జ్ఞాన సమాచారం అందుబాటులో ఉందని ఊహించడం కష్టం. కొన్ని విషయాల గురించి వారికి సరళమయిన జ్ఞానం అయితే ఉండి ఉండవచ్చు. కానీ వాటిని గురించి ఇంత వివరంగా వర్ణించడం చాలా కష్టం. ఒక సాధారణ మానవుడెవ్వడూ ఈ అంశాల గురించి ఇంత వివరంగా వర్ణించలేడు. అందుకని ఈ సమాచారం దైవ సంబంధ మూలమైనదని నేను భావిస్తున్నాను" [13]

## తేజత్ తెజసన్

(అధ్యక్షులు - శరీర నిర్మాణ శాస్త్ర విభాగం, విశ్వవిద్యాలయ ఉపశాఖాధ్యక్షులు - వైద్యవిభాగం, యూనివర్సిటీ ఆఫ్ ఛియాంగ్ మాయి, థాయిలాండ్)

ప్రొఫెసర్ తెజసన్ ఖురాను మరియు పిండపరిణామం మీద వ్రాయబడిన పరిశోధనా ఫలితాల వ్యాసాలను పరిశీలించారు. ముస్లిములు, ముస్లిమేతర మేధావులతో నాలుగు రోజులు - ఖురాను మరియూ ప్రవక్త సాంప్రదాయాలలో శాస్త్రీయ సమాచారం గురించిన సభలలో పాల్గొన్నారు. రియాద్‌లో జరిగిన 8వ సౌదీ మెడికల్ కాన్ఫరెన్స్‌లో ఆయన నిలబడి, ఇలా అన్నారు:

"గత మూడు సంవత్సరాలుగా నేను ఖురాను గ్రంథంపట్ల ఆకర్షితుడనైనాను. నా పరిశోధనల మరియు ఈ సభలో నేను పొందిన జ్ఞానం ద్వారా నేను నమ్ముతున్నదేమంటే - 14 శతాబ్దాలక్రితం ఖురాను గ్రంథంలో పొందుపరచబడిన సమాచారం అంతా సరిఅయినదే, ఇది శాస్త్రీయ పరిజ్ఞానం ఆధారంగా నిరూపించగలిగే సమాచారం.

ముహమ్మద్ ప్రవక్తకు వ్రాయడంగాని, చదవడంగాని రాదు. కనుక ఆయన ఈ పరిజ్ఞానాన్ని సృష్టికర్త ద్వారా పొంది, మనకు తెలియజేశారు. ఆ సృష్టికర్తే - దేవుడు లేక అల్లాహ్.

**'అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యదైవం లేడు, ముహమ్మద్ ఆయన ప్రవక్త' అని ఋజువివ్వడానికి - ఇది సుసందర్భమని నేను భావిస్తున్నాను.**

ఈ సభకు రావడం ద్వారా నాకు లభించిన అమూల్యమైన అనుభవాలు - అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్య దైవం లేడని తెలుసుకోవడం మరియూ ముస్లిముగా మారడం".[14]

## డాక్టర్ మారిస్ బుకాలి

(ఈయన 1920వ సం॥లో జన్మించారు. యూనివర్సిటీ ఆఫ్ పారిస్‌లోని శస్త్ర చికిత్స శాఖాధిపతి)

ఈయన దివ్యగ్రంథాలలోని బోధనలు మరియు ఆధునిక లౌకిక జ్ఞానానికి మధ్యగల పొంతనను తెలుసుకోవడానికి పరిశోధన జరిపారు. పది సం॥లు జరిగిన అన్వేషణ అనంతరం - 1976వ సం॥లో - ఫ్రెంచి అకాడమీ ఆఫ్ మెడిసిన్‌ను సంబోధిస్తూ - ఖురానులో పొందుపరచబడిన పదార్థతత్వ మరియు పునరుత్పత్తి శాస్త్ర సమాచారాన్ని గురించి, డా॥ బుకాలి ఇలా అన్నారు:

"............ఈ శాస్త్రాలను గురించి మన పరిజ్ఞానం ఆధారంగా, ఈ మధ్యకాలంలో నిరూపితమయిన అంశాలు - ఖురాను గ్రంథంలో ఎలా పొందుపరచబడి ఉన్నాయి అనే దానికి వివరణ అసంభవం.

పై వివరణ ప్రకారం, ఖురాను గ్రంథాన్ని ముహమ్మద్ ప్రవక్త రచించారని సూచించేవారిమాట నిలుపుకోశక్యము కానిది. ఒక నిరక్షరాస్యుడైన వ్యక్తి మొత్తం అరబీ సాహిత్య ప్రపంచంలోనే మహాపండితుడు ఎలా కాగలడు? అంతేకాక అతను అప్పటి మానవుల్వెరూ ఎరిగి ఉండని శాస్త్రీయ పరిజ్ఞానానికి సంబంధించిన సత్యాలను ఎలాంటి తప్పులు దొర్లకుండా ఎలాపలుకగలడు?"

మారిస్ బుకాలి గారు ప్రసిద్ధ పుస్తకమయన "బైబిలు, ఖురాన్ మరియూ సైన్స్" (1976) రచయిత. ఆయన ఇతర రచనలు - "మానవుడు ఎలా ఆవిర్భవించాడు?", "మూసా మరియు ఫరో - ఈజిప్టులోని హెబ్రూలు" (1994) మొదలైనవి.

# ఖురాను మరియు శాస్త్రజ్ఞానం

దివ్యఖురాను గ్రంథములో ఆధునిక శాస్త్రజ్ఞాన ఆవిష్కరణలతో ఏకీభవించి, సరితూగలిగే ఎంతో సమాచారం పొందుపరచబడి ఉంది. క్రింద ఇవ్వబడినట్లుగా, ఇది వివిధ శాస్త్రీయ రంగాలలోని అనేక భావనలను వర్ణిస్తుంది.

| శాస్త్రీయ రంగము | వర్ణింపబడిన భావన |
|---|---|
| ఖగోళ శాస్త్రము | విశ్వావిర్భావము.<br>మహా విస్ఫోటనము (ది బిగ్ బాంగ్)<br>పూర్వ వాయువ్య పదార్థం<br>నక్షత్ర వీధుల ఆవిర్భావం<br>భూమి ఆకారం (గుండ్రం)<br>చంద్రుని కాంతి - ప్రతిఫలించిన కాంతి<br>సూర్యుడు పరిభ్రమిస్తాడు<br>సూర్యుడు తుదకు ఆరిపోతాడు<br>నక్షత్ర పదార్థము<br>విశ్వ వ్యాకోచము |
| భౌతిక శాస్త్రము | అణువులను కూడా విభజింపవచ్చు. |
| ద్రవ్య శాస్త్రము | నీటిచక్రము<br>ఆవిరి చక్రము<br>వాయువులచే మేఘాల పరిరూపణ |
| భౌగోళిక శాస్త్రము | పర్వతాలు గుడార కమ్ముల లాంటివి.<br>పర్వతాల స్వభావం |
| సముద్ర శాస్త్రము | తీపి మరియు ఉప్పుజలాల మధ్య విభజన రేఖ<br>సముద్రగర్భం యొక్క అంధకారము. |
| వృక్ష శాస్త్రము | చెట్లలో - ఆడ, మగ<br>పండ్లలో - ఆడ, మగ<br>ప్రతీది జతలలో తయారయింది. |
| జంతు శాస్త్రము | జంతువుల, పక్షుల సామాజిక వ్యవస్థ<br>పక్షుల పయనము<br>తేనెటీగ సామర్థ్యత<br>సాలెపురుగు గూడు<br>చీమల జీవన మరియు సంభాషణ శైలి |

| | |
|---|---|
| వైద్య శాస్త్రము | తేనె యొక్క ఔషధ గుణాలు |
| పదార్థ తత్వ శాస్త్రము | రక్తప్రసరణ మరియు పాలు |
| పిండ శాస్త్రము | వెన్నుముక, పక్కటెముకల మధ్య నుండి వెలువడే ద్రవం<br>వీర్యం<br>ఫలదీకరణ ప్రక్రియ<br>ఆడ, మగ శిశు నిర్ధారణ<br>పిండాన్ని పరిరక్షించే పొరలు<br>పిండ పరిణామ దశలు<br>పాక్షికంగా ఏర్పడు పిండం<br>జ్ఞానేంద్రియవయవాల పరిణామం |
| సాధారణ శాస్త్రము | వేలిముద్రలు<br>చర్మంలోని బాధనాళాలు. |

ఈ అంశానికి సంబంధించి శాస్త్రవేత్తలు మరియు తత్వవేత్తల అనేక పుస్తకాలు, వ్యాసాలు ప్రచురణలో ఉన్నాయి. శాస్త్రీయ పరిజ్ఞానానికి సంబంధించిన వచనాలను, వాటి వివరణలను ఇక్కడ పొందుపరచటం సాధ్యంకాదు. నమ్మేవారికి శాస్త్రజ్ఞుల వాంగ్మూలాలే ఒక పెద్ద సంకేతం లాంటివి. మీకు ఈ అంశం మీద ఆసక్తి ఉంటే - 'అనుబంధం-**B** - అదనపు సమాచారం' లో ఇవ్వబడిన వెబ్‌సైట్లను చూడండి. ఈ అంశానికి సంబంధించిన ఉచిత పుస్తకాలు, వ్యాసాలను అక్కడ చదువగలరు.

**ఒక పిచ్చి మనిషి ఇలాంటి గ్రంథాన్ని వ్రాయగలడా?**

ఇప్పుడు, ముహమ్మద్ (సఅస) ఏదైనా మానసిక రోగగ్రస్తులై ఉండవచ్చని అభిప్రాయపడిన శాస్త్రజ్ఞుల విషయానికొద్దాము. ఇప్పటి నాస్తిక - శాస్త్రజ్ఞులే కాదు, ప్రవక్త కాలంనాటి అజ్ఞానులయిన అరబ్బులు కూడా ఆయనపై ఈ అభాండం వేశారు. అల్లాహ్ దివ్య ఖురానులో ఇలా అంటున్నాడు:

"ఈ ప్రజలు ఇలా అంటారు: ఈ జ్ఞాపిక అవతరించిన మనిషీ! నీవు నిజంగానే పిచ్చివాడవు..." *(15:6)*

ఈ పిచ్చి ఫలితం ఖురాను గ్రంథం కాకుండా వేరే ఏదైనా అయిఉంటే, వారు చెప్పిన మాటలకు కొంతైనా విలువ ఉండేది. కానీ, ఇక్కడ సవాలు ఏమిటంటే: ఒక పిచ్చిమనిషి ఇలాంటి మహత్తరమయిన గ్రంథరచన చేయగలడా? 1400 సం॥ల నిశిత పరిశీలన, పరీక్షల ద్వారా కూడా ఒక్క వైరుధ్యదోషంగానీ, వ్యాకరణదోషంకానీ ఋజువు కాలేదు మరియు దీనికి సరితూగగల అనుకరణ ఏదీ ఉనికిలోకి రాలేదు.

ఒక పిచ్చివాడు పొరపాటున వ్రాసిన గ్రంథరాజం - ఈ ప్రపంచం వీక్షించిన అత్యంత శక్తివంతమయిన సామ్రాజ్యాల ఆవిర్భావానికి, వివిధ జాతుల, ప్రాంతాల, భాషల ప్రజల సమైక్యతకు, పరిపూర్ణమయిన - ప్రభుత్వ, ఆర్థిక, సామాజిక, మానవ హక్కుల వ్యవస్థల రూపణకు, తద్వారా ఇప్పుడు మనం అనుభవిస్తున్న ప్రజాస్వామ్య వ్యవస్థ ఆవిర్భావానికీ దారితీయగలుగుతుందా?

ఖురాను గ్రంథాన్ని పిచ్చిదనం యొక్క ఫలితం అనడం - కీబోర్డుపై కోతులు చేసిన కుప్పిగంతుల ఫలితంగా ఒక సంపూర్ణమయిన నిఘంటువు ఏదైనా తయారయిందనటం లాంటిది. ఖురాను గ్రంథం స్వయానా ఇలాంటి అభాండాలను సవాలు చేస్తుంది. అల్లాహ్ ఖురాను గ్రంథంలో ఇలా అంటున్నాడు:

"మేము మా దాసునిపై అవతరింపజేసిన గ్రంథం గురించి, అది మా గ్రంథం అవునో కాదో అని మీకు సందేహం ఉన్నట్లయితే దానివంటి ఒక సూరా (వచనం) నైనా మీరు రచించి తీసుకురండి. మీ సహచరులందరినీ పిలుచుకోండి. ఒక్క అల్లాహ్ తప్ప మరెవరి సహాయాన్నయినా పొందండి. మీరు సత్యవంతులే అయితే ఈ పనిచేసి చూపించండి. కానీ మీరు అలా చెయ్యకపోతే - నిశ్చయంగా ఎన్నటికీ చెయ్యలేరు - భయపడండి, మానవులు, రాళ్ళు ఇంధనం కాగల ఆ అగ్నికి. అది సత్య తిరస్కారుల కొరకు తయారు చెయ్యబడింది."

*(2:23-24).*

## మార్మికవాదులు మరియు దైవప్రవక్తలు

మార్మికవాదులు ప్రచారంచేసిన దైవ అస్తిత్వాన్ని మీ ముందుంచి, అది ప్రవక్తల సందేశానికి ఎంత సత్యదూరమో వివరించడమే ఈ పుస్తకం యొక్క ముఖ్య ఉద్దేశ్యం. తద్వారా దేవుని యొక్క నిజ అస్తిత్వం మీ ముందుకు వస్తుంది. ఇస్లాం గురించి మొత్తం వివరణ ఇవ్వడం ఇక్కడ సాధ్యపడదు, ఇది ఇస్లాం అనే దైవప్రేరిత జీవన వ్యవస్థకు ఒక చిరు-పరిచయం మాత్రమే. అందుకని మనం ఇతర అంశాల విశ్లేషణ చేయకుండా, కేవలం దైవ అస్తిత్వానికి సంబంధించిన విశ్లేషణ మాత్రమే చేస్తున్నాం. ముహమ్మద్ (సఅస) గారి సందేశాన్ని ఇంకొకసారి పరిశీలిద్దాం:

**షహాదత్ - మొదటి స్థంబము (లేక పునాది)**

దైవనమ్మకమనే కట్టడానికి పునాది వంటిది - ఒకే దేవునిలో విశ్వాసాన్ని ప్రకటించడం. ఈ విశ్వాస వ్యక్తీకరణను షహాదత్ అంటారు. ఇది మనస్ఫూర్తిగా ఇలా అనడం మరియు నమ్మడం ద్వారా సాధ్యం అవుతుంది - "అల్లా తప్ప వేరే ఆరాధ్య దైవం లేడు, మరియు ముహమ్మద్ ఆయన ప్రవక్త". ఇది ముస్లిములు అనుదినం పలుసార్లు ఉచ్ఛరించే మంత్రం. దీనినే 'కలిమ' అని కూడా అంటారు.

ఒక చాలా ముఖ్యమయిన పరిశీలన ఇక్కడ చేయబడుతుంది - అరబ్బీ భాషలో 'కలిమ' యొక్క మొదటి భాగం : 'లా ఇలాహ ఇల్ల - అల్లాహ్'

**లా = లేడు**

**ఇలాహ = ఆరాధ్యుడు**

**ఇల్ల = తప్ప**

**అల్లాహ్(అల్-ఇలాహ్) = అల్లాహ్ (దేవుడు, పూజకు అర్హ మయినవాడు)**

మీరు గుర్తిస్తే, ఇక్కడ దేవుడు ఒక నెగిటివ్ విధానాన్ని అవలంబించాడు.

'మీ ఆరాధ్య దైవం ఒక్కడే' అని అనబడలేదు. అలా అని ఉంటే అది పాసిటివ్ విధానం అయి ఉండేది.

**'లేడు ఏ ఆరాధ్య దేవుడు, ఒక్క అల్లాహ్ తప్ప'** అనబడింది. ఇక్కడ ఉద్దేశ్యం ఏమిటంటే -

సకల చరాచరాల సృష్టికర్త, భూమ్యాకాశాల ప్రభువయిన అల్లాహ్‌ను సేవించేముందు, మానవుడు ప్రతీ ఇతర దైవాన్ని - పూజింపబడే వస్తువులు, వ్యక్తులనూ కాదనాలి. ఆతరువాతే ఆయనను పూజించాలి.

దేవుడు ఇలా ఎందుకు దైవసమానంగా పరిగణింపబడే ప్రతీవస్తువునూ, వ్యక్తిత్వాన్ని కాదనమంటున్నాడో ఒక్కసారి ఆలోచించండి:

ఇస్లాం పునఃస్థాపించబడటానికి ముందు, అరేబియా ప్రజలు - 'ఒకే ఒక దైవం ఉన్నాడు' అని విశ్వసిస్తూనే, తాము ఏర్పరచుకున్న ఇష్టదైవాలు, ప్రతిమలు, వ్యక్తిత్వ ఆరాధనలు - ఆ దైవాన్ని చేరే మార్గాలని భ్రమించేవారు. ఇది హిందువులు చేస్తున్న దానికి సరిసమానం. ముహమ్మద్ ప్రవక్త కాలానికి ముందు - భారతీయులు, అరబ్బులు ఒకే మత సిద్ధాంతాలు కలిగి ఉండేవారనేది చరిత్ర చదివినవారికి కానవచ్చే సత్యం. ఇలాంటి ఆరాధన సరిఅయినదీ, దైవానికి ఆమోద యోగ్యమయినదీ అయి ఉంటే, దైవం తన ప్రవక్త ద్వారా - తన ఏకత్వ అస్తిత్వ సందేశం మరియు తననే పూజించవలసిన ఆవశ్యకతలను గురించి మనకు తెలియజేసి ఉండేవాడు కాదు. కాస్త ఆలోచించండి.

ఇక, కలిమా రెండవ భాగం - 'ముహమ్మదన్ రసూలుల్లాహ్' అంటే 'ముహమ్మద్ (సఅస) దైవ సందేశహరుడు లేక దైవప్రవక్త'. ఇది ఒక దైవప్రవక్తగా ముహమ్మద్ (సఅస) గారి స్థానాన్ని, అస్తిత్వాన్ని పదే పదే గుర్తుచేసేందుకు. లేకపోతే ఆయన మహావ్యక్తిత్వానికి ప్రజలు ఆయననూ దేవునిగా చేసి తీరేవారే!

ఇప్పుడు మనం సూఫీలు (ముస్లింలుగా పిలుచుకోబడే - మార్మికవాదులు) ఇస్లాం యొక్క అత్యంత ముఖ్యమయిన ఈ పునాదిని ఎలా వక్రీకరిస్తారో చూద్దాం:

**వాళ్ళు 'లా ఇలాహ ఇల్లల్లాహ్' కు ఇచ్చే అర్థం 'అల్లా ఒక్కడే నిజం'.**

ఇదీ వారి వక్రీకరణకు తార్కాణం. ఇది వారి మార్మిక అనుభవాల ఆధారంగా వెలువడిన - 'అంతా దేవుడే మరియూ దేవుడి అస్తిత్వమే పరమ అస్తిత్వం, మిగిలినదంతా మాయ' అనే తత్వాన్ని సమర్థించుకోడానికి చేయబడిన వక్రీకరణ.

ముహమ్మద్ (సఅస) ప్రవక్త మరియు మార్మికవాదుల సందేశాల మధ్య ఎంత తేడా ఉందో గమనించండి. ఇది ఒక చిరు ఉదాహరణ మాత్రమే అయినా ఎంతో ముఖ్యమయినది. మార్మికవాదుల భక్తులయినవారు మార్మిక వాదుల సిద్ధాంతత్వ గ్రంథాలు (ఉదాహరణకు: మెహర్‌బాబాగారి 'గాడ్ స్పీక్స్') మరియు ఖురాన్‌లను స్వయంగా చదివి పరిశీలన చేసుకోవాలి. అప్పుడు ఆ తేడా వారికి స్వయంగా అర్థం అవుతుంది. 'ముహమ్మద్ తదుపరి అవతారంగా', 'ప్రాచీనుడైనవాడిగా', 'అన్ని మతాలూ తనలో ఉన్నవాడిగా' మార్మికవాదులు చేసుకున్న ప్రకటనలలోని అసత్యం అవగతమవుతుంది. తద్వారా, ఇవి మార్మిక వాదులు - ప్రజలను దైవ ప్రవక్తల సందేశాన్ని పరిశీలించకుండా నిరోధించడానికి చేసే ప్రయత్నాలలోని భాగం మాత్రమే అనేది తేటతెల్లం అవుతుంది.

**ఇలాంటి వారి గురించి దైవం స్వయంగా హెచ్చరిస్తున్నాడు :**

"జ్ఞానం లేకుండా ప్రజలను పెడమార్గం పట్టించే నిమిత్తం అబద్ధాన్ని కల్పించి, దానిని అల్లాహ్‌కు ఆపాదించే వ్యక్తి కంటే మించిన దుర్మార్గుడెవడు? నిశ్చయంగా అల్లాహ్ అటువంటి వారికి ఋజుమార్గం చూపడు" (6:144)

**దేవుడు మనలను ముహమ్మద్ (సఅస)ను మాత్రమే అనుసరించమని ఆదేశిస్తున్నాడు :**

"ప్రవక్తా! నీవు ప్రజలకు ఇలా చెప్పు: 'మీకు నిజంగానే అల్లాహ్ పట్ల ప్రేమ ఉంటే నన్ను అనుసరించండి. అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు. మీ పాపాలను మన్నిస్తాడు'." *(3:31)*

ఈవిధంగా దైవప్రేమ అనేది - పరలోకంలో సాఫల్యం కాంక్షిస్తూ మరియూ దైవశిక్షకు భయపడుతూ, దైవప్రవక్త సందేశాలను ఆచరించడంలోనే ఉంది.

**ముహమ్మద్ (సఅస) ఇతరులను అనుసరించవద్దని హెచ్చరించారు:**

ముహమ్మద్ ప్రవక్త నేలపై తనచేతితో ఒక సరళరేఖను గీసి చూపిస్తూ ఇలా అన్నారు:

"ఇది అల్లాహ్ యొక్క ఋజుమార్గము". తరువాత ఆయన ఆ సరళరేఖకు ఇరువైపులా చిన్న చిన్న రేఖలను గీసి, ఇలా అన్నారు: "ఈ ప్రతీ చిన్న రేఖపై, ఒక షైతాను ప్రజలను తనవైపుకు ఆహ్వానిస్తున్నాడు". తదనంతరం ఆయన ఖురానులోని ఈ వచనాన్ని పఠించారు:

".............నా ఋజుమార్గం ఇదే. కనుక మీరు దీనిపైనే నడవండి. వేరే మార్గాలపై నడవకండి. ఎందుకంటే అవి మిమ్మల్ని ఆయన మార్గం నుండి తొలగించి విచ్ఛిన్న పరుస్తాయి....... " *(6:153)*

ఇంకా ఆయన ఇలా అన్నారు: "మీలో కొంతమంది, చాలా వైవిధ్య పద్ధతులను చూస్తారు (దేవుని ప్రజలు కొలిచే విషయంలో). నా సాంప్రదాయాన్ని వీడకండి. సన్మార్గులయిన నా అనుచరులు, నా సాంప్రదాయన్ని ఎలా పాటించారో అలా పాటించండి, దీనిని గట్టిగా పట్టుకోండి. ధర్మం విషయంలో కల్పనల గురించి జాగ్రత్తగా ఉండండి. ప్రతీకల్పనా - ఒక వక్రమార్గానికి దారితీస్తుంది, ప్రతీ వక్రమార్గం నరకానికి దారితీస్తుంది."

*(మూలం: అబూ దావూద్ మరియు అన్నిసాయి)*

**"ఎవరు తమ ప్రభువు వాక్యాలను విశ్వసిస్తారో, ఎవరు తమ ప్రభువునకు ఇతరులను భాగస్వాములుగా చేయరో, ఎవరు తాము ఇవ్వగలిగినది ఇస్తుంటారో, కానీ వారి హృదయాలు తమ ప్రభువు వైపునకే మరలిపోవలసి ఉన్నదనే భావన వలన వణుకుతూ ఉంటాయో వారే మేళ్ళ వైపునకు పరుగులు తీస్తారు. పోటీపడి వాటిని పొందుతారు."**

*(23:57-61)*

# ఒక్కసారి ఆలోచించండి !

**"ఓ మానవుడా! పరమదాత అయిన నీ ప్రభువును గురించి ఏ విషయం నిన్ను మోసంలో పడవేసింది?"**

**(దివ్య ఖురాను, 82:6)**

మార్మికవాదము ఒక ఏకైక సిద్ధాంత తత్వమని, అది దైవప్రవక్తల సందేశానికి విరుద్ధమయిన సాంప్రదాయమని తేటతెల్లం చేసే ఎన్నో నిరూపణలు ఈ పుస్తక రూపంలో మీ ముందు ఉంచబడ్డాయి. మార్మికవాద సిద్ధాంతాలు మరియు మార్మికవాదులు చేసే ప్రచారాలు దైవప్రవక్తల సందేశానికి సరాసరి వ్యతిరేకమని కూడా ఈ వివరణల ద్వారా వెల్లడయింది. దైవప్రవక్తలు మార్మికవాదులు కారనీ, మార్మికవాదులు తాము దేవుళ్ళమని చేసే ప్రకటనలు వారి సొంత వివరణల పరిశీలన ఆధారంగానూ అసత్యాలనీ వెల్లడయింది.

**మార్మిక అనుభవాలు:-** వీటిద్వారా, మార్మికవాదులు దైవానుభవాన్ని పొందామనీ, దైవలీనత్వం చెందామనీ, తద్వారా దేవునితో సమానమయ్యామని వివరిస్తున్నారు. ఈ మార్మిక అనుభవాలు ధ్యానసాధనల వలన మెదడులో జరిగే పరిణామాల వలన ఉద్భవించిన అనుభూతులే తప్ప దేవునితో ఎలాంటి సంబంధం లేనివని - శాస్త్ర, హేతువాద మరియు మతపరమయిన జ్ఞానాల ఆధారంగా సవివరంగా చూపించటమైనది.

ఈ అనుభవాల ఆధారంగా మార్మికవాదులు దేవుడిని - ఒక స్వచ్ఛమైన, అనంతమైన చైతన్యంగా ప్రచారం చేస్తున్నారనేది కూడా వెల్లడయింది.

**మార్మికవాద సిద్ధాంతాలు:-** ఏవిధంగా ఈ మార్మిక అనుభవాలు - మార్మిక వాద సిద్ధాంతాలకు దారితీస్తాయో అనేది సవివరంగా వర్ణించడమైనది. మార్మికవాద సిద్ధాంతాలు మనసృష్టికి సంబంధించిన మౌలిక భావనలు కూడా వివరించలేవనేది వెల్లడయింది.

**మార్మికవాదుల అస్తిత్వ వక్రీకరణ:-** మార్మిక అనుభవాలు, మార్మికవాదాల యొక్క అవగాహనాలేమి మరియు భక్తి సంబంధ విషయాలలో గ్రుడ్డిగా నమ్మేతత్వం జతకలసి - ఏవిధంగా తమకు తాము ఏర్పరచుకున్న మార్మికవాదుల అస్తిత్వ వక్రీకరణను మరింత ముందుకు తీసుకువెళ్ళి, వాళ్లను మందిరాలలో, ఇళ్ళలో నిత్య పూజా కార్యక్రమాలతో ఆరాధింపబడే దైవాలుగా నిలబెడతాయో చూడడమైనది.

దేవుని అస్తిత్వాన్ని మరుగున తోయడం, దాన్ని వక్రీకరించటం, ఆది నుండి మానవులుగా మనం చేస్తున్న ఘోరనిర్వాకం. రాళ్ళు రప్పల నుంచి మనుషులదాకా ప్రతీ దానితో ఆయనను మనం సమానంగా నిలపటమో, వాటిద్వారా ఆయనను పూజిస్తున్నామనే అజ్ఞానంలో కొట్టుమిట్టాడుకోవడమో ఆది నుండీ జరుగుతున్న తంతే. మార్మికవాదులు ఆయనను 'చైతన్యం'తో సమానం చేశారు మరియు తమను తాము దేవుళ్లుగా ప్రకటించుకున్నారు.

**"ఆయనను పోలినది సృష్టిలో మరేదీ లేదు." (దివ్య ఖురాన్ 42:11)**

మనం అత్యంత సరళమయిన ఈ దైవసందేశాన్ని అర్థం చేసుకోలేమా? ఆయనకై అన్వేషణను త్యజించి, ఆయనకు రూపంగానీ, సహవర్తులు (మార్మికవాదులే కాదు, ఎవరైనా సరే) జత చేయకుండా, ఆయన తన ప్రవక్తల ద్వారా తెలిపినటువంటి విధానంలో ఆరాధించలేమా?

# ఆత్మద్రోహులం కాకూడదు

**"మీకు తెలియని (జ్ఞానంలేని) విషయం వెంటపడకండి. (మీ ప్రభువు సమక్షంలో) నిశ్చయంగా - కళ్ళూ, చెవులూ, మనస్సూ అన్నింటి విషయంలోనూ విచారణ జరుగుతుంది."** *(17:36)*

దైవ అస్తిత్వాన్ని గుర్తించే విషయంలో గ్రుడ్డిగా ఇతరులను అనుసరించకుండా, దేవుడు ప్రసాదించిన అవయవాలతో పరికించి, పరీక్షించి, హేతువాదజ్ఞానాన్ని ఉపయోగించమని దైవం ప్రభోదిస్తున్నాడు.

సాయిబాబాగారు మానవ మరియు మతాల సమానతకు చిహ్నంగా (అందరి దేవుడూ ఒక్కడే, అందరం సమానులే అంటూ) నిలిచారు. ఆయన జీవితాంతం భిక్షాటన చేస్తూ, రుచికి ప్రాముఖ్యత ఇవ్వకుండా, ఇవ్వబడిందే తింటూ, మిగిలిన భోజన పదార్థాలను ఒక మట్టి గిన్నెలో మసీదు బయట ఉంచేవారు. అది ఆకలిగొన్న కుక్కలు, పిల్లులు, కాకులతో సహా అందరికీ ఉపయోగపడేది. సాయిబాబాగారు - తన భక్తులు, సందర్శకుల నుంచి 'దక్షిణ' రూపంలో డబ్బులు వసూలు చేసేవారు. కానీ దానినంతటినీ అదేరోజున అవసరార్థులకు దానంచేసి, చిల్లిగవ్వకూడా ఉంచుకునేవారు కారు. అందరు మహిళలను తన తల్లులుగా, అక్క, చెల్లెళ్ళుగా భావించేవారు. ఇదేవిధంగా మెహర్‌బాబా గారు కూడా. ఆయన పేదలకు, కుష్టురోగులకు, మానసిక రోగులకు ఎన్నో సేవలనందించారు. వీటన్నింటిద్వారా - వాళ్ళు ఎంతో దయగల వ్యక్తులుగా ఋజువు అవుతుంది. మనం మదర్ తెరిసాను కూడా చూశాం - ఆమె పేదలకు, రోగులకు చేసిన సేవలను గురించి వివరించవలసిన అవసరం లేదు. కానీ వీటివలన ఆమె దైవంతో సమానం కాగలుగుతుందా? ఇదేవిధంగా - మంచి నడత, సేవాభావం, అణకువ - ఏ మానవుడినీ దేవునితో సమానంగా నిలబెట్టడానికి కారణాలు కానేరవు. ఇవి అత్యున్నత మానవ లక్షణాలు, వీటిని మనం సాధ్యమయినంత వరకూ ఆచరించాలే తప్ప, వీటిని - దేవుని అస్తిత్వాన్ని వక్రీకరించడానికీ, నాశనం చేయడానికీ సాధనాలుగా వాడుకోరాదు.

ఈ పుస్తకంలో పొందుపరచబడిన సమాచారం, బాబా భక్తులుగా మీలో కలతను కలిగించి, మిమ్మలను బాధించి ఉండవచ్చు. ఇది మీ బాబాపై మీకున్న భక్తి శ్రద్ధలకూ, అభిమానానికి నిదర్శనం.

బాబా భక్తులుగా మారడానికి అనేక కారణాలు ఉంటాయి. కొంతమంది ఏదైనా బాబా గుడిని దర్శించడం లేదా బాబాను వేడుకోవడం చేసిన తరువాత తమ సమస్యలు తీరడం, జీవితంలో లాభాలను గడించడం చూసి భక్తులుగా మారతారు. మరికొంతమంది తమ తల్లితండ్రుల, కుటుంబ సభ్యుల అడుగుజాడల్లో నడుస్తూ భక్తులుగా మారతారు. కారణం ఏదైనప్పటికీ - ఒక భక్తునిగా లేదా భక్తురాలిగా - మీరు మీ బాబా ఒక మహనీయుడని, మానవ రూపంలో వచ్చిన దేవుడే అని ఖచ్చితమయిన నమ్మకాన్ని, విశ్వాసాన్ని కలిగి ఉంటారు.

ఈ పుస్తకంలో మార్మిక అనుభవాల గురించి పొందుపరచబడిన శాస్త్రీయ విశ్లేషణ, మార్మికవాదుల గురించి ఇవ్వబడిన మతపరమయిన విశ్లేషణ మరియు మార్మికవాదులు నిజదైవాలుగా చూడబడటం వెనుక గల సంఘటనల పరంపరలో బయటపడే మన మూర్ఖత్వం - ఇవన్నీ చూసిన తర్వాత మీరు - ఆశ్చర్యపడటం, బాధపడటం లేదా కోపగించుకోవడం ఏదైనా జరగవచ్చు. ఇది సాధారణ ప్రతిస్పందన మరియు మీలో నిక్షిప్తమై ఉన్న దైవభక్తికి తార్కాణం.

మిత్రులారా! మీ ఈ భక్తి శ్రద్ధలను కించపరిచే ఉద్దేశ్యం నాకు ఏమాత్రం లేదని దయచేసి అర్థం చేసుకోండి. మీ ఈ భక్తిశ్రద్ధలను దేవుని నిజ అస్తిత్వం వైపునకు మరల్చమని మనవి చేసుకోవటమే ఇక్కడి ముఖ్య ఉద్దేశ్యము. మీరు అర్థం చేసుకుంటే, ఇన్ని వివరణల అనంతరం ఆలోచించవలసిన విషయం - బాబాలను గురించి, వారి మార్మిక అనుభవాల గురించి, వారి సిద్ధాంత తత్వాల గురించి కాదు. ఆలోచించవలసింది - మీ గురించి. అవును. మిమ్మల్ని మీరు మోసం చేసుకోకండి. ఇదే ఈ పుస్తకం యొక్క అతి ముఖ్యమైన సందేశం. ఇదెలాగో మీకు వివరిస్తాను.

## భయంకరమైన ఆరోజు నిజమైతే?......

మార్మిక సిద్ధాంతత్వం మనకు ఏమి బోధిస్తుందంటే- ఈ భువిపై మనం సాగిస్తున్న ఈ జీవనం - 'జీవన-మరణ-పునర్జనన' చక్రంలో కేవలం ఒక తంతు మాత్రమే. దైవ ప్రవక్తల సందేశం మనకు బోధిస్తున్న దేమిటంటే- ఈ జీవితం, మనం దేవుని నిజ అస్తిత్వాన్ని గుర్తించి, కేవలం ఆయనను మాత్రమే ఆరాధించడానికి - ఒకే ఒక అమూల్యమయిన అవకాశం.

మార్మిక సిద్ధాంతత్వం మనకు ఏమి బోధిస్తుందంటే- ఈ ప్రపంచంలో జ్ఞానోదయం పొందేవరకు అంటే మన నిజ అస్తిత్వం దేవునితో సమానమని తెలుసుకొనేవరకు మనం ఇక్కడికి అనేక వేల, కోట్ల జన్మల ద్వారా వస్తూనే ఉంటాము. దైవప్రవక్తల సందేశం మనకు విశదపరుస్తున్నదేమంటే- ఈ భూమిపై మనం చేయగల అత్యంత పెద్దదైన పాపం దేవునికి సమానులుగా, సహవర్తులుగా ఇతరులను నిలబెట్టడం. (దీనినే షిర్క్ అంటారు).

మార్మిక సిద్ధాంతత్వం మనకు ఏమి బోధిస్తుందంటే- స్వర్గం, నరకాలు అనేవి లేనేలేవు* (అంతా దేవుడే కదా!) మరియు మనం దేవునిలో అనేకానేక జన్మల అనంతరం చివరకు లీనం అయిపోతాము. దైవప్రవక్తల సందేశం మనకు ఖచ్చితమైన హెచ్చరిక చేస్తున్న దేమంటే- తీర్పుదినం అనేది ఒకటి ఉందని, ఈ షిర్క్ యొక్క ప్రతిఫలం కలకాల నరకవాసమని, దేవుని నిజ అస్తిత్వాన్ని గుర్తించినందుకు ప్రతిఫలం మోక్షం - కలకాల స్వర్గనివాసము అని.

ఒకవేళ మార్మిక సిద్ధాంతత్వమే నిజమైనదనుకున్నా, ఒకే దైవంలో విశ్వాసముంచడం, ఒకే దైవాన్ని ఆరాధించడం ద్వారా మీరు కోల్పోయేదేమీలేదు. మీరే దేవుడనే జ్ఞానోదయం పొందడానికి ఇంకా అనేక అవకాశాలు రానున్నాయి (అనేక జన్మల ద్వారా). కాని ఒకవేళ దైవప్రవక్తల సందేశమే నిజమని మరణం తరువాత మనకు బోధపడితే? మన తప్పుని సరిదిద్దుకొనే అవకాశమే మనకు ఉండబోదు, కలకాల నరకవాసమే మనకు మిగిలేది. 60-70 సంవత్సరాల ఈ చిరు జీవితానికి సంబంధించిన చిన్న,చిన్న విషయాలకు కూడా ఎంతో ప్రాముఖ్యత నిచ్చి, ప్రణాళికలు తయారు చేసుకుంటాం. కాని, మనం- మరణం తరువాత తలెత్తగల విషయాల గురించి గాని, అప్పుడు ఎదురుకోవలసిన పరిస్థితుల గురించి కాని, ఆ పరిస్థితులలో నుంచి క్షేమంగా బయటపడటానికి ఇప్పుడు చేయవలసిన కర్తవ్యాన్ని గురించి కాని - కాస్తంత కూడా ఆలోచించము. కలకాల (శాశ్వత) జీవితం విషయంలో మనకింత తెగింపు సమర్ధనీయమా?కాస్తంత ఆలోచించండి. ఎంతో భయంకరమయిన ఆ రోజు గురించి మనల్ని హెచ్చరించడం జరిగింది:

".......చివరకు చెవులను చెవిటివి చేసే ధ్వని ఉధృతమైనప్పుడు - ఈ రోజున మనిషి తనసోదరునికి, తన తల్లికీ, తన తండ్రికీ, తన భార్యకూ, తన సంతానానికీ దూరంగా పరుగెత్తుతాడు. ఆ రోజున ప్రతీ ఒక్కరికీ తమను గురించి తప్ప ఇతరుల్ని గురించి పట్టించుకోలేని ఆపత్సమయం వస్తుంది" (80:33-37)

"........... ఏరోజున ఆకాశం కరిగిన వెండి మాదిరిగా అయిపోతుందో, కొండలు ఏకిన రంగురంగుల ఉన్నిపింజలు మాదిరిగా అయిపోతాయో, ప్రాణస్నేహితులు ఒకరికొకరు కనిపించినప్పటికీ, ఎవరూ ఎవరిని గురించీ పట్టించుకోవడం జరగదో (ఆరోజున ఆ శిక్ష సంభవిస్తుంది) దోషి ఆనాటి శిక్ష నుండి తప్పించుకోవటానికి తన సంతానాన్ని, తన భార్యనూ, తన సోదరులనూ, తనకు ఆశ్రయమిచ్చిన దగ్గరి బంధువులనూ, భూమండలంలోని వారందరినీ పరిహారంగా ఇచ్చి, ఈ ఉపాయం ద్వారా విముక్తి పొందాలని కోరుకుంటాడు. (కానీ అలా ఎన్నటికీ జరగదు)" *(70:8-14)*

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

\* *మెహర్‌బాబాగారి ప్రకారం - స్వర్గం, నరకం అనేవి - పునర్జన్మించే ముందు, ఆత్మయొక్క సంస్కారాలను (పూర్వజన్మ అనుభవాలను) సమతుల్యం చేసే, కేవలం ఒక తాత్కాలిక అనుభవాల ప్రక్రియ మాత్రమే!*
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ఒకే దేవునిలో విశ్వాసం, ఆయన నిజ అస్తిత్వాన్ని, ఆయనకు సహవర్తులెవ్వరినీ నిలబెట్టకుండా మాత్రమే ఆరాధించడం మరియు ఆయన ఆజ్ఞాపాలన చేయడం మాత్రమే మనకు ప్రళయ దినాన ఉపయోగపడతాయి. నిత్యజీవితంలోని - ప్రాపంచిక వ్యవహారాలలో ఉపయోగించే వివేచనాజ్ఞానం, సత్యాసత్యాల పరిశీలన, హేతువాద ధోరణులను మనం - ఒక మనిషిని (అందునా చనిపోయిన వారిని) దేవునిగా స్వీకరించే విషయంలో పాటించము. ఈ సాధనాలన్నింటినీ మనం అణచివేస్తాం. ఈ అజ్ఞానానికి మనం పశ్చత్తాపపడవలసి వస్తుందేమో?

**తన సమక్షంలో ప్రజలు పడే పశ్చత్తాపాన్ని గురించి ఖురానులో దేవుడు ఇలా వివరిస్తున్నాడు:**

**"...అతను, 'అయ్యో! నా ఈ జీవితం కొరకు నేను ముందుగానే కొంత సామగ్రిని ఏర్పాటు చేసుకొని ఉంటే ఎంత బాగుండేది?' అని అంటాడు."** *(19:24)*

**"....'అయ్యో! నేను నా ప్రభువునకు ఇతరులెవరినీ భాగస్థులుగా చేయకుంటే ఎంత బాగుండేది?' "** *(18:42)*

**"....'అయ్యో! నేను దైవ ప్రవక్తకు తోడుగా ఉంటే ఎంత బాగుండేది! అయ్యో! నాదౌర్భాగ్యం! నేను ఫలానా వ్యక్తితో స్నేహం చేయకుండా ఉంటే ఎంత బాగుండేది? అతడి మాయలోపడి నేను నావద్దకు వచ్చిన హితబోధను స్వీకరించలేదు.' "** *(25:27-28)*

**"....'అయ్యో! ఈ విషయంలో మేము ఎంత పొరపాటు చేశాము!' "** (6:31)

ఇలాంటి పశ్చాత్తాపం పొందగోరని వారు, తక్షణం చేయవలసింది-ఆ నిజదైవం వైపునకు మరలి, ఆయననే ఆరాధించటం.

" అల్లాహ్ తరపునుండి తొలగింపబడే అవకాశం ఏ మాత్రం లేనటువంటి ఆరోజు రాకమునుపే, మీరు మీ ప్రభువు మాటను స్వీకరించండి. ఆరోజున మీకు ఎక్కడా ఆశ్రయం లభించదు, మీ స్థితిని మార్చడానికి ప్రయత్నం చేసేవాడూ ఎవడూ ఉండడు." *(42:47)*

"...కాని (అల్లాహ్ ఏకత్వాన్ని స్పష్టంగా, బహిరంగంగా చాటే ఇన్ని సూచనలు ఉన్నప్పటికీ) కొందరు అల్లాహ్‌ను కాదని ఇతరులను ఆయనకు సమానులుగా, ప్రత్యర్థులుగా భావిస్తారు. వారు అల్లాహ్ పట్లకలిగి ఉండవలసిన ప్రేమతో వారిని ప్రేమిస్తారు- కాని విశ్వాసులు అన్నింటికంటె అధికంగా అల్లాహ్‌నే ప్రేమిస్తారు. సర్వశక్తులూ, సర్వాధికారాలూ అల్లాహ్ గుప్పెట్లో ఉన్నాయనీ, ఇంకా శిక్షించటంలో కూడా ఆయన చాలా కఠినుడు అని ఈ దుర్మార్గులకు, ముమ్ముందు ఘోర శిక్షను ప్రత్యక్షంగా చూసిన తరువాత బోధపడే బదులు, ఇప్పుడే బోధపడితే ఎంత బాగుంటుంది! అల్లాహ్ వారిని శిక్షించే సమయాన వారు ప్రపంచంలో ఏ నాయకుల, ఏ మార్గదర్శకుల అడుగుజాడలలో నడిచేవారో, ఆ నాయకులు, ఆ మార్గదర్శులు, తమ అనుచరులతో ఏ మాత్రం సంబంధం లేని విధంగా ప్రవర్తిస్తారు. కాని వారికి శిక్షమాత్రం తప్పదు. ఇంకా వారి సకల సాధనా సంపత్తుల పరంపర తెగిపోతుంది. అప్పుడు అనుచరులు ఇలా అంటారు: 'మాకు ( ప్రపంచానికి మళ్ళీ తిరిగి పోయే) మరొక అవకాశం లభిస్తే, వారు ఈ రోజు మమ్మల్ని త్యజిస్తున్న విధంగానే మేమూ అప్పుడు వారిని త్యజిస్తాము.' ఈ విధంగా ప్రపంచంలో వారు చేసిన కర్మలను అల్లాహ్ వారి ముందు ఉంచుతాడు. వారు అప్పుడు నిస్పృహతో, తీవ్ర అవమాన భారంతో కృంగి పోతారు. అయినప్పటికీ, నరకాగ్ని నుండి బయటపడటం వారికి సాధ్యపడదు." *(2:165-167)*

ఎందుకంటే, ఈ అవకాశం మళ్ళీరాదు. సత్యపథంలోనే పయనించమని మనకు ముందుగానే హెచ్చరించడం జరిగింది. ఈ హెచ్చరికను అర్థంచేసుకొని, దానిని అనుసరించటానికి మనకు చాలా సమయం ఇవ్వబడింది. కాని ఈ హెచ్చరికను మనం పెడచెవిన పెట్టాం, పరలోకాన్ని పట్టించుకోలేదు (పునర్జన్మల మాయలోపడి). పరలోకంలోకి ప్రవేశించిన తరువాత, ఈ ప్రపంచంలోకి తిరిగి వచ్చి, మన తప్పులను దిద్దుకునే అవకాశం ఇవ్వబడదు. ఖురాను గ్రంథంలో దీని గురించి, అల్లాహ్ అత్యంత స్పష్టంగా హెచ్చరిస్తున్నాడు:

"నరకం గట్టుపై వారిని నిలబెట్టే దృశ్యాన్ని నీవు గనుక చూడగలిగితే ఎంత బాగుంటుంది? అప్పుడు వారు ఇలా అంటారు:'అయ్యో! మేము మళ్ళీ భూలోకానికి తిరిగి పంపబడే, మా ప్రభువు సూచనలు అసత్యాలని తిరస్కరంచకుండా ఉండే, విశ్వాసులలో మేము కలిసి పోయే మార్గం ఏదైనా ఉండే ఎంత బాగుండును?"

*(6:27)*

"వారు ఇలా అంటారు, 'అయ్యో! మేము గనక (ఆనాడు) విని ఉంటే, లేదా గ్రహించి ఉంటే, ఈనాడు ఇలా మండే నరకాగ్ని శిక్షకు గురిఅయినవారిలో చేరి ఉండేవారము కాదు కదా!' " *(67:10)*

"సమీపములోనే ఉన్న శిక్షను గురించి మేము మిమ్మల్ని హెచ్చరించాము. ఆరోజున మనిషి తన చేజేతులా చేసుకొని ముందు పంపుకున్నదంతా ప్రత్యక్షంగా చూస్తాడు. (అప్పుడు) సత్య తిరస్కారి 'అయ్యో! నేను మట్టినై ఉంటే ఎంత బాగుండేది' అని గగ్గోలు పెడతాడు." *(78:40)*

"..........వారు 'ఓ మాలిక్! నీ ప్రభువు మమ్మల్ని అంతం చేస్తే బాగుంటుంది.' అని వేడుకుంటారు. దానికి అతడు, 'మీరు ఇలాగే పడి ఉంటారు. మేము మీ దగ్గరకు సత్యాన్ని తీసుకుని వచ్చాము. **కానీ మీలో చాలామందికి సత్యం అంటేనే గిట్టేది కాదు**' అని సమాధానం చెబుతాడు " *(43:77-78)*

ఎంతో నిజాయితీ పరులుగా కనబడే వ్యక్తులు, స్వాములు - ధార్మిక, ఆధ్యాత్మిక సమావేశాలలో తీయని మాటలు పలుకుతుంటారు. కానీ బాధాకరమయిన విషయం ఏమిటంటే - దేవుని అస్తిత్వ విషయానికి వచ్చేటప్పటికి మాత్రం వారు మనకు ఋజుమార్గాన్ని చూపించలేరు, వారే ఋజుమార్గంలో లేరు కనుక.

అనేక మతాలు, సిద్ధాంతాల వలన దేవుని అస్తిత్వం విషయంలో ఎంతో అయోమయ పరిస్థితి నెలకొని ఉంది. కానీ, వీటన్నింటి మధ్య - దేవుని నిజ అస్తిత్వాన్ని బోధించే మరియు దానిని పెడచెవిన పెట్టడం వలన సంభవించే పరిణామాలను హెచ్చరిస్తున్న ఒక సందేశం ఉంది - ఇది నిజంగా దైవం తరఫునుంచి ఒక గుర్తు. దీనిని మీరు గుర్తిస్తున్నారా? విస్మరిస్తున్నారా? ఎందుకంటే ప్రళయదినాన దేవుడు ఇలా అనవచ్చు:

**"మా ఆయతులు (దృక్పథాలు, వచనాలు), నీవద్దకు వచ్చినప్పుడు నీవు వాటిని విస్మరించావు. అదేవిధంగా ఈనాడు నీవు కూడా విస్మరింపబడుతున్నావు."** ***(20:126)***

**"మీరు ఈనాటి సమావేశాన్ని మరచిపోయిన విధంగానే, మేము కూడా మిమ్మల్ని ఈనాడు మరిచిపోతాము. మీ నివాసం ఇక నరకమే. మీకు సహాయం చేసే వాడెవడూ లేడు."** ***(45:34)***

**"........'వారు తమ ధర్మాన్ని ఒక క్రీడగా, ఒక కాలక్షేపంగా చేసుకున్నారు. ఇంకా వారిని ఇహలోక జీవితం మోసానికి గురిచేసింది'. అల్లాహ్ ఇలా సెలవిస్తాడు: 'వారు ఈనాటి సమావేశాన్ని మరచి ఉండిన విధంగానే, మా ఆయతులను తిరస్కరిస్తూ ఉండిన విధంగానే మేమూ వారిని ఈనాడు మరచిపోతాము' "** ***(7:51)***

"ప్రవక్తా! వారితో ఇలా అను: తాముచేసిన పనుల విషయంలో అందరికంటే ఎక్కువగా విఫలులయ్యేవారు ఎవరో, నష్టపోయే వారెవరో మేము మీకు తెలుపమంటారా? వారెవరంటే, ప్రాపంచిక జీవితంలో వారి ప్రయత్నాలు అన్ని ఋజుమార్గం నుండి వైదొలగి ఉంటాయి. **అయినావారు తాము చేసేదంతా సవ్యంగానే ఉందని భావిస్తారు.** వారు తమ ప్రభువు వాక్యాలను నమ్మకుండా తిరస్కరించినవారు. ఆయన సాన్నిధ్యంలో హాజరు కావలసి ఉన్నదనే విషయాన్ని విశ్వసించనివారు. ఇందువల్ల వారి కర్మలన్నీ వృథా అయిపోయాయి. ప్రళయదినంనాడు మేము వాటికి ఏమాత్రమూ విలువనీయము." *(18:103-105)*

"మీ మీదకు శిక్ష రాకమునుపే, మీకు ఎవరి నుండీ సహాయం లభించని పరిస్థితి ఏర్పడకమునుపే, మీరు మీ ప్రభువు వైపునకు మరలి, ఆయనకు విధేయత చూపండి. మీకు తెలియకుండానే, మీ మీదకు అకస్మత్తుగా శిక్ష రాకముందే, మీ ప్రభువు పంపిన గ్రంథంలోని ఉత్తమమయిన విషయాలను అనుసరించండి." *(39:54-55)*

"ఆ రోజున కొందరి ముఖాలు దేదీప్యమానంగా వెలుగుతూ ఆనందపారవశ్యంతో నవ్వులు చిందిస్తూ ఉంటాయి. కొందరి ముఖాలు ఆరోజున దుమ్మూ ధూళీ కొట్టుకుని ఉంటాయి, వాటిపై నల్లని మసి ఆవరించి మాడిపోయి ఉంటాయి. వీరే సత్యతిరస్కారులు, దుర్మార్గులు." *(80:38-42)*

## మా కర్తవ్యం - మిమ్మల్ని సన్మార్గం వైపునకు ఆహ్వానించటమే

విశ్వాసుల మీద దైవం విధించిన కర్తవ్యం - మానవాళిలో ఎవరైనా సరే, వినిపించుకొనే స్థితిలో ఉన్నవారికి, ముహమ్మద్ (సఅస) యొక్క సందేశాన్ని అందజేయడమే - ఇస్లాం వైపునకు ఆహ్వానించటం. దీనిని నమ్మటం, అంగీకరించటం లేదా త్రోసిపుచ్చటం అనేవి ప్రతీవ్యక్తి యొక్క సొంత నిర్ణయాలు. ప్రతీ మనిషీ తాను చేసుకున్న దానికే బాధ్యుడు. 'స్వ' కర్మలకు జవాబు దైవం వద్ద ఇచ్చుకోవలసి ఉంటుంది.

"ప్రవక్తా! నీ ప్రభువు మార్గం వైపునకు ఆహ్వానించు, వివేకంతో చక్కని హితబోధతో. ప్రజలతో ఉత్తమోత్తమమైన రీతిలో వాదించు. నీ ప్రభువుకే బాగా తెలుసు - ఆయన మార్గం నుండి తప్పిపోయినవాడు ఎవడో, ఋజుమార్గంలో ఉన్నవాడు ఎవడో." *(16:125)*

## మార్మికవాదుల, నాస్తికవాదుల వలలలో పడకండి

*మార్మికవాదులు ఈ సృష్టి ఉనికే మాయ అని, ఉన్నదంతా దేవుడే అని సెలవిస్తూ, తమను తాము దేవుళ్ళుగా ప్రకటించుకొని, దేవుని నిజ అస్తిత్వం నుంచి ప్రజలను దూరం చేశారు. నాస్తికవాదులు దేవుడనే వాడెవడూ లేడంటూ, ఈ సృష్టి ఉనికే పరమ సత్యమని సెలవిస్తూ, దేవుని నిజ అస్తిత్వం నుంచి ప్రజలను దూరం చేశారు. ఈ సత్యాన్ని గ్రహించిన వారు - దైవ ప్రవక్తల సందేశం మాత్రమే దేవుడిని సృష్టికర్తగా గుర్తించి అతని నిజ అస్తిత్వాన్ని ప్రజల ముందు ఉంచుతుందనేది గమనిస్తారు. అంతేకాదు, ఆ సందేశ ఆచరణ ద్వారా మాత్రమే - దేవుని నిజ అస్తిత్వాన్ని మాత్రమే ఆరాధించటం ద్వారా మోక్షాన్ని పొందగలమనీ గుర్తిస్తారు.*

***"తమకు తాము అన్యాయం చేసుకుంటూ ఉండేవారి ప్రాణాలను తీసి, దైవదూతలు వారిని, 'ఇదేమిటీ మీ స్థితి ఇలా ఉంది?' అని అడిగారు. అప్పుడు వారు ఇలా సమాధానం చెప్పారు : 'మేము భూమిపై బలహీనులుగా, నిస్సహాయులముగా ఉండే వారము.' దైవదూతలు 'అల్లాహ్ భూమి విశాలంగా లేదా మీరు వలస పోవటానికి?' అని అడిగారు. వారి నివాసం నరకం. అది మహాచెడ్డ నివాసం." (4:97)***

*ఈ విధంగా సత్య మార్గాన్ని గుర్తించి కూడా, దానిని అనుసరించకుండా కుంటి సాకులు చెప్పేవారిని దైవం వారిస్తున్నాడు. బానిసగా ఉన్నా, అవసరం వస్తే వలస పోయిఅయినా సరే విశ్వాసిగా జీవించమని, లేకుంటే నరకం తప్పదనీ హెచ్చరిస్తున్నాడు. వ్యక్తిగత స్వేచ్ఛ, మత స్వాతంత్రాలతో కూడిన ఆధునిక, లౌకిక సమాజంలో నివసిస్తూ కూడా 'నేనున్న పరిస్థితిలో ఏమీ చేయలేను' అనుకునే వారు పునరాలోచన చేసుకోవాలి.*

## నిజమైన మాయ, జ్ఞానోదయం మరియు మోక్షం

మార్మిక అనుభవమనేది ఒక మాయ, దేవుని నిజ అస్తిత్వం నుండి ప్రజలను దూరంచేసే మార్మికవాద సిద్ధాంతత్వం ఒకమాయ. ప్రతీదీ ప్రసాదించేది - ఎల్లప్పుడూ వినగలిగే ఆ నిజదైవం కాగా, మన మాటలను సైతం వినలేని స్థితిలో, మరణించి ఉన్న మానవమాత్రులు - మనకు సిరిసంపదలను, సంతానాన్ని ఇస్తున్నారని భ్రమపడి, వారి అస్తిత్వానికి మనం చేసే అంతులేని ఆరాధనా కార్యాలు, వారి సమాధుల దర్శనం మొదలయిన అజ్ఞానపు వైఖరులే మాయ.

"మానవులారా! అల్లాహ్ మీకు చేసిన ఉపకారాలను జ్ఞాపకం ఉంచుకోండి. అల్లాహ్‌కాక, భూమ్యాకాశాల నుండి మీకు ఉపాధినిచ్చే మరొక సృష్టికర్త కూడా ఎవడైనా ఉన్నాడా? ఆయన తప్ప మరొక ఆరాధ్యుడెవ్వడూ లేడు. అసలు మీరు ఎవని వల్ల మోసపోతున్నారు?" *(35:3)*

"అల్లాహ్‌యే మిమ్మల్ని పుట్టించాడు. తరువాత మీకు ఉపాధిని ఇచ్చాడు. ఆ తరువాత ఆయన మీకు మరణం కలిగిస్తాడు, తరువాత ఆయన మిమ్మల్ని బ్రతికిస్తాడు. మీరు దైవసమానులుగా నిర్ణయించుకున్న వారిలో, ఎవడైనా ఈ పనులలో ఏపనినైనా చేసేవాడు ఉన్నాడా? ఈ మానవులు చేసే షిర్కు నుండి ఆయన పరిశుద్ధుడు, మహోన్నతుడు" *(30:40)*

"అల్లాహ్‌ను కాకుండా మీరు పూజిస్తూ ఉన్నవి కేవలం విగ్రహాలు మాత్రమే. మీరు ఒక అభూతకల్పన చేస్తున్నారు. యదార్థానికి అల్లాహ్‌ను కాదని మీరు పూజిస్తున్నవి మీకు ఏ ఉపాధినీ ఇచ్చే అధికారం కలిగిలేవు. ఉపాధి కొరకు అల్లాహ్‌ను అడగండి, ఆయనకే దాస్యం చేయండి, ఆయనకు కృతజ్ఞతలు తెలుపండి. ఆయన వైపునకే మీరు మరలింపబడతారు" *(29:17)*

"...........అప్పుడు అల్లాహ్ వారికి ఒక చక్కని, ఏలోపమూ లేనటువంటి పిల్లవాణ్ణి ప్రసాదించాడు. కానీవారు ఆయన ప్రసాదించిన ఈ కానుక విషయంలో ఇతరులను ఆయనకు భాగస్వాములుగా చేయసాగారు. వారు చేసే ఈ షిర్క్ పనులకు అల్లాహ్ అతీతుడు, ఉన్నతుడూను" *(7:190)*

"భూమ్యాకాశాల సామ్రాజ్యానికి అల్లాహ్ ప్రభువు. ఆయన తాను కోరిన దానిని సృష్టిస్తాడు, తనకు ఇష్టమైనవారికి కూతుళ్ళనూ, తాను కోరినవారికి కొడుకులనూ ఇస్తాడు. తనకు ఇష్టమైన వారికి కొడుకులనూ, కూతుళ్ళనూ కలిపి ఇస్తాడు. తాను కోరినవారికి అసలు సంతానమే ఇవ్వడు. ఆయనకు అంతా తెలుసు. ఆయనకు అన్నింటిపైనా అధికారం ఉన్నది." *(42:49-50)*

"అల్లాహ్ స్వయంగా ఉపాధి ప్రదాత, గొప్పశక్తి సంపన్నుడు, అత్యంత ధృడమైనవాడూను" *(51:58)*

".........లేదా ఒకవేళ కరుణామయుడైన అల్లాహ్ తాను ప్రసాదించే ఆహారాన్ని ఆపివేసినట్లయితే, ఇంకెవరు మీకు ఆహారమివ్వగలరు? చెప్పండి? వారసలు తలబిరుసుతనానికి, సత్యతిరస్కారానికీ, మూర్ఖంగా అంటిపెట్టుకొని ఉన్నారు" *(67:21)*.

"సమాధులలో ఖననమైన వారికి నీవు వినిపించలేవు" *(దివ్య ఖురాను 35:22)*

నిజమయిన జ్ఞానోదయం అంటే - మనసులోని అజ్ఞానాంధకారాన్ని - శాస్త్రజ్ఞానం, హేతువాదం మరియు సత్యాసత్యాల వెలుగుతో రూపుమాపి, దేవుడి నిజ అస్తిత్వాన్ని గుర్తించడం!

దేవుడి నిజ అస్తిత్వాన్ని గుర్తించి, ఆయనకు సహవర్తులనెవ్వరినీ నిలపకుండా ఆయననే ఆరాధించటంలోనే 'మోక్షం' ఉంది:

"ఆయనను మాత్రమే వేడుకోవడం ధర్మం. ఇకవారు ఆయనను వదలి వేడుకుంటున్న ఇతర శక్తులు - అవి వారి ప్రార్థనలకు ఏ సమాధానమూ ఇవ్వలేవు. వాటిని వేడుకోవటం ఒక మనిషి నీళ్ళవైపు చేతులు చాచి, దానిని 'నీవు నానోటి దాకా వచ్చెయ్యి' అని అభ్యర్థన చేసిన మాదిరిగా ఉన్నది. వాస్తవానికి నీరు అతని వద్దకు చేరటం జరగదు. కనుక ఇదేవిధంగా అవిశ్వాసుల ప్రార్థనలు కూడా గురిలేని బాణాలే తప్ప మరేమీ కావు." *(13:14)*

"అల్లాహ్ తన ఇష్టప్రకారం కొందరికి ఎక్కువ జీవనోపాధిని ప్రసాదిస్తాడు, మరికొందరికి తక్కువ జీవనోపాధిని ప్రసాదిస్తాడు. వారు ప్రాపంచిక జీవితంలో మునిగిపోయి ఉన్నారు. వాస్తవానికి పరలోకం ముందు ప్రాపంచిక జీవితం ఒక చిరుసంపద తప్పమరేమీ కాదు". *(13:26)*

".........అసలు విషయం ఏమిటంటే, వారికీ (అవిశ్వాసులకు), వారి పూర్వీకులకూ మేము జీవితావసరాలను ఇస్తూ వచ్చాము. ఇక వారిపై చాలాకాలం గడచిపోయింది. కానీ మేము భూమిని విభిన్న దిశల నుండి తగ్గిస్తూ వస్తున్న విషయం వారికి కనిపించడం లేదా? వారు ఆధిక్యం వహించగలుగుతారా?." *(21:44)*

"పూర్తిగా అబద్ధాలయిన విషయాలను సృష్టించి, అల్లాహ్‌కు ఆపాదించి, లేక సత్యమైన అల్లాహ్ ఆయతులు (శ్లోకాలు) అసత్యాలని తిరస్కరించే వాడిని మించిన దుర్మార్గుడెవడు? అటువంటివారు - తమ విధి వ్రాత ప్రకారం తమ భాగాన్ని పొందుతూ ఉంటారు, మేము పంపే దైవదూతలు వారి ఆత్మలను బంధించటానికి వచ్చే ఆ ఘడియ వరకూ. అప్పుడు ఆ దూతలు వారిని ఇలా అడుగుతారు: 'చెప్పండి, మీరు అల్లాహ్‌కు బదులుగా వేడుకొనే ఆ ఆరాధ్య దైవాలు ఇప్పుడెక్కడున్నారు?' వారు ఇలా అంటారు: 'వారంతా మానుండి తప్పుకున్నారు'. ఇంకా వారు 'మేము నిజంగానే సత్య-తిరస్కారులమే' అని తమకు వ్యతిరేకంగా తామే సాక్ష్యం ఇస్తారు." *(7:37)*

"........కనుక అల్లాహ్ మహోన్నతుడు, నిజమైన చక్రవర్తి. ఆయన తప్ప మరొక దేవుడు లేనేలేడు. గౌరవ పీఠానికి స్వామి. ఎవడైనా అల్లాహ్‌తోపాటు మరొక ఆరాధ్యుణ్ణి వేడుకుంటే, దానికి అతని వద్ద ఏ ప్రమాణమూలేదు. (తాను చేసే పని సత్యమని చెప్పటానికి అతని వద్ద ఆధారమేమీ ఉండదు). అతని లెక్క అతని ప్రభువు వద్ద ఉన్నది. అటువంటి అవిశ్వాసులు ఎన్నటికీ సాఫల్యం పొందలేరు". *(23:116-117)*

"అల్లాహ్‌యే సృష్టిని ప్రారంభిస్తాడు, ఆయనే దానిని తిరిగి సృష్టిస్తాడు, తరువాత ఆయన వైపునకే మీరు మరలింపబడతారు. ఆ ఘడియ నెలకొన్ననాడు, అపరాధులు దిగ్భ్రమకు లోనవుతారు, వారు అల్లాహ్‌కు భాగస్వాములుగా నిలబెట్టిన వారెవరూ వారిని గురించి సిఫారసు చేయరు. అప్పుడు వారు తాము కల్పించుకున్న దైవాలను సైతం తిరస్కరిస్తారు." *(30:13)*

" .... దైవదూతలు వచ్చి వారిముందు నిలబడాలనీ లేదా నీ ప్రభువే స్వయంగా రావాలనీ లేదా నీ ప్రభువు యొక్క కొన్ని బహిరంగ నిదర్శనాలు ప్రత్యక్షం కావాలనీ, ప్రజలు నిరీక్షిస్తున్నారా? నీ ప్రభువు యొక్క ప్రత్యేకమైన సూచనలు కొన్ని ప్రత్యక్షమయ్యేరోజున పూర్వం విశ్వసించకుండా ఆ రోజున విశ్వసించిన వ్యక్తికీ, లేదా విశ్వసించి కూడా ఏ మంచినీ సంపాదించుకోని వ్యక్తికీ తమ విశ్వాసం వల్ల ఏ ప్రయోజనమూ చేకూరదు." *(6:158)*

"............. తరువాత ప్రళయం నాడు అల్లాహ్ వారిని అవమానపరుస్తాడు, హీనపరుస్తాడు. వారితో ఇలా అంటాడు : మీరు (సత్యవాదులతో) నా భాగస్వాముల తరపున పోట్లాడుతూ ఉండేవారు కదా! ఇప్పుడు ఆ నా భాగస్వాములు ఎక్కడ ఉన్నారో చెప్పండి. ప్రపంచంలో జ్ఞానోదయం పొందినవారు - 'అవిశ్వాసులకు ఈరోజు (లభించేది) అవమానమూ, దౌర్భాగ్యమూను' అని అంటారు." *(16:27)*

ప్రియమిత్రులారా! మీరు ఈ పుస్తకంలో పొందుపరచబడిన సత్యాసత్యాలను గుర్తించి, మార్మికవాదుల మరియు దైవప్రవక్తల సందేశాల మధ్యకల తేడాను విశ్లేషించటం ద్వారా - దేవుని నిజ అస్తిత్వాన్ని గుర్తించి, మోక్షమార్గంలో పయనించటం ద్వారా - పరలోకంలో శాశ్వతమైన సుఖశాంతుల్ని సొంతం చేసుకోవటానకి కృషి చేయగలరని ఆశిస్తూ - నేను ముగిస్తున్నాను. దైవం మీకు సన్మార్గాన్ని చూపించుగాక.

"ధర్మం విషయంలో నిర్బంధంకానీ, బలాత్కారం కానీ లేవు.

సత్యవాక్కు అసత్యవాక్కుల నుండి ప్రస్ఫుటం చెయ్యబడింది." *(దివ్యఖురాను 2:256)*

# సంకలన కర్త సందేశం

## విజ్ఞానశాస్త్రం-తత్వశాస్త్రం- దైవసందేశం (Science-Philosophy-God's Message)

నేనెవరిని? నేనెందుకిక్కడున్నాను? పుట్టటానికి పూర్వం నేనున్నానా? మరణించిన తరువాత నేనెక్కడికి పోతాను? ఈ జీవితానికి గమ్యం, అర్ధం ఏమిటి? దేవుడున్నాడా? ఉంటే ఎలా ఉంటాడు? లేకపోతే ఎందుకు లేడు? ఇత్యాది ప్రశ్నలు- తిండితిప్పల సౌకర్యం ఉండి, కాస్తంత తీరిక దొరికిన ప్రతీ మనిషినీ అనాదిగా తొలిచేస్తున్నవే కదా! మనకు వీటికి సమాధానాలు - విజ్ఞానశాస్త్రం, తత్వశాస్త్రం, మతవ్యవస్థలు- ఈ మూడింటిలోనూ దొరుకుతాయి. కాని అవన్నీ పరస్పర వైరుధ్యాలతో నిండి ఉండి, అవి అర్ధం చేసుకోవడానికి సాహసించిన వారికి - 'అసలిలాంటి ప్రశ్నలడుక్కోవటం దేనికి? నా మానాన నేను బ్రతక్క?' అనిపించేట్టుచేస్తాయి. నా ఉద్దేశ్యంలో దీనికి కారణమేమిటంటే- వీటిలో మొదటి రెండు వాటికున్న పరిమితులనవి గుర్తించకుండా మొత్తం పరమసత్యాన్ని (Ultimate Truth) ఎరిగినట్టుగా సిద్ధాంతాలు చేయటం వలన ఇలా జరుగుతుంది. ఇదెలాగో వివరిస్తాను.

### విజ్ఞానశాస్త్రం

దీనికి కచ్చితమయిన ఆధారాలు, కొలతలు అవసరం. అవి లేకుండా ఇందులో పని జరగదు. భౌతిక ప్రపంచం వరకూ అది అనేక సత్యాలను ఆవిష్కరించగలదు, మానవజాతి అభివృద్ధికి కారకం కాగలదు. ఇదెలాగో వివరించనవసరం లేకుండా మనందరికీ తెలిసినదే.

విజ్ఞానశాస్త్రం ప్రకారం ఒక మహా విస్ఫోటనంతో ఈ సృష్టి ప్రారంభమయింది. విశ్వవ్యవస్థ అనంతంగా వ్యాకోచిస్తూ పోతుంది - అంటే ఈ చిత్రాన్ని rewind చేసిచూస్తే అంతా ఒక చోటునుంచి లేదా ఒక మూలపదార్ధం నుండి ఆరంభమయినదని తేలుతుంది. అప్పటి నుండి జరిగిన సంఘటనలనే విజ్ఞానశాస్త్రం వివరించగలదు. ఈ విస్ఫోటనం ఎందువలన కలిగింది? ఆ విస్ఫోటనానికి అవసరమయిన శక్తి ఎక్కడినుండి వచ్చింది? అనేది అది వివరించలేదు. అది అర్ధంలేని ప్రశ్న, ఎందుకంటే దానికి ముందు అసలు ఏమీలేదు కదా వివరించటానికి అంటుంది. ఈ సమాధానం విజ్ఞానశాస్త్రం యొక్క భౌతిక పరిమితిని స్పష్టం చేస్తుంది.

సరే, ఈ విస్ఫోటనం తరువాత కూడా ఈ ప్రపంచం ఇలానే ఎందుకు ఉంది? ఇంకో రకంగా ఎందుకు లేదు? ఇది ఈ మౌలిక సూత్రాలనే ఎందుకు పాటిస్తుంది? అని ప్రశ్నించుకున్న శాస్త్రజ్ఞులు కనుగొన్న నిజం ఏమిటంటే - ఇది వేరే సూత్రాలను గనుక పాటిస్తే, ఈ ప్రశ్నలడగటానికి మనం ఇక్కడ ఉండేవారము కాదనేది.

ఉదాహరణకు, పదార్ధం కలిగిఉన్న సాంద్రత కాక కొంచెం ఎక్కువుండుంటే సృష్టి అంతా ఒక బ్లాక్ హోల్‌లోకి పడిపోయి ఉండేది. అలాకాక సాంద్రత కొంచెం తక్కువుండుంటే అది ఎంత వేగంగా దూరం జరిగేదంటే - నక్షత్ర మండలాలు, గ్రహాలు ఆవిర్భవించడానికి ఏమాత్రం అవకాశం లేనంతగా! ఈ సాంద్రతను నియంత్రించినదెవరంటే తెల్లమొహం వేయటమే శాస్త్రజ్ఞులు చేయగలిగింది.

ఆ తరువాత జీవ ఆవిర్భావం విషయంలో కూడా అంతే. ఎన్నెన్ని నియంత్రణలు జరిగితే భూమిపై జీవావిర్భావం సంభవమయినదో తెలుసుకుంటే మతి పోతుంది. ఏ ఏ నియంత్రణల వలన జీవావిర్భావం జరిగిందో చెప్పగలదేగాని, విజ్ఞానశాస్త్రం ఇదంతా ఎవరు చేశారనేది చెప్పలేదు. పరిణామవాదం కూడా ఇప్పుడు చాలా బలంగా తిరస్కరించబడుతుంది. అంటే మానవుడు మానవుడుగానే పుట్టించబడ్డాడుగాని జంతువులనుంచి ఆవిర్భవించలేదనేది నానాటికి స్పష్టమౌతుంది.

విజ్ఞానశాస్త్రం ఇలా చాలా చాలా ఆవిష్కరణలు చేయవచ్చు. ఎన్నోరహస్యాలను (ఉదాహరణకు ఈ పుస్తకంలో వివరించినట్లుగా మార్మిక అనుభవాలను) చేధించగలదు. అపనమ్మకాలు లేదా మూఢవిశ్వాసాల నుంచి మనలను విముక్తులను చేయగలదు. కాని శాస్త్రజ్ఞులే స్వయంగా ఒప్పుకునేదేమంటే- అసలు ఏమీలేనటువంటిదానినుంచి అంతా ఎలా సృష్టించబడిందనేది విజ్ఞానశాస్త్రం ఎప్పటికీ వివరించలేదు.

## తత్వశాస్త్రం

ఈ రహస్యాన్ని చేధించటానికి లేదా వివరించటానికి అన్నట్టు తత్వవేత్తలు అనేకానేక సిద్ధాంతాలను ప్రతిపాదించారు, ఇంకా ప్రతిపాదిస్తూనే ఉన్నారు. అధికశాతం పరస్పర వైరుధ్యాలతోనే కూడిన ఆ సిద్ధాంతాలన్నింటినీ ఇక్కడ వివరించటం అసంభవం. తత్వదర్శన పుస్తకాలు ఎన్నెన్నో ఉన్నాయి, అవి చదివితే సరి. 'తాడిని తన్నేవాడొకడయితే తాడి తలను తన్నేవాడొకడు' (వాడి తలనే తన్నేవాడింకొకడు?) అన్నట్టు సిద్ధాంతాలు చేసుకుంటూ పోయారు ఎందరెందరో మహానుభావులు. తత్వసిద్ధాంతాలతో వచ్చిన సమస్య ఏమిటంటే- ఇవన్నీ మానవ మస్తిష్కాల ఊహలు, అంచనాలు మాత్రమే. ఇది వాటి పరిమితి. అలాగని వాటిని కొట్టిపారేయమనటం లేదు. వాటి అధ్యయనం ఎంతో ఆసక్తికరంగా ఉంటుంది. కాని 'చదువవేస్తే ఉన్న మతి పోయినట్టు' విషయం మాత్రం తేలదు. పదార్థం మొదటిదా? భావన మొదటిదా? అనే మీమాంసతో ప్రారంభమయ్యే తత్వచర్చలు చివరకు పరస్పర వైరుధ్యాలతోకూడిన సిద్ధాంతాలను ప్రతిపాదించటమే తప్ప ఏ విషయాన్నీ తేల్చలేవు.

గమనింపదగ్గ విషయం ఏమిటంటే - సామాజిక, రాజకీయ ప్రభావాలతోపాటు మార్మిక అనుభవాల ప్రభావం కూడా అనేక తత్వసిద్ధాంతాలపై ఉంది. అసలు మార్మికవాదులందరూ ఒకరకానికి చెందిన తత్వవేత్తలంటే అతిశయోక్తి కాదు. మిగిలిన తత్వవేత్తలలా కాకుండా వారు తమ మార్మిక అనుభవాల ఆధారంగా వివిధ సిద్ధాంతాలను ప్రతిపాదించి, బలపరచినవారు. ఈ మార్మిక అనుభవాలు ఎంతవరకూ విశ్వసనీయాలో ఈ పుస్తకంలో విశ్లేషించటం జరిగింది. ఏది ఏమయినా మానవుడు పరిమిత జీవి. అంటే ఎంత తెలుసుకున్నా అతనికి తెలుసుకోవలసింది మిగిలే ఉంటుంది మరియు అతని జ్ఞాన సముపార్జనకు కూడా ఒక పరిమితి ఉంది.

## దైవసందేశం

విజ్ఞానశాస్త్రం యొక్క, తత్వశాస్త్రం యొక్క ఈ పరిమితులను అంగీకరిస్తే తప్ప సంతృప్తికరమయిన సమాధానాలు దొరకవు. దేవుడొకడున్నాడనీ, తన ప్రవక్తలద్వారా మనకు సందేశం అందించాడనీ విశ్వసించడమే దానికి పునాది. విజ్ఞానశాస్త్రం, మానవ మేధస్సుల మీద నమ్మకం వదులుకోవలసిన అవసరం లేదు, వాటి పరిమితులను గుర్తిస్తే చాలు.

మార్మికవాదులలో ఒక వర్గం వారయితే మత్తు మందులు, రకరకాల వనమూలికల ద్వారా కలిగే మార్మిక అనుభవాలననుసరించి కూడా సిద్ధాంతాలు చేస్తుంటారు. వారెలాంటివారంటే- మార్మిక అనుభవాలను కలుగజేసే సిలోసైబిన్ పుట్టగొడుగు అనేది గ్రహాంతరవాసులు మనకు ఏదో సందేశం పంపడానికి భూమిపై వదిలారని సిద్ధాంతాలు చేస్తుంటారు, కానీ దైవం మాత్రం తన ప్రవక్తల ద్వారా సందేశం పంపగలడని నమ్మరు!

తత్వసిద్ధాంతాలలో (ముఖ్యంగా భారతీయ తత్వసిద్ధాంతాలలో) తరచూ కానవచ్చేది: ఆత్మ చర్చ. మనలో ఉన్న ఆత్మ, పరమాత్మ ఒక్కటే అనేది సాధారణ భావన., ఇదే అద్వైత సిద్ధాంత మూలం కూడా. గమనించవలసినది ఏమంటే ఇది కూడా మార్మిక అనుభవాల పర్యవసానంగా ఏర్పడిన సిద్ధాంతమే తప్ప దైవం తరపు నుండి వచ్చిన జ్ఞానం కాదనేది. అసలు ఆత్మ అంటే ఏమిటి? నా కాళ్లు, నా చేతులు అంటున్నావు. అసలు ఈ 'నా' అనేది ఏమిటి? ఇలా ప్రారంభమవుతుంది ఈ చర్చ (చివరకు 'నేనే దేవుణ్ణి' అని ముగుస్తుంది).

అంతులేని ఈ తత్వావిష్కరణల వలయంలో పడి దైవనిజఅస్తిత్వారాధన, సందేశపాలన అయిన కర్తవ్యనిర్వహణల నుండి దూరమయిపోతున్నామేమో తర్కించుకోవాలి.

తత్వశాస్త్ర సిద్ధాంతాల యొక్క పరిమితిని గుర్తించకుండా వాటితో (ముఖ్యంగా మార్మికవాద సంబంధ సిద్ధాంతాలతో) దైవభక్తిని ముడివేయటం వలన, దైవసందేశాన్ని పెడచెవినపెట్టడం లేదా దానిని వక్రీకరించి, సందేశం పంపించినవానికి కాకుండా సందేశం తెచ్చినవారికి, బోధించినవారికి పెద్దపీట వేయటంవలన ఆ సందేశం వివిధ మతాలుగా పరిణామం చెంది దేవుని అస్తిత్వ విషయంలో ఇంత అయోమయ పరిస్థితి నెలకొంది. దీనికి తోడు మార్మికవాదులను దేవుళ్లను చేసే ప్రక్రియ ఈ మధ్య కాలంలో ఊపందుకుంది. 'నేను దేవుణ్ణి' అని మార్మికవాదులు చేసే ప్రకటన వెనుక గల కారణం వారి మార్మిక అనుభవాలు. వాటిని అర్థం చేసుకుంటే గాని వారి ప్రకటనల వెనుక తత్వం బోధపడదు. మార్మిక అనుభవాల రహస్యం మెదడులో ఉంది.

మెదడు మన శరీరంలో ఒక కీలకమయిన అవయవం. మెదడుకు కొన్ని నిమిషాల పాటు రక్త సరఫరా నిలచిపోతే అది మరణించడం, దానితో పాటు మొత్తం భౌతిక శరీరం మరణించడం సంభవిస్తుంది. పుట్టినప్పటి నుండి మొదలు మరణించే వరకూ మెదడు నిర్విరామంగా పని చేస్తూనే ఉంటుంది. గాఢ నిద్రలో కూడా మన మెదడు విశ్రమించకుండా, అనేక శారీరక చర్యలను నియంత్రిస్తూ ఉంటుంది. ఉదాహరణకు, శ్వాస సరిగా అందక శరీరం ప్రమాద స్థితిలో ఉంటే, మెదడు ఒక భయంకర స్వప్నాన్ని కలుగజేయటం ద్వారా మనం మేల్కొనేటట్టు చేయగలదు.

మెదడు యొక్క అతి ముఖ్యమయిన అంశం- చైతన్యం (Consciousness). పరిధులు, కొలతలు, హద్దులు, గుర్తులు, 'స్వ', 'పర' భావనలు (అంటే నేను, నేను కానిదంతా అనే జ్ఞానం) మొదలయినవి తెలుసుకోగలగడానికి చైతన్యం అత్యవసరం. కానీ చైతన్యానికి స్వతహాగా ఒక పరిధిగానీ, కొలతగానీ లేవు. అంటే - పరిధులు, కొలతలు తెలకోవడానికి చైతన్యం అవసరం కానీ చైతన్యం స్వతహాగా ఈ లక్షణాలను కలిగిలేదు లేదా ఇది వీటికతీతం. ధ్యాన సమయంలో మనకనుభవంలోకి వచ్చేది ఈ శుద్ధ చైతన్యమే.

కాల భావనకు, ఆద్యంతాల భావనకు (అంటే ఏదయినా మొదలవడం, అంతమవటం అనేవి తెలవడానికి) జ్ఞాపకశక్తి వ్యవస్థ (Memory) అవసరం. చైతన్యం అనేది ఈ వ్యవస్థకన్నా ముందే ఉంటుంది మరియూ దానికది ఒక సాధనంలా ఉపయోగపడుతుంది. కానీ జ్ఞాపకశక్తికి చైతన్యం యొక్క ఆద్యంతాల జ్ఞానం ఉండదు. అందువలన చైతన్యం అనంతమయినదిగా (కాల, ప్రాంత భావనలో) మాత్రమే అనుభవంలోకి రాగలదు - ధ్యాన సమయంలో జరిగేది అదే.

మనం ప్రతీ అనుభవాన్నీ మెదడు ద్వారానే పొందుతున్నాం. చిన్న పిల్లవాడు సర్కస్‌ను వీక్షించే అనుభవమయినా లేదా మార్మికవాదుల (బాబాల) దైవానుభవమయినా దీని ద్వారానే సాధ్యమౌతుంది. దృశ్యాలను వీక్షించడం, శబ్దాలు వినడం, వాసనలు చూడటం, స్పర్శ జ్ఞానం, ఆనంద-విషాదానుభూతులు ఇలా ప్రతీదీ మెదడు ద్వారానే అనుభవంలోకి వస్తుంది. మనం చూసే దృశ్యాలు, వినే శబ్దాలు మొదలయినవన్నీ కూడా మెదడులోకి విద్యుత్ సంకేతాలుగా (Signals) పరివర్తనం చెంది, అందులో కోట్లకొలది ఉన్న న్యూరాన్ల

మధ్య రవాణా అవుతున్నాయి. వెన్నెల రాత్రిలో ఆహ్లాదభరిత తన్మయత్వంతో ఆకాశాన్ని వీక్షించే సన్నివేశాన్నే తీసుకోండి. కనుల ద్వారా విద్యుత్ తరంగాలుగా పరివర్తనం చెందిన కాంతి కిరణాలు మెదడుకు సరఫరా అయి, మెదడులోని Visual Cortex లో ఆ వెన్నెల రాత్రి యొక్క సన్నివేశ రూపకల్పన జరుగుతుంది. ఈ రకంగా మన అనుభవాలన్నీ మెదడు లోపల రూపొందుతున్నాయి. అంతేగాని మెదడు బయట లేదా శరీరం బయట కాదు. ధ్యానం ద్వారా మన ధ్యాసను అంతర్గతంగా ఉన్న మన చైతన్యం మీద లగ్నం చేసినపుడు ఈ సత్యం బోధపడుతుంది.

'నా శరీరమే నేను' అనే భావన కూడా మెదడులో జనించినదే. మెదడు యొక్క నిర్విరామ పనితనం, అసమాన సమర్ధతల వలన మనం దీనిని గురించి ఆలోచించే, అర్థం చేసుకునే అవసరం లేకుండా ఈ భావన ఇంత బలంగా అభివృద్ధి చెంది ఉంటుంది. ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే 'నా శరీరమే నేను' అనే కాకుండా, మెదడు వేరే ఏ రూపమయినా 'నేను' అని నమ్మించగలదు. ఉదాహరణకు - ఒక పువ్వు మీద లేదా కొవ్వొత్తి మీద లేదా నీటిపాత్ర మీద మనసును లగ్నం చేసే ధ్యానులు: 'నేను ఇదే (పువ్వు / కొవ్వొత్తి / నీటిపాత్ర) మరియు ఇదే పరమ సత్యం - ఉన్నదంతా కూడా ఇదే (నాతో సహా), ఇది తప్ప వేరే ఏమీ లేదు' అనే అనుభవాన్ని పొందగలగడానికి కారణం మన మెదడు యొక్క ఈ లక్షణమే. ఈ అనుభవాన్నే 'సమాధి' అని వర్ణిస్తారు.

వాస్తవానికి మనకు అను నిత్యం అనుభవంలోకి వస్తున్న మన శరీర భావన ('ఈ భౌతిక శరీరమే నేను' అనే అనుభూతి) కూడా మెదడు ద్వారా అనుక్షణం జనిస్తున్నదే. వివిధ శరీర భాగాలు, జ్ఞానేంద్రియ అవయవాలతో నిరంతర సమాచార సరఫరా ద్వారా మెదడు దీనిని సాధిస్తుంది. ధ్యానం మెదడును విశ్రాంత పరిచే ప్రక్రియ. నిరంతర ఆలోచనల నియంత్రణే కాకుండా, శరీరావయవాలతో మెదడు యొక్క సమాచార వేగం కూడా దీని ద్వారా మందగిస్తుంది. తద్వారా, మెదడులో 'స్వ', 'కాల', 'ప్రాంత' భావనలను జనింపజేసే వ్యవస్థలలో కార్యకలాపాలు మందగించబడతాయని అత్యాధునిక సాంకేతిక పరికరాల సహాయంతో శాస్త్రజ్ఞులు నిర్ధారించారు. ఈ విధంగా మెదడు విశ్రాంత స్థితికి చేరుకున్నప్పుడు 'నా శరీరమే నేను' అనే భావనే కాకుండా కాల, ప్రాంత భావనలు కూడా అంతమవటం ప్రారంభమవుతుంది. ఈ భావనలు లేనపుడు ఇక మెదడులో మిగిలి ఉన్న శుద్ధ చైతన్యమే అనంతమయిన, కాలాతీత, పరమసత్య భావనగా అనుభవంలోకి వస్తుంది.

'అహం'ను అంతమొందించడంగా, జ్ఞానోదయంగా, దేవునిలో లీనమవడంగా మార్మికవాదులు ఇచ్చే వర్ణనల వెనుక రహస్యం ఇదే.

ఈ విధంగా మార్మికవాదుల అనుభవంలోకి వచ్చేది వారి సొంత చైతన్యమే తప్ప వేరొకటి కాదు. ధ్యానం ద్వారానే కాక కొన్ని రకాల మత్తుమందులు, ఇతర శారీరక సాధనల ద్వారా కూడా ఈ మానసిక స్థితులను పొందగలగడం దీనికొక తిరుగులేని సాక్ష్యం. ఈ విషయాలన్నింటిని ఈ పుస్తకంలో ఆధారాలతో వివరించడం, విశ్లేషించడం జరిగింది.

దైవం మానవ మేధస్సుకు, ఊహలకు అందని వాడని, జనన మరణాలకు అతీతుడని మన మత గ్రంథాలు, దైవసందేశాలు ఎంత స్పష్టంగా తేటతెల్లం చేస్తున్నా, మనం ఈ మానసిక స్థితుల ద్వారా తమను తాము దైవాలుగా ప్రకటించుకున్న మానవ మాత్రులను దైవాలుగా అంగీకరించడం, కీర్తించడం, వారిని

ఉపాసించడం అవివేకమే కాక ఘోర పాపం కూడా.

ప్రతీ అవయవాన్నీ ఎంతో విజ్ఞతతో తీర్చి దిద్దిన మన శరీర రూపకల్పి ఆ దైవమే. ఆయనే మన మెదడులలో విశ్లేషణా శక్తులు, చైతన్యాలను నింపినది. ఈ వివేచన, విశ్లేషణా శక్తుల ద్వారా మన సృష్టికర్తను గుర్తించడం, కేవలం ఆయనను మాత్రమే ఆరాధించడం, ఆయన సందేశం ద్వారా తెలుపబడిన జీవన విధానాన్ని అవలంబించడం మన కర్తవ్యం. దీనిని కాదని కాల్పనిక జీవిత విధానాలను అవలంబించి, వింత వింత సాధనల ద్వారా ఆ చైతన్యాన్నే దేవునిగా భ్రమపడి, తమను తాము దేవుళ్లుగా ప్రకటించుకున్నవారు మార్మికవాదులు. మనం వారిని మన దారితప్పిన భక్తి శ్రద్ధల వలన దైవాలుగా మార్చివేసి, వారికి మందిరాలను నిర్మించి ఆరాధిస్తున్నాము. ఈ ప్రక్రియలన్నీ ఎలా జరిగాయన్నది ఈ పుస్తకంలో వివరంగా, నిజాధారాల సహాయంతో విశ్లేషించడం జరిగింది.

మార్మిక అనుభవాల వెనుక రహస్యం వీడిన ఆధునిక యుగంలో కూడా ఈ మార్మిక సిద్ధాంతాలకు, మార్మికవాదులకు ఇంకా పెద్దపీట వేయడం జరుగుతుంది. మార్మికవాద సిద్ధాంతాలు - దైవ సందేశానికి, దైవ అస్తిత్వానికి అసంబంధమయిన సిద్ధాంతాలని ఎరుగక ప్రజలు తండోపతండాలుగా బాబాలను, స్వాములను దర్శించడం మనం చూస్తున్నాం.

ఇస్లాం తరాలుగా వక్రీకరింపబడిన దైవసందేశాన్ని తిరిగి దాని అసలు రూపంలో అందజేస్తుంది: సృష్టిని, సృష్టితాలను కాదు, సృష్టికర్తను మాత్రమే ఆరాధించాలని పదే పదే గుర్తుచేస్తుంది. ఆ నిజ దైవాన్ని తప్పించి వేరెవరిని వేడుకున్నా అది అత్యంత పెద్దదయిన పాపం అని, నరక శిక్షకు అర్హమని నొక్కివాక్కాణిస్తుంది ఇస్లాం. మన జీవిత కర్తవ్యాన్ని, పరమార్థాన్ని, మరణానంతర పరలోక జీవిత సత్యాన్ని మనముందుంచుతోంది. ఈ పుస్తకంలో వివరించినట్టు అది అనేక విజ్ఞానశాస్త్ర సత్యాలతో ఏకీభవిస్తుంది మరియు మార్మికవాద సిద్ధాంతాలకు పూర్తిగా వ్యతిరేకం.

ఇలాంటి ఇస్లాం మతంపై కూడా మార్మికవాదమనేది సూఫీజం పేరుతో తిష్టవేయటం జరిగింది. ప్రస్తుత కాలంలో విశేష ప్రజాదరణ పొందుతున్న సూఫీ గురువులయిన ఇద్దరు బాబాల జీవిత చరిత్రలను విశ్లేషించడం ద్వారా పలు సత్యాలను మీముందుంచడం జరిగింది. ఈ మార్మికవాదమనేది ఇస్లాం సందేశానికి ఎంత విరుద్ధమయిన సాంప్రదాయమో తద్వారా విశ్లేషించబడింది. గురుభక్తి, దైవభీతి - ఈ రెంటిలో ఏది ముఖ్యమో నిరూపించబడింది. దివ్య ఖురాను పఠనం, ప్రవక్తల సాంప్రదాయాల అవగాహనా విధుల నిర్లక్ష్య ఫలితంగా ఇస్లాం సందేశాన్ని అర్థం చేసుకోలేకపోవడం వలన అనేకమంది ముస్లింలు కూడా బాబాల ఆరాధనలో నిమగ్నమయి ఉన్నారనేది వాస్తవం. ఈ సూఫీజం అనే చీడతో కప్పివేయబడిన ఇస్లాం యదార్థ సందేశమేమిటి, ఒక సూఫీ అయిన సాయిబాబాను హిందూ దైవావతారంగా ఎలా చిత్రీకరించారో ఈ పుస్తకంలో సవివరంగా మీముందుంచడం జరిగింది.

ఈ పుస్తకం ఒక రచన కాదు. ఇది ఒక సంకలనం - వివిధ పుస్తకాలు, మతగ్రంథాలు మరియు పరిశోధనా వ్యాసాలనుండి సమీకరించిన సమాచారం, దానికి అక్కడక్కడా నా విశ్లేషణ జతపరచబడింది...అంత మాత్రమే. దైవసందేశంపై మబ్బులా ఆవరించిన మార్మికవాద సిద్ధాంతాల నిజరూపాన్ని మీముందు ఆవిష్కరించడం మరియు దేవుని నిజఅస్తిత్వాన్ని కప్పివేసిన మార్మికుల నిజస్వరూపాలను మీముందుచటమే ఈ సంకలన ధ్యేయం. దీనిని మీరు విశాల హృదయంతో, సత్యాన్వేష కాంక్షతో చదివి, అర్థం చేసుకొని, దేవుని నిజ అస్తిత్వాన్ని గుర్తించగలగడంలో సఫలీకృతులు కాగలరని ఆకాంక్షిస్తున్నాను.

A. సొహైల్

## అనుబంధం - A: 'కుండలిని' కు శాస్త్రజ్ఞాన వివరణ

http://www.skaggs-island.org/humanistic/sannella/kundalini.html

ఐ. బెంటోవ్ గారి 'మైక్రోమోషన్ ఆఫ్ బాడీ' సిద్ధాంతం 'కుండలిని'కు సంబంధించిన అనేక అనుభవాలకు వివరణ ఇస్తుంది. దీనిప్రకారం, యోగ సాధనలద్వారా - వివిధ శరీర నిర్మాణాల మధ్య పరస్పర అనునాద స్థితి **(Resonance)** నెలకొలపబడటంవలన, మెదడు యొక్క వెలుపలి పొరలో అయస్కాంత విద్యుత్ ప్రసరణ ఏర్పడుతుంది. ఇదే 'కుండలిని' విడుదలగా చెప్పబడుతుంది.

**శరీర కదలికల లక్షణాలు:-** మెదడులోని ఈ అయస్కాంత విద్యుత్ ప్రవాహం, శరీర కదలికలను సమన్వయ పరిచే మెదడులోని వివిధ భాగాలను ఉత్తేజ పరచటం వలన - కండరాల కదలికలు, యోగాసన భంగిమలు, వివిధ శ్వాసక్రమాలు సంభవిస్తాయి. పక్షవాతం ద్వితీయ పరిణామం వలన సంభవిస్తుంది.

**శరీరానుభూతులు:-** అనుభూతులను నియంత్రించే మెదడులోని భాగాలు ఉత్తేజితం చేయబడటం వలన ఇది సంభవిస్తుంది. వివిధ రకాల అనుభూతులకు లోనయ్యే - శరీర అవయవాల క్రమం - మెదడులో వాటి నియంత్రణ జరిగే క్రమంతో ఖచ్చితంగా సరిపోతుంది. ముందుగా కాలివ్రేళ్ళు, తరువాత కాళ్ళూ, చేతులూ, వీపుభాగం, మెడ, తల, కళ్ళు, ముఖం, గొంతుక మరియు చివరిగా ఉదరభాగము. బెంటోవ్ వివరణ ప్రకారం - ముందుగా కలిగే శరీర అనుభూతులు - కాలివ్రేళ్ళతో (ముఖ్యంగా ఎడమవైపు కాలి పెద్దవ్రేలు) మొదలవుతాయి. మెదడులో దీనికి ప్రాతినిధ్యం వహించే నియంత్రణ భాగం, జనించిన అయస్కాంత విద్యుత్ ప్రసరణ వలన ముందుగా ఉత్తేజితమవడమే దీనికి కారణం. గంగానది - దేవుని కాలి పెద్దవ్రేలు నుంచి వెలువడిందని చెప్పబడుతుంది. సిద్ధయోగాలో గురువు పాదాలు - ముఖ్యంగా ఈ పెద్దవ్రేలు పవిత్రమయినవిగా భావించబడతాయి. అనుభూతులకు లోనయ్యే శరీర అవయవాల క్రమం మెదడులో వాటి నియంత్రణ జరిగే క్రమంతో సరిగ్గా పోలిఉండటం, బెంటోవ్ వివరణకు ముఖ్యమయిన నిరూపణ. ఈ వివరణ ద్వారా - గొంతు, ఉదర భాగాలు చివరగా అనుభూతులకు లోనయ్యే అవయవాలని స్పష్టం అవుతుంది. హిందూ గ్రంథాలలో ఈ గొంతు భాగానికి ప్రాముఖ్యత ఉంది. నాగస్వరి (గొంతు దేవత)గా ఇది వర్ణింపబడింది. ఆ అనుభవం తరువాత, కుండలిని చక్రం పూర్తయి, తాంత్రిక శక్తులు సంభవిస్తాయని నమ్మడం జరుగుతుంది. కానీ జరుగుతున్న దేమిటంటే - మెదడులో ఈ శరీర అవయవాలను నియంత్రించే వివిధ భాగాలు, సాధనాలవలన నెలకొల్పబడిన అనునాదస్థితి వలన జనించిన అయస్కాంత విద్యుత్తు ప్రసరణచే ప్రేరేపించబడి, ఉత్తేజితమై వివిధ రకాలయిన శరీర అనుభవాలను కలిగజేస్తున్నాయి.

**వెచ్చదనం మరియు చల్లదనం అనుభూతులు:-** మెదడులో శరీర ఉష్ణోగ్రత, దాహం, ఆకలిని నియంత్రించే భాగం ఒకటి ఉంది. దీనినే హైపోథాలమస్ అంటారు. ఈ అనుభూతులు ఈ భాగం ఉత్తేజితమవటం వలన సంభవిస్తాయి. ఈ భాగంలో శరీర అవయవాల ప్రాతినిధ్యక్రమం నిర్దిష్టంగా లేదు. అందువలన ఈ అనుభూతులు కలిగేక్రమం కూడా నిర్దిష్టంగా ఉండజాలదు. కుండలిని యోగుల అనుభవాల విశ్లేషణలో వెల్లడయ్యేది కూడా ఇది నిజం అనేదే. కొన్ని కొన్ని శరీరావయవాల ఉష్ణోగ్రత చాలా ఎక్కువగా పెరిగిపోవటం అనేది ఈ కారణంతో ఇంకొన్ని ఇతర కారణాల ప్రభావం తోడవటంవలన సంభవిస్తుంది.

**కాంతులు, శబ్దాల అనుభవాలు:-** ఇది వెంట్రికల్స్‌లో స్థానిక తరంగాలు జనించటం వలన జరుగుతుంది. ఈ ప్రాంతం ఉత్తేజితమయినపుడు ఈ అనుభూతులు కలుగుతాయి. కాని వీటిలో రూపంలేని కాంతి కనబడటం, అర్థంకాని శబ్దాలు వినబడటం సంభవిస్తుంది. ఎందుకంటే మెదడులో ఈ భాగంలో వీటికి ప్రాతినిధ్యం లేదు. ఇదే ఉత్తేజనం ఇంకా ప్రక్కలకు ప్రసరించి - శబ్ద, దృశ్య సంబంధ భాగాలకు వ్యాపిస్తే అపుడు - రూపవంతమయిన కాంతిని వీక్షించటం, అర్థం అయ్యే శబ్దాలను వినటం లాంటి అనుభూతులు కలుగుతాయి.

**నొప్పులు:-** మెదడులో ప్రసరిస్తున్న ఈ విద్యుత్తు ఏదయినా నిరోధాన్ని ఎదుర్కొన్నప్పుడు ఈ పరిణామం సంభవిస్తుంది. యోగులు చెప్పేదాని ప్రకారం ఇవి కుండలిని శరీరంలోని వివిధ చక్రాల (అతీంద్రియ శక్తిస్థావరాలు) మురికిని నిర్మూలించే క్రమంలో కలుగుతాయని!

**శరీరం నుండి వేరుపడినట్లు భావనలు:-** మెదడులోని 'ఏరియా 39' అనే భాగాన్ని ఉత్తేజితం చేయటం ద్వారా ఇలాంటి అనుభవాలను పుట్టించగలమని, విల్డర్ పెనెఫీల్డ్ (1958) కనుగొన్నారు. ఈవిధంగా మెదడులోని అయస్కాంత విద్యుత్తు ఈ భాగాన్ని చేరినపుడు ఈ అనుభవాలు కలుగుతాయి.

ఇది బెంటావ్ వివరణలోని ముఖ్యాంశాలు మాత్రమే. ఈ అయస్కాంత విద్యుత్తు ప్రసరణ ఎలా నెలకొల్పబడుతుంది మరియు ఈ అనుభవాలు ఎలా కలుగుతున్నాయి అనేవి సమగ్రంగా అధ్యయనం చేయదలచిన వారికి ఈ క్రింది పుస్తకాలు ఉపయోగపడతాయి:

**"Stalking the wild pendulum: On the mechanics of consciousness" by Itzhak Bentov, Inner Traditions Bear and Company (13 Oct 1988). ISBN: 0892812028**

**"The Kundalini Experience: Psychosis or Transcendence?" Author: Lee Sanella, M.D. , Integral Publishing (Jun 1987). ISBN: 0941255298**

(ఈ పుస్తకాలు www.amazon.co.uk వద్ద లభిస్తాయి)

ఇదీ 'కుండలిని' వెనుక గల మర్మం. ఈ విధంగా - యోగసాధనల కారణంగా - వివిధ శరీర భాగాలు - పరస్పర అనునాద స్థితిలోకి రావటం వలన - మెదడులో అయస్కాంత విద్యుత్ ప్రసరణ ఏర్పడి - అది మెదడులో శరీర అవయవాల నియంత్రణ జరిపే భాగాలను ఉత్తేజితపరచటం వలన - యోగులు వర్ణించే అనేక అనుభవాలు ఉద్భవిస్తున్నాయి.

**ఇది మోక్షమార్గమని భావించి, ఈ అనుభవాలను పొందటానికి సంవత్సరాలు ప్రయాసపడి, గురువుల సేవలు చేసేవారు - దైవమార్గం నుంచి ఎంతదూరంగా తరలిపోయారు అనేది మీరే అర్థం చేసుకోండి.**

# అనుబంధం B - అదనపు సమాచారం

## చదువదగినవి

- దివ్యఖురాను గ్రంథం - అంతిమ దైవప్రక్త ముహమ్మద్ (సఅస) గారిపై అవతరింపచేయబడినది.

**ఖురాను గ్రంథంలో శాస్త్రీయ జ్ఞాన సమాచారం:**

**http://home.swipnet.se/islam/quran-bible.htm**

బైబిలు, ఖురాను మరియూ సైన్స్ - మారిస్ బుకాలీ గారి పుస్తకం యొక్క ఉచిత ఇంటర్నెట్ ప్రతి. బుకాలీ ఒక శస్త్రచికిత్స వైద్యునిగా - మానవశరీరాలనే కాక, వ్యక్తిత్వాలను కూడా పరిశీలించేవారు. ముస్లింల దైవభక్తిని చూసి ఆయన ఆశ్చర్యపోయారు. ఇది ముస్లిమేతరులకు తెలియని విషయం. దీనిని పరిశోధించే క్రమంలో ఆయన అరబ్బీ భాష నేర్చుకొని - ఖురాను గ్రంథాన్ని విశ్లేషించారు. అందులో పొందుపరచబడి, ఆధునిక శాస్త్రజ్ఞానంతో ఏకీభవించే సమాచారం ఆయనను అమితమైన ఆశ్చర్యానికి గురిచేసింది. అప్పుడాయన ఏకేశ్వరోపాసనను ప్రతిపాదించే మతగ్రంథాలు ఎంతవరకూ నిజమైనవనే అంశం మీద దృష్టి సారించారు. బైబిలు విషయంలో - అందులోని సమాచారం శాస్త్రజ్ఞానానికి విరుద్ధమైనదని ఆయన పరిశోధనలో తేలింది. దివ్యఖురాను, బైబిలు గ్రంథాలపై ఆయన జరిపిన పరిశోధనా ఫలితాలను, విశ్లేషణలనూ ఈ పుస్తకంలో పొందుపరచటం జరిగింది.

మరియు ఈక్రింది వెబ్‌సైట్లలో కూడా ఖురానులో ఉన్న శాస్త్రజ్ఞానం వివరింపబడినది:

**http://rationalreality.50webs.com/sci.htm**

**http://www.answering-christianity.com/sci_quran.htm**

**http://www.harunyahya.com/**

**http://www.islamic-awareness.org/Quran/Science/**

**http://www.irf.net/irf/download/index.htm**

**ఇతర మత గ్రంథాలలో ముహమ్మద్ (సఅస):-**

**http://www.allaahuakbar.net/**

ఇందులో COMPARATIVE RELIGION భాగాన్ని దర్శించండి. ఇక్కడ మీరు - ముహమ్మద్ (సఅస) ప్రవక్తగారి ఆగమనం గురించి - బౌద్ధ, జొరాష్ట్రియన్ (పార్సీ), క్రైస్తవ, యూద మతగ్రంథాలలో ఉన్న సమాచారం చూడగలరు.

# గమనికలు(Notes)

## 1. పరిచయం:

1. NarasimhaSwami, Sri Sai Baba's Charters & Sayings, No. 122

## 2. మార్మికవాదము - అర్థము, తత్వము మరియు చరిత్ర:

1. Wikipedia – Online encyclopedia (www.wikipedia.org)
2. Ibid
3. Brihadaranyaka Upanishad. Chapter 2, 4:12
4. Quoted in Andrew Newberg, D'Aquili, Why God Won't Go Away
5. *Ibid*
6. Nicholson R.A., The Mystics of Islam, Page 151.
7. Massignon, Louis, Hallaj: Mystic and Martyr, Page 142.
8. Quoted in Andrew Newberg, D'Aquili, Why God Won't Go Away
9. *Ibid*
10. Tukaram: Abhanga 1815, quoted in Ranade, Mysticism in India, Page 303.
11. Janeswari, V:134, quoted in Ranade, Mysticism in India, Page 126.
12. Rabbani, Islamic Sufism, Cover page
13. Ibid, Page 81.
14. Massignon, *The Passion of al-Hallaj*, Page 597.
15. Ibid, Page 571.

## 3. సాయిబాబా, మెహర్‌బాబా - మార్మికవాదులేనా?:

1. NarasimhaSwami, Devotees Experiences of Sri Sai Baba, Page. 180
2. Ibid, Page 132
3. Ibid
4. Marianne Warren, Shirdi Sai Baba in the light of Sufism, Page 301-302
5. Ibid, Page 302
6. Ibid, Page 306
7. Dabholkar, Sri Sai Saccarita, 13:4
8. Bharadwaja, Sai Baba the Master, Page 61.
9. NarasimhaSwami, Devotees Experiences of Sri Sai Baba, Page 151.
10. Dabholkar, Sri Sai Saccarita , 8:112.
11. NarasimhaSwami, Devotees Experiences of Sri Sai Baba, Page 255.
12. Gunaji, Sri Sai Satcharita, Page 24.
13. Ibid
14. Marianne Warren, Shirdi Sai Baba in the light of Sufism, Page 109.
15. Kevin, Meher Baba, An Iranian Liberal, Page 274.
16. Ibid, Page, 127.
17. Ibid, Page, 134.
18. Abdulla, Shri Meher Baba: his Philosophy and Teachings, Page 31. Qutoed in Kevin, Meher Baba, An Iranian Liberal, Page 135.
19. Kevin, Meher Baba, An Iranian Liberal , Page 129.
20. Ibid, Page 130. Also see – The Glow (Dehra Dun, 1976) 11(2):2, for a verbatim report taken down by one of the mandali members present at the time.
21. Ibid, Page, 131.
22. Duce, How a Master Works, Page 85.
23. Ibid
24. Ibid, Page 263.

## 4. 'నేను దేవుణ్ణి' - మాటల వెనుక రహస్యం:


1. Abhayananda, History of Mysticism, Page 2-3.
2. Andrew Newberg, D'Aquili, Why God Won't Go Away, Page 107.
3. James, Zen and Brain, Page 34.
4. James William, The Varieties of Religious experiences, Page 422.
5. Andrew Newberg, D'Aquili, Why God Won't Go Away, Page 5.
6. A. Gesell, The first five years of Life: A guide to the study of the pre-school of child, quoted in James, Zen and Brain, Page 38.
7. J. Anderson. The development of self-recognition: A review , quoted in James, Zen and Brain, Page 38.
8. M. Hoffman. Developmental synthesis of affect and cognition and its implications for altruistic motivation. Developmental Physchology 1975, quoted in James, Zen and Brain, Page 38.
9. A. Salamy. Commissural transmission: Maturational changes in Humans, quoted in James, Zen and Brain Page 38.
10. James, Zen and Brain, Page 304. Original James classification of this state is state VI-B, I described it as State 7 for sake of clarity
11. These descriptions are based on the work of Researchers Andrew Newberg and Eugene D'Aquili
12. D.T. Suzuki. The Training of Zen Buddhist Monk, quoted in James, Zen and Brain, Page 477.
13. James, Zen and Brain Reflections, Page 319.
14. NarasimhaSwami, Sri Sai Baba's Charters & Sayings, No. 122
15. Ibid
16. Ibid, No. 62
17. Ibid, No. 66
18. Ibid, No. 67
19. Ibid, No. 68
20. Ibid, No. 69
21. VIVEKANANDA, Raja Yoga, London, 1896. Sited in James William, The Varieties of Religious experiences, Page 437.
22. Andrew Newberg, D'Aquili, Why God Won't Go Away, Page 123.
23. Noble Rosss Reat, Buddhism – A History, Page 32.
24. R. Sasaki. Zen: A method for religious awakening, quoted in James, Zen and Brain.
25. James, Zen and Brain, Page 18.
26. Abhayananda, History of Mysticism, Page 75.
27. Jyot, Theology of Buddhism, Page 23.
28. Nikhilananda, The Gospel of Sri Ramakrishna, Page 13-14.
29. Ibid, Page 15-16.
30. Rolland, The Life of Ramakrishna, Page. 156, quoted in Abhayananda, The History of Mysticism
31. Crystal Love, The Mystic Mind – The Science behind the Supernatural
32. Huston Smith, Cleansing the doors of perception: The religious significance of Entheogenic plants and chemicals.
33. http://ajp.psychiatryonline.org/cgi/content/full/160/11/1965?

5. హిందూ మతంపై మార్మికవాద ప్రభావం:

1. Wikipedia – Online encyclopedia (www.wikipedia.org)
2. Radhakrishnan, Glimpses of World Religions, Page 38
3. Ramamohana Rao, Viswadarsanam - Bharatiya Chintana, Page 137
4. Ibid, Page 296
5. Dayananda Saraswati, Satyartha Prakaasam, Page 269
6. Pandit Gopadev, Purana Vishnuvevaru? Points taken from this book and language simplified for sake of easier understsanding.

6. మెహర్‌బాబా మరియు అవతారవాదం:

1. Kevin, Investigating the Sai Baba Movement, Page 151-152
2. Ibid, Page 153
3. Ibid, Page 155
4. Ibid, Page 153
5. Ibid, Page 268.
6. Kevin, Meher Baba, An Iranian Liberal , Page 270
7. See Kevin, Investigating the Sai Baba Movement, Page 156 for more details.
8. Ibid, Page 246
9. Ibid, Page 252-253
10. Duce, How a Master Works, Page 171
11. Kevin, Investigating the Sai Baba Movement, Page 261
12. Kevin, Investigating the Sai Baba Movement, Page 158
13. Purdom, The God-Man, Page 217, quoted in Kevin, Investigating the Sai Baba Movement

7. సాయిబాబాగారి అస్తిత్వ వక్రీకరణ:

1. Marianne Warren, Shirdi Sai Baba in the light of Sufism, Page 338-339
2. Ibid, Page 347-348
3. Ibid, Page 336
4. Ibid, Page 347
5. Ibid
6. Gunaji, Sri Sai Satcharita, Page 3
7. Marianne Warren, Shirdi Sai Baba in the light of Sufism, Page 350
8. Ibid, Page 5
9. Gunaji, Sri Sai Satcharita, Page 24-25
10. Dabholkar, Sri Sai Saccarita, 11:146-8, Gunaji, Sri Sai Satcharita, Page 66
11. Dabholkar, Sri Sai Saccarita, 11:84
12. Marianne Warren, Shirdi Sai Baba in the light of Sufism, Page 6
13. Ibid, Page 10
14. NarasimhaSwami, Devotees Experiences of Sri Sai Baba, Page. 144
15. Marianne Warren, Shirdi Sai Baba in the light of Sufism, Page 267
16. Ibid, Page 12
17. Ibid

18. Ibid, Page 338
19. Kevin, Meher Baba, An Iranian Liberal, Page 154
20. Purdom, The God-Man, Page 284, quoted in Kevin, Meher Baba, An Iranian Liberal
21. NarasimhaSwami, Sri Sai Baba's Charters & Sayings, Foreword
22. NarasimhaSwami, Devotees Experiences of Sri Sai Baba, Page. 257
23. Ibid, Page 258
24. Ibid, Page 228-230
25. Kevin, Investigating the Sai Baba Movement, Page 151-152
26. Cited at http://www.koausa.org/Saints/LalDed/article6.html


## 9. దేవుని నిజ అస్తిత్వం మరియు సందేశం:


1. Moore, Keith L. and al-Zindani, Abdul-Majeed A., The Developing Human with Islamic Additions, Third Edition, W.B. Saunders Company, Philadelphia, 1982, with Dar Al-Qiblah for Islamic Literature, Jeddah, Saudi Arabia, 1983, page viiic. Limited Edition.
2. al-Zindani, Abdul-Majeed A, This is the Truth (video tape). Scientific Signs of the Qur'an and Sunnah containing interviews with various scientists. Available in Arabic, English, French, Urdu and Turkish. A full English transcript of this video with illustrations is also available: Al-Rehaili, Abdullah M., This is the Truth, Muslim World League, Makkah al-Mukarrammah, 1995. Also available on the web at:
   http://www.it-is-truth.org/
3. Ibid
4. Ibid
5. Ibid
6. Ibid
7. Ibid
8. Ibid
9. Ibid
10. Ibid
11. Ibid
12. Ibid
13. Ibid
14. Ibid

# గ్రంథమాల (BIBLIOGRAPHY)

**Abhayananda S., History of Mysticism – The Unchanging Testament, London: Watkins Publishing, 2002.**

**Ahmed Ali, My Findings from Geeta confirm with Quran, Kakinada, AP, 2005.**

**Andrew Newberg M.D, Eugene D'Aquili, Ph.D, Why God Won't Go Away, New York: Ballentine Books, 2001.**

**Bharadwaja E., Sai Baba - The Master, 4th edition, Ongole, AP: Sri Guru Paduka Publications, 1993.**

**Crystal Love, The Mystic Mind – The Science behind the Supernatural, London: Fusion Press, 2004.**

**Dabholkar G. R., Sri Sai Saccarita (Marathi), Shirdi: Sri Sai Baba Sansthan, 1929.**

**Dayananda Saraswati, Satyartha Prakaasam, Amba-Ramarya Satyartha Prakaasa Trust, Secunderabad, A.P., 2006.**

**Duce, I.O., How a Master Works, California: Sufism Reoriented, 1975.**

**Gunaji, Nagesh Vasudev, Shri Sai Satcharita. 13th ed., Bombay: Sri Sai Baba Sansthan, 1987.**

**Huston Smith, Cleansing the doors of perception: The religious significance of Entheogenic plants and chemicals, Boulder, CO, Sentient Publications, 2000.**

**James H. Austin, Zen And Brain – Towards understanding Meditation and consciousness, Massachusetts: The MIT Press, Cambridge, 2000.**

**James H. Austin, Zen And Brain Reflections, Massachusetts: The MIT Press, Cambridge, 2006.**

**James William, The Varieties of Religious Experience, New York: Modern Library, 1994.**

**Jyot Devasthan, Theology of Buddhism - Volume 1, New Delhi: Dominant Publishers and Distributors, 2000.**

**Kevin Shepherd, Investigating the Sai Baba Movement - A clarification of Misrepresented Saints and Opportunism, England: Citizen Initiative, 2005.**

**Kevin Shepherd, Meher Baba – An Iranian Liberal, England: Anthropographia Publications, Cambridge, 1986.**

**Marianne Warren Dr., Unravelling the Enigma – Shirdi Sai Baba in the light of Sufism, New Delhi: Sterling Publishers (P) Ltd, 2004.**

**Massignon Louis, Hallaj: Mystic and Martyr, translated by Herbert Mason, abridged edition, New Jersey: Princeton University Press, Princeton, 1994.**

**Massignon, *The Passion of al-Hallaj*, translated from french by Herbert Mason, New Jersey: Princeton University Press, Princeton, Vol.I, 1982.**

**Meher Baba, God Speaks, Sufism Reoriented, 1997.**

**Muhammad Farooq Khan, Hereafter and Indian Traditions, Markazi Maktaba Islami Publishers, New Delhi, 2003.**

**Nanduri Ramamohana Rao Dr., Viswadarsanam - Bharatiya chintana (An Introduction to Indian Thought), Likhitha Prachuranalu, Vijayawada, 2003.**

**Narasimhaswami B.V., Devotees Experiences of Sri Sai Baba, Hyderabad: Akhanda Sainama Sapthaha Samithi, 1986.**

**Narasimhaswami B.V., Sri Sai Baba's Charters & Sayings, 6th ed., Chennai: All India Sai Samaj, 1989.**

**Nicholson R.A, The Mystics of Islam, London: Routeledge and Kegan Paul, 1963.**

**Nikhilananda Swami (trans.), The Gospel of Sri Ramakrishna, New York: Ramakrishna-Vivekananda Center, 1942.**

**Noble Ross Reat, Buddhism – A History, California: Asian Humanities Press, Berkeley, 1951.**

**Pandit Gopadev, Purana Vishnuvevaru?, Arya Samaj, Kuchipudi, A.P., 1995.**

**Rabbani W.B., Islamic Sufism, 5th ed., India: Premier Publishing company, Aligarh., 2001.**

**Ranade R.D., Mysticism In India: The Poet-Saints of Maharashtra, Albany: State University of New York Press, 1983.**

**S. Radhakrishnan Dr., Glimpes of World Religions**